# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 10 సంచిక : 12 హైదరాబాద్ 137 డిసెంబర్ 2012 పేజీలు : 68 రు. 15

- నేరం - శిక్ష: బాల్ ఠాక్రే, అజ్మల్ కసబ్
- చిల్లర వర్తకంపై పాలకుల ప్రేమ
- ఒబామా గెలుపు ఎవరికి మేలు?
- భారత్-చైనా యుద్ధం : నిజానిజాలు
- ఆంగ్‌సాన్ సూచీ - ఇరోం షర్మిల
- మాణిక్యాపూర్ రాజకీయార్థిక స్థితి
- లక్షింపేట, తెలంగాణలపై చర్చ

# ఆర్.ఎస్.రావు స్మారక ఉపన్యాసం - సదస్సు (10-11 నవంబర్, 2012)




(రిపోర్ట్ 57-58 పేజీలో)

137

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2012
సంపుటి : 10
సంచిక : 12

| వ్యవస్థాపక సంపాదకులు : | సంపాదకులు : | కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ : | ఆఫీస్ అసిస్టెంట్ : |
|---|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | వై. రామచంద్రం | ఎస్. వెంకటేష్ |


## లోపలి పేజీల్లో...





ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,
డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com


### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **01391101100217 5**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

తెలంగాణ మీద దేశ్‌పాండే గారు రాసిన వ్యాసంలో వలసవాదులు, నేల విముక్తి ప్రస్తావన ఉంది. వలసవాదానికి విరుగుడు ప్రత్యేక రాష్ట్రం ఎలా అవుతుందో రాయలేదు. వారు చెప్పిన తేదీ దాటి నెల రోజులు ముగుస్తున్నాయి కాని విషయం రావణకాష్టం లాగా మండుతుంది. ఈ పీటముడి ఛేదించి ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్లే బలం, నిర్మాణం కనీసం అందులో పనిచేస్తున్న ఎంఎల్ పార్టీలకు ఉందా?

*– నరేంద్రమోహన్*
*మెల్‌బోర్న్, ఆస్ట్రేలియా*

'చౌరస్తాలో తెలంగాణ ఇంకెన్నాళ్లు' వీక్షణం (నవంబర్ 2012) వ్యాసంలో తెలంగాణ ప్రజల బలమైన ఆకాంక్ష, ఆవేదన, ఆతురత, అసహనం. ఆక్రోశం, ఆగ్రహాలను రచయిత ఉన్నది ఉన్నట్లు ప్రతిబింబించడం అభినందనీయం. వాస్తవానికి తెలంగాణలోని రాజకీయ పార్టీలన్నీ ఆడుతున్న ఓట్లు, సీట్లు అనే రాజకీయ పేకాటలో తెలంగాణ అంశాన్ని ఒక తురుపు ముక్కలా వాడుకుంటున్నాయి. ఏ రాజకీయ పార్టీకీ తెలంగాణ సాధించాలనే నిజాయితీగానీ, నిబద్ధతగానీ లేవు. దేశంలో కొనసాగుతున్న ప్రజాస్వామ్యం ముసుగులోని ధనస్వామ్యం నడిపిస్తున్న అసెంబ్లీ, పార్లమెంటరీ తదితర వ్యవస్థలు సజీవంగా ఉన్నంతకాలం తెలంగాణ అంశాన్ని రాజకీయ పార్టీలన్నీ రావణ కాష్టంలా ఎల్లప్పుడూ మండే నిప్పులా ఉంచుతుంటాయి. పైపెచ్చు అదనపు హామీలతో, నాటకీయ ఉద్యమాల కార్యచరణలతో తెలంగాణ ప్రజలను మోసగిస్తూనే ఉంటాయి (తెలంగాణ జెఎసి కాదు). తెలంగాణ రాష్ట్ర సాధనకు తెలంగాణ ప్రజలు దశాబ్దాలుగా చేసిన అన్ని పోరాటాల్లో నల్ల బ్యాడ్జీలు, నల్ల జెండాలు, ధర్నాలు, వంటావార్పులు, రోడ్, రైలు రోకోలు తదితర నిరసనల దశలన్నీ అయిపోయినాయి. మిలియన్ మార్చ్, సకల జనుల సమ్మె, హైదరాబాద్ మార్చ్ తదితర ఉద్యమాల దశ కూడా అయిపోయింది. తెలంగాణ ప్రజల మనోభావాలతో చెలగాటమాడుతున్న అన్ని రాజకీయ పార్టీల మీద తిరుగుబాటు దశ చివరిదిగా మిలిగి ఉన్నది. అందుకే కాబోలు 'చౌరస్తాలో తెలంగాణ ఇంకెన్నాళ్లు'? రచయిత ముగింపులో 'ఆ ఆగ్రహం కట్టలు తెంచుకునే సందర్భం వచ్చినప్పుడు అది ఎంత విస్ఫోటకంగా, అరాచకంగా ఉంటుందో ప్రపంచ చరిత్ర ఎన్నో సార్లు తెలియచెప్పింది' అని హెచ్చరించడం జరిగింది.

*– ఆర్.ఎస్. చౌహాన్*
*కర్నూల్*

'చౌరస్తాలో తెలంగాణ ఇంకెన్నాళ్లు' వ్యాసం సుతిమెత్తగా అందరినీ విమర్శించడం బాగానే ఉంది గానీ, ఎందుకో కొందరిని మాత్రం విమర్శ నుంచి తప్పించారు. అన్ని పార్టీల వైఖరి గురించి ఒకటో రెండో మాటలు ఉన్నప్పుడు మావోయిస్టు పార్టీ గురించి మాత్రం ఒక్క మాటా లేదేమిటి? ఆ పార్టీ బహిరంగంగా లేదు గదా అంటారేమో! కానీ, వారు వెనుక నుంచి నడుపుతున్నారని అందరూ అనుకునే సంస్థలు తెలంగాణలో కూడా ఉన్నాయి కదా. వారేం చేస్తున్నారు? వారి మీద విమర్శలు లేవా?

*– బి. ఎల్లారెడ్డి*
*కరీంనగర్*

నవంబర్ 2012 సంచికలోని సంపాదకీయం 'వాద్రా, గడ్కరీ – బందిపోట్లదీ ఈ రాజ్యం'లో చాలా లోతుగా ఆలోచించవలసిన అంశాలెన్నో ఉన్నాయి. ముఖ్యంగా ఈ దేశంలోని మధ్యతరగతి, శ్రామికవర్గ ప్రజలు తెలుసుకోదగిన విషయాన్ని బాగా గుర్తింపచేశారు. మౌనం దాల్చడం అనేది పెద్ద వైఫల్యంగాను, ఘోర తప్పిదంగాను హెచ్చరిస్తున్నారు. యధార్థంగా నేడున్న పరిస్థితి. మధ్యతరగతి వారు అవకాశ వాదులుగానే కాకుండా విప్లవ ప్రతీఘాతకులుగా కూడా తయారువుతున్నారనేది యధార్థం. పై వర్గాల వారిని అందుకోవాలని ఆరాటపడుతున్నారు. అన్ని పాలకవర్గ పార్టీల నిజస్వరూపం గతం కంటే నేడెంతో బహిర్గతమై బజారున పడుతున్నారు. విప్లవానికి ఇదొక మంచి అవకాశం. ప్రజలు చైతన్యవంతం కావడానికి పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయి. ఈ పరిస్థితుల్ని విప్లవానికి అనుకూలంగా మలచుకోవడానికి, విప్లవ పురోగమనానికి శ్రామిక చైతన్యం అవసరం. విప్లవోద్యమానికి చేయూతనివ్వడం ప్రతి భారతీయుని కర్తవ్యంగానే ఉంది. కనుక ఇలాంటి వ్యాసాలు తతిమ్మా పత్రికల్లో రావు గనుక ఇదే స్ఫూర్తితో సంపాదకీయాలు గానీ, వ్యాసాలుగానీ రావాలని నా కోరిక. ఇంకొక కోరిక ఏమంటే పత్రికను త్వరగా పక్ష పత్రికగానైనా తీసుకొని రావాల్సిన ఆవశ్యకత నేడెంతో ఉందని గౌరవనీయ మిత్రులు వి. హనుమంతరావు గారు కూడా తన లేఖలో ఈ సలహా ఇచ్చి ఉన్నారు. అందుకు ఆయన్ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. పక్షపత్రికగా తీసుకొస్తే చందాదార్ల సంఖ్య కూడా పెరుగుతుందనేది నా అభిప్రాయం. ఈ రోజు ఏ పత్రిక చూసినా కులాల కుమ్ములాటలతో ఆయా కులాలకే పరిమితమై యధార్థ వార్తలు రాయడం లేదు అనేది మరింత యధార్థం కూడా. గతంలో ఉన్న విలువలు మచ్చుకైనా కానరావడం లేదు. వీక్షణం పత్రిక ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించగలదని ఆశిస్తున్నాను. ఇదే సంచికలో 'జీవవైవిధ్యం కాదు జీవ విధ్వంసం' అనే వ్యాసం చదివి తెలుసుకోవడం అత్యంతావశ్యకతగా భావిస్తున్నాను. ప్రకృతిని ధ్వంసం చెయ్యడమనేది ఈనాటిది కాదు. మహాభారత యుద్ధ కథలోనే దాని మూలాలు ఉన్నాయి. ఖాండవ వన దహనాన్ని కృష్ణార్జునులు చేశారు గదా! వారి రాజభవనం కోసం గదా! ప్రజల కోసం కాదు గదా! అక్కడున్న నానా విధి తెగల ప్రజల్ని ఎంత నిర్దాక్షిణ్యంగా దహనం చేసి అంతమొందించారో స్పష్టంగా విదితమవుతుంది గదా! వారి మీద ఏ మాత్రం కనికరం లేకుండా ఆ రాజ భవన నిర్మాణం గురించే చాలా శ్రద్ధగా, పవిత్ర కార్యంగా రాశాడు వ్యాసుడు. వ్యాసమహర్షి రాజభోగాల్ని త్యజించినా రాజులకు ఊడిగం చేసిన వాడే గదా! అందుకే ఆ దహన కార్యాన్ని మహత్కార్యంగా చిత్రించాడు. అక్కడ నుండి ఈనాటికీ జీవవైవిధ్య విధ్వంసాన్ని చూడాలి. ఈ రోజున పాలకవర్గాలు జీవవైవిధ్యాన్ని కాపాడతాయని అనుకోవడం ఒక భ్రమ. ఈ భ్రమను తొలగించుకొంటే జీవవైవిధ్యాన్ని రక్షించుకోగలం. దోపిడీవర్గాలు వారి వైభోగాలకే అంకితమవుతారు గానీ, ప్రజల బతుకులు వారికి పట్టవు. ఈ కోణం నుండి చూసినపుడు ఈనాటి సామ్రాజ్యవాద వర్గాలు జరిపే ఇలాంటి తతంగమంతా ప్రజల్ని మభ్యపెట్టడానికి, వారి పని సజావుగా జరుపుకోవడానికేననేది ఈ వ్యాసం వలన విదితమవుతున్నది. చాలా బాగుంది. విప్లవోద్యమాలకు సహకరించడం ప్రతి శ్రామికుని కర్తవ్యంగా ఉండాలని ఆశిస్తున్నాను. తతిమ్మ వ్యాసాల మీద రాయలేనందున ఇది నా అసమర్థతగా అనుకోండి. ఇంకొక విజ్ఞప్తి. పత్రిక పేజీలు కూడా పెంచాలి. చర్చకు ఎక్కువ అవకాశం ఇవ్వాలని పత్రికా సంపాదకవర్గానికి మనవి చేస్తున్నాను. చర్చ మానవ చైతన్యం వికసించేదిగా ఉండాలి. మావో చెప్పినట్టు నూరు పూలు వికసింపచేయాలి.

*– కె. సుబ్బానాచారి*
*నెల్లూరు*

కొడవటిగంటి రోహిణీప్రసాద్ గారి గురించిన వ్యాసం (అక్టోబర్ సంచిక) చదివాను. ఇది బొత్తిగా క్లుప్తంగా ఉంది. మరింత వివరంగా ఉంటే బాగుండనిపించింది. ఆయన ఏడు పుస్తకాలూ కొని చదివాను. అవన్నీ సంపుటాలుగా స్వేచ్ఛా సాహితి (వీక్షణం) త్వరలో ప్రచురించాలని ఆశిస్తున్నాం. రోహిణీప్రసాద్‌గారి జీవితం–కృషి కూడా వివిధ వ్యాసాలతో, తగిన ఫొటోలతో పుస్తకంగా తీసుకురావాలని కూడా కోరుతున్నాం. రోహిణీప్రసాద్‌గారి కృషిని ఎవరైనా అందుకొని కొనసాగించాలి.

*– డా. మానేపల్లి*
*ఎలమంచిలి, విశాఖపట్నం*

వీక్షణంలో వివిధ అంశాలపై వస్తున్న వార్తలు, విశ్లేషణలు బాగున్నాయి. కానీ, వాస్తవ తప్పులు దొర్లడం పాఠకులకు తప్పుడు సమాచారం ఇచ్చినట్లవుతుంది. నవంబర్ 2012 సంచికలో 62వ పేజీలో దేశీయం శీర్షికన వస్తున్న వార్త–వ్యాఖ్యల్లో 'మధ్యప్రదేశ్ – గుజరాత్‌లో ఎన్నికలు' అని రాశారు. కానీ ఎన్నికలు జరుగుతున్నవి హిమాచల్ ప్రదేశ్‌లో. ఇలాంటి పొరపాట్లు దొర్లకుండా చూడాల్సిన బాధ్యత సంపాదకీయ వర్గందే.

*– తేమజీ డోంగ్రె*
*హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ*

వీక్షణం నవంబర్ సంచికలో 'ముప్పై ఏళ్ల తరువాత గౌరవెల్లి గ్రామ పరిశోధన' వ్యాసం ప్రచురించారు. మీరు ప్రాతిపదికగా పెట్టుకున్న పీపుల్స్‌వార్ పార్టీ 1980లో చేసిన అధ్యయన పత్రాన్ని కూడా ప్రచురించి ఉంటే అప్పటికీ ఇప్పటికీ వివిధ రంగాలలో వచ్చిన మార్పులను పోల్చుకోవడానికి ఇంకా ఎక్కువ దోహదపడేది. ఇటువంటి అధ్యయనాలు రావడం వలన గ్రామాల్లో వస్తున్న మార్పులను తెలుసుకోవడానికి ఉపయోగకరంగా ఉంటాయి. ఇక ముందు కూడా ఇటువంటి అధ్యయనాలు కొనసాగించాలని నా కోరిక. దీనివల్ల గ్రామాల్లో పనిచేసే సామాజిక ఆలోచనా పరులకు కూడా వారి వారి గ్రామాలను ఎట్లా చూడాలో అనే విషయం కూడా గత సంచికల్లో చాలా వివరణాత్మకంగా వివరించినందుకు వీక్షణంకు కృతజ్ఞతలు.

*– టి. రమేష్*
*కరీంనగర్*

(మిగతా 60వ పేజీలో...)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గౌడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ;

# కార్పొరేట్ల చేత, కార్పొరేట్ల కొరకు, కార్పొరేట్ల వల్ల...

'ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజల వల్ల సాగే ప్రభుత్వం' అనే ప్రజాస్వామ్య నిర్వచనాన్ని అందరూ ఉటంకిస్తుంటారు. ప్రజా వ్యతిరేకంగా ఉంటూనే తమ మనుగడ సజావుగా సాగడానికి ప్రభుత్వాలు ఈ నిర్వచనాన్ని వాడుకుంటాయి. తాము ప్రజల చేత ఎన్నికయ్యామని, ప్రజల కొరకు పని చేస్తున్నామని, ప్రజల వల్ల తమకు సాధికారత వస్తున్నదని ప్రభుత్వాలు చెప్పుకుంటాయి. ప్రజాభిమతం, ప్రజామోదం అనే బ్రహ్మపదార్థం కింద తమ దోపిడీనీ, పీడననూ కొనసాగిస్తుంటాయి. ఎన్నికల మాయాజాలాన్ని వ్యాపింపజేసి, ప్రజాభిమతం ఎవరి పక్షాన ఉన్నదని తేల్చే భారమితి ఎన్నికలేనని నమ్మబలుకుతాయి. ప్రజామోదాన్ని సంపాదించేందుకు పోటీపడిన అభ్యర్థులందరిలో తమకు అనుకూలంగా ఎక్కువమంది ఓట్లు వేశారని, ప్రజలు తమనే ఎంచుకున్నారని చెపుతాయి. కాని ఎన్నికల రాజకీయాల అక్రమాలు, డబ్బు, మద్యం, కుల, మత, ప్రాంతీయ సమీకరణాలు, ఇతర ఆకర్షణలు, ఒత్తిళ్లు చూస్తే ఎవరైనా ఎన్నికలకూ ప్రజాభిమతానికీ పెద్ద సంబంధం లేదని గ్రహించగలరు. అటువంటి ఎన్నికల్లో ఒకసారి గెలిస్తే ఆ తర్వాత ఐదేళ్లు తాము ఏమి చేసినా అది ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజల వల్ల చేసినట్టేనని పాలకవర్గ నాయకులు తమ అధికారాన్ని స్థాపించుకుంటున్నారు. ఆ అధికారాన్ని నిలుపుకోవడానికి బలప్రయోగాన్ని వాడుతున్నారు.

కాని ఇటీవలి కేంద్ర ప్రభుత్వ విధానాలు, నిర్ణయాలు చూస్తే ఇది ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజల వల్ల సాగుతున్న ప్రభుత్వం మాత్రం కాదని స్పష్టంగా తేలిపోతుంది. ఆ నిర్ణయాల వల్ల లాభపడుతున్న వ్యక్తులను, శక్తులను చూస్తే ఇది కేవలం కార్పొరేట్ల చేత, కార్పొరేట్ల కొరకు, కార్పొరేట్ల వల్ల నడుస్తున్న ప్రభుత్వమని తేటతెల్లమవుతుంది. ఆ బందిపోటు దొంగల చెప్పుచేతల్లో భారత ప్రభుత్వం అక్షరాలా ఎలా పనిచేస్తున్నదో ఈ నెలలో మూడు ఉదంతాల్లో స్పష్టంగా బయటపడింది.

మొదటిది, సహజవాయు రంగంలో తమ ఆదేశాలను కాదన్నందుకు ఒక కాబినెట్ మంత్రిని తొలగించాలని హుకుం జారీ చేసి, ప్రధానమంత్రి చేత అమలు చేయించిన రిలయన్స్ వ్యవహారం. రెండవది, 2జి అమ్మకాలలో కుంభకోణం జరిగి బహుళజాతి సంస్థలు, వారి దళారీలు భారత ప్రజాధనం భారీగా కొల్లగొట్టారని చెప్పిన కాగ్ నివేదిక తప్పు అని చూపడానికి ప్రభుత్వమే కార్పొరేట్లతో మిలాఖత్తయి తూతూమంత్రపు వేలం పాట నిర్వహించి తనను తానే ఓడించుకున్న ఉదంతం. మూడవది, భారత చిల్లర వర్తకంలోకి స్వయంగా తానో, తన దళారులో ప్రవేశించడానికి అనుమతించాలనే వాల్‌మార్ట్ వంటి బహుళజాతి సంస్థల కోరికను తీర్చడానికి ప్రభుత్వం తానే చెప్పుకునే ప్రజా ప్రతినిధుల చట్టసభను కూడ పక్కన పెట్టి, అధికారిక నిర్ణయంతో ఆ అనుమతిని అందజేసిన ఉదంతం.

మొదటి ఉదంతం గత ఇరవై సంవత్సరాల కార్పొరేట్ పాలన పర్యవసానం. నూతన ఆర్థిక విధానాలలో భాగంగా దేశంలోని చమురు, సహజవాయు నిక్షేపాలను అన్వేషించడానికి, వెలికితీయడానికి, తమ ఇష్టం వచ్చిన ధరకు ప్రభుత్వానికే అమ్మడానికి రిలయన్స్ వంటి కార్పొరేట్ సంస్థలకు 1999 లోనే ప్రభుత్వం అనుమతించింది. వేల సంవత్సరాలుగా భూమిలో, సముద్రజలాలలో నిక్షిప్తమై ఉన్న ఈ దేశ ప్రజల వనరుల మీద సర్వాధికారాన్ని కార్పొరేట్లకు కట్టబెట్టింది. ఆ సర్వాధికారంలో భాగంగానే 2009లో ఐదు సంవత్సరాల కొరకు రిలయన్స్ ఒక ధరతో ఒప్పందం కుదుర్చుకుంది. ఇప్పుడు ఆ ధర పెంచి మరో నలభైవేల కోట్ల రూపాయలు అదనంగా ఆర్జించాలని రిలయన్స్‌కు కోరిక కలిగింది. ఆ శాఖకు బాధ్యత వహిస్తున్న మంత్రి ఆ కోరికకు అడ్డు తగిలాడు. ఆ అడ్డు కూడ ప్రజా దృక్పథం నుంచి కాదు, ఐదు సంవత్సరాల ఒప్పందాన్ని మధ్యలో మార్చడం మొదలుపెడితే అది తప్పుడు సంకేతాలిస్తుందని, అది మంచి సంప్రదాయం కాదని మాత్రమే వద్దన్నాడు. ఆయన తమ మాట వింటే వందల కోట్లో, వేల కోట్లో లంచం ఇస్తానని కూడ రిలయన్స్ ఎర చూపిందని వదంతులున్నాయి. ఆయన ఆ మాట కూడ వినకపోవడంతో, ధిక్కారమున్ సైతునా అని ముకేష్ అంబానీకి కోపం వచ్చింది. ఈ ప్రభుత్వాన్ని నడిపేది మన్మోహన్ సింగ్ కాదని, తానేనని ఆయన రుజువు చేయదలిచి, ధిక్కరించిన మంత్రిని పీకి పారేయించాడు.

రెండవ ఉదంతం ఇంకా హాస్యాస్పదమైనది. ముందు జరిగిన కేటాయింపులలో వేలం పాట ఉంటే ప్రభుత్వానికి ఎంత రాబడి వచ్చేదో, ఆ తర్వాత రాబడి పునాదిగా లెక్కలు వేసి తేల్చింది రాజ్యాంగ బద్ధ సంస్థ కాగ్. టెలికాం రంగంలోని కార్పొరేట్లకు ఇలా తమ లాభాల లెక్కలు బయటపెడుతున్న కాగ్ మీద చాల కోపం వచ్చింది. దాన్ని గేలి చేయడానికి కంకణం కట్టుకుని, ఆ పని ప్రభుత్వం ద్వారానే చేయించాయి. మళ్లీ ఒక వేలం నాటకం ఆడి, ఆ నాటకాన్ని రసాభాస చేసి, చూశావా పాత లెక్క కూడ తప్పే అని ఇల్లెక్కి అరవడం మొదలుపెట్టాయి. ప్రభుత్వ నాయకులు, అధికారులు కూడ ఆ బృందగానంలో గొంతు కలిపారు. కార్పొరేట్ల సేవలో ప్రభుత్వం ఒక రాజ్యాంగబద్ధ సంస్థను, తనలో భాగమైన సంస్థను అవమానించడానికి కూడ వెనుకాడడం లేదు.

మూడో నిర్ణయం అధికారిక నిర్ణయమని, దాని మీద చట్టసభలో చర్చించలేమని ప్రభుత్వం అంటున్నది. అంటే ఈ దేశంలో అమలయ్యే విధానాల మీద చర్చించే అధికారం కూడ 'ప్రజాప్రతినిధులకు' లేదన్నమాట.

ఈ నిర్ణయాలు కోట్లాది మంది ప్రజల మీద లోతయిన ప్రభావం వేసేవి. లక్షల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని కొల్లగొట్టి, కార్పొరేట్ సంస్థలకు అప్పగించేవి. భారత ప్రజల సార్వభౌమాధికారాన్ని ఉల్లంఘించేవి. అయినా భారత ప్రభుత్వం, ఆ ప్రభుత్వాన్ని నడిపే దళారీలు ముందుకే కదులుతున్నారు. భారత ప్రజల వనరులకు కాపలాదార్లుగా ఉండవలసిన ప్రభుత్వాధినేతలు దేశదేశాల బందిపోట్లను ఆహ్వానించి, తాళపు చేతులు అప్పగించి, వనరుల మూటలు కట్టి, తామే హమాలీలుగా పనిచేసి ఆ బందిపోట్ల బొక్కసాలు నింపుతున్నారు. ఇంతకీ ఎవరిదీ ప్రభుత్వం?

వీ

# అరాచకమే రాజకీయమై చెలరేగుతున్న చోట...

నాటక రంగం గురించి ఒక పరిహాసం ఉంది. రంగస్థలం మీద నటుడు పాతాళంబుననుండి అని పద్యం ఎత్తుకుని వేలు పైకి చూపించాడట. 'అదేమిటి ఔచిత్య భంగం కదా' అని ఎవరో అంటే, 'కాదు, అదే ఔచిత్యం, మరి తెలుగు నాటకరంగం ఉన్నది పాతాళం కన్న కిందగదా' అన్నాడట శ్రీశ్రీ. ఆంధ్ర ప్రదేశ్ పాలకవర్గ రాజకీయాలు ఇవాళ సరిగ్గా ఆ స్థితిలోనే ఉన్నాయి. పాలకవర్గ, పార్లమెంటరీ రాజకీయాల దివాళాకోరుతనం మీద, నీచత్వం మీద ఎంత లోతయిన అవగాహన ఉన్నవాళ్లనైనా ఆశ్చర్యపరిచేంత దివాళాకోరుతనం, నీచత్వం, అవకాశవాదం, వంచన ఇవాళ తెలుగుసీమ పాలకవర్గ రాజకీయ పక్షాలన్నిటిలో అడుగడుగునా, అణువణువునా కనబడుతున్నాయి. విభిన్న రాజకీయపక్ష నాయకులు ఒకరి గురించి ఒకరు చెపుతున్న, ఆరోపిస్తున్న విషయాలు, వేసుకుంటున్న నిందలు, వీధి రౌడీల కన్న అన్యాయమైన సవాళ్లు, ప్రతిసవాళ్లు, కుప్పిగంతులు, అటునుంచిఇటు, ఇటునుంచిఅటు కనీస నైతిక విలువలు లేకుండా కప్పల తక్కెడలా దూకుతున్న ఘటనలు, పార్టీ ఫిరాయింపులు, కొనుగోళ్లు, అమ్మకాలు, పాదయాత్రల పేరిట ప్రజల మీద సాగుతున్న దండయాత్రలు, ఆ దండయాత్రలలో వినేవారి కనీస తెలివిని శంకించేలా నిర్లజ్జగా, నిర్భయంగా వెల్లువెత్తుతున్న అబద్ధాలు, అర్ధసత్యాలు, అతిశయోక్తులు, ప్రజల మధ్య చీలికలు సృష్టించి పబ్బం గడుపుకునే ప్రయత్నాలు, లేని చరిత్రను సృష్టించడాలు ... ఒక్కటి కాదు, ఒక్క పార్టీ అని కాదు. ఇవాళ తెలుగుసీమలో పార్లమెంటరీ పాలకవర్గ రాజకీయపక్షాలన్నీ కనీవినీ ఎరగనంత నగ్నంగా తమ హంతక, వంచక, దుర్మార్గ, ప్రజావ్యతిరేక స్వభావాన్ని రుజువు చేసుకుంటున్నాయి. ఇవన్నీ 2014 ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని జరుగుతూ ఉండవచ్చు. ఎన్నికలు దగ్గరపడుతున్న కొద్దీ ఈ అసహ్యకర ప్రవర్తన మరింత అసహ్యకరంగా, జుగుప్సాకరంగా మారవచ్చు. ఎవరైనా తాము అప్పటివరకూ ఉన్న రాజకీయ పక్షాన్ని వదలవచ్చు, మరొక పక్షంలో చేరవచ్చు. కాని ఆయా పార్టీలకు భిన్నమైన రాజకీయ సిద్ధాంతాలు, ఆదర్శాలు, విలువలు ఉన్నాయని ఎవరైనా ఇంతకాలం భ్రమపడి ఉంటే, ఆ భ్రమలు వదిలేలా ఎవరైనా ఏ పార్టీ నుంచి అయినా ఏ పార్టీలోకి అయినా దూకుతున్నారు. అన్ని పార్టీలూ ఒకే తానులోని ముక్కలని రుజువు చేస్తున్నారు. తమకు స్థిరమైన రాజకీయ విశ్వాసాలేమీ లేవని, ఎక్కడ అధికారం దొరుకుతుందంటే అక్కడికి దూకగలమని చూపుతున్నారు. ఈ ఫిరాయింపులకు పదవీలాలసతో పాటు ధనాకర్షణ కూడ ఉందని బహిరంగంగానే చెప్పుకుంటున్నారు. ఇక మరోవైపు పాదయాత్రల పేరుమీద ప్రజల మధ్యకు వెళ్లి ఎన్నడూ తాము కలలోనైనా ఊహించని మాటలు, తమ నోట్లోంచి వస్తే ఎంతమాత్రం బాగుండని మాటలు మాట్లాడుతున్నారు. అధికారం కోసం ఏ గడ్డి కరవడానికైనా సిద్ధమని చూపుతున్నారు. ప్రజలను కులమతాల ప్రాతిపదికన చీల్చి అధికారం చేజిక్కించుకోవాలనే కుటిల పన్నాగాలతో లేని గుడులు సృష్టిస్తున్నారు. ప్రజల మధ్య ద్వేషం రెచ్చగొడుతున్నారు. ఎంతో ప్రగతిశీలమైనదని పేరున్న తెలుగు సమాజం ఇంత దుర్మార్గమైన, అమానుషమైన, దుర్గంధపూరితమైన రాజకీయ క్రీడను ఎందుకు, ఎట్లా సహిస్తున్నట్టు? వీ

# మరొకసారి రక్తసిక్తమైన గాజా

మళ్లీ గెలిచిన దొర ఆ ఉత్సాహంలో ఊరికి ఏం ఉప్పలాయి తెస్తాడో అని భయపడుతుండగానే, దొర గెలిచిన సంబురంలో దొరవారి కుక్క కట్లు తెంచుకుని దూకి కనబడ్డవాడినల్లా కరిచేసింది. ఒబామా రెండో రాకడతో ఏం ముప్పు ముంచుకొస్తుందో అనుకుంటుండగానే గాజాలో ఇజ్రాయెల్ దుర్మార్గమైన మారణకాండ జరిపి నవంబర్ 14 నుంచి వారం రోజుల్లో 167 మంది పాలస్తీనియన్లను బలిగొంది. ఇజ్రాయెల్ భద్రతా దళాలు గాజా నగరం మీద విచ్చలవిడిగా జరిపిన బాంబుదాడులలో దాదాపు పన్నెండు వందల మంది గాయపడ్డారని ఐక్యరాజ్యసమితి అంచనా వేస్తున్నది. పాలస్తీనియన్ల ప్రతిఘటనలో ఇజ్రాయెల్ కు చెందిన సాధారణ పౌరులు నలుగురు, సైనికులు ఇద్దరు కూడ చనిపోయారు. గాజా రక్తసిక్త విషాద గాథ కొత్తది కాదు. పాలస్తీనాను ఆక్రమించుకోవాలని, యూదుల స్వతంత్ర మతరాజ్యం ఏర్పాటు చేసుకోవాలని యూదు జాతీయోన్మాద జియోనిజం ఒక శతాబ్దానికి పైగా ప్రయత్నిస్తోంది. యూదుల మీద యూరప్ లో ఉండిన వ్యతిరేక, ద్వేష భావనల వల్ల, ప్రత్యేకించి హిట్లర్ యూదుల మీద జరిపిన హంతక దాడులవల్ల వారిపట్ల ఏర్పడిన సానుభూతి వెల్లువలో ఈ జాతీయోన్మాదం మరుగున పడింది. తాము 'భూమిలేని ప్రజల'మని, తమకు 'ప్రజలు లేని భూమి' కావాలని రాజకీయ నినాదాన్ని జియోనిజం చేపట్టింది. భగవంతుడు తమకు ఆ నేల ఇచ్చాడని బైబిల్ లో ఉందని, ఆ భూమిని తాము ఆక్రమించుకుంటామని జియోనిస్టు వాదన. కాని పాలస్తీనా 'ప్రజలు లేని భూమి' కాదు. అరబ్బుల భూమి. ఆ అరబ్బులను అక్కడినుంచి బలప్రయోగంతో తొలగించి అయినా సరే, తామా భూమి ఆక్రమించుకుని తమ దేశం ఏర్పాటు చేసుకుంటామని జియోనిస్టులు చేసిన వాదనను సభ్యమైన ప్రపంచమైతే తిప్పికొట్టవలసింది. కాని, అరబ్బుల నేల కింద చమురు ఉందని, అది తమకు అవసరమని, ఆ నేల మీద ఉన్నవాళ్లు భిన్న మతానికి చెందినవాళ్లని గుర్తించిన సామ్రాజ్యవాదులు, ముఖ్యంగా బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు, అరబ్ దేశాల మధ్య పక్కలో బల్లెంలా 1948లో ఇజ్రాయెల్ ను తయారుచేశారు. అప్పటినుంచి ఇజ్రాయెల్ పని పాలస్తీనా మీద దాడిచేయడం, పాలస్తీనా భూభాగాన్ని ఆక్రమించడం, ఐక్యరాజ్యసమితి నామమాత్రంగా చేసిన తీర్మానాలను ఉల్లంఘించడం, సామ్రాజ్యవాద దొరల తరఫున పెద్దపాలేరుగా ప్రవర్తించడం. ఆ దురహంకార ప్రవర్తనలో భాగంగా జరిగిన అనేక దాడుల్లో ఒకటి తాజా గాజా దాడి. గాజా నుంచి పాలస్తీనా తీవ్రవాద బృందాలు తమ మీద దాడులు చేశాయని, తిప్పి కొట్టడానికే తాము దాడులు చేశామని ఇజ్రాయెల్ భద్రతా దళాలు వాదిస్తున్నాయి. ఇది సరిగ్గా ఇరాక్ మీద దాడికి అమెరికా చెప్పిన కారణం లాంటి అబద్ధమే. నిజంగానే పాలస్తీనా తీవ్రవాదుల దాడులను ఎదుర్కోవడమే ఉద్దేశమైతే చనిపోయిన పాలస్తీనియన్లలో మూడు వంతులకు పైగా సాధారణ పౌరులు, చిన్నపిల్లలు, స్త్రీలు ఎలా ఉన్నారు, సైనిక లక్ష్యాల మీద కాకుండా పౌర నివాస భవనాల మీద దాడులు ఎందుకు చేశారు లాంటి ప్రశ్నలు సామ్రాజ్యవాద హంతక ముఠాలను అడిగి ప్రయోజనం లేదు. సామ్రాజ్యవాదాన్ని అంతం చేసే కృషి మాత్రమే ఇటువంటి అమానుషత్వాన్ని అడ్డుకోగలదు. వీ



❖ **నిత్యానుశీలనం** – సాహిత్య పరిశోధనాత్మక వ్యాస కదంబం – ఆచార్య వెలుదండ నిత్యానంద రావు – 144 పేజీలు, 1/8 డెమీ, రు: 125, ప్రతులకు: నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్



❖ **నోముల పురస్కార కథలు** – సంపాదకుడు: డా. ఎన్.ఎస్. రాహుల్ – నోముల సాహిత్య సమితి – 134 పేజీలు, 1/8 డెమీ, రు: 80, ప్రతులకు: ఎన్ఎస్ అరుణ 206, సాయి టవర్స్, నాగార్జున కాలనీ, నల్లగొండ; విశాలాంధ్ర; నవోదయ; తెలుగు బుక్‌హౌస్ తదితర ప్రముఖ పుస్తకాల దుకాణాలు



❖ **ప్రపంచాన్ని మార్చే సిద్ధాంతం** – శాస్త్రీయ కమ్యూనిజం గురించిన సులభ వివరణ – షాలోమ్ గెర్మన్ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ – 64 పేజీలు, 1/8 డెమీ, రు: 30, ప్రతులకు: విశాలాంధ్ర; ప్రజాశక్తి; మైత్రి; దిశ; సహచర; నవయుగ; మణి బుక్‌స్టాల్స్



❖ **కథల గూడు** – దేవులపల్లి కృష్ణమూర్తి – హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 122 పేజీలు, 1/8 డెమీ, రు : 60, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్–500 006. ఫోన్:23521849, www.hyderabadbooktrust.blogspot.com



❖ **లోపలిస్వరం** – కవిత్వం – రేణుక అయోల – పాలపిట్ట బుక్స్ – 119 పేజీలు, 1/8 డెమీ, రు.60, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036. ఫోన్: 040–27678430 www.palapittabooks@gmail.com



❖ **సవర పాటలు** – గిడుగు వెంకట రామమూర్తి – అనువాదం: చంద్రశేఖర రావు – ఆదర్శ కళా మందిరం – 56 పేజీలు, 1/8 డెమీ, రు: 35, ప్రతులకు: డా.ఎ. చంద్రశేఖర రావు, ఆదర్శ కళా మందిరం, మాడుగుల స్ట్రీట్, పొందూరు–532 168; ఫోన్: 08941–242141; సెల్: 9949605141



❖ **'ప్రతిజ్ఞ' పదశిల్పి పైడిమర్రి** – సంపాదకుడు: ఎలికట్టె శంకర్‌రావు – నోముల సాహిత్య సమితి – 48 పేజీలు, 1/8 డెమీ, రు: 20, ప్రతులకు: పి.వి. సుబ్రహ్మణ్యం, ప్లాట్ నెం.55, ఎన్.ఎల్.ఎన్. స్వామి కాలనీ, నల్లగొండ–508001; సెల్: 9290644784



❖ **అంబేద్కర్ ఓ అగ్ని ప్రవాహం** – విగ్రహ విధ్వంస నిరసన కవిత్వం – 31 పేజీలు, 1/8 డెమీ, రు:20, ప్రతులకు: అనిశెట్టి రజిత, ఇ.నెం. 3-12-60, కుమార్‌పల్లి, హన్మకొండ, వరంగల్; సెల్: 9849482462, 9989415571, 9908277692, 9849674768, 7702649820



❖ **కె.ఎస్. రమణ కవిత్వం** – అనుభవాంతరంగం – సౌభాగ్య – కిరణ్మయి పబ్లికేషన్స్– 118 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్



❖ **ఈద్ ముబారక్** – ప్రగతిశీల ముస్లిం కవిత్వం – షేక్ కరీముల్లా – ముస్లిం రచయితల సంఘం ప్రచురణ – 100 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: షేక్ కరీముల్లా, 21–36, పెద్ద మసీదు బజారు, వినుకొండ – 522 647, గుంటూరు; ఫోన్: 08646–275084, సెల్: 9441502990



❖ **స్పెషల్ కాంపోనెంట్ ప్లాన్, షెడ్యూల్డు కులాల ఉప ప్రణాళిక, షెడ్యూల్డు తెగల ఉప ప్రణాళిక** – కార్యకర్తల కరదీపిక – నేషనల్ దళిత్ ఫోరం ప్రచురణ – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు: అన్ని పుస్తక కేంద్రాలు



❖ **ముళ్లపొదలో పూలబాట** – స్వగతం – కనగిరి విమలమ్మ (వన్నమ్మ) వికాసం బుక్స్ – 55 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: విశాలాంధ్ర; ప్రజాశక్తి; నవోదయ; దిశ; తెలుగు బుక్‌హౌస్



❖ **కాంచనపల్లి చినవెంకటరామారావు కథలు** – సంపాదకుడు: ఎలికట్టె శంకర్ రావు – కాంచనపల్లి సాహిత్య ప్రోత్సాహక సమితి– 88 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: డా. కాంచనపల్లి ప్రభాకర్ రావు, ఇ.నెం. 6-3-241, రామగిరి, నల్లగొండ



❖ **తెలంగాణ చరిత్ర** – డా. సుంకిరెడ్డి నారాయణ రెడ్డి – తెలంగాణ ప్రచురణలు – పాలపిట్ట బుక్స్ – 268 పేజీలు, 1/8 డెమీ, సాదా ప్రతి రు: 120, గ్రంథాలయ ప్రతి రు: 200 ప్రతులకు: తెలంగాణ ప్రచురణలు, ఇందిరా నివాస్, 3/97, ఓల్డ్ అల్వాల్, సికింద్రాబాద్ – 500010; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **సమాధిలోకి సామ్రాజ్యవాదం** – వ్యాస సంచిక – డి. పాపారావు – క్రిష్ణా పబ్లికేషన్స్ – 316 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: డి. పాపారావు, ఫ్లాట్ నెం. 302, ఆర్.కె. రెసిడెన్సీ, ప్లాట్ నెం. 8-3-318/11/16,16/ఎ,16/ఎ1, ఎల్లారెడ్డిగూడ, జె.పి.నగర్, హైదరాబాద్–500073; ఫోన్: 9866179615



❖ **అసామాన్య విశాఖలో విశాఖ మాన్యులు** – మోదు రాజేశ్వర రావు – సత్య–మూర్తి చారిటబుల్ ట్రస్ట్ – 250 పేజీలు, 1/4 క్రౌన్, రు. 250, ప్రతులకు: మోదు రాజేశ్వరరావు, సంపాదకుడు 'కావ్య సమీక్ష', తెలుగు మాసపత్రిక, సప్తగిరి నగర్, చినముషిడివాడ, విశాఖపట్నం–530051; ఫోన్: 9391811226; సెల్: 9396447227, 7386795536

## ఎర్రన్నాయుడు మృతి

తెలుగుదేశం పార్టీ సీనియర్ నేత, పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు, కేంద్ర మాజీ మంత్రి కింజరాపు ఎర్రన్నాయుడు (55) నవంబర్ 2న అర్ధరాత్రి రొడ్డు ప్రమాదంలో మరణించారు. విశాఖలో ఓ వివాహానికి హాజరై తిరిగి వస్తుండగా శ్రీకాకుళం జిల్లా రణస్థలం మండలం దన్నానపేట జంక్షన్ సమీపంలో ట్యాంకర్‌ను ఎర్రన్నాయుడు ప్రయాణిస్తున్న వాహనం ఢీకొట్టడంతో ఆయన ఛాతీ, ఉదర భాగాలకు, తలకు గాయాలయ్యాయి. శ్రీకాకుళం కిమ్స్ ఆసుపత్రికి తరలించగా చికిత్స పొందుతూ తెల్లవారుజాము 3.30 నిమిషాలకు తుదిశ్వాస విడిచారు. ఆయన 1957 ఫిబ్రవరి 23న శ్రీకాకుళం జిల్లా కోట బొమ్మాళి మండలం నిమ్మాడలో ఓ సాధారణ కుటుంబంలో పుట్టారు. ఆయన తల్లిదండ్రులు కళావతమ్మ, దాలినాయుడు. ఆయన వృత్తిరీత్యా న్యాయవాది. ఎన్‌టిఆర్ ప్రభావంతో తెలుగుదేశం పార్టీలో చేరి తన రాజకీయ జీవితం ప్రారంభించారు. తొలిసారి 1983లో హరిశ్చంద్రపురం నియోజకవర్గం నుంచి పోటీ చేసి గెలిచి ఎం.ఎల్.ఎ. అయ్యారు. 1996లో శ్రీకాకుళం లోక్‌సభ స్థానం నుంచి పోటీచేసి గెలిచారు. 1996లో కేంద్రంలో యూనైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వంలో గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రిగా నియమితులయ్యారు. 1998, 1999 లోకసభ ఎన్నికల్లో కూడా విజయం సాధించారు. 2009 లోక్‌సభ ఎన్నికల్లో కృపారాణి చేతిలో ఓడిపోయారు. ఆయన మృతి పట్ల ప్రముఖులు సంతాపం తెలిపారు.

## నీలం తుపాను

ఈ నెల మొదటి వారంలో రాష్ట్రాన్ని నీలం తుపాను అతలాకుతలం చేసింది. బంగాళాఖాతంలో ఏర్పడిన వాయుగుండం తుపానుగా మారి రాష్ట్రాన్ని ముంచెత్తింది. రాష్ట్రమంతటా భారీ వర్షాలు కురిసాయి. ముఖ్యంగా తీర ప్రాంతాలలోని ప్రజలు భారీ వర్షాలు, ఈదురు గాలులతో తీవ్ర ఇబ్బందులకు గురయ్యారు. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు, ఖమ్మం, మహబూబ్‌నగర్, వరంగల్, కరీంనగర్, నల్లగొండ జిల్లాలు తుపాను ప్రభావానికి గురయ్యాయి. దాదాపు పంతొమ్మిది లక్షల ఎకరాలకు పైగా పంట నీటిలో మునిగింది. పది వేల కిలోమీటర్లకు పైగా రోడ్లు దెబ్బతిన్నాయి. కొన్ని చోట్ల వాగులకు గండ్లు పడ్డాయి, వంతెనలు తెగిపోయాయి. రైలు రాకపోకలకు తీవ్ర అంతరాయం కలిగింది. నీలం తుపాను కారణంగా నలభై మూడు మంది మరణించారు.

## ధర్మవరపు సీతారాం మృతి

ప్రముఖ పాత్రికేయుడు ధర్మవరపు సీతారాం (88) నవంబర్ 5న హైదరాబాద్, సీతాఫల్‌మండిలోని తన స్వగృహంలో మరణించారు. ఆయన గత కొద్దికాలంగా అనారోగ్యంతో బాధపడుతున్నారు. ఆయన స్వస్థలం నల్లగొండ జిల్లా లక్కవరం. ఆయన తన 17వ ఏటనే కలం పట్టారు. హైదరాబాద్ బులెటిన్‌లో క్లబ్ రిపోర్టర్‌గా జర్నలిస్టు జీవితం ప్రారంభించారు. కృష్ణా జిల్లా కంచికచర్లలో కోటేశు అనే దళిత యువకుడిని సజీవ దహనం చేసిన ఘటనను రాష్ట్రవ్యాప్తంగా విస్తృత ప్రచారంలోకి తెచ్చిన ఘనత సీతారాందే. ద స్టేట్స్‌మెన్, ఎకనమిక్ టైమ్స్, యునైటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా (యుపిఐ), యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియా (యుఎన్ఐ)లో పనిచేశారు. పాత్రికేయ వృత్తికి చేసిన సేవలకు గాను ఇటీవలే రాష్ట్ర ప్రభుత్వం ఆయనను జీవన సాఫల్య పురస్కారంతో సత్కరించింది.

## అలిపిరి కేసులో ఇద్దరికి శిక్ష

అలిపిరి బాంబు దాడి కేసులో ఇద్దరికి జైలు శిక్ష పడింది. 2003 అక్టోబర్ 1న తిరుపతిలోని అలిపిరి వద్ద మావోయిస్టులు జరిపిన బాంబు దాడిలో అప్పటి ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు, మరికొందరు గాయపడ్డారు. ఈ కేసుకు సంబంధించి 39 మందిపై పోలీసులు కుట్ర, హత్యాయత్నం, దాడి, పేలుడు పదార్థాల దుర్వినియోగం వంటి నేరారోపణ లతో కేసులు నమోదు చేశారు. నవంబర్ 8న ఈ కేసుకు సంబంధించి తీర్పు చెబుతూ తిరుపతి నాలుగవ అదనపు జిల్లా జడ్జి టి. ఈశ్వరరావు ఎ. రామస్వామిరెడ్డి, జె. నాగార్జునలకు ఏడేళ్ల జైలు, ఐదు వేల రూపాయల చొప్పున జరిమానా విధించారు. మరో ఇద్దరు నిందితులైన మావోయిస్టు నేత పాండురంగారెడ్డి అలియాస్ సాగర్, కె. గంగిరెడ్డిపై నేర నిరూపణ కాకపోవడంతో వారిని నిర్దోషులుగా ప్రకటించారు.

## హైదరాబాద్ పాతబస్తీలో అల్లర్లు

చారిత్రక చార్మినార్‌ను ఆనుకుని ఉన్న ఆలయం మరమ్మతుల కార్యక్రమం తీవ్ర ఉద్రిక్తతలకు దారితీసింది. ఇటీవల ఆలయ నిర్వాహకులు అలంకరణకు పూనుకోవడంతో వివాదం చెలరేగింది. దీన్ని వ్యతిరేకిస్తూ ఎం.ఐ.ఎం. నేతలు హైకోర్టును ఆశ్రయించడంతో అక్టోబర్ 30న ఎలా ఉందో అలాగే కొనసాగించాలని హైకోర్టు ఉత్తర్వులు జారీచేసింది. వీటి ప్రకారం దేవాలయం నిర్వాహకులు ఆలయం ముందు ఉన్న షెడ్డుకు మరమ్మతులు ప్రారంభించారు. ఎం.ఐ.ఎం. నేతలు దీనికి నిరసన వ్యక్తం చేశారు. హైకోర్టు మధ్యంతర ఉత్తర్వులను ఉల్లంఘిస్తూ మరమ్మత్తులు జరుగుతున్నాయంటూ వారు అభ్యంతరం తెలిపారు. దీంతో ఉద్రిక్తత వాతావరణం చోటుచేసుకుంది. చార్మినార్ ప్రాంతంలో ర్యాలీ నిర్వహిస్తున్న ఎం.ఐ.ఎం. నేతలను పోలీసులు అడ్డుకొని అరెస్టు చేశారు. ఈ క్రమంలో కొన్ని ప్రాంతాలలో అల్లరి మూకలు విధ్వంసానికి పాల్పడ్డాయి. ప్రభుత్వ, ప్రైవేట్ ఆస్తులను ధ్వంసం చేశారు.

## కాంగ్రెస్‌కు ఎం.ఐ.ఎం. మద్దతు ఉపసంహరణ

ఆలిండియా మజ్లిస్ ఎ ఇత్తేహాదుల్ ముస్లిమీన్ (ఎం.ఐ.ఎం) పార్టీ కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ కాంగ్రెస్‌కు మద్దతు ఉపసంహరిస్తున్నట్టు ప్రకటించింది. నవంబర్ 12న మజ్లిస్ కేంద్ర కార్యాలయంలో ఎం.ఐ.ఎం. అధ్యక్షుడు అసదుద్దీన్ ఓవైసీ ఈ నిర్ణయం ప్రకటించారు. కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం రెండూ ప్రజా వ్యతిరేక విధానాలను, రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం సంఘ్ పరివార్‌ను ప్రోత్సహిస్తూ శాంతిభద్రతలకు విఘాతం కలిగిస్తుందని నిరసన వ్యక్తం చేశారు. ఎం.ఐ.ఎం.కు రాష్ట్రంలో మొత్తం 7 అసెంబ్లీ స్థానాలు ఉన్నాయి. లోక్‌సభలో ఒక సీటు ఉంది. ప్రస్తుతం అసెంబ్లీలో కాంగ్రెస్ ఎంఎల్ఎల సంఖ్య 155, తెలుగుదేశం పార్టీ-88, టిఆర్ఎస్-17, వైఎస్ఆర్‌సిపి-17, సిపిఐ-4, బిజెపి-3, సిపిఎం-1, లోక్‌సత్తా-1, తెలంగాణ నగారా సమితి-1, స్వతంత్రులు-2.

## 81 ఇంజనీరింగ్ కాలేజీలు మూత

ఎంసెట్-2012 మొదటి, రెండో దశల కౌన్సిలింగ్ తరువాత 23 కాలేజీల్లో ఒక్క విద్యార్థి కూడా చేరకపోవడంతో, మరో 58 కాలేజీల్లో చేరిన విద్యార్థుల సంఖ్య చాలా స్వల్పంగా ఉండడంతో రాష్ట్రంలో మొత్తం 81 ఇంజనీరింగ్ కాలేజీలను మూసేస్తున్నట్టు సాంకేతిక విద్యాశాఖ తెలిపింది. దీంతో ఈ 58 కాలేజీల విద్యార్థులను ఇతర కాలేజీలకు బదలాయిస్తున్నారు.

## కాకతీయ ఉత్సవాలు వాయిదా

వరంగల్‌లో నవంబర్ 24 నుంచి మొదలు కావల్సిన కాకతీయ ఉత్సవాలను డిసెంబర్ 21కి వాయిదా పడ్డాయి. నిధులు మంజూరు చేసేందుకు ప్రభుత్వం వెనుకాడడంతో ఈ నిర్ణయం తీసుకుంటున్నట్లు ఉత్సవ నిర్వాహకులు చెప్పారు. వీ

# నేరం - శిక్ష : బాల్ థాక్రే, అజ్మల్ కసబ్

*కసబ్ ఉరి తర్వాత పరిణామాలనూ, థాక్రే మరణం తర్వాత పరిణామాలనూ పోల్చి నేరం - శిక్ష ప్రక్రియలను పునరాలోచించాలనుంటున్నారు* **ఎడ్ల పోచయ్య**

**ముం**బైలో నాలుగు సంవత్సరాల కింద 2008 నవంబర్ 26 నుంచి 29 వరకు 'పాకిస్తాన్-ప్రేరేపిత తీవ్రవాదులు' జరిపిన బాంబు దాడులలో, కాల్పులలో 164 మంది మరణించారు. 300 మందికి పైగా గాయపడ్డారు. ఆ నేరానికి పాల్పడిన వారిలో సజీవంగా దొరికిన ఒకే ఒక్క వ్యక్తి అజ్మల్ కసబ్ అనే పాకిస్తాన్ పౌరుడు. రెండు సంవత్సరాల విచారణ ప్రక్రియ తర్వాత 2010 మేలో కసబ్‌కు న్యాయస్థానం మరణశిక్ష విధించింది. ఆ శిక్షను రాష్ట్ర హైకోర్టు, సుప్రీం కోర్టు కూడ నిర్ధారించాయి. చివరి అవకాశంగా పెట్టుకున్నక్షమాభిక్ష దరఖాస్తును రాష్ట్రపతి నవంబర్ 5న నిరాకరించారు. ఆ తర్వాత నవంబర్ 21 ఉదయం కసబ్ ను ఎరవాడ జైలులో ఉరితీశారు. ఈ చట్టబద్ధ హత్యకు దేశంలో చాలమంది ఆనందోత్సాహాలతో స్పందించి ఉత్సవంగా జరుపుకున్నారని వార్తలు వచ్చాయి. ప్రచార, ప్రసార సాధనాలన్నీ మితిమీరిన దేశభక్తితో ఉరి వార్తను, ఉరి తర్వాత దాన్ని సమర్థించే చర్చలను చేపట్టాయి.

ముంబై దాడులలో ప్రాణాలు కోల్పోయిన వారి కుటుంబాలు ఈ 'ప్రతీకారానికి' సంతోషం వ్యక్తం చేసి ఉంటే, వారిలోని వ్యక్తిగత ప్రతీకారవాంఛను అర్థం చేసుకోవచ్చు గాని, ముంబైతోనూ, ఆ ఘటనలతోనూ ఏ సంబంధమూ లేనివారు కూడ సంతోషపడ్డారని వార్తలు వచ్చాయి. అంటే వాళ్లు కసబ్ చేసినది ఒక నేరంగా గుర్తించి, దానికి శిక్ష పడినందుకు సంతోషిస్తున్నారనుకోవాలి. మరి కసబ్ చేసిన నేరాల కన్న ఘోరమైన నేరాలు చేసిన, కసబ్ చంపినవారి కన్న ఎక్కువ మందిని చంపిన, చంపించిన మరొక వ్యక్తి అదే ముంబైలో సరిగ్గా రెండు రోజుల ముందు చనిపోయినప్పుడు ఎవరూ సంతోషించినట్టు వార్తలు రాలేదు సరిగదా, రాష్ట్రపతి నుంచి సాధారణ ముంబైకర్ దాకా చాల మంది విచారం, సంతాపం ప్రకటించారు. ముంబై జైలు నుంచి ఎరవాడ జైలుకు మార్చి కసబ్‌ను ఉరి తీయడానికి మూడు రోజుల ముందు అదే ముంబైలో చనిపోయిన వ్యక్తి పేరు బాల్ థాక్రే. ఆయన గుండెపోటుతో మరణిస్తే ముంబైలో నిర్బంధంగా బంద్ జరిపారు. కసబ్ మూడు రోజులపాటు ఒక నేరం చేసి, 164 మందిని చంపాడేమో గాని, బాల్ థాక్రే అటువంటి నేరాలే నలభై సంవత్సరాలకు పైగా చేస్తూ వేలాది మంది హత్యలకు దారితీసిన రాజకీయాలు నడిపాడు. ద్వేషభావం రెచ్చగొట్టాడు. మరి ఒకరి నేరానికేమో ఉరిశిక్ష అమలు జరగగా, మరొకరి నేరానికేమో శిక్ష లేకపోవడం మాత్రమే కాదు, విచారణ కూడ జరగలేదు.

అంటే ఈ దేశంలో నేరాలన్నీ ఒకటి కావన్నమాట. అన్ని నేరాలకూ శిక్షలు పడవన్నమాట. నేరాలు చేసిన వారందరూ చట్టం ముందర సమానం కాదన్నమాట. చేసిన మనిషి ఎవరనేదాన్నిబట్టి ఆ నేరం శిక్షార్హమైన నేరంగానో, విచారణాతీత నేరంగానో మారిపోతుందన్నమాట. ఇద్దరూ మనుషులను చంపినవాళ్లే అయినప్పటికీ ప్రచార సాధనాలు ఒకరి గురించి ముష్కరుడు, కరడుగట్టిన ఉగ్రవాది, ఖతం లాంటి మాటలు వాడాయి. మరొకరి గురించి ఉద్యమ ప్రయాణం ముగించిన నేత, ఇకలేరు, శోక సంద్రం, స్తంభించిన ముంబై లాంటి మాటలు వాడాయి. అంటే నేరం, శిక్ష విషయాల్లో అందరికీ సమానంగా వర్తించే తటస్థ ప్రమాణాలు లేవన్నమాట.

మహమ్మద్ అజ్మల్ అమీర్ కసబ్ పాకిస్తాన్‌లోని పంజాబ్‌లో ఫరీద్ కోట్ గ్రామానికి చెందిన నిరుద్యోగ యువకుడు. తండ్రి తోపుడు బండి మీద రొట్టెలు అమ్ముకుంటూ తిరిగి జీవనం గడిపేవాడు. అటువంటి కటిక దారిద్ర్యంలో మగ్గుతూ, పెద్దగా చదువుకోని కసబ్ ఏదో ఒక ఉపాధి కోసం వెతుకుతూ, లష్కర్ ఎ తయెబాలో చేరి, ఫిదాయీగా మారడం ఒక ఉద్యోగంగానే చేశాడని అన్ని కథనాలూ చెపుతున్నాయి. మత భావాలతో ప్రేరేపితుడై, తాను చేయబోతున్నది మహాకార్యమని, దానికి ప్రతిఫలంగా స్వర్గంలో భగవంతుని పక్కన స్థానం దొరుకుతుందని హామీ దొరికి ముంబై మారణకాండకు పాల్పడ్డాడు. అది కసబ్‌కు ప్రత్యేకం కాదు, ఇస్లాంకూ ప్రత్యేకం కాదు. అటువంటి నిస్సహాయ స్థితిలో ఉన్న ఏ మతంలోని వ్యక్తి అయినా అటువంటి ఉద్యోగానికి సిద్ధపడవచ్చు. భారత్ లోనైనా, పాకిస్తాన్ లోనైనా మనుషుల్ని చంపే, నేరాలు చేసే వృత్తిని ఉద్యోగంగా ఎంచుకోక తప్పని ఆర్థిక దుస్థితిలో యువత ఉన్నందుకు వ్యవస్థలు తలవంచుకోవాలి. పండుగకు కొత్త బట్టలు కుట్టించమని అడిగితే తండ్రి కాదన్నాడని కసబ్ పద్దెనిమిదో ఏట ఇంటి నుంచి పారిపోయాడు. రెండేళ్ల పాటు చిన్న చితకా దొంగతనాలతో పొట్టపోసుకుని, 2007లో లష్కర్ ఎ తయెబా ప్రభావంలోకి వచ్చి, ఆయుధ శిక్షణ పొందాడు, ఇరవై ఒకటో ఏట 2008 నవంబర్ 23న మరొక తొమ్మిది మందితో కలిసి కరాచీలో బయల్దేరి, సముద్రం మధ్యలో భారతీయ చేపలపడవలోకి మారి ముంబైకి అతి సులభంగా చేరగలిగాడు.

వీపున సంచీతో, చంకలో ఎకె 47తో ఛత్రపతి శివాజీ టర్మినస్ లో ప్లాట్ ఫారంపై నడుస్తున్న కసబ్ అక్కడి సిసిటివి కెమెరాలకు చిక్కాడు. అక్కడా, మెట్రో సినిమా దగ్గరా కాల్పులు జరిపి, చౌపాటీ వైపు వెళ్తుండగా జరిగిన కాల్పులలో గాయపడి పోలీసులకు దొరికాడు. కాల్పులు, పేలుళ్లు జరిగిన అన్ని ప్రాంతాలలోనూ నేరస్తులు కాల్పులలో హతులైపోగా, మొత్తం నేరస్తుల బృందంలో సజీవంగా పోలీసుల చేత చిక్కినది కసబ్ మాత్రమే. పదకొండు వేల పేజీలకు మించిన ఛార్జి షీట్ లో ప్రాసిక్యూషన్ కసబ్ మీద ఎనభై నేరారోపణలు చేసింది. అసలు తనకు ఈ ఘటనలతో ఏ ప్రమేయమూ లేదని, ఉద్యోగం కోసం వెతుకులాటలో ముంబై వచ్చానని, ఈ ఘటనలు జరగడానికి మూడు రోజుల ముందే తనను

పోలీసులు అనుమానాస్పదం తిరుగుతున్నాడని అరెస్టు చేశారని కసబ్ మొదట చెప్పాడు. తాను పాకిస్తాన్ పౌరుడినని, లష్కర్ ఎ తయెబా శిక్షణ ఇచ్చి ఈ విధ్వంసకాండ కోసం పంపించిందని మరొకసారి చెప్పాడు. కసబ్ ఒప్పుకోలు ప్రకటన అంటూ పోలీసులు ప్రకటించినది కనీసం మూడు సార్లు మారింది. కసబ్ తరఫు న్యాయవాదుల మీద హిందుత్వ శక్తులు చేసిన దాడులవల్ల ప్రభుత్వం మొక్కుబడిగా అందించిన న్యాయసహాయం తప్ప సమర్థమైన న్యాయసహాయం అందలేదు. ఎంతో మంది అమాయకులు మరణించి, విధ్వంసం జరిగిన నేపథ్యంలో న్యాయ విచారణ కూడ భావోద్వేగాలతో జరిగింది గాని, నిష్పక్షపాతంగా, సత్యాన్వేషణ దృష్టితో జరగలేదు. ఈ నేర విచారణ కోసమే ఏర్పాటయిన ప్రత్యేక న్యాయస్థానం చివరికి 2010 మే 6న కసబ్ కు మరణశిక్ష విధించింది. ఆ శిక్షను ముంబై హైకోర్టు, సుప్రీం కోర్టు కూడ ధృవీకరించాయి. మరణశిక్ష పడిన నేరస్తులు చివరి ప్రయత్నంగా క్షమాభిక్ష కోసం రాష్ట్రపతికి అభ్యర్థన పెట్టుకునే అవకాశం ఉంది. కసబ్ ఆ అభ్యర్థన కూడ చేయగా, ప్రతిభా పాటిల్ తన పదవీకాలంలో ఆ అభ్యర్థనను తిరస్కరించకుండా, ఆమోదించకుండా అలా ఉంచారు. రాష్ట్రపతిగా జూలై 25న పదవి స్వీకరించిన ప్రణబ్ ముఖర్జీ వందరోజులు గడవకుండానే నవంబర్ 5న ఆ అభ్యర్థనను తిరస్కరిస్తూ నిర్ణయం తీసుకున్నారు. ఆ తర్వాత రెండు వారాలకే మరణశిక్ష అమలయి పోయింది.

నిజానికి కసబ్ విచారణకు, ముంబై విధ్వంసకాండ విచారణకు సంబంధించి కీలకమైన ప్రశ్నలెన్నో మిగిలే ఉన్నాయి. అంత సులభంగా ఆగంతుకులు భారత సముద్ర జలాల్లోకి ప్రవేశించగల అవకాశం ఎలా వచ్చింది? తీర రక్షణ దళం, నావికాదళం, వైమానిక దళం, సరిహద్దు భద్రతా దళం, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, సాధారణ పోలీసులు వంటి వందలాది, బహుశా వేలాది భద్రతా సిబ్బంది, ఈ పది మంది ఆగంతుకులు పాకిస్తాన్ సరిహద్దుల్లోంచి భారత సరిహద్దుల్లోకి వచ్చి, ముంబై తీరంలో ప్రవేశిస్తుండగా ఏం చేస్తున్నారు? భారత భద్రతా బలగాల ఈ తప్పును ఎవరూ వేలెత్తి చూపలేదు. ముంబై నగరంలో అత్యున్నత భద్రత ఉండే ప్రాంగణాలలోకి సాయుధ ఆగంతుకులు ఎలా ప్రవేశించగలిగారని విచారణే జరగలేదు. ఇంతగా విదేశీ శక్తుల, ముఖ్యంగా పాకిస్తాన్ ప్రభుత్వ భాగస్వామ్యం ఉన్న నేరాన్ని సరిగా విచారించాలంటే ఆ నేరస్తులను సజీవంగా పట్టుకుని వివరాలన్నీ సంపాదించాలని భద్రతా బలగాలు అనుకోలేదు. పైగా ఒక్క సాక్ష్యమూ మిగలకుండా నేరస్తులందరినీ అక్కడికక్కడ చంపివేయడం వెనుక మరేదన్నా కుట్ర ఉందా విచారణ జరగలేదు. నేరస్తులకు ముంబైలో ఆశ్రయాలు, వాహనాలు, నిధులు సమకూర్చినవారెవరో విచారణ జరగలేదు. వారు కాల్పులకు ముందు పోలీసు వాహనాలలోనే ప్రయాణించారని ఆధారాలున్నప్పటికీ, వారు భయపెట్టి ఆ వాహనాలు చేజిక్కించుకున్నారనే కల్లబొల్లి వాదనలు తప్ప, నిజంగా ఆ వాహనాలు వారి చేతికి ఎలా చిక్కాయన్న విచారణ జరగలేదు. ఆ దాడులలో సూటిగా కాల్పులకు గురయి మరణించిన పోలీసు అధికారి హేమంత్ కర్కారే అంతకుముందు హిందుత్వవాదులను ఎదిరించిన చరిత్రగలవాడని, ఆయన మీద హిందుత్వవాదులే ఎక్కుపెట్టి ఉండవచ్చునని వచ్చిన ఆరోపణలకు నమ్మదగిన జవాబు లేదు.

కనుక మొత్తం మీద చూస్తే కసబ్ నేరస్తుడని ఒప్పుకున్నా మిగిలిపోయే ప్రశ్నలున్నాయి. నేరస్తుడు కాకపోవచ్చునని, పోలీసులు బనాయించే సాధారణ తప్పుడు కేసులలో ఇదీ ఒకటి కావచ్చుననే అనుమానాలూ ఉన్నాయి. ఇంత అనుమానాస్పదమైన పునాది మీద ఒక మనిషి ప్రాణాలను చట్టబద్ధంగా తీయడం జరిగిపోయింది. అది కూడ అసాధారణమైన తొందరపాటుతో, రహస్యంగా జరిగిపోయింది.

ఇక ఈ మరణశిక్ష అమలు చేసిన సందర్భం చూస్తే ప్రభుత్వం శిక్ష అమలు జరపడం కన్న, చట్టబద్ధ నిబంధనలు పాటించడం కన్న తన స్వప్రయోజనాలు ముఖ్యమని భావించిందని అర్థమవుతుంది. ముంబై దాడులు జరిగి నాలుగు సంవత్సరాలు నిండడానికి సరిగ్గా నాలుగు రోజుల ముందు ప్రతీకాత్మకంగా ఈ శిక్ష అమలు జరిగింది. చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల అనుమతి మీద వివాదాస్పదమైన పార్లమెంటు శీతాకాలం సమావేశాలు ప్రారంభం కావడానికి ఒక్కరోజు ముందు ఈ ఉరిశిక్ష అమలయింది. మరొక మూడు వారాల్లో జరగనున్న గుజరాత్ ఎన్నికలలో ప్రచారాస్త్రంగా వాడుకోవడానికి, మోడీ కన్న తామే ఎక్కువగా ముస్లిం వ్యతిరేకులమని, హిందూ ప్రజల సంరక్షకులమని చెప్పుకోవడానికి కాంగ్రెస్ ఈ ఉరిశిక్షను అమలు చేసింది. మరణశిక్షను రద్దు చేయాలనే తీర్మానానికి వ్యతిరేకంగా ఐక్యరాజ్య సమితిలో భారత ప్రతినిధి మాట్లాడిన రోజునే ఈ మరణశిక్ష అమలయింది.

కసబ్ మరణశిక్ష అమలు కాగానే హిందుత్వ శక్తులు 'ఇక అఫ్జల్ గురును ఉరితీయాలి' అనే ప్రచారం ప్రారంభించారు. స్వయంగా మోడీ తన ట్విట్టర్ సందేశంలో ఈ మాట రాశాడు. అఫ్జల్ గురు పార్లమెంటుపై దాడి కేసులో నిందితుడు. ఉరిశిక్ష 2004లో విధించబడినా, ఇంకా అమలు కాలేదు. కాని అఫ్జల్ గురు పార్లమెంటుపై దాడికి కుట్ర పన్నాడని ప్రాసిక్యూషన్ నిరూపించలేకపోయింది. 'ఈ నిందితుడు నేరం చేశాడని నమ్మదగిన సాక్ష్యాధారాలేమీ లేనప్పటికీ, నేరస్తుడికి మరణశిక్ష విధిస్తేనే, సమాజపు సామూహిక అంతరాత్మ సంతృప్తి చెందుతుంది' అని నిస్సిగ్గుగా, నేరం చేసినట్టు రుజువు చేయకపోయినా ప్రతీకార వాంఛను సంతృప్తి పరచడం కోసం ఉరిశిక్ష విధించామని స్వయంగా సుప్రీంకోర్టు తీర్పులోనే రాశారు.

మరొకవైపు నుంచి చూస్తే, సరిగ్గా కసబ్ చేసినలాంటి నేరాలే భారత ప్రభుత్వం తరఫున పాకిస్తాన్‌లో చేసిన సరబ్‌జిత్ సింగ్ ఉన్నాడు. లాహోర్ లోనూ, ఫైసలాబాద్‌లోనూ సీరియల్ బాంబు పేలుళ్ల కేసులో సరబ్‌జిత్ నేరస్తుడని, సరిగ్గా భారత న్యాయస్థానాలు కసబ్ విషయంలో విచారణ జరిపి తేల్చినట్టే, పాకిస్తాన్ న్యాయస్థానాలు నిర్ధారించి 1991లోనే మరణశిక్ష విధించాయి. ఆ మరణశిక్ష ఇంకా అమలు చేయలేదు. సరబ్ జిత్ కు క్షమాభిక్ష పెట్టాలని, వదిలెయ్యాలని, భారత ప్రభుత్వం ఇన్నాళ్లుగా పాకిస్తాన్ ప్రభుత్వంతో రాయబారాలు నడుపుతున్నది. మరి లాహోర్, ఫైసలాబాద్ పేలుళ్లు, మారణకాండ శాంతియుతమైనవీ, ముంబై పేలుళ్లు, మారణకాండ మాత్రం నేరాలూ ఎలా అవుతాయి?

సమాజంలో శాంతి భద్రతలు సక్రమంగా కొనసాగాలని, ఆ శాంతి భద్రతలను భంగపరచడం నేరమని, ఆ నేరం చేసిన వారికి శిక్ష విధించాలని, ఆ శిక్ష ఇకముందు నేరం చేయదలచినవారికి బెదురుగా నిలుస్తుందని, నేరం – శిక్ష ప్రక్రియ సమాజాన్ని శాంతిభద్రతలతో ఉంచుతుందని చాల మంది నమ్ముతారు. ప్రతి నేరానికీ శిక్ష ఉండాలనేది

సాధారణంగా అంగీకరించదగిన విలువే. కాని నేరం అంటే ఏమిటి అని నిర్వచించబూనుకుంటే, సమాజంలో నేరాలుగా వేటిని పరిగణిస్తున్నారో చూస్తే, శిక్షల తీరును, పర్యవసానాలను చూస్తే ఇది అంత సులభమైన వ్యవహారం కాదని తేలిపోతుంది. ఒక వ్యక్తో, ఒక సమాజమో ఏదయినా చర్యను నేరం అనుకున్నంత మాత్రాన అది నేరం కాదు, చట్టంలో క్రోడీకరించబడినది మాత్రమే నేరం అవుతుంది. మరి చట్టాలను తయారుచేసే అధికారం ఉన్నవారు తమ ఇష్టారాజ్యంగా నేరాలను నిర్వచిస్తే, వాటికి శిక్షలను విధిస్తే అంగీకరించవలసిందేనా? అందుకే నేరం – శిక్ష ప్రక్రియ చాల సంక్లిష్టమైనది. అనేక చారిత్రక, రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక అంశాలతో కలగలిసినది.

అసలు ఒక నేరానికి విధించే శిక్ష సమాజంలో ఆ నేరాలు మళ్లీ జరగకుండా శిక్షణ ఇవ్వగలిగిన, మానసిక పరివర్తన తేదగిన సామర్థ్యం కలిగినదై ఉండాలి. అసలు సమాజంలో ఏ మూలకారణాలవల్ల ఆ నేరం జరగడానికి అవకాశం వస్తున్నదో ఆ మూలకారణాలను తొలగించగలిగినదీ, తగ్గించగలిగినదీ అయి ఉండాలి. కాని ప్రస్తుత శిక్షలేవీ అంత విశాలమైన సంస్కరణ దృష్టిగానీ, రాజకీయార్థిక దృష్టిగానీ కలిగినవి కావు. తమ పాలన సజావుగా సాగడం కోసం బ్రిటిష్ వలసవాదులు రాసిపెట్టిన చట్టాలను యథాతథంగా అమలుచేస్తున్న భారత పాలకులు నేరం – శిక్ష ప్రక్రియ గురించి అంత నిశితమైన వైఖరి తీసుకుంటారని ఆశించలేం.

కాని మామూలు మధ్యతరగతి వ్యాఖ్యాతలు శిక్షలను, ముఖ్యంగా మరణశిక్షను సమర్థించేటప్పుడు, ఇకముందు అటువంటి నేరం జరగకుండా బెదురు కలిగించేలా శిక్ష ఉండాలని వాదిస్తారు. సమాజంలో ఎంత తీవ్రమైన శిక్షలు అమలవుతున్నప్పటికీ మళ్లీ మళ్లీ పదే పదే అవే నేరాలు జరుగుతూ ఉండడమే ఈ వాదన డొల్లవాదన అని చెప్పడానికి ఉదాహరణ. నిజంగానే శిక్షలు బెదురుగా పనిచేస్తే ఇన్ని నేరాలు జరుగుతూనే ఉండేవి కావు. నిజానికి ఈ వాదన చేసేవారికి నేరాలు ఎందుకు జరుగుతాయో తెలియదు. అసలు నేరం అంటే ఏమిటి, పాలకవర్గాలు, చట్టాలు నిర్వచించినదే నేరమా వంటి తాత్విక ప్రశ్నలను కాసేపు పక్కన పెట్టినా, నేరాలు జరగడానికి మూడు రకాల కారణాలు ఉంటాయి: తమ చుట్టూ ఉన్న రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితుల ఒత్తిడివల్ల జరిగేవి మొదటి రకం. అటువంటి ఒత్తిడి వల్ల నేరాలు జరుగుతాయి గనుక ఆ నేరాలను ఏవో బెదురులు చూపి ఆపడం సాధ్యం కాదు. రెండో రకం నేరాలు క్షణికావేశానికి గురయి చేసేవి. ఆ నేరాలు స్వభావం వల్లనే మనుషులు ఉద్దేశపూర్వకంగా, ఆలోచించి చేసేవి కావు. అప్పటికప్పుడు భావోద్వేగం తోసుకువస్తే చేసేవి. ఆ భావోద్వేగంలో తాను చేసేది నేరమని, దానికి శిక్ష ఉంటుందని బెదిరే సమయం గాని, ఆలోచన గాని ఉండే అవకాశం లేదు. ఇక మూడో రకం నేరాలు పథకం ప్రకారం, ఉద్దేశ పూర్వకంగా, నేరానికి సంపూర్ణ ప్రణాళిక రచించుకుని, వ్యూహం పన్ని చేసే నేరాలు. ఈ నేరస్తులకు చట్టం అనేది ఉందని, తాము చేసే నేరానికి ఫలానా ఫలానా శిక్షలు ఉన్నాయని సంపూర్ణంగా తెలుసు. వారికి ఆ శిక్షల బెదురే ఉండదు. అంటే ఎలా చూసినా శిక్ష అనేది నేరస్తులకు బెదురుగా పనిచేస్తుందని, అందువల్ల మరణశిక్ష లాంటి పెద్దశిక్షలు ఉండవలసిందేనని చేసే వాదనలకు అర్థం లేదు. అవి ఎప్పటికీ తాము అనుకున్న ఫలితాన్ని కూడ సాధించలేవు.

మరి మరణశిక్షకు, లేదా ఇటువంటి పెద్ద శిక్షలకు సమర్థన ఎక్కడినుంచి వస్తున్నది? ఇవి కేవలం ప్రతీకారవాంఛ నుంచి పుట్టినవి. అవతలివాళ్లు మనకు నష్టం, బాధ కలగజేశారు కాబట్టి, వాళ్లకు మనం అంతే సమానమైన నష్టాన్ని, బాధను కలగజేయాలి అని బహుశా ప్రతివ్యక్తీ అనుకుంటారు. వ్యక్తిగత స్థాయిలో ఉండే ఈ ప్రతీకారవాంఛ వల్లనే కసబ్ ఉరితీత జరగగానే ముంబై మారణకాండ బాధిత కుటుంబాలు సంతోషించాయి. కాని కంటికి కన్ను, పంటికి పన్ను అనే ఈ ఆదిమ, మధ్యయుగాల ప్రతీకార న్యాయం నాగరికమైనది కాదని కొన్ని శతాబ్దాలుగా మానవజాతి ఆలోచిస్తున్నది. వ్యక్తి తన పట్ల జరిగిన నేరానికి ప్రతీకారం తీసుకోవాలనే కోరికతో కంటికి కన్ను, పంటికి పన్ను కోరుతాడని, అందువల్ల ఆ ప్రతీకారం తీర్చుకునే అవకాశాన్ని బాధిత వ్యక్తికి ఇవ్వగూడదని, సమాజంలోని భిన్న ప్రయోజనాల మధ్య సమన్వయం కుదిర్చే రాజ్యమే ఆ ప్రతీకార బాధ్యతను వహిస్తుందని, ఆ ప్రతీకారాన్ని నాగరిక పద్ధతుల్లో సాధిస్తుందని ఆధునిక చట్టబద్ధ పాలనా భావన చెపుతుంది. అందుకే మిగిలిన నేరాలన్నీ వ్యక్తిగత స్థాయిలో ఉన్నా, హత్యా నేరాలలో మాత్రం బాధితుల తరఫున ప్రభుత్వమే వాదిస్తుంది. కంటికి కన్ను, పంటికి పన్ను అని ప్రతి ఒక్కరూ అనుకుంటే మొత్తం సమాజమే గుడ్డిదై పోతుంది అని గాంధీ అన్న మాట మరణశిక్షను దృష్టిలో పెట్టుకున్నదే.

ఈ ప్రతీకారం గురించి, నేరానికి తగిన శిక్ష ఉండడం గురించి వాదించే మధ్యతరగతి అన్ని నేరాల గురించీ ఇలాగే ఆలోచిస్తుందా అని చూస్తే దాని వాదనల దివాళాకోరుతనం మరింత బయటపడుతుంది. అణగారినవర్గాలు, అధికారంలో లేని వర్గాలు, నిస్సహాయ వ్యక్తులు, బృందాలు చేసే 'నేరాల'కు కఠిన శిక్షలు విధించాలని, మరణశిక్ష తప్పనిసరిగా ఉండాలనీ వాదించేవారు, ఆధిపత్య వర్గపు నేరాల విషయంలో, పాలకవర్గ విధానాలే నేరాలుగా మారే సందర్భాలలో తమ

నేర నిర్వచనాన్ని మార్చేసుకుంటారు. ఆస్తి, అగ్రవర్ణం, మెజారిటీ మతం, పురుషాధిపత్యం, పెద్ద వయసు, అభివృద్ధి చెందిన ప్రాంతం వంటి అవకాశాలు ఉన్నవారు చేసే నేరాలు నేరాలుగా కనబడవు. వాటికి శిక్షలు విధించాలని ఎవరూ గొంతెత్తి పలకరు. ఇక అధికారాన్ని చేపట్టిన పాలకవర్గ విధానాల పర్యవసానాలను నేరాలుగా గుర్తించడం, వాటికి శిక్షలు పడాలని కోరడం అసాధ్యమే అవుతుంది.

కసబ్ కొన్ని మరణాలకు, 164 మందో, 167 మందో మరణించడానికి ప్రత్యక్ష బాధ్యుడు గనుక ఉరి తీయవలసిందే అని వాదించేవారు అటువంటి మరణాలకే కారణమవుతున్న ఇతర నేరస్తుల గురించి పట్టించుకుంటారా? ఉత్పత్తి సాధనాలను తమ గుప్పెట్లో పెట్టుకుని, అశేష పీడిత ప్రజానీకాన్ని ఆకలికీ, చీకటికీ, అనారోగ్యానికీ, అవిద్యకూ, నిరుద్యోగానికీ గురిచేస్తున్న, అందువల్ల కోట్లాది మంది మరణాలకు కారణమవుతున్న నేరస్తులను ఎలా శిక్షించాలి? తోటి మానవుల పట్ల కుల వివక్ష చూపుతూ కోట్లాది మందిని అవమానానికీ, నిరాదరణకూ, దారిద్ర్యానికీ గురిచేస్తున్న అగ్రవర్ణాల నేరాలు ఎక్కడయినా నమోదవుతున్నాయా, వాటికి శిక్షలు పడుతున్నాయా? స్త్రీని అసమానంగా చూసి, భ్రూణ హత్యల నుంచి వరకట్నపు చావుల దాకా తక్షణ హత్యలకూ, బతికి ఉండనిచ్చినా దుర్మార్గమైన అసమానతకూ వివక్షకూ, దీర్ఘకాలిక హత్యలకూ గురిచేస్తున్న పితృస్వామిక, పురుషాధిపత్య అహంకారాన్ని నేరంగా గుర్తిస్తారా? ఆ నేరానికి శిక్ష విధిస్తారా?

పోనీ, అవన్నీ సామాజిక వ్యవస్థలో, భావజాలంలో భాగమైన, అలవాటైన స్వభావాలని అనుకున్నా, మన కళ్ల ముందర, మూడువేల మందిని ఊచకోతకోసిన నరేంద్ర మోడీని ముఖ్యమంత్రిగా ఎన్నుకుని, రేపో మాపో ప్రధానమంత్రి కావాలని కలలు కంటూ, ఆయన చేసిన, చేయించిన హత్యలలో ఇరవయ్యో వంతు కూడ చేయని కసబ్‌ను మాత్రం ఉరితీయవలసిందే అని వీరాలాపాలకు దిగడం సవ్యమేనా? లక్షన్నర మంది రైతుల ఆత్మహత్యలకు ప్రత్యక్షంగా కారణమైన నూతన ఆర్థిక విధానాలను ఈ దేశంలోకి తెచ్చిన మన్మోహన్ సింగ్‌ను ఆ హత్యలు చేసినందుకే ఆర్థిక మంత్రినుంచి ప్రధాన మంత్రిగా పదోన్నతి ఇచ్చి, పదవీకాలాన్ని రెండో దఫా పొడిగించి, నూట అరవై మందిని హత్య చేసిన వాడిని మాత్రం ఉరితీయవలసిందే అని అడగడం భావ్యమేనా? తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమవుతున్నదని ఒక విధాన ప్రకటన చేసి, దాన్ని ఉపసంహరించుకుని, నిరాశా నిస్పృహలను వ్యాపింపజేసి వెయ్యి మందిని ఆశోపహతులను చేసి హత్య చేసిన పాలకులు నిమ్మకు నీరెత్తినట్టు ఉండగా, నూట అరవై మందిని చంపినవాడు మాత్రం ఉరికంబం ఎక్కవలసిందేనా? కనీసం లెక్కల ప్రకారం చూసినా పెద్ద నేరస్తులను వదిలిపెట్టి, చిన్న నేరస్తులను బలి తీసుకోవడం న్యాయమా?

అవన్నీ కూడ పోనీండి, కసబ్ ఉరితో ఓలలాడేవాళ్లు అంతకు మూడు రోజుల ముందు మరణించిన బాల్ ఠాక్రే గురించి అయినా ఆలోచించ వద్దా? ఆయన జీవించి ఉన్న కాలంలో ఆయన శివసేన అనే మతోన్మాద పార్టీని, సామ్నా అనే పత్రికను నడిపేవాడు. ఆయన రాసిన ఏ వ్యాసం చదివినా, ఆయన ఉపన్యాసాలు విన్నా ఆయనను మించిన తీవ్రవాది ఎవరూ ఉండరని తెలిసిపోతుంది. ఆ రచనలు, ఉపన్యాసాలు అలా ఉంచి, 1960ల చివరినుంచి చనిపోవడానికి కొద్ది ముందుదాకా బొంబాయి లోనూ, మహారాష్ట్రలోనూ మరాఠీలు కానివారందరి మీద, ప్రత్యేకించి ముస్లింల మీద విపరీతమైన ద్వేషభావనను రెచ్చగొట్టిన హిందుత్వ తీవ్రవాది ఆయన. 1966లో దసరా ఊరేగింపులో భాగంగా బొంబాయిలోని దక్షిణ భారత హోటళ్ల మీద, దుకాణాల మీద దాడులతో ప్రారంభించి, 1969లో అరవై మంది కన్నడిగులను హత్య చేసిన, వందలాది మందిని గాయపరచిన భాషా కల్లోలాలు రెచ్చగొట్టాడు. సిపిఐ శాసనసభ్యుడు కృష్ణ దేశాయి, దళిత్ పాంథర్ కవి భగవతీదళ్ జాదవ్ లతో సహా వందలాది మంది భిన్నస్వరాలను హతమార్చిన ఘన చరిత్ర ఆయనది. దళితుల మీద, దక్షిణాది వారి మీద, సిక్కుల మీద, ముస్లింల మీద, తాజాగా బిహారీల మీద ఆయన నేతృత్వంలోని శివసేన సాగించిన దాడుల పూర్తి జాబితా పేజీలకు పేజీలు అవుతుంది. 1993లో వెయ్యి మంది మరణించిన ముంబై అల్లర్లకు ప్రధాన కారణం ఆయన రచనలేనని, శివసైనికులకు ఆయన చేసిన ఉద్బోధలేనని బి.ఎన్. శ్రీకృష్ణ న్యాయవిచారణ కమిషన్ నిర్ద్వంద్వంగా ప్రకటించింది. 1997లో రమాబాయి అంబేద్కర్ నగర్ హత్యాకాండలో ఆయన శివసైనికులు ఒక్కరోజు పది మంది దళితులను హత్య చేశారు. మొత్తం మీద ముంబైలో, విదర్భలో బహుశా వేలాది మందిని ఊచకోత కోసిన ఘటనలకు రూపశిల్పి, వ్యూహకర్త బాల్ ఠాక్రే. మరి మన కళ్లముందరి ఈ హంతక సామ్రాజ్య చక్రవర్తికి సంతాప, శోక సందేశాలేమిటి? పొట్టకూటికి చేరిన ఉద్యోగధర్మంగా, లేదా తలకెక్కిన మతోన్మాదపు హింసాకాండగా అటువంటి హత్యలే కొన్ని చేసిన ఒక చదరంగపు పావును చంపడమేమిటి? చంపినందుకు ఆనందించడమేమిటి?

ఈ సందర్భాన్ని జాగ్రత్తగా పరిశీలించి నేరం – శిక్ష ప్రక్రియ గురించి, ముఖ్యంగా మరణ శిక్ష గురించి, అధికారవర్గపు మారణకాండల నేరాల గురించి, వారికి వేయవలసిన శిక్షల గురించి కాస్త ఆలోచించవలసి ఉంది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- లెనిన్ రచన 'ఏం చెయ్యాలి?' - ఎన్.వి.ఎస్. నాగభూషణ్
- ఆహారాన్ని కొల్లగొట్టే బయో డీజిల్ - జి. రఘురాం
- కనిపించే యథార్థాలు - డా. ఎం. శ్రీకాంత్‌రెడ్డి
- ఓపెన్ కాస్టుల వల్ల ఎవరికి లాభం? - కొండపాక శ్రీలత

# ముగిసిన బాల్‌ఠాక్రే శకం

*ముంబై నగర ప్రజలను ప్రాంతాల పేర, మతాల పేర విభజించి ఠాక్రే సాగించిన నిరంకుశత్వాన్ని వివరిస్తున్నారు*

**మచ్చ ప్రభాకర్**

టైగర్‌లు అభయారణ్యంలో రోజు రోజు తగ్గిపోతున్నాయని టైగర్ ప్రాజెక్టుల వారు వాపోతుంటే దానికి విరుద్ధంగా జనారణ్యంలోని టైగర్‌ల సంఖ్య మాత్రం పెరిగిపోతున్నా పట్టించుకొన్న నాథుడే కానరాడు. అలా పెరిగిన జనారణ్య టైగర్‌లో ఒకటి తన 86 ఏళ్ల వృద్ధాప్య దశలో ఈ మధ్య మరణించింది. ఆ టైగర్ పేరు బాల్‌ఠాక్రే. నివాసం ముంబై మహానగరం. అడవిలో సింహం కింగైతే, ఈ టైగర్ నగరానికి, దానికి చెందిన రాష్ట్రానికి కింగ్ కావడం దాని విశేషం. నాలుగు దశకాలుగా అది ముంబైని తన గుప్పిట్లో పెట్టుకొని కింగ్ పాత్రను పోషించి రిమోట్ కంట్రోల్‌తో అదిరించి, బెదిరించి, శాసించి ఈ నెల 17న అస్తమించింది. ప్రపంచంలోని ఏ జనారణ్య నగర టైగర్ల చేతిలో రిమోట్ కంట్రోల్ కనిపించదు కాని, ఈ నగర టైగర్ చేతిలో బహిరంగంగా, అందరి సమక్షంలో కనిపిస్తుంది. అయినా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, రాజ్యాంగాన్ని పరిరక్షించే న్యాయ వ్యవస్థలు ఏవీ దాని 'బాల్' (వెంట్రుక) లోని ఒక్క 'బాల్'ను పీకలేకపోయాయి. అదీ దాని స్పెషాలిటీ.

అది నిలబడమంటే నిలబడాలి, కూర్చోమంటే కూర్చోవాలి, ఆడమంటే ఆడాలి, పాడమంటే పాడాలి, ఎగరమంటే ఎగరాలి, దూకమంటే దూకాలి, అవునంటే అవుననాలి, కాదంటే కాదనాలి, బంద్ అంటే బంద్ అనాలి – తెరవమంటే తెరవాలి, తన్నమంటే తన్నాలి – చంపమంటే చంపి తీరాలి. ఇదంతా దాని రిమోట్ కంట్రోల్ బలం. మరి ఇంత బలం దానికెలా వచ్చిందనా మీ డౌటు – చెప్తానాగండి. కొంచెం ఓపిక పట్టి, శాంతంగా వినండి. అలాగని దానికి పంజాలు, కోరలున్నవా అంటే అవీ లేవు. ఏవీ లేకుండా ఎం.ఎఫ్. హుస్సేన్‌ను దేశం నుంచి బహిష్కరించి అక్కడే చనిపోయేలా చేశాడెలా, పాకిస్తాన్ క్రికెట్ టీంలను, సాంస్కృతిక బృందాలను ఆపాడెలా? బాలీవుడ్ మొత్తాన్ని తన కాళ్ల కిందికి రప్పించుకున్నాడెలా, పారిశ్రామికాధిపతులు వంత పాడారెలా?.. ఇలా అడుక్కుంటూ పోతే ఎన్నో ఉన్నాయి. వాటికి జవాబులూ ఉన్నాయి.

టైగర్‌కు తన జాతి సంతతంటే, వారు మాట్లాడే భాషంటే తెగ ఇష్టమనీ, వారిని కాపాడడానికి తన ప్రాణం అర్పిస్తాననీ హామీ ఇచ్చాడు. కాని అందుకు ఇతర భాషల రాష్ట్రాల ప్రజలు, ముస్లింలు, దక్షిణ, ఉత్తర భారతీయులు పెద్ద అడ్డంకిగా ఉన్నారని రెచ్చగొట్టాడు. వారి పీడ వదలందే మీ పీడలు దూరం కావని మంత్రోపదేశం చేసి అందుకు తాను ఆదేశించే సూత్రాలను పాటించే వారు లక్షల కొద్ది ముందుకు రావాలని సూచించాడు. అంతే, 19 జూన్ 1966న 'శివసేన' పార్టీ ఏర్పడి, దానికి అంగ బలాలుగా విద్యార్థి సేన, కార్మిక సేన, ఉద్యోగ సేన, యువసేనలు గల్లీ గల్లీకి పుట్టుకొచ్చాయి. అప్పటికే నగరంలో కమ్యూనిస్టులు కొన్నేళ్లుగా పోరాడి కార్మిక యూనియన్‌లు స్థాపించి తమ స్థావరాలు చేసుకున్నారు. ఇది పాలకపక్షం కాంగ్రెస్‌కు, ధనిక వర్గాలకు పెద్ద తల భారమై, ఎలా వదులుకుందామన్న కష్ట దశలో దేవునిలా టైగర్ దొరికాడు. ఇంకేముంది? టైగర్ ఆగుతుందా, అటు ప్రభుత్వాల, పోలీసుల, ధన, అల్లరి మూకల గూండాల కండబలాల కొండంత అండ లభించి విజృంభించాడు.

మొదటి పంజా దక్షిణ భారతీయులపై – ఉద్యోగాలన్ని చేజిక్కించు కొని కాజేశారన్న కారణం చూపి నగర పేద ప్రజలను అక్కడే నివసించే వలస పేద కూలీ ప్రజలపై ఉసిగొలిపి, పేదల మధ్య యుద్ధ నీతిని, సంస్కృతిని నేర్పిన టైగర్, బహుశా దేశంలోనే మొదటి వాడు కావచ్చు. కన్నడ వారి ఉడిపి హోటళ్లు, తమిళ, మలయాళీ, తెలుగు వారి నివాసాలపై, అశక్తులపై, బలహీనులపై బీభత్సం, విధ్వంసం సృష్టించిన ప్రతాపాలన్ని ఆ టైగర్, దాని సేన చేయగలిగిందంటే దాన్ని వీరత్వమని, దానికి అది భావించవచ్చు. వాస్తవానికి అది పిరికిపందల లక్షణమని బుర్ర ఉన్న ఏ మనిషైనా అర్థం చేసుకోగలడు. ఆ తర్వాత కొన్నాళ్లకు క్షమాపణలు చెప్పకుండానే మీరు, మేము హిందువులమని, హిందూ కార్డు పట్టుకొని ముస్లింలపై దాడిచేసి వారిని ఊచకోత కోసి 'హిందూ సామ్రాట్ టైగర్'గా బిరుదు తగిలించుకున్నాడు. మరి కొన్నేళ్లకు ఆ పాచికలేవీ పారకుంటే ఉత్తర భారతం, యుపి, బీహార్‌ల వారిపై దాడులు చేసే కొత్త ఎత్తుగడలు వేసి వేట మొదలెట్టాడు. స్థానిక ఉద్యోగాలు – భూమి పుత్రుల సమస్య వరకు ప్రపంచంలో ఏ టైగర్‌తో ఏ ఇబ్బంది లేదు కానీ ఈ ఒక్క టైగర్ మాత్రం ఇంకెన్నో అడుగులు ముందుకేసి పేదలను పేదలతోనే, ప్రజలను ప్రజలతోనే మతకల్లోలాలు, దాడులు చేసే నీచ సంస్కృతికి తెరలేపి తన అంగబలాలకు మరింత విషమ తత్వాలు బోధించి తర్ఫీదు చేశాడంటే అది ఎలాంటి టైగరో మీరే ఊహించాలి. అంతెందుకు అది తన భాషకే చెందిన దళిత పాంథర్స్‌పై 1969–72 దశకంలో దాడులు చేసింది, తన స్వంత కార్మికుల మిల్లులు మూతబడి రోడ్డుపై పడేసినా పట్టించుకోలేదు. రైతుల భూములను లాక్కొని సెజ్‌లకు అప్పగించింది. డా. అంబేద్కర్ రిడిల్స్ గ్రంథంపై, పు.ల. దేశ్‌పాండేపై, విజయ్ టెండూల్కర్ లాంటి గొప్ప మహానుభావుల, సాహితీకారుల గ్రంథాలపై విరుచుకపడి నానా బీభత్సం సృష్టించినా తోటి తన సంతతి ఒక్క నోరు విప్పలేదు అంటే, ఆ కృత్రిమ టైగర్ భయమే తప్ప, మరొకటి కాదు. ఇప్పుడు టైగర్ శకం ముగిసింది. ఇక మరో టైగర్ దాని స్థానంలో వస్తుందా? దాని వలెనే పోలి ఉంటుందా అని ఎదురు చూస్తుంది.

*(రచయిత అఖిల భారత తెలంగాణ రచయితల వేదిక ప్రధాన కార్యదర్శి)* వీ

# ఒబామా గెలుపు ఎవరికి మేలు?

***నాలుగేళ్ల పాలనలో విదేశాంగ విధానంలోగానీ, ఆంతరంగిక విధానలలో గానీ ఏ మార్పు తేని ఒబామా రెండో గెలుపు ఏం సాధిస్తుందని ప్రశ్నిస్తున్నారు*** **రాజవరం పార్థసారథి**

అమెరికా అధ్యక్షుడుగా బారక్ హుసేన్ ఒబామా మొదటిసారి గెలిచినప్పుడు వీక్షణం 2008 డిసెంబర్ సంచికలో 'ఒబామా మార్పు తేగలడా?' అని సంపాదకీయ వ్యాఖ్య రాశారు. ఇప్పుడు ఒబామా రెండోసారి గెలిచిన సందర్భంగా ఆ వ్యాఖ్యను యథాతథంగా గుర్తు తెచ్చుకోవడం అవసరం.

'రెండువందల ముప్పై సంవత్సరాల తర్వాత, నలభైముగ్గురు అధ్యక్షులతర్వాత అమెరికా అధికార పీఠం మీదికి ఆ సమాజంలోని అతి ముఖ్యభాగానికి చెందిన వ్యక్తికి అవకాశం దొరకడం కొత్తగాలి వీస్తున్నదనడానికి సూచనే. అంతమాత్రమే గాక, తెల్లవారికి, నల్లవారికి మధ్య సమానత్వం ఉండాలని అన్నందుకే ఇద్దరు అధ్యక్షులు హత్యకు గురయిన దేశంలో, ఒక నల్లజాతి వ్యక్తి ఎన్నికల ద్వారా అధ్యక్ష పదవికి రావడం కూడ ఆహ్వానించవలసిన సంగతే. అమెరికా సమాజంలో వ్యక్తీకరణ పొందుతున్న కొత్త తరం ఆలోచనలకు, ప్రజాస్వామిక ధోరణులకు ఒబామా ఎన్నిక ఒక సూచనే. అయితే అమెరికన్ సమాజంలోని కొత్తధోరణులు తనమీద పెట్టిన ఈ నమ్మకాన్ని ఒబామా నిలుపుకోగలడా అనే అనుమానాన్ని అమెరికన్ సమాజంలోని ప్రగతిశీల శక్తులన్నీ వ్యక్తంచేస్తున్నాయి. అమెరికన్ పాలకవర్గాలలో ఒక ముఠా కోరికలమేరకు, ఆ ముఠా ఆర్థికసహాయంతో అధికారపగ్గాలు చేపట్టిన ఒబామా ఆ వర్గపు ప్రయోజనాలకు భిన్నంగా వ్యవహరించగలడా అని వారు ప్రశ్నిస్తున్నారు. ఆ ముఠా ప్రయోజనాలు రిపబ్లికన్ పార్టీ ప్రయోజనాలకన్న, జార్జి బుష్ ప్రయోజనాలకన్న భిన్నమైనవేమీ కావు. వాళ్ల నినాదాలు వేరు కావచ్చుగాని, పశ్చిమాసియా చమురు నిల్వల విషయంలో, ఇజ్రాయిల్ పాలకులను సమర్థించే విషయంలో, ప్రపంచవ్యాప్తంగా నెలకొన్న అమెరికన్ యుద్ధస్థావరాల విషయంలో, అఫ్ఘనిస్తాన్, ఇరాక్ లతో యుద్ధం విషయంలో, ప్రపంచీకరణ రాజకీయార్థిక విధానాల విషయంలో, ప్రపంచాన్ని బహుళజాతిసంస్థల దోపిడీ పీడనలకు అనుకూలంగా తయారుచేసిపెట్టే విషయంలో వాళ్ల ఆలోచనలు ఒకటే. అమెరికన్ ఆంతరంగిక రాజకీయార్థిక విధానాలలో ఏ స్వల్పమైన మార్పులనో ఒబామా తీసుకు రాగలడేమోగాని, అమెరికన్ విదేశాంగనీతినీ, అంతర్జాతీయ రాజకీయార్థిక వ్యవహారాలలో అమెరికా పాలకులు నిర్వహిస్తున్న దౌర్జన్య, దోపిడీ విధానాలనూ మార్చగలడా అనే ప్రశ్న వేయవలసినదే. మార్చజాలడనే విషయంలో ఎటువంటి సందేహం అవసరం లేదు' అని నాలుగేళ్ల కింద వీక్షణం రాసిన వ్యాఖ్యలో అక్షరం కూడ మార్చవలసిన అవసరాన్ని ఒబామా కల్పించలేదు.

గెలుస్తాడా, ఓడుతాడా అని చివరి నిమిషం దాకా ఉత్కంఠకు గురి చేసి ఒబామా చివరికి రెండోసారి గెలిచి మరొక నాలుగేళ్ల కొరకు అమెరికా అధ్యక్షుడయ్యాడు. శ్వేత జాత్యహంకారానికీ, నల్లజాతి పట్ల వివక్షకూ పేరుపొందిన అమెరికాలో నల్లజాతికి చెందిన వ్యక్తి అధ్యక్షుడు కావడమే విశేషం గనుక మొదటిసారి 2008 ఎన్నికలలో ఒబామా ఎన్నికను చాలమంది విమర్శనాత్మకంగా అయినా ఆహ్వానించారు. అమెరికా విదేశాంగ విధానం ప్రధానంగా సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల చేతుల్లోనే ఉంటుంది గనుక అది మారకపోవచ్చునని, కాని నల్లజాతి వ్యక్తిగా, డెమొక్రటిక్ పార్టీ అభ్యర్థిగా కనీసం దేశ అంతర్గత విధానాలలో ఒబామా పాలన కొంత ప్రగతిశీలంగా ఉండవచ్చునని కొందరు ఆశించారు. ఒబామా నాలుగు సంవత్సరాల పాలన ఆ ఆశలన్నిటినీ వమ్ము చేసింది.

ప్రపంచవ్యాప్తంగా యుద్ధోన్మాద రాజకీయాలను కొనసాగించడం, నాటో దళాలతో కలిసి ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ లలో సైన్యాలను తిష్టవేయించి, దుర్మార్గమైన దాడులు కొనసాగించడం, చమురు అవసరాల కోసం గల్ఫ్ దేశాల మీద కయ్యానికి కాలు దువ్వడం, అక్కడి ప్రజాందోళనలకు, కుట్రలకు సహకరించడం, లిబియా మీద దాడి చేయడం, గల్ఫ్ దేశాలకు పక్కలో బల్లెంలా అమెరికన్ పాలకవర్గాలు తయారు చేసిపెట్టిన ఇజ్రాయెల్ ను కనీసంగానైనా అదుపు చేయకపోవడం వంటి విధానాలన్నీ ఒబామా పాలనలో యథాతథంగా సాగాయి. వాటిని మౌలికంగా మార్చగలిగిన శక్తి అమెరికా అధ్యక్షుడికి లేకపోవచ్చు. కాని అమెరికా ఆర్థిక వ్యవస్థలోపల పెరుగుతున్న అసమానతలను తగ్గించడానికి ప్రయత్నించడం, సంక్షేమ వ్యయాల మీద కోత విధించకపోవడం, నల్లజాతి, లాటినోలు, ఆసియన్లు, స్త్రీలు వంటి అణగారిన అమెరికన్ వర్గాల పురోగతికి అవసరమైన చర్యలు తీసుకోవడం వంటి పనులన్నా ఒబామా నాయకత్వంలోని డెమొక్రటిక్ ప్రభుత్వం చేయగలదని ఆశించినవారికి ఆశాభంగమే మిగిలింది.

ఒబామా వ్యక్తిగతంగా గాని, డెమొక్రటిక్ పార్టీ మొత్తంగా గాని 2008 ఎన్నికల్లో చేసిన వాగ్దానాలన్నీ జాబితా తయారుచేసి, వాటిలో నెరవేర్చనివెన్నో రాజకీయ విశ్లేషకుడు మాట్ స్టోలర్ నిర్ధారించారు. ఆ జాబితా ప్రకారం కార్మికులు యూనియన్లలో చేరడాన్ని సులభతరం చేసే ఎంప్లాయీ ఫ్రీ చాయిస్ ఆక్ట్ అనే చట్టం తీసుకువస్తామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. సమ్మె చేసిన కార్మికులను శాశ్వతంగా తొలగించడంపై నిషేధం విధిస్తామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. కార్మికులందరికీ ఏడురోజుల వేతనసహిత అనారోగ్య సెలవులు ఇస్తామమే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. ఆధారపడిన పిల్లలు ఉంటే తల్లిదండ్రులకు ఎర్న్డ్ ఇన్‌కమ్ టాక్స్ క్రెడిట్ రాయితీ ఇస్తామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. కనీస వేతనాలను పెంచుతామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. తనఖా అప్పులను రద్దు చేసే అధికారం స్థానిక న్యాయాధికారులకు ఇస్తామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. అమెరికన్ పౌరుల టెలిఫోన్ సంభాషణలను రహస్యంగా,

వారంట్ లేకుండా వినడం రద్దు చేస్తామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. దేశంలోని ప్రజాఉద్యమ బృందాల మీద, కార్యకర్తల మీద కేంద్ర ప్రభుత్వ దాడులను ఆపుతామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. హెబియస్ కార్పస్ హక్కును పునరుద్ధరిస్తామనే వాగ్దానాన్ని నెరవేర్చలేదు. అసలు వీటిని అమలు చేయడంలో విఫలం కావడం కాదు, ఏ ఒక్క వాగ్దానాన్నీ అమలు చేయడానికి చిన్నమెత్తు ప్రయత్నం కూడ ఈ నాలుగేళ్లలో జరగలేదని స్టోలర్ వ్యాఖ్యానించారు.

'వీటిని కేవలం వాగ్దానాల ఉల్లంఘనలుగా మాత్రమే చూడగూడదు. ఇవి అణగారిన ప్రజల ఆర్థిక రాజకీయ హక్కుల ఉల్లంఘనలు. వ్యక్తిగత అంశాలు, యూనియన్ హక్కులు, రుణగ్రహీతల హక్కులు, క్రియాశీల కార్యకర్తల హక్కులు వంటివన్నీ వాగ్దానాలలో ఉన్నాయి గాని ఏ ఒక్కటీ అమలులోకి మాత్రం రాలేదు. ఇందుకు భిన్నంగా, బడా వ్యాపారవేత్తల, బ్యాంకుల, మొత్తంగా అమెరికన్ సామ్రాజ్యవాదపు సేవలో, వారికోసం మాత్రం ఒబామా ప్రభుత్వం ఎన్నెన్నో పనులు చేసింది. భారీ బ్యాంకులను రక్షించడానికి, వాల్‌స్ట్రీట్ సహాయార్థం లక్షల కోట్ల డాలర్ల ప్రజాధనాన్ని ఖర్చుపెట్టింది. అఫ్ఘనిస్తాన్ లో యుద్ధాన్ని కొనసాగించింది. లిబియా, పాకిస్తాన్, యెమెన్, తదితర ప్రాంతాలకూ సైనిక చర్యలను విస్తరించింది. చివరికి ఒబామా తెచ్చిన కొత్త ఆరోగ్య రక్షణ చట్టంలో కొన్ని అనుకూల అంశాలున్నప్పటికీ, వాటికన్న ఎక్కువగా కొన్ని నిబంధనలు లక్షలాది ప్రజలను బీమా కంపెనీల లాభార్జనా పథకాల వలలోకి నెట్టివేసేలా ఉన్నాయి' అని ఆయన రాశారు.

ఇది వ్యక్తిగత సమస్య కాదు. బారక్ ఒబామా అనే వ్యక్తి నల్లజాతికి చెందినవాడిగా వివక్ష, అవమానం, పేదరికం, కష్టాలు తెలిసినవాడే కావచ్చు. కాని ఆ పుట్టుక మాత్రమే ఆయన విధానాలను నిర్ణయించదు. వర్గ సమాజంలో అధికార పీఠం ఎక్కేవారు ఏ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు, ఏ భావజాలంతో, విలువలతో ఉన్నారు అనేదే ప్రధానమవుతుంది, పాలకవర్గంలో చేరిపోయిన వ్యక్తిగా, పాలకవర్గ ప్రతినిధిగా, ప్రభుత్వాన్ని నడిపే వ్యక్తిగా ఒబామా ముందు ఉండే కర్తవ్యం తాను పుట్టిన అస్తిత్వ బృందపు హక్కులను రక్షించడం ఎంతమాత్రం కాదు. ఆ అస్తిత్వాన్ని వదిలేసి, లేదా కేవలం ప్రదర్శనావస్తువుగా మాత్రమే ఉంచుకుంటూ, చూపుతూ, వాస్తవంలో మాత్రం పాలకవర్గ ప్రయోజనాలను కాపాడడం, పెంపొందించడం మాత్రమే ఆయన బాధ్యత. ఆ కర్తవ్యాన్ని ఆయన ఎంతకాలం సమర్థంగా నెరవేర్చగలిగితే అంతకాలం మాత్రమే ఆయనకు ఆ ప్రాతినిధ్య పాత్ర దక్కుతుంది. గత నాలుగేళ్లలో ఆ పని చాల సమర్థంగా చేశాడని రుజువైనందువల్లనే ఆయనకు మరో అవకాశం దక్కింది. అణగారిన ప్రజలను, డెమొక్రటిక్ పార్టీ శ్రేణులను చాలవరకు, ప్రగతిశీల శక్తులను కూడ కొంతవరకు ఆకర్షించడానికి, మోసగించడానికి ఎట్లాగూ వాగ్దానాలు, వాగాడంబరం ఉండనే ఉన్నాయి. అవి చాలవనుకుంటే ఎన్నికల అక్రమాలు కూడ తోడ్పడతాయని వార్తలు, వ్యాఖ్యలు వస్తున్నాయి.

పుట్టుక వల్ల ఒబామా ఏదో ఒరగబెడతాడని సగటు అమెరికన్ పౌరులకు ఆశలున్నాయో లేవో గాని భారతదేశంలో మాత్రం శ్వేత సౌధంలో నల్లకలువ వగైరా విశేషణాలతో 2008 గెలుపు సందర్భంగా చాలా ఆశాభావం వ్యక్తమయింది. అయితే పుట్టుక వల్ల తమ అస్తిత్వ బృందానికి సహాయం చేస్తారనే మాట నిజం కాదని అందరికన్న ఎక్కువగా భారతీయులకు తెలుసు. భారత రాష్ట్రపతి సింహాసనం మీద అణగారిన వర్గాలలో పుట్టినవారందరూ (దళితుడు కె ఆర్ నారాయణన్, ముస్లింలు జాకీర్ హుసేన్, ఫక్రుద్దీన్ అలీ అహ్మద్, అబ్దుల్ కలామ్, సిక్కు జైల్‌సింగ్, స్త్రీ ప్రతిభా పాటిల్) కూచున్నారు. కాని ఆయా వర్గాల జీవితాల పురోభివృద్ధికి, కనీసం వివక్ష, అత్యాచారాలు ఆపడానికి వారు చేసిన మేలు అణువంత కూడ లేదని ప్రతి ఒక్కరికీ తెలుసు.

అసలు అమెరికాలో నడుస్తున్నది ప్రజాస్వామ్యమే కాదని, అందువల్లనే అధ్యక్షుడుగా ఏ పార్టీకి చెందిన ఏ వ్యక్తి ఉంటారనేది ముఖ్యం కాదని ఒబామా గెలుపుకు కొద్ది ముందే వామపక్ష రచయిత రాబర్ట్ మెక్ చెస్నీ ఒక సుదీర్ఘమైన విశ్లేషణా వ్యాసం రాశారు.

'ప్రస్తుత అమెరికా ఎన్నికల రాజకీయాలలో ఒకవైపు రాజకీయ నాయకులూ మేధావులూ చేసే గంభీరమైన ప్రకటనలున్నాయి. మరొకవైపు తీవ్రమైన, విస్తారమైన, సాధారణంగా నిర్లక్ష్యానికి గురవుతున్న అమెరికన్ ప్రజానీకపు సమస్యలున్నాయి. ఈ రెంటి మధ్యా అఖాతం నానాటికి పెరిగిపోతున్నది' అని ఆయన రాశారు. 'ప్రజలకూ పాలకులకూ మధ్య ఈ దూరానికి ఒక ఉదాహరణ చెప్పాలంటే ప్రతి ఏటా సైనికీకరణకూ యుద్ధానికీ ఖర్చవుతున్న లక్ష కోట్ల డాలర్ల నిధుల మీద ఎటువంటి ప్రజాసమీక్ష, చర్చ ఉండడం లేదు. అలాగే ఆర్థిక వ్యవస్థ మీద, ప్రభుత్వం మీద కార్పొరేట్ శక్తుల నియంత్రణ గురించి కూడ ఎక్కడా చర్చకు రావడం లేదు. సమాజంలో, ఆర్థిక వ్యవస్థలో ప్రతిష్టంభన, వర్గ వ్యవస్థ, పెరిగిపోతున్న పేదరికం, రోజురోజుకూ కునారిల్లుతున్న సామాజిక సేవలు వంటి అంశాలు రాజకీయవాదుల ఉపన్యాసాలలో, ఎన్నికల సమయంలో తప్ప మరెప్పుడూ ప్రస్తావనకు కూడ రావడం లేదు' అని మెక్ చెస్నీ అంటున్నారు.

ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్యమని చెప్పుకునే అమెరికా ప్రభుత్వాలు ఇలా ఎందుకు ప్రజలకు దూరదూరంగా జరిగిపోతూ, ప్రజావ్యతిరేకంగా మారిపోతున్నాయో చర్చిస్తూ ఆయన 'నిజంగా దేశం ఎదుర్కొంటున్న సమస్యలకూ ప్రధాన స్రవంతి రాజకీయాలకూ ఏమీ సంబంధం లేని స్థితి నానాటికీ పెరుగుతున్నది. లేదా, ఇంకా సరిగా చెప్పాలంటే ఇవాళ దేశం ఎదుర్కొంటున్న సమస్యలను కల్పిస్తున్న ప్రధాన శక్తి ప్రధానస్రవంతి రాజకీయాలే' అన్నారు.

'పెట్టుబడిదారీ విధానానికీ ప్రజాస్వామ్యానికి మధ్య సంబంధం ఎప్పుడూ సమస్యల మయమే. పెట్టుబడిదారీ విధానమేమో దారుణమైన అసమానతను సృష్టిస్తుంది. ప్రజాస్వామ్యమేమో రాజకీయ సమానత్వ భావన మీదనే ఆధారపడుతుంది. కాని రాజకీయ సమానత్వాన్ని ఆర్థిక అసమానత్వం దెబ్బతీసినప్పుడు, తీవ్రమైన ఆర్థిక అసమానతల పరిస్థితులలో ప్రజాస్వామ్యం మనుగడ అసాధ్యమైపోతుంది' అని ఆయన నిర్ధారించారు. 'చాల కాలంగా అమెరికాను 'బలహీన ప్రజాస్వామ్యం' అని అభివర్ణిస్తున్నారు. కాని కొత్త శతాబ్దపు రెండో దశాబ్దానికల్లా ఆ వర్ణన అతిశయోక్తి అయిపోయింది. ఇవాళ అమెరికా గురించి కచ్చితంగా చెప్పాలంటే అది డాలరోక్రసీ - డాలర్ స్వామ్యం - తప్ప మరేమీ కాదు. అది ప్రజల పాలన కాదు, డబ్బు పాలన. ఇది అమెరికాకే ప్రత్యేకమైన అత్యల్ప సంఖ్యాక సంపన్న ముఠా రాజ్యం. ఎవరి దగ్గర ఎక్కువ డాలర్లుంటే వాళ్లే ఎక్కువ వోట్లు తెచ్చుకుంటారు, వాళ్లే పాలన సాగిస్తారు' అని ఆయన అన్నారు.

వ్యక్తిగా బారక్ ఒబామా దగ్గర గాని, రాజకీయ పార్టీగా డెమొక్రటిక్ పార్టీ దగ్గర గాని ఆ డబ్బులు ఉన్నాయా లేవా, వారి ప్రకటిత ఆదర్శా

# చిల్లర వర్తకంపై పాలకుల ప్రేమ

*సామ్రాజ్యవాదుల ప్రయోజనాలే దేశ ప్రయోజనాలని ప్రజలను నమ్మిస్తూ, వాటిని అమలు చేయడానికి భారత పాలకులు చేస్తున్న దుర్మార్గాలను వివరిస్తున్నారు* **కె.వి. కూర్మనాథ్**

చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడులకు సంబంధించి నవంబరులో రెండు పరిణామాలు జరిగాయి. మొదటిది, ఢిల్లీ రామలీలా మైదానంలో కాంగ్రెస్ పార్టీ పెట్టిన భారీ బహిరంగసభ. రెండోది, ప్రభుత్వ అనుమతుల కోసం లంచాలిచ్చారన్న ఆరోపణలతో తమ సంస్థలో పనిచేస్తున్న కొందరు ఉన్నతాధికారులను వాల్‌మార్ట్ ఉద్యోగాల్నించి తొలగించడం.

గత ఎనిమిదేళ్ల కాలంలో దేశాన్ని పీడించిన, కుదిపివేసిన ఏ సందర్భంలోనూ కాంగ్రెస్ ఒక సభ పెట్టాలనుకోలేదు. ఎప్పుడూ మౌనముద్రలో ఉండే ప్రధానమంత్రి, కోటరీయే కళ్లు, చెవులుగా ఉన్న సోనియాగాంధీ, తెలివిలేని అవగాహనలేని నాయకుడు అనే పేరు తెచ్చుకున్న రాహుల్‌గాంధీ - ఈ ముగ్గురూ ఢిల్లీలో బ్రహ్మాండమైన సభ పెట్టారు. దేశానికి వాళ్లు ఏం చెప్పదల్చుకున్నారంటే 'ఆరునూరైనా మేం చిల్లరవర్తకంలో విదేశీ పెట్టుబడుల్ని అనుమతించి తీరతాం' అని.

ఒక్క మనదేశ ప్రజలకే కాదు, విదేశీ పెట్టుబడిదారులకు కూడా ఈ సభ ద్వారా ఒక సందేశం ఇవ్వదలచుకున్నారు. ప్రస్తుత ప్రధానమంత్రే కాదు కాబోయే ప్రధానమంత్రికి కూడా ఈ నిర్ణయానికి మద్దతిస్తున్నారని, దానికి యుపిఎకి సారథ్యం వహిస్తున్న కాంగ్రెస్ వెన్నుదన్నుగా ఉందని- ఆ సందేశం సారాంశం. ఇంకా చెప్పాలంటే, పాశ్చాత్య ప్రభుత్వాలకు పెట్టుబడికి భరోసా ఇవ్వడానికే కాంగ్రెస్ ఢిల్లీలో సభ పెట్టింది. తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో ఉన్న పాశ్చాత్య దేశాలను ఒడ్డున పడేయ్యడమే మన్మోహన్ సింగ్, సోనియాగాంధీ, చిదంబరంల అసలు లక్ష్యం.

ఇది ఒక కుట్ర. జాతి విద్రోహం. దేశ ప్రయోజనాల్ని తాకట్టు పెట్టేయడమే. ఇది కుట్ర అనడానికి, విద్రోహమనడానికి సాక్ష్యాలు చూడండి. పాశ్చాత్య ప్రభుత్వాల వాదనల్ని కాపాడడానికి, అక్కడి పెట్టుబడి ప్రయోజనాల్ని పరిరక్షించడానికి ఎకనమిస్ట్, టైమ్, వాషింగ్టన్ పోస్టు పత్రికలు పనిచేస్తుంటాయి. అందుకు సరిపడా వార్తలు, కథనాలు, విశ్లేషణలు రాస్తుంటాయి. గత నాలుగైదు నెలలుగా ఈ పత్రికలు మన్మోహన్‌సింగ్‌ను చవట దద్దమ్మ అని, అసమర్థ పాలకుడని తిట్టాయి. ఎందుకంటే, దేశంలో ఆర్థిక సంస్కరణలు వాళ్లనుకున్నంత వేగంగా జరగడంలేదు. లాభసాటైన మైనింగ్, మౌలిక వసతులు, చిల్లరవర్తకం, విమానయానరంగం, ప్రావిడెంట్ ఫండు, ఇన్సూరెన్సు - ఈ రంగాలన్నీ విదేశీ పెట్టుబడికి అందనంత దూరంలోనే ఉండిపోయాయి. వాటి అక్రమాలకు, దోపిడికి అవకాశం లేకుండా పోయింది.

ఎకనమిస్ట్ పత్రిక సెప్టెంబర్29 సంచికలో మనదేశంపై పద్నాలుగు పేజీల ప్రత్యేక కథనాన్ని ప్రచురించింది. 'విదేశీ పెట్టుబడుల్ని భారత్ అనుమతించాలి. ఇలాచేస్తే పెట్టుబడుల వాతావరణం పుంజుకుంటుంది. కొన్ని రాష్ట్రాల్లోనైనా విదేశీ కంపెనీలు సూపర్ మార్కెట్లు పెట్టుకోవడానికి అనుమతించాలి. భారత విమానయాన కంపెనీల్లో విదేశీ కంపెనీలు వాటా కొనుక్కోనివ్వాలి. కానీ విదేశీ పెట్టుబడులపై నియంత్రణ పరిమితులు బుద్ధిలేని పనులు' అని వ్యాఖ్యానించింది.

ఇది సెప్టెంబర్‌లో వచ్చిన సంచిక. అక్టోబర్ నెలాఖరుకల్లా ఎకనమిస్టు పత్రిక (అంటే పశ్చిమదేశాలు లేదా విదేశీ పెట్టుబడి) ఏం కోరుకుందో మన్మోహన్‌సింగ్ - చిదంబరం - సోనియా ప్రభుత్వం అది యథాతథంగా చేసేసింది. అంటే ప్రభుత్వం ఎవరిమాట ప్రకారం నడచుకుంటుందో, ఎవరి ఇష్టాయిష్టాల ప్రకారం నిర్ణయాలు తీసుకుంటుందో స్పష్టంగా తెలుస్తోంది కదా.

ఇప్పటి ఈ నిర్ణయాలకు మార్గం సులువు చేసేందుకు ఏడాది మొదటి నుంచే పకడ్బందీ పథకం సిద్ధమయింది. తమ ఆలోచనలన్నింటినీ యథాతథంగా అమలు చెయ్యడానికి అడ్డొస్తున్న, తెలిసో తెలియకో విదేశీ పెట్టుబడులు దేశంలోకి రావడాన్ని నిదానపరిచిన ప్రణబ్‌ముఖర్జీని ఆ పదవి నుంచి తప్పించారు. మన అవసరాలకన్నా విదేశీ ప్రభుత్వాల, కంపెనీల ప్రయోజనాలే ముఖ్యమనుకునే చిదంబరానికి ఆర్థికశాఖ ఇచ్చారు. హోంమంత్రిగా మైనింగ్ కంపెనీల ప్రయోజనాల కోసం దండకారణ్యంలో గ్రీన్‌హంట్‌ను మొదలుపెట్టిన చిదంబరం, ఆర్థిక మంత్రిగా బాధ్యతలు చేపట్టిన క్షణం నుంచి విదేశీ పెట్టుబడులకు ఎలాంటి అడ్డులేకుండా నిర్ణయాలు తీసుకుంటున్నాడు.

తమిళనాడు, పశ్చిమబెంగాల్ వంటి రాష్ట్రాలు ఈ నిర్ణయాల్ని బహిరంగంగానే వ్యతిరేకించాయి. ఈ వ్యతిరేకత వెనక దేశీయ వర్తకాన్ని కాపాడాలన్న కాంక్షకంటే, రాజకీయ ప్రయోజనాలే ఎక్కువ కారణం కావచ్చు. కేంద్ర ప్రభుత్వం నుంచి ఏవో లాభాలు ఆశించి కావచ్చు. దేశవ్యాప్తంగా పెల్లుబికిన నిరసనలు, వ్యతిరేకతతో ప్రభుత్వం

లేమిటి, వారి శరీరపు రంగు ఏమిటి, వారు ఎక్కడ పుట్టారు అనేవన్నీ ఈ డాలరోక్రసీ కింద అణగిపోతాయి. అధికారిక ప్రకటనల ప్రకారం మొన్నటి ఎన్నికల ప్రచార వ్యయం కోసం ఒబామా 934 మిలియన్ డాలర్లు సేకరించి 852 మిలియన్ డాలర్లు ఖర్చు పెట్టగా, ప్రత్యర్థి మిట్ రోమ్నీ 881 మిలియన్ డాలర్లు సేకరించి 752 మిలియన్ డాలర్లు ఖర్చుపెట్టాడు. అంటే రూపాయల్లో చెప్పాలంటే ఒబామా సేకరించినది రు. 5,200 కోట్లు. ఇందులో అత్యధిక భాగం బహుళజాతి సంస్థల నుంచి అందిన విరాళాలే. ఇంకా విశాలమైన రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలు అలా ఉంచినా, ఈ విరాళాలకైనా ప్రతిఫలం ఇవ్వాలి గదా.

*(రచయిత పాత్రికేయులు)* వీ

ఆత్మరక్షణలో పడింది. ఎంత కాదనుకున్నా ఓట్లకు సంబంధించిన విషయం కదా! అందుకే భారీ బహిరంగసభ పెట్టి ఇది మంచి నిర్ణయమేనని, దీనికి ప్రజల మద్దతు ఉందని ప్రభుత్వమూ, కాంగ్రెస్‌పార్టీ ప్రకటించ దలచుకుంది. సభ అయితే పెట్టింది కానీ, సభకి వచ్చిన వాళ్లలో చాలా మందికి అసలు ఎఫ్‌డిఐ అంటే ఏమిటో, చిల్లర వర్తకంలోకి విదేశీ పెట్టుబడులు ఎందుకో తెలియదని రిపోర్టులు వచ్చాయి.

ప్రజల్ని కలతపెట్టిన, కలవరపెట్టిన ఏ అంశాల మీద మాట్లాడని ముగ్గురూ, విదేశీ ప్రయోజనాలకోసం ఒక రాజకీయ ప్రకటన ఇవ్వడం కోసం, విదేశీ పెట్టుబడిదారులకు భరోసా ఇవ్వడం కోసం మాత్రమే సభ పెట్టారన్నది స్పష్టం.

ఇక నవంబరు నెలలో చిల్లరవర్తకానికి సంబంధించి జరిగిన రెండో పరిణామం చూద్దాం. భారతదేశంలో తమ స్టోర్లు తెరవడానికి, ఇంకా ఇతర అనుమతులు సంపాదించడానికి లంచాలు ఇచ్చారని, ఇది తమ కార్పోరేటు నీతినియమావళికి భిన్నం కాబట్టి ఆ అవినీతికి కారకులైన తమ ఉద్యోగుల్ని తొలగిస్తున్నామని వాల్‌మార్ట్ ప్రకటించింది.

ఈ నిర్ణయం వెనుక రెండు కారణాలు కనిపిస్తాయి. ఒకటి తాము నీతి నిజాయితీకి ప్రతిరూపమని, వాటిని నిలబెట్టుకోవడం కోసం ఎంతటి స్థాయి ఉద్యోగులైనా ఉపేక్షించమని చెప్పడం. రెండోది, తమకు ఇలాంటి ఉత్కృష్టమైన విలువలు ఉన్నాయి కాబట్టే, భారత ప్రభుత్వం తమకు అనుమతులు ఇచ్చిందని చెప్పుకోవడం. భారత ప్రభుత్వానికి ఒక సర్టిఫికెట్ ఇచ్చి, విదేశీ చిల్లర వర్తకంతో పారదర్శకత వస్తుందని, అవినీతి తగ్గుతుందని దేశ ప్రజలకు చాటిచెప్పడం. విదేశీ పెట్టుబడులు వచ్చీ రావడంతోనే అవినీతిపరుల ఆటలు సాగడం లేదంటే, ఇక పూర్తిస్థాయిలో, అన్నిరంగాల్లో విదేశీ పెట్టుబడులు వస్తే ఇక అవినీతికి ఆస్కారమే ఉండదన్న సందేశం కూడా ఇందులో ఉంది. విదేశీ కంపెనీలు చేసే అవినీతి ఏ స్థాయిలో ఉంటుందో ఈ పాటికే మనకి అనుభవం ఉంది. మహారాష్ట్రలో ఎన్రాన్ కంపెనీ వాళ్లు రాజకీయ నాయకుల్ని, అధికారుల్ని 'ఎడ్యుకేట్' చెయ్యడాన్ని ప్రజలింకా గుర్తుంచుకునే ఉన్నారు. అమెరికన్ కంపెనీలు పారదర్శకత, కార్పొరేట్ గవర్నెన్స్, మోడల్ కోడ్ ఆఫ్ కాండక్టు, నైతిక పద్ధతులు వంటి మాటలను వాడుతుంటాయి. కానీ వాళ్లు లంచాలిచ్చి ప్రభుత్వాల్నే లొంగదీసుకుంటారు. బ్రహ్మాండమైన మార్కెట్‌ను తమ చేతుల్లోకి తీసుకుంటారు.

'వాల్‌మార్ట్ వాళ్లు ఎంత స్ట్రిక్ట్‌గా ఉంటారంటే, తాలూకా ఆఫీసులో వందరూపాయలు కూడా లంచమివ్వరు' అని ఆ కంపెనీ ఉద్యోగి ఒకరు నాతో అన్నారు. ఇంగ్లండ్, ఆస్ట్రేలియా, ఫ్రాన్స్ దేశాల కంపెనీలు కూడా ఈ అవినీతి చెయ్యవు. కానీ వాళ్లు ఏ అవినీతి చేస్తారంటే ప్రభుత్వాల్లో కీలకస్థానాల్లో ఉండేవాళ్ల 'అవసరాల్ని' చూసుకుంటారు. సాక్షాత్తూ ప్రధానమంత్రే, కాబోయే ప్రధానమంత్రే, కాంగ్రెస్‌పార్టీలో ఎదురులేని నాయకురాలే, ఆర్థికమంత్రే వాళ్లకి అనుకూలంగా మాట్లాడతారు. అందుకు వాళ్ల వాళ్ల ప్రభుత్వాలే రంగంలోకి దిగుతాయి. వాళ్ల ఆశయాల్ని ప్రచారం చెయ్యడానికి అంతర్జాతీయ మీడియా పూనుకుంటుంది. ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాల్ని అవమానం చేస్తాయి. అపహాస్యం చేస్తాయి. ఎద్దేవా చేస్తాయి. ఏసి గదుల్లో కూచుని రాసే జర్నలిస్టులు ఎక్కడో వేల మైళ్ల దూరంలో ఉన్న దేశాల స్థితిగతుల్ని నిర్ణయించే వ్యాసాలు రాస్తారు. ఇంత పెద్ద నిర్మాణం వాళ్లవెనుక ఉంటే తాలుకాఫీసుల్లో అవినీతికి పాల్పడాల్సిన అవసరం వాళ్లకేమొచ్చింది. అందుకే నీతి నిజాయితీకి పట్టంగట్టే కంపెనీలుగా ప్రచారం చేసుకుంటాయి. ఆ కంపెనీ లు అంత గొప్పవి కాబట్టే, ఆ పెట్టుబడులు అంత గొప్పవి కాబట్టే అవి మన దేశానికి తక్షణ అవసరం అని మన ప్రభుత్వం మనకి చెబుతుంది!

కొసమెరుపు - మనదేశాలకు ఏ నిర్ణయాలు అవసరమో తేల్చేసిన, ప్రభుత్వ నిర్ణయాలకు కారణమైన ఎకనమిస్టు వ్యాసానికి 35 మంది భారత ప్రముఖులు సహాయం చేసారని ఆ పత్రిక చెప్పుకుంది. భారత దేశం గురించి ఈ అవగాహనకు కారణమైన వాళ్లకు కృతజ్ఞతలు కూడా చెప్పుకుంది. వాళ్లలో కొందరి పేర్లు మాత్రం ఇక్కడ రాస్తాను. మాంటెక్ సింగ్ అహ్లూవాలియా (ప్రణాళికాసంఘం అధిపతి. మన్మోహన్‌సింగ్ శిష్యుడు. ఎన్నో ఏళ్లు ప్రపంచ బ్యాంకుకు సంబంధించిన పదవుల్లో ఉన్నవాడు. ప్రణాళికా సంఘం టాయిలెట్లకే ఎన్నో లక్షలు ఖర్చుపెట్టినట్టు వార్తల్లోకి రావడం వల్ల ఆర్థికమంత్రి కాలేకపోయినవాడు). ఇంకొకరు కేంద్రమంత్రి, మావోయిస్టుల మూలాల్ని దెబ్బకొట్టాలని కంకణం కట్టుకున్న జైరాం రమేష్. కాంగ్రెస్ అధికార ప్రతినిధి మనీష్ తివారీ, ఇన్ఫోసిస్ మాజీ సిఇఓ నందన్ నీలకేని, బిబిసి మాజీ విలేకరి మార్క్‌టల్లీ కూడా ఇందులో ఉన్నారు.

విదేశీ ప్రభుత్వాల, పెట్టుబడుల ప్రయోజనాల కోసమే ఎకనమిస్టు రాస్తుంది. ఆ నిర్ణయాలు తీసుకోవాల్సిన ప్రభుత్వంలోని వారే ఆ విశ్లేషణకు సహకరిస్తారు. అమలు చెయ్యాల్సిన, ప్రచారం చెయ్యాల్సిన వారే ఆ అభిప్రాయాలను బలపరుస్తారు! ఇంత పథక రచన ఉంటుంది మనల్ని శాసించే నిర్ణయాల రచన వెనుక! వీ

*(రచయిత పాత్రికేయులు)*

# నేపాల్ మావోయిస్టుల దారి ఎటు?

*నేపాల్ మావోయిస్టుల గురించి వచ్చిన రెండు తాజా వార్తల ఆధారంగా వారి రాజకీయ దిశ గురించి చర్చిస్తున్నారు*

**పార్వతి**

పది సంవత్సరాల సాయుధ పోరాటంతో దేశవ్యాప్త అధికారానికి చేరువ అయిన నేపాల్ మావోయిస్టుల పట్ల ప్రపంచవ్యాప్తంగానే ఆసక్తి, ఆదరణ వెల్లువెత్తాయి. భారతదేశంలోనూ, ఆంధ్రప్రదేశ్ లోనూ కూడ చాల మంది ప్రగతిశీలవాదులు, విప్లవ సానుభూతిపరులు నేపాల్ విప్లవాన్ని సగౌరవంగా ప్రశంసించారు. పదహారు వేలమంది కార్యకర్తలు, ప్రజలు అమరులైనప్పటికీ, వెనుకబడిన దేశాలలో ఇరవై ఒకటో శతాబ్ది విప్లవాలకు 'ప్రచండ మార్గం' దారి చూపుతుందని ఆశించారు. నాలుగు దశాబ్దాల సాయుధ పోరాటం తర్వాత కూడ విజయానికి చేరువ కాలేకపోయిన భారత విప్లవోద్యమం నేపాల్ నుంచి నేర్చుకోవలసి ఉంటుందని అన్నారు, అనుకున్నారు. సాయుధ పోరాటాన్ని 2006లో విరమించి ఖాట్మండులో ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకునే వ్యూహాలలో ప్రచండ, నేపాల్ మావోయిస్టు పార్టీ వేసిన పిల్లిమొగ్గలను కూడ కొందరైనా ఆ దృష్టితోనే సమర్థించారు. వారిని అప్పుడే కొట్టివేయ గూడదని, మరికొంత వేచి చూడాలని అన్నారు. కాని ఐక్యరాజ్యసమితి పర్యవేక్షణ కింద ఆయుధాల అప్పగింత, ప్రజాసైన్యాన్ని బారక్ లకు పరిమితం చేయడం, చివరికి ప్రజాసైన్యం ఉపసంహరణ, అధికారం కోసం అవకాశవాద ఎత్తుగడలు, రాజ్యాంగ రచనలో రాజీలు, విప్లవక్రమంలో స్వాధీనం చేసుకుని పేదలకు పంచిన భూములు, ఆస్తులు వెనక్కి ఇవ్వడం, వగైరా ఒక్కొక్క చర్యా ప్రచండ మార్గపు దివాళాకోరు తనాన్ని ఎత్తిచూపింది. ఆ దిశలో ఇప్పుడు రెండు తాజాపరిణామాలు జరిగాయి.

**పోఖరా అంతర్జాతీయ విమానాశ్రయం**

నేపాల్ పశ్చిమ కొసన హిమాలయ పర్వత సానువుల మధ్య అన్నపూర్ణ శిఖరానికి దగ్గరలో పోఖరా అనే పట్టణం ఉంది. అది ఖాట్మండు తర్వాత అతి పెద్ద పర్యాటక కేంద్రం. దాదాపు ఆరు దశాబ్దాలుగా అక్కడ ఒక చిన్న విమానాశ్రయం ఉంది. అక్కడికి వచ్చే విదేశీ యాత్రికుల సౌకర్యార్థం అక్కడ అంతర్జాతీయ విమానాశ్రయం నిర్మించాలనే ఆలోచన కూడ నేపాల్ పర్యాటక విమానయాన సంస్థకు చాల కాలంగా ఉంది. ఆ విమానాశ్రయం నిర్మించడానికి నేపాల్ ప్రభుత్వం ఏడాది కింద 2011 సెప్టెంబర్ 20న చైనా ప్రభుత్వ సంస్థ అయిన చైనా సిఎఎంసి ఇంజనీరింగ్ కంపెనీతో ఒప్పందం కుదుర్చుకుంది. ఇప్పుడు నేపాల్ పార్లమెంటులోని పబ్లిక్ అకౌంట్స్ కమిటీ (పిఎసి) ఈ ఒప్పందాన్ని తప్పు పడుతున్నది. అందుకు అక్కడి రాజకీయ సమీకరణాలు, సంక్షోభం ఒక కారణం కావచ్చు గాని, పిఎసి చూపుతున్న ఆర్థిక కుంభకోణం కారణం పూర్తిగా కొట్టిపారేయదగినదేమీ కాదు. గతంలో నేపాల్ ప్రభుత్వం ఈ విమానాశ్రయ నిర్మాణ వ్యయం 180 మిలియన్ డాలర్లు అని అంచనా వేయగా, ఈ ఒప్పందం మాత్రం 70 శాతం ఎక్కువగా 305 మిలియన్ డాలర్లకు కుదిరిందని పిఎసి అభ్యంతర పెట్టింది. నేపాలీ కరెన్సీలో చెపితే ఇది 1600 కోట్ల రూపాయల తొలి అంచనా నుంచి 2700 కోట్ల రూపాయలకు పెరిగిపోయింది. ఈ నిర్మాణానికి అవసరమైన నిధులను నేపాల్ ప్రభుత్వం చైనాకే చెందిన ఎక్స్ పోర్ట్ ఇంపోర్ట్ బ్యాంక్ ఆఫ్ చైనా నుంచి రుణంగా తీసుకుంటున్నది. ఇంత పెద్దఎత్తున నిర్మాణ వ్యయం పెంచి చూపడానికి కారణం ముడుపులు చేతులు మారడమేనని నేపాల్ లో ఆరోపణలు వస్తున్నాయి. ఈ ఒప్పందం కుదరడానికి మావోయిస్టు అధినేత ప్రచండకు, ఆర్థిక మంత్రి బర్సా మాన్‌పున్‌కు, ప్రధానమంత్రి బాబూరామ్ భట్టరాయ్ సతీమణి హిసిలా యామి కి పెద్ద ఎత్తున ముడుపులు ముట్టాయని ప్రతిపక్షాలు ఆరోపిస్తున్నాయి. మావోయిస్టుల అవినీతి పెచ్చరిల్లు తున్నదని, ప్రచండ ఇప్పటికే పదిహేడు వందల కోట్ల రూపాయలు వెనకేశాడని, పోఖరా విమానాశ్రయ కాంట్రాక్టులో తమకు యాభై లక్షల రూపాయలు ముట్టాయని మావోయిస్టులే స్వయంగా ఒప్పుకున్నారని ప్రతిపక్ష యుఎంఎల్‌కు చెందిన మాధవ్ కుమార్ నేపాల్ అన్నాడు. ఈ వార్తను భారత బడా పెట్టుబడిదారీ పత్రిక టైమ్స్ ఆఫ్ ఇండియా పెద్దఎత్తున ప్రచారం చేయడంతో ఇదంతా నేపాల్ కు, చైనా కు వ్యతిరేకంగా భారత–అనుకూల రాజకీయవేత్తలు చేస్తున్న దుష్ప్రచారమేనని ఆ దేశాల అధికార వర్గాలు అంటున్నాయి.

**గెరిల్లా టూరిజం**

సాయుధ పోరాటం విరమించి ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలోని పర్యవేక్షక బృందానికి తమ ఆయుధ గిడ్డంగుల తాళాలు అప్పగించిన తర్వాత ఒక ఒప్పందం కుదిరిందని, తాము సాయుధ పోరాటకాలంలో తిరిగిన అడవుల, కొండల దారుల పటాలను మావోయిస్టు పార్టీ ఆ ఒప్పందంలో భాగంగా ఐక్యరాజ్య సమితి బృందానికి అప్పగించిందని వార్తలు వచ్చాయి. ఆ వార్తలు నిజమై ఉండవని, బూర్జువా పత్రికల దుష్ప్రచారం కావచ్చునని అప్పట్లో ప్రచండ అభిమానులు అనుమానాలు వ్యక్తం చేశారు. అప్పుడు ఆ వార్తలు నిజమో కాదో గాని, ఇప్పుడు మాత్రం ప్రచండ ప్రపంచంలోనే మొదటిసారిగా 'గెరిల్లా పర్యాటక మార్గం' (గెరిల్లా ట్రెక్) పేరుతో తాము గత దశాబ్దంలో తిరిగిన దారుల్లోకి పర్యాటకులను ఆహ్వానిస్తున్నారు. ఈ గెరిల్లా పర్యాటక మార్గం పశ్చిమ, మధ్య నేపాల్‌లోని గత ఉద్యమ జిల్లాల మీదుగా సాగుతుంది. ఇది పర్యాటకుల సౌకర్యాన్ని బట్టి 14 రోజులు గాని, 19 రోజులు గాని, 27 రోజులు గాని ఉంటుంది. సాధారణంగా నేపాల్‌లోని హిమాలయ పర్వత సానువులలో ఎవరెస్ట్, అన్నపూర్ణ శిఖరాల ప్రాంతానికి, లాంగ్

# భారత్-చైనా యుద్ధం 1962- నిజానిజాలు

*భారత-చైనా యుద్ధానికి యాభై ఏళ్లు నిండిన సందర్భంగా వచ్చిన ప్రచారాల నిజానిజాలు వివరిస్తున్నారు*

**మేజర్ జైపాల్ సింగ్**

దేశ అంతర్గత విధానాల గురించి ప్రభుత్వాలను, పాలకవర్గాలను ఎంతో తీవ్రంగా విమర్శించే వారికి కూడ విదేశాంగ విధానం దగ్గరికి వచ్చేసరికి ఎక్కడలేని దేశభక్తి ఆవరిస్తుంది. అంతర్గత విధానాలలో ప్రభుత్వాలు, పాలకవర్గాలు చెప్పేవన్నీ అబద్ధాలే అని కచ్చితంగా నమ్మేవాళ్లు కూడ, విదేశాల విషయంలో, ముఖ్యంగా యుద్ధాల విషయంలో మాత్రం ప్రభుత్వాలు, పాలకవర్గాలు చెప్పేవన్నీ అక్షర సత్యాలేనని నమ్ముతారు, వాస్తవాలను వాస్తవాలుగా గ్రహించడం కాకుండా, మన పాలకవర్గాలు చెప్పేదంతా నిజమన్నట్టు, విదేశీ పాలకులు చెప్పేదంతా అబద్ధమన్నట్టు తమను తాము వంచించుకుంటారు, ఇతరులను వంచిస్తారు. 'మన ప్రభుత్వం' చెప్పేదానిలో కొంతయినా అబద్ధం ఉండవచ్చునని, విదేశీ ప్రభుత్వం చెప్పేదానిలో కొంతయినా నిజం ఉండవచ్చునని కూడ అనుమానించరు. ఇక 'మన ప్రభుత్వం' చెప్పేవి పచ్చి అబద్ధాలుగా, అవతలి ప్రభుత్వం చెప్పేవి సగమైనా నిజాలుగా ఉండే సందర్భం వస్తుందని అనుకోనే అనుకోరు. అసలు చారిత్రక పరిణామాల గురించి మన, ఇతర అనే దృష్టితో కాక వాస్తవికంగా చూడాలనే అవగాహన వాళ్లలో కొరవడుతుంది. అటువంటి సమయాలలో దేశభక్తి రసంకుప్పలు తెప్పలుగా ప్రవహిస్తుంది. 'మన' మీద 'వాళ్ల' దాడి అని, 'మనం' అంతా ఒకటయినట్టు, 'మన' పాలకవర్గాలు మన దేశం కోసమే ఉన్నట్టు అర్ధసత్యాలు, అబద్ధాలు, అతిశయోక్తులు వెల్లువెత్తుతాయి. మొత్తం మీద చరిత్ర గురించి తలకిందుల అవగాహన రాజ్యమేలుతుంది.

ఇటీవలి భారత చరిత్రలో ఇటువంటి తలకిందుల అవగాహన పెచ్చరిల్లిన సందర్భాలలో 1962లో భారత దేశానికి, చైనాకు జరిగిన యుద్ధం ప్రధానమైనది. (అసలు భాషే ఎలా ఉంటుందో చూడండి – అది భారత ప్రభుత్వానికి, చైనా ప్రభుత్వానికి మధ్య, లేదా ఆ ప్రభుత్వాలు నడిపే సైనిక బలగాల మధ్య జరిగిన యుద్ధం కాగా, దాన్ని రెండు దేశాల మధ్య యుద్ధంగా చెప్పడం సాధారణమై పోతుంది. దేశమంటే మట్టి కాదని మాత్రమే కాదు, ప్రభుత్వాలు కూడ కాదని, మనుషులని ఆలోచిస్తే, ఆ మనుషులకూ ఈ మనుషులకూ మధ్య, ఆ దేశానికీ ఈ దేశానికీ మధ్య యుద్ధం జరగవలసిన అవసరమే లేదు!)

భారత చైనా యుద్ధం మొదలై ఈ అక్టోబర్ 20కి యాభై సంవత్సరాలు నిండిన సందర్భంగా కూడ ఇటువంటి భావోద్వేగాల వెల్లువతో అనేక పత్రికల్లో లెక్కలేనన్ని వార్తలు, వ్యాసాలు వచ్చాయి. మామూలుగా ప్రగతిశీల పత్రికలుగా పేరుపొందినవాటిలో కూడ ఇటువంటి వ్యాసాలు, విశ్లేషణలు, వ్యాఖ్యానాలు చాల వచ్చాయి. నెహ్రూ మంచితనం, అమాయకత్వం వల్ల యుద్ధంలో భారత్ ఓడిపోయిందని, వైమానికదళాన్ని వాడి ఉంటే గెలిచేదని, భారత భూభాగాన్ని చైనా దురాక్రమించిందని, భారత్ శాంతికాముక దేశం కాగా చైనా దురాక్రమణదారు అని యాభై ఏళ్లుగా వినిపించిన వాదనలే మళ్లీ వినిపించాయి. చారిత్రక వాస్తవాలు భిన్నంగా ఉన్నాయని, భారత ప్రభుత్వం అప్పుడు తప్పు చేసి ఉండే అవకాశం ఉందని, భారత ప్రజలకు ఇన్నాళ్లుగా ఈ యుద్ధం గురించి అందుతున్న సమాచారమంతా నిజం కాదని ఏవో ఒకటి రెండు పత్రికలలో ఎవరో ఒకరిద్దరు రచయితలు మాత్రమే రాశారు.

నిజానికి ఈ యాభై ఏళ్లలో కూడ భారతదేశంలో అప్పుడప్పుడు, అక్కడక్కడ ఈ యుద్ధం గురించిన నిజాలు బైటికి రాకపోలేదు. లండన్‌కు చెందిన ది టైమ్స్ పత్రిక దక్షిణాసియా విలేఖరిగా 1959 నుంచి 1967 దాకా ఢిల్లీలో పనిచేసిన బ్రిటిష్ జర్నలిస్ట్ నెవిలీ మాక్స్‌వెల్ రాసిన 'ఇండియాస్ చైనా వార్' (భారతదేశపు చైనా యుద్ధం) 1970లో ప్రచురితమై చాల సంచలనం సృష్టించింది. సరిహద్దు వివాదంలో భారత ప్రభుత్వం అనేక తప్పులు చేసిందని, భారత ప్రభుత్వమే దుందుడుకుగా వ్యవహరించిందని, చైనా బాధితురాలని ఆయన పూర్తిగా భారత ఆధారాల పునాదిగానే రుజువు చేశారు. మొదట బ్రిటన్‌లో అచ్చయిన ఆ పుస్తకాన్ని భారతదేశంలో జైకో సంస్థ 1970 సెప్టెంబర్‌లో ప్రచురించింది. నవంబర్ కల్లా పునర్ముద్రణ అవసరమయింది. 'ఆ

---

టాంగ్ ప్రాంతానికి విపరీతంగా విదేశీ పర్యాటకులు వస్తుంటారు. ఇప్పుడు ఆ ప్రాంతాలకు తోడుగా 1996 నుంచి 2006 వరకు సాగిన సాయుధ పోరాటంలో ముఖ్యమైన ఘట్టాలు జరిగిన గ్రామాలను, కొండలను, గుహలను, నదులను, అడవులను, లోయలను కూడ పర్యాటకులు సందర్శించవచ్చు. ఎక్కడెక్కడ మావోయిస్టు గెరిల్లాలు కందకాలు తవ్వారో, ఎక్కడెక్కడ రాజు సైనిక బలగాలతో హోరాహోరీ ఘర్షణలు జరిగాయో అవన్నీ చూడవచ్చు. ఆ ప్రాంతాలలో బస చేయవచ్చు. ఈ పర్యాటక మార్గం గురించి అమెరికన్ యాత్రా రచయిత అలోంజో లయన్స్‌తో కలిసి ప్రచండ ఒక పుస్తకం కూడ రాశారు. ఆ పుస్తకాన్ని, యాత్రా మార్గపు పటాన్ని అక్టోబర్ 2న ప్రచండ ఆవిష్కరించారు. విప్లవం నిజంగా విజయం సాధిస్తే ఆ విప్లవ క్రమంలో తాము ఎటువంటి కఠోర పరిస్థితులను అనుభవించారో భవిష్యత్ తరాలకు చెప్పడం అవసరమే కావచ్చు. కాని మధ్యదారిలో వదిలేసిన విప్లవ అనుభవాన్ని ఇలా విహార యాత్రగా మార్చి విదేశీ పర్యాటకులకు అమ్ముకోవడానికి ప్రయత్నించడం, అది కూడ 'విప్లవం విందు భోజనం కాదు, విహారయాత్ర కాదు' అని చెప్పిన మావో పేరుతో నడుస్తున్న పార్టీ పేరుమీదనే సాగించడం నిజంగా ప్రచండ మార్గమే.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

పుస్తకాన్ని భారత ప్రభుత్వం నిషేధించిందని అభిప్రాయం ఉంది గాని అది నిజం కాదు' అని ఈ అక్టోబర్‌లో ఇచ్చిన ఇంటర్వ్యూలో మాక్స్‌వెల్ అన్నారు. యుద్ధం జరిగిన యాభై ఏళ్లయిన సందర్భంగా ఔట్‌లుక్ పత్రికలో వచ్చిన ఇంటర్వ్యూలో ఎనభై ఆరు సంవత్సరాల మాక్స్‌వెల్ భారత ప్రజలు ఇంతకాలంగా వింటున్న అబద్ధాల నుంచి బయట పడాలని, తప్పనిసరిగా తెలుసుకోవలసిన విషయాలెన్నో చెప్పారు.

సరిహద్దు వివాదంలో భారత ప్రభుత్వ వైఖరి ఆమోదయోగ్యంగా లేదని నెహ్రూ సన్నిహిత మిత్రుడు, 1953లో ఏర్పడిన భారత – చైనా మిత్రమండలి తొలి అధ్యక్షుడు పండిట్ సుందర్ లాల్ కూడ అప్పుడే రాశారు. ఆ కాలపు అధికారిక, అనధికారిక పత్రాల మీద సాధికారికమైన, సుదీర్ఘమైన పరిశోధన జరిపిన చరిత్రకారుడు, సుప్రీంకోర్టు న్యాయవాది ఎ జి నూరాని 2011లో ప్రచురించిన 'ఇండియా – చైనా బౌండరీ ప్రాబ్లమ్ 1846–1947'లో కూడ సరిహద్దు వివాదంలో భారత ప్రభుత్వం అనుసరించిన వైఖరి ఎంత అనుచితమో, అచారిత్రకమో రుజువు చేశారు. చైనా అధికారిక పుస్తకాలు, చైనా రచయితలు, చైనా అనుకూల రచయితలు మాత్రమే కాదు, దేశదేశాలలోని స్వతంత్ర పరిశోధకులెందరో ఈ వివాదంలో భారత ప్రభుత్వపు అపసవ్యపు మొండి వైఖరిని సాక్ష్యాధారాలతో ఎత్తిచూపారు.

అయినా ఈ వాస్తవాలన్నిటినీ పక్కనపెట్టి దేశంలోని, రాష్ట్రంలోని ప్రధాన పత్రికలన్నీ 1962 యుద్ధంలో చైనాదే పూర్తి తప్పు అన్నట్టుగా, చైనా భారత భూభాగాన్ని దురాక్రమణ చేసినట్టుగా, జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టే రచనలు అచ్చు వేశాయి. మరి ఈ సరిహద్దు వివాదం నిజానిజాలేమిటి? ఆ వివాదంలో ప్రధానమైన అంశాలు ఏమిటి? ఆ వివాదం యుద్ధానికి ఎలా దారి తీసింది? యుద్ధ పర్యవసానాలేమిటి?

చైనాతో భారత దేశానికి ఉత్తర కొస నుంచి ఈశాన్యం దాకా హిమాలయ పర్వత ప్రాంతాలలో 3,225 కి.మీ. సరిహద్దు ఉంది. ఆ ప్రాంతపు భౌగోళిక దుర్గమస్థితి వల్ల ఈ సుదీర్ఘ సరిహద్దు రేఖలో చాల భాగం కచ్చితంగా, నిర్దిష్టంగా, నిర్దుష్టంగా నిర్ధారణ కాలేదు. దేశ పటాలలో నమోదు కాలేదు. పైగా ఈ సరిహద్దు ప్రాంతంలో కాశ్మీర్ వంటి వివాదాస్పద ప్రాంతాలు, నేపాల్, సిక్కిం, భూటాన్ వంటి దేశాలు ఉన్నాయి. (స్వతంత్రదేశంగా ఉండిన సిక్కింలోకి భారత ప్రభుత్వం 1975 ఏప్రిల్‌లో తన సైన్యాన్ని పంపి దురాక్రమించింది. అప్పటిదాకా రాచరిక పాలనలో ఉండిన ఆ దేశాన్ని తనలో అంతర్భాగమైన రాష్ట్రంగా 1975 మే 16న ప్రకటించింది). ఈ సుదీర్ఘ సరిహద్దు ప్రాంతంలో లద్దాఖ్‌ను ఆనుకుని ఉన్న అక్సాయి చిన్, అప్పటి ఈశాన్య సరిహద్దు ప్రాంతం (ప్రస్తుత అరుణాచల్ ప్రదేశ్) సరిహద్దులలో ఉన్న మెక్ మోహన్ రేఖ 1962 యుద్ధానికి తక్షణ కారణమైన, యుద్ధం జరిగిన ప్రధాన స్థలాలు.

అక్సాయి చిన్ అక్సాయి చిన్ సముద్ర మట్టం నుంచి 16,000 అడుగుల నుంచి 23,000 అడుగుల ఎత్తున ఉన్న ఎడారి. అక్కడక్కడా ఉప్పునీటి సరస్సులు మాత్రం ఉన్న ఈ 38,000 చ.కి.మీ. ప్రాంతంలో మానవ ఆవాసాలేమీ లేవు. ఈ ప్రాంతానికి లద్దాఖ్ వైపు నుంచి, అంటే భారతదేశం వైపు నుంచి వెళ్లే మార్గం కూడ లేదు. అటువైపున అక్సాయి చిన్‌కు ఇటువైపున భారత భూభాగానికీ మధ్యన దుర్గమమైన కారకోరం పర్వతశ్రేణి ఉంది. ఈ ప్రాంతం చైనాలోని క్సిన్ జియాన్ రాష్ట్రం (స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రాంతం)లోకి చొచ్చుకుని ఉంది. టిబెట్ నుంచి క్సిన్ జియాంగ్‌లోకి వెళ్లే ప్రాచీన వ్యాపార బిడారుల రహదారి అక్సాయి చిన్ మీదుగా వెళుతుంది. పంజాబ్ పాలకులు 1834లో జమ్మూ సంస్థానాన్ని తమ రాజ్యంలో విలీనం చేసుకున్నప్పుడు, లద్దాఖ్‌లో భాగంగా ఈ ప్రాంతాన్ని కూడ ఆక్రమించుకున్నారు. పంజాబ్ పాలకులు ఇంకా ముందుకువెళ్లి 1841లో టిబెట్ మీద దాడిచేశారు. ఆ దాడిని తిప్పికొడుతూ వారిని తరుముతూ చైనా సైన్యాలు లద్దాఖ్‌లోని లే దాకా వచ్చాయి. ఈ ఘర్షణ తర్వాత 1842 సెప్టెంబర్‌లో ఒకరి భూభాగంలోకి మరొకరు చొరబడగూడదని పంజాబ్ పాలకులకూ చైనా పాలకులకూ మధ్య ఒప్పందంకుదిరింది.

కాని 1846లో పంజాబ్ పాలకులు బ్రిటిష్ వారి చేతుల్లో ఓడిపోవడంతో లద్దాఖ్ బ్రిటిష్ వారి అధీనంలోకి వచ్చింది. బ్రిటిష్ వారు సరిహద్దు విషయమై చైనా పాలకులతో చర్చలు జరపడానికి ప్రయత్నించారు గాని, ఆ ప్రయత్నాలు సఫలం కాలేదు. సహజమైన, నైసర్గికమైన సరిహద్దులను గుర్తించాలని, ఒకరి జోలికి ఒకరు రాగూడదని అలిఖిత ఒడంబడికకుదిరినట్టయింది. ఈ ప్రాంతానికి ఉత్తర కొసన ఉన్న కారకోరం కనుమను, దక్షిణ కొసన ఉన్న పాంగాంగ్ సరస్సును సహజ సరిహద్దులుగా గుర్తించడం జరిగింది గాని ఈ రెంటి మధ్య ఉన్న 200 కి.మీ. పైగా దూరానికి సరిహద్దు రేఖ లేకపోయింది. అటువంటి సరిహద్దు రేఖను తయారుచేయడానికి 1865లో సర్వే ఆఫ్ ఇండియా అధికారి డబ్ల్యు ఎచ్ జాన్సన్ ప్రయత్నించాడు గాని అప్పటికి క్సిన్ జియాంగ్ రాష్ట్రంలో తిరుగుబాటు జరిగి, అక్కడ చైనా అధికారం కోల్పోయినందువల్ల ఆ జాన్సన్ రేఖ ఇరుదేశాల ఆమోదిత రేఖ కాలేకపోయింది. ఈ రేఖను తప్పుల తడకగా తయారుచేశాడని బ్రిటిష్ ప్రభుత్వమే మందలించడంతో జాన్సన్ తన పదవికే రాజీనామా చేసి వెళ్లిపోయాడు. తర్వాత 1890లలో క్సిన్ జియాంగ్ మళ్లీ చైనా అధీనం లోకి వెళ్లింది. చైనా బలహీనపడుతూ రష్యా బలం పుంజుకోవడంతో ఈ ప్రాంతం మీద తన పట్టు ఉండాలనుకున్న బ్రిటిష్ ప్రభుత్వం తరఫున సైనికాధికారి జాన్ అర్దాఘ్ మరొక రేఖ తయారుచేశాడు. ఈ రేఖ జాన్సన్ రేఖకు కొద్ది మార్పులతో తయారయింది గనుక దీన్ని జాన్సన్ – అర్దాఘ్ రేఖ అని పిలుస్తారు.

ఆ తర్వాత బ్రిటన్‌కూ చైనాకూ స్నేహం బలపడి, అక్సాయి చిన్ తనదేనని చైనా వాదించడంతో కారకోరం పర్వత సానువులు సహజ సరిహద్దుగా, అక్సాయి చిన్‌ను చైనాలో అంతర్భాగంగా చూపుతూ బ్రిటిష్ ప్రభుత్వం మెక్‌కార్ట్‌నీ – మెక్‌డొనాల్డ్ రేఖను తయారుచేసి 1899లో చైనా ప్రభుత్వానికి అందజేసింది. నైసర్గిక అంశాలను ప్రధానంగా తీసుకున్న ఈ సరిహద్దు రేఖ సింధూనది పరీవాహక ప్రాంతాన్ని బ్రిటిష్ ఇండియాలో భాగంగా, తారిమ్ నది పరీవాహక ప్రాంతాన్ని చైనాలో భాగంగా చూసింది. అయితే ఈ ప్రతిపాదన పట్ల చైనా మౌనం పాటించగా, ఆ మౌనం అంగీకారమేనని బ్రిటిష్ ప్రభుత్వం భావించింది. ఆ తర్వాత 1899 నుంచి 1947 దాకా బ్రిటిష్ ప్రభుత్వం తయారు చేసిన పటాలలో అటు జాన్సన్ – అర్దాఘ్ రేఖ, ఇటు మెక్‌కార్ట్‌నీ – మెక్‌డొనాల్డ్ రేఖ రెండూ చూపేవారంటే ఈ సరిహద్దు ఎంత అనిర్దిష్టంగా, అస్పష్టంగా ఉండిపోయిందో అర్థమవుతుంది.

ఆ ప్రాంతం గురించి నెహ్రూ మాటల్లోనే చెప్పాలంటే, 'అక్సాయి చిన్ తమ భూభాగమని చైనీయులు అంటున్నారు. వారి పటాలలో కూడ, కొత్త పటాలలో మాత్రమే కాదు, పాత పటాలలో కూడ, అది వారి భూభాగంగానే ఉంది. మొత్తానికి అది వివాదాస్పద ప్రాంతం. దాని మీద రెండు అభిప్రాయాలున్నాయి... అది సరాసరి పదహారు వేల నుంచి పదిహేడు వేల అడుగుల ఎత్తున ఉన్న చెట్లూ చేమలూ లేని, గడ్డి కూడ మొలవని, ఏ రకమైన జీవజాలం లేని ప్రాంతం.

## మెక్‌మోహన్ రేఖ

భారత – చైనా సరిహద్దు పశ్చిమ దిశలో అటువంటి అనిశ్చిత స్థితి ఉండగా, తూర్పు కొసన కూడ వలస పాలకుల వల్ల ఇటువంటి స్థితే కొనసాగింది. తూర్పు వైపు చివరన భూటాన్, బర్మాల మధ్యన భారత, చైనా దేశాల ఉమ్మడి సరిహద్దును సూచిస్తూ గీసిన 1150 కి.మీ. రేఖను మెక్ మోహన్ రేఖ అంటారు. అప్పటి భారత ప్రభుత్వ విదేశాంగ కార్యదర్శి హెన్రీ మెక్ మోహన్ 1914లో బ్రిటిష్ ఇండియా తరఫున టిబెట్‌తోకుదుర్చుకున్న సిమ్లా ఒప్పందంలో ఈ రేఖ ఖరారయింది. కాని దానికి ఏడు సంవత్సరాల ముందు 1907లోకుదిరిన ఆంగ్లో – రష్యన్ ఒడంబడికకు ఇది భిన్నమైనది గనుక, టిబెట్ చైనా అధీన ప్రాంతమైనందువల్ల టిబెట్ గురించిన ఏ ఒడంబడికనైనా చైనా ఆమోదించవలసి ఉంటుంది గనుక, సిమ్లా ఒడంబడికకుదిరిన కొద్ది వారాలకే మొదటి ప్రపంచ యుద్ధం మొదలయింది గనుక మెక్ మోహన్ రేఖ విస్మృతిపథంలో పడిపోయింది. దాన్ని పట్టించుకున్నవారూ, సమర్థించినవారూ ఎవరూ లేకపోయారు. అది ఎక్కడా అధికారిక పటాల్లోకి కూడ ఎక్కలేదు.

కాని 1935లో బ్రిటిష్ అధికారి ఒలాఫ్ కారో దీన్ని తవ్వితీసి, ఇక నుంచి దాన్ని పటాల్లో చిత్రించాలని, నిజమైన భారత – చైనా సరిహద్దు అదేనని వాదించాడు. అలా 1937లో సర్వే ఆఫ్ ఇండియా ముద్రించిన పటాల్లో మొదటిసారిగా భారత చైనా సరిహద్దుగా మెక్ మోహన్ రేఖను చిత్రించారు. మరొక దేశంతో సరిహద్దు ఒడంబడిక చేసుకునే అధికారం తమ దేశంలో ఒక భాగమైన టిబెట్ ప్రభుత్వానికి ఉండదని, అందువల్ల సిమ్లా ఒప్పందాన్ని, మెక్ మోహన్ రేఖను తాము గుర్తించబోమని, ఆ రేఖకు దక్షిణంగా 65,000 చ.కి.మీ. భూభాగం టిబెట్‌లో, తమ దేశంలో భాగమేనని చైనా వాదించింది. దాన్ని దక్షిణ టిబెట్ అని పిలిచింది.

ఇక్కడ ఒక ఆసక్తికరమైన పిట్టకథ కూడ ఉంది: సి యు ఐచిసన్ సంపాదకుడుగా 1929లో వెలువడిన ఎ కలెక్షన్ ఆఫ్ ట్రీటీస్ (ఒడంబడికల సంకలనం)లో సిమ్లా ఒడంబడికను చేర్చలేదు. తమ అధీన దేశంగా ఉన్న టిబెట్‌కు సర్వాధికార సంతకం చేయడానికి అర్హత లేదని చైనా అనడం వల్ల ఒడంబడిక కుదరలేదు అని కూడ సంపాదక వ్యాఖ్య రాశారు. కాని 1938లో ఆ పుస్తకాన్నే మళ్లీ ప్రచురించినప్పుడు సిమ్లా ఒప్పందాన్ని చేర్చారు. పాత పుస్తకాలను వెనక్కి రప్పించడం మాత్రమే కాదు, 1938 పుస్తకంలో 1929లో ముద్రణ జరిగినట్టుగా తప్పుడు సమాచారం చేర్చారు.

బ్రిటిషిండియా సైన్యాలు 1938లోనే ఈ ప్రాంతంలోని తవాంగ్ పట్టణంలో ప్రవేశించి, అది భారత భూభాగమని ప్రకటించాయి. టిబెట్ ప్రభుత్వం అందుకు అభ్యంతరం తెలిపి తన అధికారాన్ని పునః స్థాపించుకుంది. ఆ తర్వాత ఈ ప్రాంతంలో కొన్ని చోట్ల బ్రిటిషిండియా జోక్యం ఉన్నప్పటికీ, అది తన అధికారం కింది భూభాగమేనని 1947 దాకా టిబెట్ వాదిస్తూ వచ్చింది.

## యుద్ధానికి ముందు వివాదాలు

భారత – చైనా సరిహద్దులోని ఈ రెండు ప్రధాన రంగాల స్థితి ఇలా ఉండగా, 1947లో భారత దేశంలో అధికార మార్పిడి జరిగింది. ఆ తర్వాత భారత ప్రభుత్వం పశ్చిమాన అక్సాయి చిన్ మొత్తం తనదేనని, అంటే జాన్సన్ రేఖను మాత్రమే తాను గుర్తిస్తున్నానని, అలాగే తూర్పున మెక్ మోహన్ రేఖను తాను గుర్తిస్తున్నానని, దానికి కూడ కొన్ని చోట్ల సవరణ చేయవలసి ఉన్నదని, దానికి దక్షిణాన ఉన్న భూభాగం అంతా తనదేనని వాదించడం మొదలుపెట్టింది. ఆ వాదనకు అనుగుణంగా అప్పటిదాకా అనిర్దిష్టంగా ఉన్న పటాలను నిర్దిష్ట సరిహద్దులతో పునర్ముద్రించాలని నిర్ణయించుకుంది. ఈ రెండు ప్రాంతాలను భారత భూభాగాలుగా చిత్రిస్తూ పటాలు తయారు చేయమని, ఈ భూభాగాల మీద ఎవరితోనూ చర్చలకు ఆస్కారం లేదని నెహ్రూ 1954 జూలై 1న ఒక ఆదేశం ఇచ్చారు. అంతకు చాల ముందే 1950 నవంబర్ 20నలోక్ సభలో ఒక ప్రకటన చేస్తూ 'పటంలో ఉండనీ, ఉండకపోనీ మెక్ మోహన్ రేఖే మన సరిహద్దు, ఆ రేఖ దాటి రావడానికి ఎవరినీ అనుమతించేది లేదు' అని నెహ్రూ అన్నారు. భారత భూభాగం రెండు వేల ఏళ్లుగా అవే సరిహద్దులతో ఉందని, తాము ఆ సరిహద్దులను పరిరక్షించ దలచుకున్నామని భారత పాలకులు పచ్చి అబద్ధాన్ని ప్రకటించారు. నిజానికి జాతీయోద్యమ కాలంలో భారత జాతీయ కాంగ్రెస్ కూడ, భారత సరిహద్దులను వలస పాలకులు తమ ప్రయోజనాల కోసమే సృష్టించారనే వైఖరి తీసుకుంది.

ఆ రెండు రేఖలు కూడ గత కాలపు చైనా ప్రభుత్వాలు అంగీకరించినవి కావని, అవి వలసవాద చరిత్ర అవశేషాలని, అయినా వాటిని ప్రాతిపదికగా తీసుకుని రెండు దేశాల ప్రభుత్వాలు చర్చలు జరిపి ఉమ్మడి అంగీకారానికి రావచ్చునని చైనా ప్రభుత్వం వాదించింది. అక్సాయి చిన్ తమ అధీనంలోనే ఉంది గనుక, భారత దేశానికి ప్రవేశమార్గం కూడ లేదు గనుక, తమ రెండు రాష్ట్రాలను కలిపే రహదారి అక్సాయి చిన్ నుంచి వెళ్లడం సులభం గనుక అక్సాయి చిన్ ను తమకు పూర్తిగా వదలాలని, మెక్ మోహన్ రేఖను అంగీకరించడానికి తమకు అభ్యంతరం లేదని, కాని అది పాత వలస ప్రభుత్వాల ప్రాతిపదికపై కాక, కొత్తగా ఇరు ప్రభుత్వాల మధ్య చర్చల ద్వారా జరగాలని, ఇచ్చిపుచ్చుకునే వైఖరి ఉండాలని చైనా ప్రభుత్వం వాదించింది.

ఈ రెండు వాదనలు చూస్తే భారత ప్రభుత్వం చర్చలకు కాలు అడ్డం పెడుతూ తాను పట్టినకుందేటికి మూడే కాళ్లన్నట్టు మొండిగా ఉండిందని, చైనా ప్రభుత్వం ఏదైనా చర్చల ద్వారా తేలవలసిందే అని సామరస్య పూర్వక వైఖరి తీసుకుందని అర్థమవుతుంది. భారత ప్రభుత్వం ఆ మొండి వైఖరిని ప్రదర్శిస్తూనే మరొకవైపు 'భారత్ చీనీ భాయి భాయి' అని, 'పంచశీల విధానం' అని స్నేహాన్ని నటించడం మొదలుపెట్టింది.

మొత్తంగా ఆయా వాదనలు ఎలా ఉన్నా, సరిహద్దుల దగ్గరా, దౌత్య రంగంలోనూ 1950 దశకంలో కొన్ని పరిణామాలు జరిగాయి. చైనా ప్రభుత్వం 1950ల తొలిరోజుల్లోనే టిబెట్ నుంచి క్సిన్ జియాంగ్‌కు నిర్మించిన 1,200 కి.మీ. రహదారిలో 179 కి.మీ. అక్సాయి చిన్ గుండా, జాన్సన్ రేఖకు దక్షిణంగా వెళ్లింది. నిజానికి ఈ ప్రాంతం తమదని పటంలో ఎవరు చెప్పుకున్నప్పటికీ భారత దేశం వైపునుంచి చేరడానికి వీలు కానిది, చైనా నుంచి రహదారి వేయడానికి వీలైనది. అసలు ఆ రహదారి నిర్మించారనే సంగతి కూడ భారత ప్రభుత్వానికి 1957లోనే తెలిసింది. చైనా ప్రభుత్వం 1958లో ముద్రించిన పటాలలో ఆ రహదారి ఉండడంతో భారత ప్రభుత్వానికి అది నిర్ధారణ అయింది. ఆ ప్రాంతంలో ఏమి జరుగుతున్నదో ఏళ్ల తరబడి తెలియకపోయినా అక్సాయి చిన్ శతాబ్దాలుగా భారతదేశంలో అంతర్భాగమని, దాని మీద ఎవరితోనూ చర్చలకు ఆస్కారమే లేదని భారత ప్రధాని నెహ్రూ అంటూ

వచ్చారు. తమ గత ప్రభుత్వాలు కూడ జాన్సన్ రేఖను అంగీకరించలేదని, మెక్‌కార్ట్ నీ – మెక్‌డొనాల్డ్ రేఖ గురించి తమకు సమాచారం ఇవ్వడం మాత్రమే జరిగిందని, ప్రస్తుతం తాము మెక్‌కార్ట్‌నీ – మెక్‌డొనాల్డ్ రేఖనే గుర్తిస్తామని చైనా ప్రధాని చౌ ఎన్ లై అన్నారు. అయినా చర్చలు జరుపుకోవచ్చునని, ఆ చర్చలు యథాతథ స్థితిని గుర్తించి జరగాలని చైనా ప్రభుత్వం వాదించింది. చర్చలు జరిపే అవసరమే లేదని నెహ్రూ ప్రభుత్వం వాధించింది. దేశ సరిహద్దు అనేది రెండుదేశాలూ చర్చల ద్వారా, సామరస్యపూర్వకంగా, ఇచ్చిపుచ్చుకునే వైఖరితో, నైసర్గిక, సాంస్కృతిక అంశాల ప్రాతిపదికగా ఆమోదించవలసిన వ్యవహారం కాగా, భారత ప్రభుత్వం ఏకపక్షంగా సరిహద్దులను నిర్ణయించింది, లేదా వలసపాలకులు నిర్ణయించిన సరిహద్దులను యథాతథంగా ఆమోదించి ఇక చర్చించడానికేమీ లేదని అంది. నిజానికి 1950 నుంచి 1960 వరకూ భారత ప్రభుత్వానికీ, చైనా ప్రభుత్వానికీ మధ్య వందలాది లేఖలు, పరస్పర సాక్ష్యాధారాల వినిమయం, దౌత్య అధికారుల స్థాయి నుంచి రక్షణ మంత్రులు, ప్రధాన మంత్రుల స్థాయి దాకా ద్వైపాక్షిక సమావేశాలు జరిగాయి. కాని ఈ ప్రయత్నాలేవీ వివాద పరిష్కారం దిశగా అడుగులు వేయలేదు.

ఈ వివాదాలు ఇలా ఉండగానే భారత ప్రభుత్వం చైనా ప్రభుత్వానికి ప్రతికూలమైన రెండు చర్యలు చేపట్టింది. మొదటిది దలైలామాకు భారతదేశంలో ఆశ్రయం ఇవ్వడం, రెండవది, 'ముందడుగు విధానం' పేరు మీద వాస్తవాధీన రేఖలను దాటి చైనా అధీనంలో ఉన్న భూభాగం లోకి ప్రవేశించి సైనిక శిబిరాలు ఏర్పాటు చేయడం.

టిబెట్ స్వయంపాలిత ప్రాంత ప్రజల ఆమోదంతోనే చైనా ఆ ప్రాంతాన్ని తనలో అంతర్భాగం చేసుకుందా, దురాక్రమించిందా, టిబెట్ చైనాలో అంతర్భాగం అనడానికి చారిత్రక ఆధారాలున్నాయా లేదా, టిబెట్ ప్రజలు చైనా నుంచి స్వాతంత్ర్యం కోరుతున్నారా లేదా, వేరే చర్చ. టిబెట్ చైనాలో అంతర్భాగమేనని భారత ప్రభుత్వం స్వయంగా అంగీకరించి 1954 ఏప్రిల్‌లో చైనాతో ఒప్పందం కుదుర్చుకుంది. కాని 1959లో టిబెట్ బౌద్ధుల నాయకుడైన దలైలామా చైనాపై తిరుగుబాటు చేయడానికి ప్రయత్నించి విఫలమైనప్పుడు, ఆయనకు ఆశ్రయం ఇవ్వడానికి భారత ప్రభుత్వం సిద్ధపడింది. అలాగే, చైనా ఆక్రమించిన భాగాలని తాము అనుకుంటున్న చోట్లకు సైనిక బలగాలను పంపించి, అక్కడ శిబిరాలు ఏర్పాటు చేయాలనే నిర్ణయాన్ని కూడ భారత ప్రభుత్వం 1959లో తీసుకుంది. ఈ విధానాన్ని 'ముందడుగు విధానం' పేరుతో 1961 నవంబర్‌లో అధికారికంగా ప్రకటించినప్పటికీ, 1959 నుంచే ఇలా భారత సైనిక బలగాలు వివాద ప్రాంతాలలోకి చొరబడుతుండడంతో ఘర్షణలు మొదలయ్యాయి.

ఈ మొత్తం వివాదం మీద సునిశిత పరిశోధన చేసి పుస్తకం రాసిన నూరాని ఆ దశాబ్దంలో భారత ప్రభుత్వం చేసిన ఐదు కీలకమైన తప్పిదాలను పేర్కొన్నారు: అవి 1. మెక్ మోహన్ రేఖను 1954లో ఏకపక్షంగా సవరించడం, పటాలు ముద్రించడం. 2. 1954–58 మధ్య చైనా ప్రభుత్వం అనేక సార్లు ప్రతిపాదించినప్పటికీ చర్చలు జరపడానికి తిరస్కరించడం. 3. తమ భూభాగం కాని దాన్ని తప్పుడుగా తమదేనని నొక్కి చెప్పడం. 4. అక్సాయి చిన్ మీద చైనా అధికారాన్ని నిరాకరించడం. 5.మెక్ మోహన్ రేఖను, ముందడుగు విధానాన్ని ఆమోదిస్తూనే చర్చలకు రమ్మని చౌ ఎన్ లై 1960 ఏప్రిల్‌లో చేసిన ప్రతిపాదనను తిరస్కరించడం.

### యుద్ధం

ఈ వివాదాల నేపథ్యంలో ఆగస్ట్ 1959లో మొదటిసారిగా మెక్ మోహన్ రేఖకు దిగువన లాంగ్ జు అనే చోట భారత సైనిక శిబిరంపై చైనా బలగాలు దాడి చేశాయి. ఇటువంటి ఘర్షణలు వద్దని, ఇరు దేశాల సైన్యాలు వాస్తవాధీన రేఖను గుర్తించి, దానికి ఇరవై కి.మీ. అవతలికి ఉపసంహరించుకుని, చర్చలకు సిద్ధపడాలని చౌ ఎన్ లై 1959 అక్టోబర్ 24న నెహ్రూకు రాశారు. దీనికి జవాబు ఇవ్వకపోగా భారత ప్రభుత్వం తన చొరబాటు విధానాన్ని ముమ్మరం చేసింది. 'ముందడుగు విధాన' ప్రకటనతో 1961 నవంబర్ తర్వాత భారత సైన్యాలు వాస్తవాధీన రేఖను దాటి ముందుకు కదిలి కనీసం 43 చోట్ల శిబిరాలను ఏర్పాటు చేశాయి. దానితో చైనా బలగాలు 1962 సెప్టెంబర్ 8న ధోలా శిబిరం మీద దాడి చేసి ఖాళీ చేయించాయి. అప్పటికీ మిగిలిన భారత సైనిక శిబిరాలను తొలగించక పోవడంతో ఆరు వారాలు వేచి చూసి, అక్టోబర్ 20న చైనా బలగాలు భారత శిబిరాలపై పెద్ద ఎత్తున దాడి ప్రారంభించాయి. భారత ప్రభుత్వం కూడ దాన్ని యుద్ధంగా గుర్తించి ఎదురుదాడి ప్రారంభించింది.

యుద్ధక్రమంలో చైనా బలగాలు మెక్ మోహన్ రేఖ నుంచి దాదాపు 90 కి.మీ. ఇవతలి వరకూ భారత సైన్యాలను వెనక్కినెడుతూ వచ్చాయి, అప్పటి ఈశాన్య సరిహద్దు ప్రాంతం ( చైనా ప్రభుత్వ దృష్టిలో దక్షిణ టిబెట్ – ప్రస్తుత అరుణాచల ప్రదేశ్) పూర్తిగా చైనా బలగాల ఆక్రమణలోకి వెళ్లింది. చైనా బలగాలు సులభంగానే కలకత్తాను కూడ ఆక్రమించుకుంటాయని వదంతులు వచ్చాయి. కాని చైనా బలగాలు నవంబర్ 20న ఏకపక్షంగా కాల్పుల విరమణ ప్రకటించి, మెక్ మోహన్ రేఖ దగ్గరికి ఉపసంహరించుకున్నాయి. యుద్ధ ఖైదీలుగా పట్టుకున్న భారత సైనికులను విడిచిపెట్టాయి. ఇప్పటికీ ఈ వివాదం సమసిపోలేదు.

'ఇదంతా చైనావాళ్లేదో పవిత్రులని వాదించడానికి కాదు. కాని వారి 1962 చర్య ప్రధానలక్ష్యం 'ముందడుగు విధానం' అనే భారత ప్రభుత్వపు తప్పుడు విధానాన్ని తిప్పికొట్టడం. సరిహద్దు సమస్యనులోతుగా చర్చకు తేకుండా వివాదాస్పద ప్రాంతాల నుంచి భారత సైనికులను వెనక్కి పంపించడం' అని ఈ వివాదం మీద, యుద్ధం మీద వ్యాఖ్యానిస్తూ ప్రఫుల్ బిద్వాయి అన్నారు.

### యాభై ఏళ్ల తర్వాత

యాభై ఏళ్లు గడిచినప్పటికీ ఈ రెండు వివాదాలూ సమసిపోలేదు. అటు చైనాలోనూ ఇటు భారత్‌లోనూ ప్రభుత్వాలు చాల మారిపోయాయి గాని, రెండు దేశాల పాలకులకూ ఈ వివాదం రగులుతూ ఉండడమే అవసరం. భారత పాలకులకైతే ప్రజలలో అబద్ధాల ద్వారా జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టడానికి, ప్రజల దృష్టిని అసలు సమస్యలనుంచి పక్కదారి పట్టించడానికి ఇటువంటి వివాదాలు, శత్రు దేశాలు కావాలి. తీరికా, అవకాశాలూ ఉన్న మధ్యతరగతి బుద్ధిజీవులలో కూడ ఈ చరిత్రను వాస్తవికంగా అధ్యయనం చేసి పాలకుల దుర్మార్గ చరిత్రను, అబద్ధ ప్రచారాలను అడ్డుకోవాలనే కోరిక లేదు. సాధారణ ప్రజానీకానికి అందుకు తీరికా లేదు, అవకాశాలూ లేవు. ఈ స్థితిలో పాలకులు తమ పబ్బం గడుపుకుంటున్నారు. సరిహద్దు వివాదాల, శత్రుదేశాల బూచిని చూపుతూ, ఏడాదికేడాదికీ రక్షణ వ్యయాన్ని వేల కోట్ల రూపాయలు పెంచుతూ, ప్రజాధనాన్ని వ్యర్థం చేస్తూ, ఆ రక్షణ నిధులలోంచి పెద్దఎత్తునకుంభకోణాలకు పాల్పడుతూ ఉన్నారు.

# ప్రజాస్వామ్య సంకేతాలు: సూచీ, షర్మిల

*భారత పాలకవర్గాల స్వభావాన్ని, వారి అప్రజాస్వామిక నియంతృత్వ వైఖరినీ ఆంగ్‌సాన్ సూచీ, ఇరోం షర్మిలల పోరాట నేపథ్యాల నుంచి వివరిస్తున్నారు* **జి. ఉదయ**

**బ**ర్మాలో మిలిటరీ పాలనకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్యం కోసం సుదీర్ఘ కాలంగా పోరాడుతున్న బక్కపలచటి యోధురాలు ఆంగ్ సాన్ సూచీ మొన్న నవంబర్ 14న, నెహ్రూ 123వ జయంతి నాడు, నెహ్రూ స్మారక బహుమానాన్ని అందుకోవడానికి, నెహ్రూ స్మారకోపన్యాసం ఇవ్వడానికి న్యూఢిల్లీ వచ్చారు. ఆ సమావేశానికి నెహ్రూ కుటుంబ వారసురాలు, అంతకన్నా నెహ్రూ రాజకీయ వారసురాలు అయిన సోనియా గాంధీ అధ్యక్షత వహిస్తూ సూచీ వ్యక్తిత్వాన్నీ, ఆమె పోరాట పటిమనూ, ముఖ్యంగా ఆమె ఎంచుకున్న పోరాట మార్గాన్నీ చాలా అభినందించారు. ఆంగ్‌సాన్ సూచీ కూడా భారతదేశ నాయకులు, ముఖ్యంగా గాంధీ, నెహ్రూల పట్ల తనకు గల అపార అభిమానాన్ని, తనపై వారి ప్రభావాన్ని చాలా ఉద్వేగపూరితంగా వివరించారు. ఈ సందర్భంగా ఆంగ్‌సాన్ సూచీతో పోల్చదగిన, ప్రజాస్వామ్యం కోసం చెదరని దీక్షతో సుదీర్ఘ కాలంగా పోరాడుతున్న మరొక బక్కపలచటి యోధురాలు మన దేశంలోనూ ఉన్న విషయం నాకు చప్పున గుర్తుకు వచ్చింది. వీరిద్దరికీ ఉన్న పోలికలు గుర్తించడం, వీరిద్దరితో పాలకులు వ్యవహరిస్తున్న తీరును పోల్చడం, పాలకుల స్వభావంలోని కృత్రిమత్వాన్ని, అహింస, ప్రజాస్వామ్యం అన్న విలువల పట్ల పాలకులకు ఉన్న వాస్తవమైన గౌరవాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగ పడగలవనిపించింది.

ఆంగ్‌సాన్ సూచీతో పోల్చదిన మన దేశపు పోరాట యోధురాలు, ప్రజాస్వామ్యం అమలు కోసం అచంచలమైన పట్టుదల, తన ప్రజల స్వేచ్ఛ కోసం తన స్వేచ్ఛను సుదీర్ఘకాలం పాటు త్యాగం చేయగలిగిన ధృఢ సంకల్పం కలిగిన మన దేశపు ఆంగ్‌సాన్ సూచీ, మణిపూర్‌కు చెందిన ఇరోం షర్మిల. సూచీ బర్మాలో నిరంకుశ సైనిక పాలనకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్యాన్ని హామీ ఇచ్చే రాజ్యాంగం కోసం, ప్రజాస్వామ్య పాలన కోసం చేస్తున్న పోరాటంలో సుమారు పదిహేను సంవత్సరాలకు పైగా గృహ నిర్బంధానికి గురైంది. ఆఖరికి భర్త, పిల్లలను కూడా కలుసుకోలేని నిర్బంధ స్థితిలో కూడా ఆమె తాను నమ్మిన రాజకీయాల కోసం, విలువల కోసం ధృడంగా నిలబడింది. మరి ఇరోం షర్మిల – ఈశాన్య రాష్ట్రాల ప్రజలు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం చేస్తున్న ఉద్యమాలను అణచి వేయడం కోసం మన ప్రజాస్వామ్య ప్రభుత్వాలు సైన్యానికి విచ్చలవిడి అధికారాలు దఖలు చేస్తూ తెచ్చిన 'సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం' వల్ల సామాన్య ప్రజల హక్కులు నిరంతరం కాలరాయబడుతున్నాయి. అనేక మంది ఉద్యమకారులూ, సామాన్యులూ ప్రాణాలు కోల్పోతున్నారు. మనుషులు మాయం చేయ బడుతున్నారు. మొత్తంగా ప్రజల జీవితాలను కల్లోలం చేస్తున్న ఆ చట్టాన్ని ఎత్తివేయాలని ఇరోం షర్మిల నిరాహార దీక్ష చేపట్టి ఇప్పటికి పన్నెండు సంవత్సరాలు దాటిపోయాయి. ఆమె మౌన పోరాటానికి జవాబు చెప్పలేని భారత ప్రభుత్వం, అహింస ప్రజాస్వామ్యాలపట్ల అపార గౌరవం ఉందంటూ భారతపాలకులు ఆమెను పన్నెండు సంవత్సరాలుగా ఆసుపత్రి గదిలో బంధించి, బలవంతంగా పైప్ ద్వారా ఆహారం ఎక్కిస్తున్నారు.

అయితే, వీరిద్దరూ పోరాడుతున్నది సైన్యం అధికారాలకు వ్యతిరేకంగా, ప్రజల ప్రజాస్వామిక హక్కుల కోసం, న్యాయమైన, చట్టబద్ధమైన పాలన కోసం – సారంలో ప్రజాస్వామ్యం కోసం. అందుకు వీరిద్దరూ ఎంచుకున్న మార్గం – గాంధీ కనుగొన్నాడని చెప్పే, విస్తృతంగా శ్లాఘించే 'అహింసాయుతమైన పోరాట' మార్గం. గాంధీజీ ప్రపంచానికి చూపిన అహింసా మార్గం, నెహ్రూ బలంగా విశ్వసించి ఆచరించడానికి ప్రయత్నించిన ప్రజాస్వామ్యం అనే విలువలనే తానూ స్వీకరించాననీ, వీరిద్దరి సిద్ధాంతాలతో, వ్యక్తిత్వాలతో తాను చాలా ప్రభావితం అయ్యాయనీ ఆంగ్‌సాన్ సూచీ చెపుతోంది. మరి షర్మిల, తాను గాంధీ సిద్ధాంతాలతో ప్రభావితం అయ్యానని ఎక్కడా చెప్పినట్లు కనిపించక పోయినా, గాంధీ అహింసాయుత మార్గమని ఎంతగానో నమ్మి, తన రాజకీయ జీవితమంతటిలోనూ ఉపయోగించిన 'నిరాహార దీక్ష' అనే ఆయుధాన్ని గాంధీ కూడా ఊహించలేనంత సుదీర్ఘకాలంగా అచంచలమైన పట్టుదలతో అమలు చేస్తోంది. అయితే సుచీ గృహ నిర్బంధంలో అయినా, తన ఇంట్లో తాను కొంతవరకూ స్వేచ్ఛగా తిరగ గలిగింది. ఒక ఇంటి వాతావరణాన్ని కలిగి ఉంది. కానీ షర్మిల పన్నెండు సంవత్సరాలుగా ఇంఫాలాలోని ఆసుపత్రి గదిలో నిర్బంధంలో ఉంది.

---

అందువల్ల ఈ చరిత్రను అధ్యయనం చేయడం కేవలం గత కాలపు కంకాళాలను తవ్వితీయడానికి మాత్రమే కాదు. కేవలం పాత కంకాళాలను తవ్వితీసినందువల్ల ప్రయోజనమేమీ లేదు. ఎంత అనవసరమైన, అవాస్తవికమైన, అచారిత్రకమైన, నిర్హేతుకమైన విషయాల మీద ప్రజలలో భావోద్వేగాలు రెచ్చగొట్టడానికి, వేల కోట్ల రూపాయల ప్రజాధనం వృథా చేయడానికి, విలువైన ప్రాణాలు బలిపెట్టడానికి పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయో వర్తమానం తెలుసుకోవడానికి ఈ చరిత్ర అవసరం. అవకాశం ఉన్న చోట్ల కూడ సామరస్యపూర్వకంగా, చర్చల ద్వారా వివాదాలను పరిష్కరించడానికి పూనుకోకుండా పాలకులు ఎటువంటి కుటిల పన్నాగాలు పన్నుతున్నారో అర్థం చేసుకోవడానికి ఈ సరిహద్దు వివాదం, యుద్ధం, యుద్ధానంతర పరిణామాలు గొప్ప సూచికలు. పాలకవర్గాల మాటలను యథాతథంగా నమ్మడానికి వీలు లేదని గుర్తించడానికి ఈ వివాదాన్ని మించిన ఉదాహరణ లేదు.

*(రచయిత సైనిక వ్యవహారాల పరిశీలకుడు)* వీ

ముక్కు ద్వారా ఆహారాన్ని ఎక్కించే పైపు ఆమె శరీరంలో ఒక భాగంగా మారింది. శారీరక ఆరోగ్యం క్రమ క్రమంగా ధ్వంసమై పోతుండగా, ఆసుపత్రి మంచానికి పరిమితమైపోయింది. అయినా కూడా తన ప్రజల న్యాయమైన డిమాండ్ కోసం, ప్రజాస్వామిక హక్కుల కోసం ప్రభుత్వంపై తన పోరాటాన్ని కొనసాగిస్తూనే ఉంది.

అయితే సూచీ ప్రజాస్వామ్యం కోసం చేస్తున్న శాంతియుత ఉద్యమమైనా, షర్మిల చేస్తున్న నిరాహార దీక్ష అయినా నిజానికి రూపంలో మాత్రమే అహింసాయుతమైనవి. ఆ పోరాటాలను 'అహింసాయుత రూపం'లో ఉంచడం కోసం వారిపై అమలవుతున్న హింసను ప్రపంచం చూడలేక పోతున్నది. ఒక మనిషి కదలికలన్నీ సుదీర్ఘ కాలం కట్టడి చేయబడి, ఇంటి నాలుగు గోడలకే పరిమితం చేయబడి, బయటి ప్రపంచాన్ని చూడలేకుండా, తాను ప్రేమించే మనుషులను కలుసుకో లేకుండా, ఉండడంలోని హింస, మరొక వ్యక్తి పన్నెండు సంవత్సరాలుగా నోటితో ఆహారాన్ని రుచి చూడకుండా నిగ్రహించుకోవడం, నాలుగు గోడలు తప్ప ప్రపంచంలోని విశాలత్వాన్నీ, స్వేచ్ఛనూ అనుభవించ లేకపోవడం, తాను ప్రేమించిన మనిషిని పెళ్లాడాలని, ఒక మామూలు స్త్రీగా జీవించాలనే కోరికను చంపుకోవడంలో ఉన్న హింసను మనం నిజంగా చూడగలుగుతున్నామా? చూడగలిగితే ఇటువంటి పోరాటాలను అహింసాయుత పోరాటాలని అనవచ్చునా? ఇంత సుదీర్ఘకాలం తమపై హింసను ఆమోదిస్తూ కూడా అహింసాయుత పోరాట మార్గాన్నే ఆచరించే వారికి ప్రభుత్వాల ప్రతిస్పందన ఇంత నిర్లక్ష్యంగా ఉన్నప్పుడు గాంధీ ఏం చేయమని చెప్పి ఉండేవారో?

ఎదుటివారిపై హింస చేయడం మన సంస్కారానికి తప్పనిపిస్తుంది. నిజమే, కానీ తమపై తాము ఇంతటి హింసను ప్రయోగించుకోవడం అంత శ్లాఘించదగిందా? అయినా నాగరికమైన సమాజాల్లో, అందులో ప్రజాస్వామ్యం అమలవుతున్న చోట్ల తమ న్యాయమైన డిమాండ్లను సాధించుకోవడానికి, తమ ప్రజాస్వామిక హక్కుల అమలు కోసం తమపై తామైనా ఇంత హింసను ప్రయోగించుకోవాల్సిన స్థితి ఉండవచ్చునా? ఉన్నప్పుడు ఆ సమాజాలు, ఆ పాలన నాగరికమైనవి అని అనవచ్చునా?

మరొక ముఖ్య పోలిక – ఈ ఇద్దరు పోరాటకారుల పట్ల భారత పాలకులు చూపిన వైఖరి. ఈ దేశంలో ఎంతో చారిత్రక సాంస్కృతిక అనుబంధం కలిగి, బ్రిటిష్ వలస పాలనకు వ్యతిరేకంగా భారత దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న సుభాష్ చంద్రబోస్ వంటి ఎందరో ఉద్యమకారులకు ఆశ్రయం ఇచ్చి, ఈ దేశ స్వాతంత్ర్య పోరాటంలో విడదీయరాని సంబంధం కలిగిన దేశం బర్మా. ఇవాళ తమ దేశంలో స్వాతంత్ర్యం కోసం, ప్రజాస్వామ్య సాధన కోసం బర్మీయులు చేస్తున్న పోరాటానికి భారతదేశం ఇచ్చిన సహకారం ఏమిటి? సైన్యం కనుసన్నల లోనే అయినా, అక్కడ జరిగిన ఎన్నికలలో అత్యధిక మెజారిటీతో గెలుపొందిన నేతను నిర్బంధించి అధికారం చేజిక్కించుకున్న అక్కడి సైనిక ప్రభుత్వంతో భారత ప్రభుత్వం ఎలా సంబంధాలను కలిగి ఉంది? ఆ దుర్మార్గాన్ని ఖండిస్తూ ఒక్క తీర్మానమైనా ఎందుకు చేయలేదు?

సూచీ మొన్న ఢిల్లీలో మాట్లాడుతూ, గాంధీ ఈనాడు ఉండి ఉంటే బర్మా పట్ల భారత వైఖరిని తీవ్రంగా గర్హించే వాడని అంది. అంతేకాదు, ప్రజాస్వామ్యం కోసం తాము చేస్తున్న పోరాటం పట్ల భారతదేశ వైఖరిని తనను ఎంతో బాధించిందని చెప్పింది. అంటే, పరోక్షంగా భారత్ తాను నిలబడాల్సిన విలువల నుండి పక్కకు పోయిందని చెప్పడమే. అయితే భారత ప్రభుత్వం ఒక్క బర్మా పట్లనేనా ఇంత దుర్మార్గ వైఖరి అవలంబించింది? అభివృద్ధి పేరుతో అమెరికాతో అంటకాగుతూ, ప్రపంచ వ్యాప్తంగా అమెరికా చేస్తున్న దుర్మార్గాలకు భారత్ ఒక సమర్థకురాలిగా మారింది. ఇరాక్, అఫ్ఘనిస్తాన్‌లపై అమెరికా చేసిన ధ్వంస రచనను ఖండిస్తూ భారతదేశం ఒక్క ప్రకటన చేయలేకపోయింది. ఒక సార్వభౌమ దేశపు ప్రజలు ఎన్నుకున్న దేశాధ్యక్షుడిని అమెరికా సైన్యాలు వెతికి, వేటాడి పట్టుకొని, ప్రపంచమంతా చూసేలా కెమెరాల ముందు నిల్చోబెట్టి ఉరితీస్తున్నప్పుడు అమెరికా చేస్తున్నది దురహంకార దుర్మార్గమని భారత్ ఖండించగలిగిందా? పాలస్తీనాపై ఇజ్రాయిల్ సాగిస్తున్న దారుణాలు దుర్మార్గమని, అప్రజాస్వామికమని ఏ అంతర్జాతీయ వేదిక నుండైనా భారత్ ఖండించిందా? అంతర్జాతీయ పెట్టుబడులు, మార్కెట్‌ల ప్రయోజనాలు, ఐఎంఎఫ్ అప్పులు వంటి వాటికి నష్టం జరగకుండా చూసుకోవడమే తప్ప, మరే విలువలూ, ఆదర్శాలూ లేని భారతదేశ విదేశాంగ నీతి ఆంగ్‌సాంగ్ సూచీకి అర్థం కాలేదా? ఒక న్యాయమైన పోరాటానికి రావలసిన సహజమైన ప్రతిస్పందనను భారత పాలకుల నుండి ఆమె ఎలా ఆశించింది?

ఇన్నాళ్లకైనా ఆమెను ఈ దేశానికి పిలిచి, నెహ్రూ స్మారకోపన్యాసం చేయమనడం అంటే ఇంకా 'శాంతి, అహింస, న్యాయం, ప్రజాస్వామ్యం' వంటి విలువల పట్ల భారత పాలకులకు గౌరవముందని ఆమె భావిస్తోందా? 'సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని రద్దు చేయమనే' ఒక న్యాయమైన, సులభమైన డిమాండ్‌తో ఇరోం షర్మిల సుదీర్ఘకాలంగా చేస్తున్న అహింసాయుత పోరాటానికి పాలకుల నిర్లక్ష్యపు ప్రతిస్పందన చాలదూ అర్థం చేసుకోవడానికి? విచ్చలవిడిగా నదులపై ఆనకట్టలు కట్టి మా ఇళ్లూ, ఊళ్లూ ముంచి మా జీవించే హక్కును కాలరాయొద్దని ఇరవై సంవత్సరాలుగా, లక్షలాది ప్రజలతో అనేక దఫాలుగా శాంతియుత నిరసనలూ, పోరాటాలూ చేసిన 'నర్మదా బచావో ఆందోళన్' ప్రాజెక్టులను ఆపలేకపోయినా, కనీసం భూమికి బదులుగా భూమిని కూడా సాధించుకోలేకపోయిందే! అభివృద్ధి పేరుతో, మైనింగ్ ప్రాజెక్టులతో మా నదులు, అడువుల నాశనం చేయొద్దని, మా భూములు లాక్కోవద్దని శాంతియుతంగా ప్రజలు చేస్తున్న పోరాటాలతో ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు, అణు విద్యుత్ ప్రాజెక్టులతో మా నేల, మా ప్రాణాలకు ప్రమాదాన్ని తెచ్చి పెట్టడాన్ని మేము అంగీకరించం అంటూ – శాంతి యుతంగానే – పోరాడుతున్న ప్రజలతో ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు – ఈ దేశ ప్రజలందరూ చూస్తున్నారు. మావోయిస్టు ఉద్యమానికి ఆదివాసులు సహకరిస్తున్నారనే కోపంతో సల్వాజుడుం, హర్మద్ వాహిని వంటి పేర్లతో ప్రభుత్వమే మాఫియాలను తయారు చేసి ఆదివాసులపైకి వదిలి, వారి కొంపా, గూడూ, పంట, ప్రాణాలూ హరిస్తూ, గ్రీన్‌హంట్ చేయిస్తున్న ఈ పాలకులకు అహింస, ప్రజాస్వామ్యం అనే విలువల పట్ల గౌరవముందని ఎవరైనా ఎట్లా అనుకోగలరు?

సూచీ, తన దేశంలో వెనుకబాటుతనాన్ని నిర్మూలించి, ప్రజలకు అభివృద్ధిని అందించాల్సిన అవసరాన్ని గురించి చెపుతూనే, ఒక విలువైన మాట అంది, 'ప్రజాస్వామ్యానికి అభివృద్ధి ప్రత్యామ్నాయం కాదు' అని. కానీ ఈ దేశ పాలకులు 'అభివృద్ధి'ని ప్రజాస్వామ్యానికి ప్రత్యామ్నాయం గానే కాదు, ప్రజాస్వామ్యం కంటే అనేక రెట్లు ఉన్నతమైనదానిగా చూస్తున్నారు. ఈ నేపథ్యంలో నెహ్రూ స్మారక బహుమానాన్ని సోనియాగాంధీ చేతుల మీదుగా అందుకోవడానికి, అసలు సుచీయే ఆలోచించి ఉండవలసిందేమో.

*(రచయిత ఉపాధ్యాయురాలు)* వీ

# మాణిక్యాపూర్ రాజకీయార్థిక స్థితి

*ముప్పై ఏళ్ల క్రితానికీ ఇప్పటికీ మాణిక్యాపూర్ గ్రామ రాజకీయార్థిక, సామాజిక స్థితిగతుల్లోవచ్చిన మార్పులను వివరిస్తున్నారు* **డి.వి. రామకృష్ణారావు, వై. రామచంద్రం**

**భా**రతదేశ వ్యవసాయ సంబంధాలలో మార్పులు, రాజకీయ ఆర్థిక స్థితిగతులపై వీక్షణం సంపాదకులకు లండన్ ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీకి పరిశోధనా పత్రం సమర్పణకు వచ్చిన ఆహ్వానం మేరకు మేము గ్రామ అధ్యయనం చేపట్టాం. అందులో భాగంగా గ్రామ పరిశీలనకు ఏ గ్రామాలను పరిశీలించాలనే ప్రశ్న వచ్చింది. గతంలో పరిశీలించిన గ్రామాలను అధ్యయనానికి ఎంచుకుంటే పోల్చుకోవడానికి అనువుగా ఉంటుందని భావించాం. అలా ఎంపిక చేసుకున్నప్పుడు ఆ గ్రామాలలో మారిన స్థితిని అధ్యయనం చేయడానికి అవకాశం ఎక్కువగా ఉంటుంది. 1980-81లో అప్పటి పీపుల్స్‌వార్ (నేటి మావోయిస్టు పార్టీ) 'గ్రామాలకు తరలండి క్యాంపెయిన్'లో భాగంగా దేశంలోనూ, ఆంధ్రప్రదేశ్‌లోనూ ఎన్నో గ్రామాలను అధ్యయనం చేసింది. తాను అధ్యయనం చేసిన గ్రామాలలోంచి కరీంనగర్ జిల్లాలోని హుస్నాబాద్ మండల పరిధిలోని గౌరవెల్లి, రామారం గ్రామాల, భీమదేవరపల్లి మండల పరిధిలోని మాణిక్యాపూర్, కొత్తపల్లి గ్రామాల వివరాలను క్రోడీకరించి **'దున్నేవారికి భూమి లభించనిదే రైతాంగానికి విముక్తి లేదు'** అనే పత్రాన్ని క్రాంతి ప్రచురణలుగా ఏప్రిల్ 1982లో వెలువరించింది. వాటిని ప్రాతిపదికగా తీసుకొని మేము గౌరవెల్లి, మాణిక్యాపూర్ గ్రామాలను మా పరిశోధనకు ఎంచుకున్నాం. ఈ గ్రామాలకు మేము మార్చ్ 2011 నుండి మే 2012 మధ్యకాలంలో దాదాపు పన్నెండు సార్లు వెళ్లాం. వెళ్లిన ప్రతిసారి రెండు రోజుల చొప్పున గ్రామంలో గడిపి వివరాలు సేకరించాం.

మా పరిశోధనలో భాగంగా ఆ ఊరిలో ఇప్పుడున్న శ్రమ సంబంధాలు, భూ సంబంధాలు, సామాజిక స్థితిగతులు, మార్కెట్‌తో సంబంధాలు, కుల వృత్తులు, సంస్కృతి, జీవన విధానం, మొత్తంగా రాజకీయార్థిక స్థితిగతులలో అప్పటికీ, ఇప్పటికీ వచ్చిన మార్పులు చూసే ప్రయత్నం చేశాం. ఈ పరిశోధనా క్రమంలో గ్రామం గురించి మేం చేసిన సర్వేలో అనుసరించిన పాక్షిక నమూనా సర్వే పద్ధతి సమగ్ర అంచనా ఇవ్వకపోయినా, స్థూలంగా కొన్ని ఆలోచనలు చేయడానికి ఉపయోగపడుతుందని అనుకున్నాం. ఆ దిశగా చేసిన చిన్న ప్రయత్నమే ఈ పరిశోధనా పత్రం.

దేశంలో ఈనాటికీ అత్యధిక జనాభాకు ఆశ్రయమిస్తూ దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక వ్యవస్థలను పరిరక్షిస్తూ ఉన్నవి గ్రామాలే. అందువలన మన సమాజాన్ని అర్థంచేసుకోవాలన్నా, అభివృద్ధి చేయాలన్నా, మౌలికంగా మార్పులు తీసుకురావాలన్నా గ్రామాలను లోతుగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. ఈ గ్రామ అధ్యయనాన్ని ప్రభుత్వాలు, ప్రపంచ బ్యాంకు, బహుళజాతి సంస్థలు, స్వచ్ఛంద సేవా సంస్థలు, సామాజిక పరిశోధన చేసే విశ్వవిద్యాలయాలు రకరకాల ఉద్దేశాలతో స్థూలంగానో, శకలంగానో గ్రామాలను తాము అనుకున్న పరిధిలో పరిశీలిస్తున్నాయి. తాము అనుకున్న లక్ష్యాలకు అవసరమైన, కొన్ని సందర్భాల్లో తమ వాదనలకు అనుకూలమైన గణాంకాలను సృష్టించుకుంటున్నాయి. అయితే మౌలికంగా సమాజం మార్చాలనుకునే వారికి ఉత్పత్తి శక్తులు ఎలా ఉన్నాయి, ఉత్పత్తి సంబంధాలు ఎలా ఉన్నాయి, ఉపరితల అంశాలు ఏవిధంగా ఉన్నాయో సమగ్రంగా అంచనాకు రావాల్సిన అవసరం ఉంటుంది. మన రాష్ట్రంలో అలాంటి గ్రామాల మౌలిక పరిశోధన కొండపల్లి సీతారామయ్య నాయకత్వంలోని పీపుల్స్‌వార్ పార్టీ చేసింది. ఆ కృషిని ఆ తర్వాత కాలంలో మల్లోజుల కోటేశ్వరరావుతో సహా నేటి మావోయిస్టు పార్టీ దాకా కొనసాగిస్తూనే ఉంది. ఎప్పటికప్పుడు తమ గ్రామ అధ్యయనాన్ని కొనసాగిస్తూ భారతదేశ సమాజ లక్షణాన్ని అర్ధ భూస్వామ్య, అర్ధ వలసగా విశ్లేషించుకొని తమ కార్యక్రమాన్ని రూపొందించుకుంది. ఎప్పటికప్పుడు తమ అధ్యయనానికి పదును పెట్టుకుంటున్నారు.

ఇక మాణిక్యాపూర్ గ్రామ నైసర్గిక స్వరూపాన్ని చూస్తే తూర్పున జీలుగుల, పడమర అమ్మనగుర్తి, ఉత్తరాన కాత్రాపల్లి, దక్షిణం వైపు కొప్పూరు గ్రామాలు ఉన్నాయి. ఈ గ్రామ ముఖద్వారంలోనే రోడ్డు పక్కన పీపుల్స్‌వార్ పార్టీలో పనిచేస్తూ పోలీసు కాల్పుల్లో మరణించిన గజవెల్లి సమ్మయ్య, బండి మొగిలి, శనిగరపు శారద, రాంబెల్లి జనార్దన్‌ల స్మారకార్థంగా నిర్మించిన సుత్తి కొడవలితో ఉన్న స్థూపం, దాని పక్కనే సిపిఐ వారి కంకి కొడవలి గుర్తుతో ఉన్న జెండా గద్దె రెండూ గ్రామంలోకి దారి చూపుతున్నాయి.

మాణిక్యాపూర్ గ్రామం కరీంనగర్ జిల్లా భీమదేవరపల్లి మండలంలోకి వస్తుంది. దీన్ని గతంలో చాట్లాపూర్ అనేవారని, తరువాత కాలంలో మాణిక్యమ్మనే మహిళ పేరుతో ఊరు పేరు, ఊరిలోని చెరువు పేరు స్థిరపడ్డాయి. ఈ ఊరు పరిణామ క్రమంలో మూడు భాగాలుగా విడిపోయి ఉంది. మొదటి భాగం మాణిక్యమ్మ చెరువుకు దగ్గరగా ఉన్న అసలు ఊరు. కుంటను ఆనుకుని ఉన్నది రెండో భాగం. హుజురాబాద్ - భీమదేవరపల్లి రోడ్డుకు రెండు వైపులా పరుచుకుని ఉన్నది మూడవ భాగం. గతంలో మధ్య భాగం అంచున దళితుల ఇండ్లు ఉండేవి. 1982లో కాలనీ ఏర్పడగా దళితులంతా రోడ్డువైపుకు వెళ్లారు. కొంత మంది బిసి కులస్తులు కూడా కొత్తగా ఏర్పడ్డ కాలనీ వైపు వెళ్లిపోయారు. ఏది ఏమైనా దళితుల ఇండ్లు మాత్రం వేరుగా ఒక వైపు ఉన్నాయి. మాణిక్యాపూర్ నుంచి హుజురాబాద్ 9 కిలోమీటర్ల దూరంలోనూ, మండల కేంద్రం భీమరదేవరపల్లి 5 కిలోమీటర్ల దూరంలోనూ ఉన్నాయి. ఈ ఊరి గ్రామ పొలిమేర సైదాపూర్, హుజురాబాద్, ఎల్కతుర్తి, భీమదేవరపల్లి నాలుగు మండలాల గ్రామ శివారులను ఆనుకొని ఉంది. మండల రెవెన్యూ కార్యాలయం భీమదేవరపల్లిలో ఉంది. పోలీస్ స్టేషన్ వంగర అయినప్పటికీ సైదాపూర్ (మాణిక్యాపూర్ నుండి 35 కిలోమీటర్లు)లో ఉంది. కోర్టు హుస్నాబాద్‌లోనూ, బ్యాంకు (వైశ్యా) హుజురాబాద్‌లోనూ ఉన్నాయి.

మాణిక్యాపూర్ గ్రామ జనాభా మొత్తం 3207 (2011 లెక్కల ప్రకారం) అందులో స్త్రీలు-1579, పురుషులు-1628. వారిలో ఓటర్ల సంఖ్య మొత్తం-2294 (2011 లెక్కల ప్రకారం). వారిలో ఎస్.సి. స్త్రీలు-287, పురుషులు-290; బి.సి. స్త్రీలు-764, పురుషులు-838; ఎస్.టి. స్త్రీలు-12, పురుషులు-14; ఓ.సి స్త్రీలు -41, పురుషులు-48 మంది ఉన్నారు.

ఈ గ్రామంలో 19 కులాలకు చెందిన వారున్నారు. కులాల వారిగా ఇండ్ల పేర్ల వివరాలు, కడపల సంఖ్య-పెరిక-77; మాదిగ-184; చాకలి-32; పద్మశాలి-70; వడ్ల-25; కమ్మరి-33; రెడ్డి-15; కుమ్మరి-3; గౌడ-74; మంగలి-6; ఔసుల-8; బహురూపుల-5; గొల్ల-55; కురుమ-2;

బ్రహ్మణ-2; కోమటి-6; తెనుగు-60; మేర-3; ఎరుకల-10; సింది-6 ఇలా మొత్తం 652 కడపలు ఉన్నాయి.

ఊరి మొత్తం మీద వ్యవసాయ భూమి 1580 ఎకరాల వరకు ఉంది. ఇందులోనే 340 ఎకరాల పంచరాయి భూమి కలిసి ఉంది. ఈ పంచరాయి భూమిలో 90 శాతం దళితులకు, 10 శాతం బి.సిలకు పట్టాలయిన్నట్లు చెప్పారు. బీడు, పోరంబోకు అంతా కలిపి 80 ఎకరాలదాక ఉంది. నీటి పారుదల కింద 940 ఎకరాలు, వర్షాధారంగా 640 ఎకరాలు ఉన్నట్లు చెప్పారు. మొత్తం పట్టా పాస్ పుస్తకాలు 560 ఉన్నాయి. భూమిలేని వారు, రెండెకరాల లోపు కలిగి ఉన్న కమతాలు 307; రెండెకరాల నుంచి పది ఎకరాల మధ్య ఉన్న కమతాలు 319; పది నుంచి ఇరవై ఎకరాలు ఉన్న కమతాలు 16; ఇరవై ఎకరాలకు పైగా ఉన్న కమతాలు 10 ఉన్నట్లు తెలుస్తోంది. ఈ మొత్తం కమతాల్లో బిసిలకు చెందిన 450 కమతాలు; ఎస్‌సి-184; ఎస్‌టి-2, ఒసి-16 కమతాలు ఉన్నాయి. చెరువు శిఖం భూమిలో 190 ఎకరాలు సాగవుతున్నట్లు చెప్పారు. చెరువు నిండనపుడు ఈ భూమిని ప్రధానంగా తెనుగు, దళిత, పెరిక కులాలకు చెందిన వారు సాగుచేసుకుంటున్నారు.

మాణిక్యాపూర్ గ్రామానికి చెందిన వారు **జగ్గరాయనిపల్లిలో** 10 ఎకరాలు, **రత్నగిరిలో** 50 ఎకరాలు, **అమ్మనగుర్తిలో** 50 ఎకరాలు, **కాట్రాపల్లిలో** 60 ఎకరాలు, **పెంచికల్ పేటలో** 20 ఎకరాలు, **జీలుగులలో** 200 ఎకరాలు, **కొప్పూరులో** 20 ఎకరాలు, **జగన్నాథపురంలో** 30 ఎకరాలు, **వంగరలో** 50 ఎకరాలు, **రంగయ్యపల్లిలో** 20 ఎకరాల భూమిని కొనుక్కున్నారు. ఊరిలో మొత్తం భూమి 1580 ఎకరాలు ఉండగా, చుట్టుపక్కలున్న పది గ్రామాల శివారులలో 500 ఎకరాల భూమిని కొన్నారు. సరైన ఫలసాయంలేని, సాగునీరు లేని, చిన్న స్థాయి కమతాలు కలిగిన, అసలే భూమిలేని కుటుంబాలు అన్నీ కలిపి 140 వరకు ఉన్నాయి.**ఈ గ్రామంలో కులాల వారిగా అసలే భూమిలేని కుటుంబాలు :** పద్మశాలీలు-37, గొల్లలు-16, తెనుగు-17, గౌడ-4, చాకలి-3, వడ్ల-2, ఔసుల-4, మంగలి-3, మాదిగ-51 ఉన్నాయి.

ఈ గ్రామంలో మూడు కుంటలు ఉన్నాయి. ఒకటి **తిరుమల కుంట**. రెండోది **మైసమ్మ కుంట**. వీటి కింద 20 ఎకరాల భూమి సాగయ్యేది. మూడోది **బ్రాహ్మణ కుంట**. దీని కింద 15 ఎకరాల భూమి సాగయ్యేది. నీటి ఎద్దడి కారణంగా ఇప్పుడు కుంటల్లోని నీరు వదలకుండా కుంటల్లోనే ఉంచుతూ బావుల్లోని నీటి ద్వారనే పొలాలను సాగుచేసుకుంటున్నారు. మాణిక్యాపూర్‌లో 1882లో సాగునీరు కోసం కుంట నిర్మించారు. దానికి రెండు సార్లు గండి పడినా దాన్ని పూడ్చి వాడుకలోకి తెచ్చుకుని 30 సంవత్సరాల తరువాత చెరువుగా ఏర్పాటు చేసుకున్నారు. చెరువు కింద సాగవుతున్న విస్తీర్ణం 360 ఎకరాల వరకు ఉంది. మంచి వర్షాలు పడితే మూడు పంటలు పండుతాయి. చెరువుకు వాగుల ఆధారం ఏమి లేదు, వర్షపు నీరే చెరువుకు ఆధారం. ఊరిలో 366 వ్యవసాయ బావులు, 10 బోరు బావులు ఉన్నాయి. ఈ వ్యవసాయ బావులలో 3 ఎచ్.పి. మోటర్లు 226, 5 ఎచ్.పి. మోటర్లు 29, 7.5 ఎచ్.పి మోటర్లు 111 ఉన్నాయి. ప్రతి మోటరుకు నెలకు రు. 20 చొప్పున విద్యుత్ శాఖకు చెల్లిస్తున్నారు. ఇటీవలే నెలకు రు. 30కి పెరిగింది. కొత్తగా మూడు బావులు, ఇటీవలే రెండు బోర్లు ఊరిలో వేసుకున్నట్లు ఆ ఊరి హెల్పర్ చెప్పారు. వ్యవసాయంలో 150 నుంచి 200 రోజులు పని దొరుకుతోందని చెప్పారు.30 ఏళ్ల క్రితం పంటచేన్లకు నీరందించడానికి ఎడ్ల మోటలు, డీజిల్ ఇంజన్లు, చెరువు కాలువలు ఉండేవి. ఇప్పుడు కరంట్ మోటర్‌ల ద్వారా, చెరువు కాలువల ద్వారా పంటలకు నీరందిస్తున్నారు. కొన్ని తోటలకు నీరందించడానికి దాదాపు పది డ్రిప్ సిస్టమ్స్ వాడుతున్నారు.

వ్యవసాయ బావులకు రాత్రి పగలు కలిపి 7 గంటల కరెంట్ ఇస్తున్నట్లు చెప్పారు. ఇవి వారానికి ఒక సారి మారుతుంటాయి. అవి 1.ఉదయం 6-10 వరకు ఇంకా రాత్రి 9-12 గంటల వరకు; 2. ఉదయం10 గంటల నుంచి మధ్యాహ్నం 2 గంటల వరకు, మళ్లీ అర్ధరాత్రి 12 గంటల నుంచి తెల్లవారు జామున 3 గంటల వరకు; 3. మధ్యాహ్నం 2 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు మళ్లీ తెల్లవారు జామున 3 గంటల నుంచి 6 గంటల వరకు ఇలా మూడు షిఫ్టులల్లో కరెంట్ ఇస్తున్నారు. దీనివల్ల రైతుకు విరామం, వెసులుబాటు అనేవి లేకుండా కరెంట్ కోసం రేయింబవళ్లు కాసుక్కూసొని గానుగెద్దులా భూమి చుట్టూ తిరిగే పరిస్థితి ఉంది. రాత్రి చీకట్లో చేన్లకు నీళ్లు కట్టడానికి పోయి కరెంట్ ప్రమాదాలకు, తేలు, పాము కాట్లకు గురై ఎంతో మంది చనిపోతున్నారు. సంసార జీవితాన్నీ కోల్పోతున్నారు.

ఈ గ్రామ ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి బతుకుతున్నారు. ఈ ఊరిలో ప్రధానంగా పత్తి, వరి పంటలను పండిస్తున్నారు. వాటి తరువాత స్థానంలో మక్కజొన్న, పండ్లతోటలు ఉన్నాయి. అంతర పంటగా కంది, కొద్దిగా పెసర, బబ్బెర వేస్తున్నారు. వ్యవసాయ పనులకు స్త్రీలకు రోజు కూలీ రు. 100, పురుషులకు రోజు కూలీ రు. 200 చొప్పున ఇస్తున్నారు.

**పంటలు-ఆదాయం**

ఈ గ్రామంలో ప్రధానంగా ఖరీఫ్ పంటలుగా పత్తి, వరి, మక్కజొన్న, వేరు శనగ పంటలను పండిస్తున్నారు. పత్తి వర్షాధారం, నీటి పారుదలల కింద కలిపి సగటున ఎకరాకి 7.5 క్వింటాళ్ల చొప్పున ఊరి మొత్తానికి దాదాపు వెయ్యి ఎకరాల్లో 7500 క్వింటాళ్ల దిగుబడి వస్తోంది. పత్తి సగటు ధర క్వింటాల్‌కు రు.4000 చొప్పున మొత్తం **రు. 3 కోట్ల** ఆదాయం వస్తోంది. వరి ఎకరానికి సగటున 25 కింటాళ్ల చొప్పున ఐదు వందల ఎకరాల్లో 12500 క్వింటాళ్ల దిగుబడి వస్తోంది. వరి సగటు ధర క్వింటాల్‌కు రు. 900 చొప్పున **రు.1కోటి 13 లక్షల** ఆదాయం వస్తోంది. మక్కజొన్న సగటున ఎకరాకి 28 క్వింటాళ్ల చొప్పున మూడు వందల ఎకరాల్లో 8400 క్వింటాళ్ల దిగుబడి వస్తోంది. క్వింటాల్ ధర రు. 1200 చొప్పున **రు. 1 కోటి** ఆదాయం వస్తోంది. పల్లి (వేరుశనగ) సగటున ఎకరాకి 5 క్వింటాళ్ల చొప్పున వంద ఎకరాల్లో 500 క్వింటాళ్ల దిగుబడి వస్తోంది. పల్లి క్వింటాల్ ధర రు. 4000 చొప్పున **రు. 20 లక్షల** ఆదాయం వస్తోంది. పండ్ల తోటలపై **రు. 15 లక్షల** ఆదాయం వస్తోంది. కూరగాయలపై **రు. 10 లక్షల** ఆదాయం వస్తోంది. ఖరీఫ్ మొత్తం ఆదాయం **రు. 5 కోట్ల 58 లక్షలు** వస్తోంది.

రబీ పంటలుగా వరి, మక్కజొన్న పంటలు పండిస్తున్నారు. నీళ్ల సౌకర్యాన్నిబట్టి దాదాపు 600 ఎకరాల వరి, 400 ఎకరాల మక్క సాగు అవుతున్నాయి. వరిపై రు. 1 కోటి 65 లక్షలు (క్వింటాల్‌కు రు. 1100 చొప్పున), మక్కపై రు. 1కోటి 45 లక్షలు, ఇతరత్రా పంటలు కలిపి రు. 25 లక్షల ఆదాయం వస్తోంది. ఈ రకంగా ఖరీఫ్, రబీ ఆదాయాల మొత్తం రు. 9 కోట్ల వరకు ఉంది. వ్యవసాయంలో పెట్టుబడి ఖర్చులను సగానికి మినహాయించుకున్నా సంవత్సరానికి రు. 4.5 కోట్ల ఆదాయం ఆ గ్రామంపై వస్తోంది. ఈ ఆదాయాన్ని గ్రామంలోని 652 కడపలపై విభజిస్తే కడపకు సగటున నెలకు రు. 5751 ఆదాయం వస్తోంది. ఇవన్నీ పంట ధరలు, దిగుబడులు సగటున లెక్కించగా వచ్చినవి.

శాస్త్రీయ పద్ధతుల్లో వ్యవసాయాన్ని చేస్తే ఇంకా అధిక దిగుబడులు సాధించి, కుటుంబ సగటు ఆదాయాన్ని జీవన ప్రమాణాలను మెరుగుపరుచు కోవచ్చు. వ్యవసాయం చేయని (రాజకీయ, వ్యాపారాలు, ఉద్యోగాల్లో స్థిరపడిన) కుటుంబాలను మినహాయించి భూమిని పంపకం చేస్తే 500 కడపలకు సగటున 4 ఎకరాల చొప్పున భూమి లభిస్తుంది. ఆదాయంలో పాల ఉత్పత్తులు, ఎడ్ల బ్యారం, ఉపాధి హామీ, కల్లు, ఇతరత్రా జీవనోపాధుల పై వచ్చే ఆదాయాన్ని ఇందులో కలపలేదు.

భూమి దున్నడం 80 శాతంకు పైగా ట్రాక్టర్‌తో సాగుతోంది. వరి కోత వంద శాతం హార్వెస్టర్‌తోనే గత రెండేళ్లుగా సాగుతోంది. మొత్తంగా వ్యవసాయం మీద ఉన్న పనులు **వరికి సంబంధించి** : నాట్లు వేయడం, కలుపు తీయడం పనులు ఉన్నాయి. వరి కోత మనుషులకు బదులు హార్వెస్టర్‌తో జరుగుతోంది. పండిన వడ్లు, మక్కలు ఇతర దినుసులు, గడ్డి ఇండ్లకు లేదా మార్కెట్‌కు తీసుకెళ్లడానికి గతంలో ఎడ్ల బండ్లు వాడే వారు.

ఇప్పుడు ఆ పనులు ట్రాక్టర్‌తో చేస్తున్నారు. నూర్పిడికి ఎడ్లతో బంతికట్టి తిప్పేవారు, తరువాత ట్రాక్టర్‌తో తిప్పేవారు. ఇప్పుడు ఆ పనిని కూడా హార్వెస్టర్ చేస్తోంది. వ్యవసాయంలోని దాదాపు పనులు ఎక్కువగా యాంత్రీకరణకు గురయ్యాయి. వరి కోతల సమయాల్లో ఒక నెల రోజుల పాటు 20 మంది హమాలీ పని చేస్తున్నారు. **పత్తికి సంబంధించి**: విత్తులు నాటడం, కలుపు తీయడం, ఎరువు వేయడం, పురుగు మందులు చల్లడం, పత్తి ఏరడం పనులు ఉన్నాయి. **మక్కకు సంబంధించి** : విత్తులు నాటడం, కలుపు తీయడం, మక్క కోత, కంకులు బూరు తీయడం పనులు ఉన్నాయి. మక్కతో పాటు అంతర పంటగా కంది వేసుకుంటున్నారు. **మామిడి, బత్తాయి** వరుస కరువులతో తగ్గిపోయాయి. ట్రాక్టర్‌తో భూమి దున్నడం, వరుస కరువు పరిస్థితులు వల్ల ఎడ్ల ప్రాముఖ్యత, సంఖ్య గణనీయంగా తగ్గిపోయింది. కౌలు పద్ధతిలో సాగవుతున్న భూమి చాలా తక్కువ. ఊరిలో బర్రెల సంఖ్య ఈ మధ్య కాలంలో పెరిగింది. ఊరిలో రెండు పాల కేంద్రాలు ఉన్నాయి.

ఊరిలో వ్యవసాయం తరువాత పాడి, పశువుల బేరం పైనా, బీడిల తయారీపైనా ఆధారపడి కొంత మంది బతుకుతున్నారు. ఊరి నుంచి ప్రతి రోజూ హమాలీ, సుతారీ, ఇతరత్రా కూలీ పనులకు హుజురాబాద్‌కు వెళ్లి వస్తున్నవాళ్లు 50 మంది వరకు ఉన్నారు. గతంలో లాగా ఇప్పుడు సీజన్‌ను బట్టి పోతున్నవారు లేరు. బీవండి, సిరిసిల్ల పోయిన పద్మశాలీ కుటుంబాలు 30 ఉన్నాయి. మాదిగ కులానికి చెందిన 30 కుటుంబాలు నగరాలలో సుతారి పనికి పోయి బతుకుతున్నాయి. బొగ్గు బావుల్లో పనిచేసి రిటైర్ అయి వచ్చిన వాళ్లు 6 మంది ఉన్నారు. ఇప్పుడు ఇంకా బొగ్గు బావులకు పోయి పనిచేస్తున్న వాళ్లు 10 మంది ఉన్నారు. హైదారాబాద్‌కు పోయి ఆటోలు నడుపుకుంటున్న వారు ముగ్గురు ఉన్నారు. ఊరి నుంచి టీచరు ఉద్యోగాలలో 20 మంది, విద్యుత్ శాఖలో 10 మంది, బ్యాంకులో 6 మంది, సిఐగా ఒకరు, వ్యవసాయ ప్రభుత్వ అధికారులుగా ఇద్దరు, ప్రైవేట్ వ్యవసాయ అధికారులుగా ఇద్దరు, నర్స్ ట్రైనింగ్ చేసి హైదారాబాద్‌లో పనిచేస్తున్న వాళ్లు ఇద్దరు, రైల్వే ఉద్యోగం ఒకరు, హైదారాబాద్ ప్రైవేట్ హాస్పిటల్, విద్యాసంస్థల్లో ఆరు మంది పనిచేసి బతుకుతున్నారు. విదేశాలకు వెళ్లి ఉద్యోగం చేస్తున్నవారు ఇద్దరు ఉన్నారు. చాకలి కులానికి చెందిన 10 కడపల వారు హైదరాబాద్‌కు పోయి బతుకుతున్నారు. కొందరు నిమ్స్ ఆసుపత్రిలోనూ, కొందరు ఎల్.వి ప్రసాద్ కంటి ఆసుపత్రిలోనూ, కొద్ది మంది ఆటోలు నడుపుకొని బతుకుతున్నారు. వడ్ల కులానికి చెందిన 12 కడపల వారు మంచిర్యాల, అదిలాబాద్, మంథనిలలో కట్టెపని చేసుకొని బతుకుతున్నారు. మంగలి కులానికి చెందిన 2 గడపల వారు మధ్యప్రదేశ్, బీవండిలకు వెళ్లి బతుకు తున్నారు. గౌడ కులానికి చెందిన 2 గడపల వారు కరీంనగర్‌లో జీపులు, కార్లు అమ్మడం కొనడం చేస్తున్నారు. తెనుగు కులానికి చెందిన ఇద్దరు హైదరాబాద్‌లో సెక్యురిటీ గార్డ్‌గా పనిచేస్తున్నారు. ఊరిలోని బాపనాయన కరీంనగర్‌లో పురోహితం చేసుకుంటున్నారు. టెలిఫోన్ డిపార్ట్‌మెంట్‌లో 3 పనిచేస్తున్నారు. గొల్లకులానికి చెందిన 4 కుటుంబాల వారు పాల్వంచ, సింగరేణి, ఇల్లందులలో హమాలీ పనిచేసుకొని బతుకుతున్నారు. కోమటి కులానికి చెందిన మూడు కుటుంబాల వారు హుజురాబాద్‌లో వ్యాపారాలు చేసుకుంటున్నారు. వీరిలో రెండు కుటుంబాల వారు కిరాణ షాపులు నడుపుకుంటున్నారు. మరొకరికి ఫైనాన్స్, ఆయిల్ మిల్, రైస్ మిల్ వ్యాపారాలు ఉన్నాయి. హైదరాబాద్‌లో దళిత కులానికి చెందిన ఒకరు హోమియో వైద్యం చేసి బతుకుతున్నట్లు చెప్పారు. ఈ ఊరిలోని వెలమ భూస్వాముల రెండు కుటుంబాలు భూములు అమ్ముకొని విదేశాల్లో స్థిరపడ్డాయి.

కులవృత్తులు బాగా దెబ్బతిన్నాయి. గౌడ, మంగలి కుల వృత్తులు మాత్రం సాగుతున్నాయి. వ్యవసాయంలో పశువులతో దున్నడం తగ్గిపోతున్న క్రమంలోనే కొయ్య నాగళ్ల అవసరం తగ్గిపోయింది. ఊరి చెరువులో తెనుగు కులస్తులు చేపలు పెంచి కాంట్రాక్టర్లకు అమ్ముతున్నారు. ఇనుప నాగళ్లను మెషన్లతోనే తయారు చేసి అమ్ముతున్నారు. వడ్ల, కమ్మరి వృత్తులు పూర్తిగా దెబ్బతిన్నాయి.

ఈ ఊరిలో ప్రస్తుతం 25 మంది పాలేర్లుగా పనిచేస్తున్నారు. వీరిలో ఒకరు ఎరుకల కులానికి చెందిన వారు, ఇద్దరు దళితులు పక్కనే ఉన్న రత్నగిరి గ్రామం నుంచి వచ్చి పోతున్నారు. 30 ఏళ్ల క్రితం ఈ గ్రామంలో 68 మంది పాలేర్లు ఉండేవారు. ఇప్పుడు పాలేర్లుగా పనిచేస్తున్న వారి సంఖ్య మూడోవంతకు పడిపోయింది. ఆదాయ ప్రత్యామ్నాయాలు ఉండడంతో పాలేరు పనికి రావడం తగ్గింది. పెద్ద పెద్ద భూకమతాల సంఖ్య తగ్గడం, ట్రాక్టర్ల వాడకం పెరగడం, ఎడ్ల సంఖ్య తగ్గడం, భవన నిర్మాణ పనుల్లో అవకాశాలు పెరగడం, కరువు పరిస్థితులు ఉండడం, ఇటీవలి ఉపాధి హామీ పని వంటి కొన్ని కారణాలు కనబడుతున్నాయి. మారుతున్న పరిస్థితుల్లో భాగంగా అన్ని కులాల్లో ముఖ్యంగా దళితుల్లో పిల్లలను చదిచించుకోవాలనే స్పృహ బాగా పెరిగింది.

కూలీ డబ్బు రూపంలోనే చెల్లిస్తున్నారు. మంగలి, వడ్ల, వృత్తులకు సంబంధించి డబ్బు రూపంలోనూ, కొద్దిగా ధాన్యం రూపంలోనూ కూడా కూలీ చెల్లిస్తున్నారు.

**గ్రామ ప్రజలు అప్పులు తీసుకుంటున్న వివిధ మార్గాలు**

1. వెలుగు-ఇందిరా క్రాంతి పథకం (మూడు గ్రామ ఐక్య సంఘాలు ఉన్నాయి. 2. కోఆపరేటివ్ డెవలప్‌మెంట్ ఫెడరేషన్ (ఎన్‌జిఒ)-స్వకృషి 3. హుజురాబాద్‌లోని ఫైనాన్స్ సంస్థల నుండి (భూమి కాగితాలు, ట్రాక్టర్ కాగితాలు కుదువ పెట్టి నూటికి మూడు రూపాయల వడ్డీకి) అప్పు తీసుకుంటున్నారు. 4. బ్యాంకుల నుండి పంట రుణాలు 5. హుజురాబాద్ కోఆపరేటివ్ సొసైటీ నుంచి భూమి కాగితాలపైనా 6. స్నేహితుల నుండి, బంధువుల వద్దనుండి 7. ఎల్ఐసి లోన్లు. 8. మార్గదర్శి-లోడి సంస్థ (క్రిస్టియన్ సంబంధిత ఎన్‌జిఒ) 9.జమ్మికుంట, హుజురాబాద్‌లలోని మైక్రో ఫైనాన్స్ (రేషన్ కార్డులు, బాండులపైనా, మెంబర్‌ల పూచికత్తుతో) 10. కుల చిట్టీలు (ఒకే కులానికి చెందిన వారు బృందాలుగా కట్టుకునే చిట్టీలు) 11. సాధారణ చిట్టీలు 12. గిరిగిరీలు(ఆటోడ్రైవర్లు చిరు వ్యాపారులు హుజురాబాద్‌లో తీసుకునే ఏరోజుకారోజు అప్పులు)

**గ్రామ రాజకీయ ఆర్థిక స్థితి**

ఈ ఊరుకు ఇప్పటి వరకు ఉన్న ఆరుగురు సర్పంచ్‌లలో మొదటి సర్పంచ్‌గా వెనుకబడిన తరగతులకు చెందిన, మేర కులస్తుడు శనిగరపు స్వామి (కాంగ్రెస్ పార్టీ) ఉన్నారు. ఆయన సర్పంచ్‌గా 15 సంవత్సరాలు ఉన్నారు. ఆయనకు 20 ఎకరాలకు పైగా భూమి ఉండేది. తరువాత రెండవ సర్పంచ్‌గా వెనుకబడిన తరగతులకు చెందిన పెరిక కులస్తులు అచ్చ నారాయణ(కాంగ్రెస్ పార్టీ) ఉన్నారు. ఆయనకు 40 ఎకరాల భూమి ఉంది. మూడవ సర్పంచ్‌గా పెరిక కులానికి చెందిన పెట్టెం రాంనారాయణ (తెలుగుదేశం పార్టీ) ఏడు సంవత్సరాల పాటు ఉన్నారు. ఆయనకు 10 ఎకరాల భూమి ఉంది. పెరిక కులానికి చెందిన ముక్కెర రాజమ్మ(తెలుగుదేశం పార్టీ) ఐదేళ్లపాటు (బి.సి. మహిళా రిజర్వేషన్ కారణంగా) నాల్గవ సర్పంచ్‌గా ఉన్నారు. ఆమెకు ఐదు ఎకరాల భూమి ఉంది. ఆమె తరువాత ఐదవ సర్పంచ్‌గా పెరిక కులానికి చెందిన బారత వీరేశలింగం (తెలంగాణ రాష్ట్ర సమితి) ఐదేళ్లపాటు ఉన్నారు. ఆయనకి 10 ఎకరాల భూమి ఉంది. ఆరవ సర్పంచ్‌గా దళిత కులానికి చెందిన గొల్లూరు ప్రవీణ్ కుమార్(తెలంగాణ రాష్ట్ర సమితి) 2006 నుంచి కొనసాగుతున్నారు. ఈయనకు భూమి లేదు. ఖమ్మం నుంచి వచ్చి స్థిరపడినట్లు చెపుతున్నారు. వార్డ్ మెంబర్స్‌గా వెనుకబడిన తరగతులకు చెందిన వారు ఏడుగురు, దళితులకు చెందిన వారు నలుగురు, ఒసికి చెందినవారు ఒకరు ఉన్నారు. ఎంపిటిసిగా పెట్టెం రాంనారాయణ (టిడిపి), జెడ్‌పిటిసిగా కొప్పూరు బిసి (యాదవ) కులానికి చెందిన గద్దె రాజమణి (టిడిపి) ప్రస్తుతం ఉన్నారు. ఈ గ్రామంలో మొదటి నుంచి రాజకీయంగా, ఆర్థికంగా, ఆధిపత్యవర్గంగా పెరిక కులానికి చెందిన వారు ఉన్నారు.

2006లో జరిగిన గ్రామ పంచాయతీ ఎన్నికలకు సర్పంచ్ పదవి ఎస్.సి.కి రిజర్వు అయింది. ఆ అవకాశాన్ని వేరే గ్రామం నుండి వచ్చి ఈ గ్రామంలో బతుకుతున్న దళితుడికి ఇవ్వడం వల్ల గ్రామ దళితులు దీన్ని జీర్ణించుకోలేక పోయారు. తరతరాల నుండి ఈ గ్రామానికి చెందిన దళితులు సేవ చేయగా వేరే గ్రామం నుండి వచ్చి స్థిరపడిన వ్యక్తికి సర్పంచ్ పదవి ఇవ్వడంవల్ల తమకు వచ్చిన అవకాశాన్ని ఆధిపత్య వర్గాలు దక్కకుండా చేశాయని చెప్పారు. ఈ వివాదంతో గ్రామానికి సంబంధించిన చావులు, పెళ్లిళ్లప్పుడు డప్పుకొట్టే సాంప్రదాయ పద్ధతిని దళితులు బహిష్కరిం చారు. ఇప్పుడు ఊరిలో జరిగే తంతులకు పక్క ఊరి బ్యాండ్ మేళాన్ని పిలుచుకుంటున్నారు. ఇందులో గ్రామ కట్టుబాట్లపై దళితులు తిరగబడిన చైతన్యం కనబడుతుంది.

స్థూలంగా అంటరానితనం, కులవివక్ష కొంత తగ్గినట్లు కనబడినా, విప్లవ చైతన్యం ప్రవహించిన ఈ గ్రామంలో దళితులను అణగదొక్కే భూస్వామ్య కుల స్వభావం, ఆధిపత్యం స్పష్టంగా కనబడుతున్నాయి.

**విప్లవోద్యమ ప్రభావం**

గౌరవెల్లి గ్రామంతో పోల్చిచూసినపుడు ఎవరు ఏమి ఇస్తారు అని చూసే పద్ధతి కాక, మాణిక్యాపూర్ ప్రజలలో మేము ఫలానా పని చేయగలం, మాకు ఈ సహకారం కావాలి అనే చొరవ, ఆత్మవిశ్వాసం కనబడ్డాయి. దీనికి నేపథ్యం బలమైన విప్లవోద్యమ ప్రభావమే. భూస్వాముల భూమిని రైతు కూలీ సంఘం నాయకత్వంలో రైతుకూలీలు కొంత ఆక్రమించుకున్నా ఆ తరువాత వచ్చిన తీవ్ర నిర్బంధంతో దాన్ని నిలుపుకోలేకపోయారు. ఆ భూములను తిరిగి భూస్వాములు అమ్ముకొని బయటపడ్డారు. కౌలు ధరలు తగ్గించాలనీ రైతుకూలీ సంఘం నాయకత్వంలో ఉద్యమించి సాధించుకున్నామని చెప్పారు. విప్లవోద్యమం వచ్చాకే భూస్వాములు వెనక్కి తగ్గారని చెప్పారు. దళితులు ఆత్మగౌరవ పోరాటం, తలెత్తుకొని తిరగడం ఉద్యమం వల్లే సాధ్యమైందని చెప్పారు. అరె, తురె అనే అగ్రకుల అహంభావానికి గండి పడింది. ఈ గ్రామంలోకి విప్లవోద్యమం వచ్చి జీతగాళ్ల కాళ్లకు చెప్పులు, ఒంటిపై గొంగడి, జీతాల పెంపు వంటివి సాధించారు. అంతకు ముందు చిన్న చిన్న తగాదాలకు కూడా పోలీస్ స్టేషన్‌ల చుట్టూ తిరిగి వందలాది రూపాయలు నష్టపోయే వారు. ఉద్యమ నాయకత్వంలో తగాదాలను గ్రామంలోనే సమష్టిగా చర్చించుకొని, పరిష్కరించుకోవడం మొదలైంది. దీంతో పెత్తందారీ వర్గాల ఆధిపత్యానికి గండి పడింది. సామాన్య ప్రజలకు ఆత్మవిశ్వాసం పెరిగిందని చెప్పారు. గ్రామంలో దోపిడీ, వెట్టి చాకిరి, ఆధిపత్యం, లంచ గొండితనం ఉద్యమం వల్ల తగ్గుముఖం పట్టాయని చెప్పారు. ఈ ఊరు నుంచి 25 మంది అప్పటి పీపుల్స్‌వార్ పార్టీలోకి వెళ్లి పనిచేశారు. వారిలో నలుగురు పోలీసు కాల్పుల్లో చనిపోయారు.

**గ్రామంలో కులాల వారిగా అప్పు వివరాలు**

| నెం. | కులం | కుటుంబాలు | అప్పు (రు.లక్షలు) |
|---|---|---|---|
| 1 | పెరిక | 77 | 54.33 |
| 2 | గౌడ | 53 | 22.63 |
| 3 | మంగలి | 5 | 1.31 |
| 4 | రెడ్డి | 15 | 3.32 |
| 5 | బ్రాహ్మణ | 1 | 1.25 |
| 6 | బహురూపుల | 2 | 0.3 |
| 7 | మాదిగ | 183 | 67.41 |
| 8 | ఎరుకల | 6 | 0.75 |
| 9 | సిందిమాదిగ | 6 | 2.12 |
| 10 | కోమటి | 4 | 0.35 |
| 11 | తెనుగు | 65 | 23.84 |
| 12 | చాకలి | 32 | 12.64 |
| 13 | పద్మశాలి | 55 | 13.5 |
| 14 | కమ్మరి | 33 | 8.8 |
| 15 | ఔసుల | 8 | 1.46 |
| 16 | గొల్ల | 47 | 16.65 |
| 17 | కురుమ | 2 | 1 |
| 18 | కుమ్మరి | | |
| 19 | వడ్ల | | |
| | **మొత్తం** | **594** | **2,31,66,000** |

సాహు (శనిగరం వెంకటేశ్వర్లు) విప్లవోద్యమంలో కృషిచేయడమే కాకుండా ఆ ఉద్యమాన్ని వివిధ రూపాల్లో రికార్డు చేసే విశిష్టమైన సాహిత్య కృషిని చేశారు. ఆయన అనేక వ్యాసాలు, ఆదివాసుల జీవితంపై రిపోర్టులు రాశారు. అల్లం రాజయ్యతో కలిసి 'కొమురం భీం' నవల రాశారు. ఒకరు (ఒగ్గే చంద్రమౌళి) ప్రస్తుతం నాగ్‌పూర్ జైల్‌లో ఉన్నారు. మిగతావారు ఆరోగ్య సమస్యల వలన, నిర్బంధం వలన, కుటుంబ ఒత్తిడుల వలన, ఇతరత్రా కారణాల వలన ఉద్యమం నుంచి తిరిగి వచ్చారని చెపుతున్నారు. ఒకరు లొంగిపోయి ఉద్యమానికి హాని తలపెడుతున్నారనే కారణంతో పార్టీవాళ్లు చంపేశారని చెప్పారు. ఈ గ్రామ చైతన్యానికి గీటురాయిగా 20 జంటలు కులాంతర వివాహాలు చేసుకున్నవాళ్లు ఉన్నారు. గతంతో పోలిస్తే కుల వివక్ష కొంత తగ్గిందని అన్నారు. వృద్ధులలో మాత్రం ఇప్పటికీ కుల వివక్ష, ఆ భావజాలం ఎక్కువగానే ఉంది. ఉద్యమానికి సానుభూతిపరులు, మిలిటెంట్‌లు అని దాదాపు వంద మందిపై కేసులు పెట్టి చిత్రహింసలకు గురిచేశారు. ఇప్పటికీ నలుగురు కోర్టు వాయిదాలకు వెళుతున్నారు.

**వ్యవసాయేతర ఉపాధి మార్గాలు**

వ్యవసాయేతర ఆదాయ మార్గాలు చూస్తే రెండు పాల సేకరణ కేంద్రాలు ఉన్నాయి. ముల్కనూరు పాల డైరీకి అనుబంధంగా ఈ ఊరిలో ఒక డైరీ ఉంది. ఈ డైరీలో 330 మంది సభ్యులున్నారు. ఉదయం 250 లీటర్లు, సాయంత్రం 150 లీటర్ల పాల సేకరణ జరుగుతోంది. సీజన్‌లో అయితే రోజుకు మొత్తంగా 500 లీటర్ల వరకు పాల సేకరణ జరగుతోంది. అలాగే విజయ డైరీలో 80 మంది సభ్యులున్నారు. బర్రెల నుంచి ఉదయం 10 లీటర్లు, సాయంత్రం 15 లీటర్లు పాల సేకరణ జరుగుతోంది. ఆవుల నుంచి ఉదయం 80 లీటర్లు. సాయంత్రం 160 లీటర్ల పాల సేకరణ జరుగుతోంది. గేదె పాల ధర లీటరుకు వెన్న శాతాన్ని బట్టి లీటరుకు రు. 20 నుండి 55 వరకు, ఆవు పాలకు 16 నుంచి 22 రుపాయల వరకు చెల్లిస్తున్నట్లు చెప్పారు.

ఊరిలో ఎనభై మందికి పైగా ఎడ్ల బేరం చేస్తున్నారు. ఒక ఎద్దుకు రెండు వందల రుపాయల నుంచి వేయి రుపాయల దాకా మిగులవచ్చని చెప్తున్నారు. 1990 తరువాత వరుస కరువు పరిస్థితుల్లో ఈ ఆదాయ మార్గాన్ని చాలా మంది వెతుకున్నట్లు చెప్పారు. ఈ పశువుల బేరంలోని లాభ నష్టాలు, సాధక బాధకాలు ఇంకా అధ్యయనం చేయాల్సి ఉంది.

**పశుసంపద వివరాలు :** ఆవులు-(ఎ) సంకర జాతి-119; (బి) దేశీయ-68; ఎడ్లు-397; దూడలు-ఒక సంవత్సరం దాటినవి సంకర జాతి-118; దేశీయ-46; ఒకటి నుండి మూడు సంవత్సరాల మధ్య సంకర జాతి-26; దేశీయ-13; బర్రెలు పాలిచ్చేవి ముర్ర జాతి గేదెలు-46; దేశీయ-105. ఒక సంవత్సరం దాటిన దుడ్డెలు సంకర జాతి-44; దేశీయ-53. రెండు నుంచి మూడు సంవత్సరాల దుడ్డెలు సంకర జాతి-14; దేశీయ-23. గొర్రెలు-540; మేకలు-250; పందులు-58; పారంకోళ్లు-159; దేశవాళి-2345; గిరిరాజా (గుడ్లకోసం)-1052; వనరాజ (గుడ్లకోసం)-159.

ఈ గ్రామంలో బీడీ కంపెనీ యూనిట్ 15 మంది మహిళలతో 1994లో ప్రారంభమైంది. ఇప్పుడు అందులో 56 మంది మహిళా బీడీ కార్మికులున్నారు. వీరిలో ఎక్కువ మంది పద్మశాలీలు. తరువాత స్థానంలో గౌడ, పెరిక కులానికి చెందిన వారు ఉన్నారు. 20 ఏళ్లు దాటిన వారినే ఈ పనిలోకి తీసుకుంటారని చెప్పారు. వెయ్యి బీడీలు తయారుచేస్తే రు. 84.90 వస్తాయి. రోజుకు సరాసరిన 750 నుంచి 1000 వరకు బీడీలు చేస్తామన్నారు. ప్రతి ఆదివారం సెలవు ఉంటుంది. పి.ఎఫ్ కోసం నెలకు రు. 79 కట్ చేస్తున్నారు. పొగాకు అందడం లేటయితేనే పని ఉండదు. వైద్యంకోసం వరంగల్, కరీంనగర్ ఆసుపత్రులకు వెళతారు. ఈ బీడీ యూనిట్ ఏజెంట్ హన్మకొండలో ఉంటాడని అతనికి ఇటువంటివి 13 యూనిట్లు ఉన్నాయని చెప్పారు. బీడీలు చేస్తున్నవారికి రిటైర్‌మెంట్ 52 సంవత్సరాలకు ఉంటుంది. ఇరవై ఏళ్లకు పైగా పనిచేసిన కొంత మంది మహిళలు నెలకు రు. 950 పింఛన్ అందుకుంటున్నట్లు

చెప్పారు. పింఛన్‌దారు చనిపోయిన సందర్భంలో ఈ పింఛన్ భర్తకు లేదా పిల్లలకు మైనారిటీ తీరే వరకు ఇస్తారు.

ఊరిలో 21 మంది (పెరిక-1, గొల్ల-2, కుమ్మరి-1, పద్మశాలి-3, గౌడ-5, వడ్ల-1, మాదిగ-6, కమ్మరి-1, తెనుగు-3, చాకలి-1, కులాలకు చెందిన) ప్యాసింజర్ ఆటోలు, ముగ్గురు ట్రాలీ ఆటోలు నడుపుకొని బతుకుతున్నారు. ఇలా వేరు వేరు కులాల నేపథ్యం ఉన్న వీరంతా తమ కులవృత్తులకు భిన్నమైన జీవనోపాధితో బతుకుతున్నారు.

ఊరిలో ఒక పెరిక కులస్తునికి రెండు డిసిఎం వ్యాన్‌లు ఉన్నాయి. ఆ వ్యాన్‌లను ఎడ్ల బేరానికి, పెళ్లిళ్లకు ఉపయోగిస్తున్నట్లు చెప్పారు. ఊరిలో రెడ్డికులస్తునికి రెండు స్కూలు వ్యాన్‌లు ఉన్నాయి. ఒక పద్మశాలి కులస్తునికి ఒక వ్యాన్ ఉంది.

**వలసలు :** గౌరవెల్లి గ్రామంతో పోలిస్తే ఈ గ్రామంలో వలసలు నామమాత్రంగా ఉన్నాయి. కరువు పరిస్థితులని ఎదుర్కొనే క్రమంలో గ్రామ ప్రజలు తమవయిన పద్ధతులు, ప్రత్యామ్నాయ మార్గాల అన్వేషణ ఈ గ్రామంలో బాగా ఉంది. విప్లవోద్యమ ప్రభావంపై చాలా గౌరవం ఉంది. గౌరవెల్లిలా కాకుండా సూటిగా స్పష్టంగా విప్లవోద్యమం గురించి ధైర్యంగా మాట్లాడుతున్నారు. విప్లవోద్యమ చైతన్యంతో తమకు తాము తమ కాళ్లపై తాము నిలబడి పరిస్థితుల్ని ఎదుర్కోవచ్చనే తత్వం ఉంది. బ్యాంక్‌ల నుంచి సరయిన సహకారం లేకున్నా తమంతట తాము ఒక స్వచ్ఛంద సంస్థ సహకారాన్ని తీసుకొని పురుషుల, స్త్రీల పొదుపు సంఘాలను ఏర్పాటు చేసుకున్నారు. పాడి బర్రెలను, ఆవులను పెంచి పాలు అమ్ముకుంటు న్నారు. ఇలా అవకాశాల్ని సృష్టించుకొని పలు ఆలోచనలు చేయడం మనకు కనబడుతుంది. మేం సర్వేకు పోయినపుడు గౌరవెల్లి లాగా మాణిక్యాపూర్‌లోనూ మీరేమైనా ఇస్తారా, మాకు ఏమైనా చేస్తారా అనే ప్రశ్నలు ఉన్నా అవి ఉన్నస్థితిని మెరుగుపరుచుకోవడానికి, అందిపుచ్చుకోవడానికి అనే ధోరణిగా కనబడింది. మొత్తంగానే ప్రభుత్వం ప్రజలను ఒక ఉత్పత్తి శక్తిగా కాకుండా లబ్ధిదారులుగా మార్చిన ప్రక్రియలో భాగంగా వచ్చిన మార్పుగా మనకు కనబడుతోంది..

**ఆర్థిక అవసరాలు :** ఆర్థిక అవసరాలు తీర్చుకోవడానికి ఈ గ్రామంలో మూడు మహిళా పొదుపు సంఘాలు ఏర్పాటు చేసుకున్నారు. 1) భారతనారి గ్రామ మహిళా ఐక్య సంఘం 1995లో ప్రారంభమై 2010 నాటికి 16 గ్రూపులను ఏర్పాటు చేసింది. ఇందులో 233 మంది బిసి. ఒసి, ఎస్.టి కులాలకు చెందిన సభ్యులున్నారు. ప్రధానంగా బిసిలకు చెందిన వారే అధికంగా ఉన్నారు. ఇప్పటి వరకు 14 గ్రూపుల మీద తీసుకున్న అప్పు రు.11 లక్షలు. ఇందులో రెండు గ్రూపులు కొత్తవి కావడం వల్ల అప్పు ఇంకా అందలేదు. 2) విజయ దుర్గ గ్రామ ఐక్య సంఘం 1999లో ప్రారంభమై 2010 నాటికి 15 గ్రూపులకు చేరుకుంది. ఇందులో మొత్తం సభ్యుల సంఖ్య 178 ఉంది. ఇందులో ముగ్గురు తప్ప దాదాపుగా అందరూ మాదిగ కులస్తులు ఉన్నారు. ఈ సంఘంలో ఏడు గ్రూపుల పేరిట 60 లక్షల రూపాయల అప్పు ఉంది. ఐదు గ్రూపులు ఇది వరకు తీసుకున్న అప్పును తీర్చాయి. కొత్తగా ఏర్పడిన మూడు గ్రూపులకు ఇంకా అప్పు ఇవ్వలేదు. 3) సంతోషిని గ్రామ మహిళా ఐక్య సంఘం 1999లో ప్రారంభమై 2010 నాటికి 27 గ్రూపులు అయ్యాయి. ఇందులో 372 మంది సభ్యులున్నారు. ఇందులో బి.సి, ఒ.సి, ఎస్.టి కులాలకు చెందిన సభ్యులున్నారు. ప్రధానంగా బిసిలకు చెందిన వారే అధికంగా ఉన్నారు. ఇప్పటి వరకు 24 గ్రూపుల మీద తీసుకున్న అప్పు **24.5 లక్షల రూపాయలు**. మిగతా మూడు గ్రూపులు గతంలో తీసుకున్న అప్పును తీర్చాయి. ఇప్పుడు వాటి పేర్ల మీద అప్పు ఏమీ లేదు.

గ్రూపులలోని ప్రతి సభ్యురాలు నెలకు రు.55 ఆయా గ్రూపులో జమచేస్తున్నారు. ప్రతి నెలకు గ్రూపుల వారిగా మండల సమాఖ్యలో రు.100 జమచేస్తున్నారు. దీనితో పాటు తమ అప్పు కిస్తీని చెల్లిస్తారు. ఈ మూడు సంఘాల కింద ఉన్న 59 గ్రూపుల మొత్తం అప్పు **రు. 95.5 లక్షలు** ఉంది.

ఊరిలో మహిళా స్వకృషి పొదుపు సంఘం ఒకటి 2000 సంవత్సరంలో

*ఈ ఊరిలో యు.పి.ఎస్ స్కూల్‌ను 1982లో హైస్కూల్‌గా చేశారు. వైశ్యాబ్యాంక్, శాతవాహన బ్యాంకుల నుంచి అప్పులు తెచ్చుకునేవారు. అంతకు ముందు సర్పంచ్ నిర్వాకంతో బ్యాంకు అప్పులు కట్టక బ్యాంక్‌వాళ్లు మాణిక్యాపూర్‌ను బ్లాక్ లిస్ట్‌చేశారు. మళ్లీ సక్రమంగా కట్టి బ్యాంక్ సేవలను పునరుద్ధరించుకున్నారు. ఊరిలో మంచి నీళ్ల పథకాన్ని హైదరాబాద్ తిరిగి సాధించుకున్నారు. 70 మందికి పాడి ఆవులు అందాయి. 15 మంది రజక సంఘ సభ్యులకు ఇస్త్రీ పెట్టెలు అందాయి. గొల్లకురుమ సంఘం ఏర్పాటు చేసుకొని 20 మందిదాక గొర్రెలు ప్రభుత్వ పథకం ద్వారా పొందారు. గొల్ల, కురుమ, చాకలి వారు అప్పులు తీసుకొని తిరిగి కట్టారు. రోడ్లు వేయించుకున్నారు. 1983 నుంచి 2 రూపాయలకు కిలో బియ్యం పథకం వచ్చింది. పశువుల ఆసుపత్రి 1995లో వచ్చింది. ఆరోగ్యం కోసం హుజురాబాద్, వంగర ఆసుపత్రులకు పోతారు. జాతీయ గ్రామీణ ఉపాధి హామి పథకం పనిచేసే తత్వాన్ని చెడగొడుతోంది. ఈ పథకాన్ని వ్యవసాయానికి వర్తింపచేయాలి. గతంలో గిద్దెడు (8 కుంచాలు) వడ్లు అమ్మితే అమ్మోనియా బస్తా వచ్చేది. ఇప్పుడు గిద్దెడు వడ్ల రేటు అట్లనే ఉంది, అమ్మోనియా బస్తా ధర మాత్రం రు. 1200 అయింది. రైతుకు వ్యవసాయం కష్టమయిపోతోంది. ఇవి ప్రభుత్వ పథకాలే అయినా ప్రజల చొరవ, సహకారంతో సాధించుకున్నాం.*

***– పెట్టెం రాంనారాయణ (ఎంపిటిసి)***

ఏర్పాటు చేసుకున్నారు. అందులో 700 మంది సభ్యులున్నారు. డిసెంబర్ 2010 నాటికి సభ్యులు తీసుకున్న మొత్తం అప్పు **రు. 23 లక్షలు**. సభ్యులు తీసుకున్న అప్పుపై సంవత్సరానికి 12 శాతం వడ్డీ చెల్లిస్తున్నారు. పురుషుల పొదుపు సంఘం 70 మంది సభ్యులతో 2000లో ప్రారంభమైంది. ఇప్పుడు 540 మంది సభ్యులున్నారు. పురుషుల పొదుపు సంఘం నుంచి **35 లక్షల** రూపాయల అప్పు తీసుకున్నట్లు చెప్పారు. బ్యాంక్ ద్వారా 149 మంది రైతులకు పంట రుణాల కింద అందిన అప్పు మొత్తం **రు.25 లక్షలు**. దీర్ఘకాల రుణాల కింద కొత్త బావులు తవ్వడానికి, మోటర్లు కొనడానికి, పైప్ లైన్లు వేసుకోవడానికి, ట్రాక్టర్లు, హార్‌వెస్టర్లు కొనడానికి తీసుకున్న అప్పు **రు.14 లక్షలు**. ఈ అప్పు 10 మంది మీద ఉందని చెప్పారు.

**మత విశ్వాసాలు :** ఊరిలో ఆంజనేయస్వామి, పోచమ్మ, ఎల్లమ్మ, కనకదుర్గమ్మలకు మొక్కడం పూర్వీకుల నుంచి ఉందన్నారు. సంవత్సరానికి ఒకసారి ఎల్లమ్మ బోనాలు చేసి కోళ్లు, మేకలను కోసి మొక్కులు చెల్లిస్తారు. 1995 నుంచి మాదిగ కులస్తుల్లో కొద్ది మంది క్రిస్టియన్ మతం నమ్ముతున్నట్లు చెప్పారు. ఒక చర్చి కూడా ఊర్లో ఉంది.

**ఆరోగ్యం :** ఊరిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఉంది కాని డాక్టరు లేరు. ఊరిలో ఆరుగురు రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టిషనర్ (ఆర్ఎంపి)లు ఉన్నారు. ఊరిలో పశువైద్యశాల ఉంది.

**తాగు నీరు-సాగు నీరు :** ఇంటి అవసరానికి కరెంట్ కనెక్షన్‌లు 434 పాతవి ఉన్నాయి. కొత్తవి 30 వచ్చాయి. ఇంకా 35 కనెక్షన్‌లు రానున్నట్లు చెప్పారు. ఊరిలో కొన్ని ఇండ్లకు కరెంట్ లేదు. ఇంటికి వాడుతున్న కరెంట్ బిల్లులు రెండు నెలలకు ఒక సారి తక్కువలో తక్కువ రు. 135, ఎక్కువలో ఎక్కువ రు. 350 చెల్లిస్తున్నట్లు చెప్పారు. ఊరిలో దాదాపు చాలా మందికి టివిలు ఉన్నాయి. దాదాపు 25 శాతం మందికైనా ఇస్త్రీ పెట్టెలు ఉన్నాయి. పిండీ, కారం రుబ్బుకునే మిక్సీలు కూడా కొద్ది మందికి ఉన్నాయని చెప్పారు.

ఊరిలో 652 కుటుంబాలకు గాను 560 నీటి సరఫరాకు నల్లా కనెక్షన్‌లు ఉన్నాయని గ్రామ కార్యదర్శి చెప్పారు. నెలకు రు.10 చొప్పున నల్లా బిల్లు కడుతున్నారని చెప్పారు. ఇవి కాక రు. 2.8 లక్షలతో బాల వికాస మంచి నీటి ప్లాంట్‌ను ఊరిలో నిర్మించుకున్నారు. ఈ ప్లాంట్ ద్వారా రోజుకు 150

**మాణిక్యాపూర్ గ్రామంలో 1982 నుంచి 2012కు వచ్చిన మార్పులు**

| అంశం | 1982 | 2012 |
|---|---|---|
| కుటుంబాలు | 409 | 648 |
| రెండెకరాలలోపు భూమి కుటుంబాలు | 280 | 307 |
| మధ్య తరగతి రైతులు | 43 | 319 |
| ధనిక రైతులు | 25 | 16 |
| భూస్వాములు | 24 | 10 |
| చేతివృత్తుల వారు | 15 | 8 |
| వ్యాపారస్తులు | 12 | 25 |
| ఉద్యోగస్తులు | 10 | 60 |
| పాలేర్లు | 68 | 25 |
| ఎడ్లు | 479 | |
| ఎడ్ల బండ్లు | 71 | 25 |
| ట్రాక్టర్లు | – | 30 |
| ఆయిల్ ఇంజన్లు వగైరా | 73 | – |
| నగదు | రు.6.85 లక్షలు | – |
| అప్పు | రు.8.7 లక్షలు | రు.3 కోట్లు |
| **విద్య** | | |
| ఎలిమెంటరీ విద్యార్థులు | 162 | 294 |
| హైస్కూల్ విద్యార్థులు | 38 | 254 |
| ఇంటర్ విద్యార్థులు | 18 | 88 |
| డిగ్రీ విద్యార్థులు | – | 71 |
| పి.జి విద్యార్థులు | – | 57 |
| వ్యవసాయానికి కరెంట్ మోటార్లు | – | 366 |
| బోర్లు | – | 10 |
| ఆటోలు | – | 30 |
| వ్యాన్లు | – | 2 |
| మోటర్ సైకిల్లు | – | 300 |
| హార్వెస్టర్ | – | 1 |
| పాల డైరీ | – | 2 |
| మంచి నీటి ప్లాంట్ | – | 1 |
| కల్లు | ఉంది | ఉంది |
| బెల్ట్ షాపులు | లేవు | 6 |
| పంటలు | వరి, మక్క జొన్న, కంది, పల్లి, పెసర, బబ్బెర, నువ్వులు | పత్తి 50 % వరి 30 % మక్క 10 % ఇతరాలు 10% |

డబ్బాల (20 లీటర్ల డబ్బా) మంచి నీరు ఫిల్టర్ చేస్తున్నారు. ఈ మంచి నీళ్ల ప్లాంట్‌లో 475 మందికి సభ్యత్వం ఉంది. సభ్యత్వ రుసుం 300 రుపాయలు. ఈ మంచి నీళ్ల ప్లాంట్ కమిటీలో 11 మంది సభ్యులుగా ఉన్నారు. ఈ ఊరిలో 1985లో వాటర్ షెడ్ స్కీమ్ వచ్చింది.

**విద్య :** 1950 నుంచి ప్రాథమిక పాఠశాల ఉన్నట్లు ప్రస్తుత ప్రధాన ఉపాధ్యాయులు చెప్పారు. 1985లో దీన్ని హైస్కూల్‌గా చేశారు. అదే ఆవరణలో ఇప్పుడు ప్రాథమిక పాఠశాల, జడ్.పి. ఉన్నత పాఠశాలలు కొనసాగుతున్నాయి. ఉన్నత పాఠశాలలో 63 మంది బాలురు, 91 మంది బాలికలు చదువుతున్నట్లు చెప్పారు. ప్రాథమిక పాఠశాలలో 24 మంది బాలురు, 29 మంది బాలికలు చదువుతున్నట్లు చెప్పారు. ఈ పాఠశాలల్లో 2008 నుంచి మధ్యాహ్న భోజన పథకం ప్రారంభమయిందని చెప్పారు. ఈ స్కూల్లో ప్రధాన ఉపాధ్యాయునితో కలిపి ఎనిమిది మంది టీచర్లు ఉన్నారు. జడ్.పి.ఎచ్. పాఠశాల ఉంది. ఈ ఏడాది ఒకటి నుంచి ఐదు తరగతుల మధ్య 16 మంది బాలురు, 25 మంది బాలికలు చదువుకుంటున్నారు. ఈ ఏడాది నుంచి పిల్లలకు పాఠశాల యూనిఫాంలు ఇస్తున్నారు. ఈ పాఠశాలకు ప్రధానోపాధ్యాయురాలుతో పాటు ఒక ఉపాధ్యాయుడు ఉన్నాడు.

ఎస్.సి కాలనీలో ఒకటి నుంచి ఏడవ తరగతి వరకు ప్రాథమికోన్నత పాఠశాల ఉంది. ఈ పాఠశాలలో 24 మంది బాలురు, 17 మంది బాలికలు చదువుకుంటున్నారని చెప్పారు. ఈ పాఠశాలలో మొత్తం ఆరుగురు టీచర్లు పనిచేస్తున్నారు. ఈ అన్ని పాఠశాలల ఉపాధ్యాయులు రోజూ హన్మకొండ, హుజురాబాద్, ముల్కనూర్ ఇలా చుట్టుపక్కల జిల్లా, మండల కేంద్రాల నుంచి వచ్చిపోతున్నారు. మధ్యాహ్న భోజన పథకం కింద గౌడ, తెనుగు, రజక, దళిత కులాలకు చెందిన మహిళలు వంట చేస్తున్నారు.

ఈ ఊరి నుంచి దాదాపు 300 మందికి పైగా పిల్లలు హుజురాబాద్‌లోని ప్రైవేట్ పాఠశాలలకు పోయి చదువుకుంటున్నారు. పిల్లలను తీసుకెళ్లి తీసుకరావడం కోసం దాదాపు పది వ్యాన్లు తిరుగుతున్నాయి. ఒకటి నుంచి ఐదు తరగతులకు నెలకు ఫీజు రు. 300, 6 నుండి 8 తరగతులకు నెలకు రు. 400, 9వ తరగతికి నెలకు రు. 450, 10వ తరగతికి నెలకు రు. 500 ఫీజు వసూలు చేస్తున్నట్లు చెప్పారు. ఒక విద్యార్థికి వ్యాన్‌కు నెలకు రు. 250 చెల్లిస్తున్నారు.

ఈ ఊరు నుంచి 71 మంది డిగ్రీ, 57 మంది పిజీలు పూర్తి చేసిన యువత ఉన్నారు. దళితుల్లో కూడా ఎక్కువ సంఖ్యలో చదుకుంటున్నారు. దళితుల్లో పి.జి. 12, డిగ్రీ 37, ఇంటర్ 18, ఎస్.ఎస్.సి. 76 మంది పూర్తిచేశారు. 30 ఏళ్ల క్రితంతో పోలిస్తే చదువుల విషయంలో ఈ మార్పు చాలా పెద్దది.

**గ్రామంలో అమలవుతున్న ప్రభుత్వ పథకాలు**

**రేషన్ కార్డులు :** ఊరిలో తెల్ల రేషన్ కార్డులు–711; ఎఎవై కార్డులు–80; ఎపి–1; గులాబి కార్డులు–50 ఉన్నట్లు రేషన్ డీలర్ చెప్పారు. నెలకు బియ్యం–128.24 క్వింటాళ్లు; చక్కర–3.96 క్వింటాళ్లు; కిరోసిన్–1498 లీటర్లు సరఫరా చేస్తున్నట్లు డీలర్ చెప్పారు. మనిషికి నాలుగు కిలోల చొప్పున తెల్ల కార్డుపై అత్యధికంగా కుటుంబానికి 20 కిలోల వరకు బియ్యం, అంత్యోదయ పథకం కింద కార్డుకు 35 కిలోల బియ్యం ఇస్తున్నట్లు చెప్పారు.

**పింఛన్‌లు : వృద్ధాప్య** పింఛన్‌లు–నెలకు రు.200 చొప్పున 163 మందికి, **చేనేత** కార్మికులకు రు.500 చొప్పున 29 మందికి, **వితంతువులకు** రు.500 చొప్పున 56 మందికి, **వికలాంగులకు** రు.500 చొప్పున 70 మందికి, **గీత కార్మికులకు** రు. 200 చొప్పున 5 మందికి, **అభయ హస్తం** కింద రు. 500 చొప్పున 50 మందికి అందుతున్నాయి.

ఈ గ్రామంలో పోస్టు ఆఫీసు ఉంది. భీమదేవరపల్లి ఎస్ఒ కింద మాణిక్యాపూర్ బ్రాంచ్ ఆఫీసుగా పనిచేస్తోంది. హెడ్ పోస్టు ఆఫీసు హుజురాబాద్ కాగా, డివిజన్ ఆఫీసు పెద్దపల్లి అని చెప్పారు. పోస్టాఫీసులో 1170 గ్రామీణ ఉపాధి హామీ పథకపు ఖాతాలు ఉన్నాయి. ప్రతి నెల రు. 25000 డిపాజిట్ చేస్తారని పోస్ట్ మాస్టర్ తెలిపారు. రికరింగ్ డిపాజిట్ కింద 250 ఖాతాలు ఉన్నాయి. ప్రతి నెల ఈ ఖాతాల్లో రు.40 వేల నుంచి 50 వేల వరకు జమ చేస్తారని చెప్పారు. ఉత్తరాల పని తగ్గిపోయిందని, ఉపాధి హామీ పనులు, ఇన్సురెన్స్ కాగితాల బట్వాడ పెరిగాయని చెప్పారు.

**జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం :** జాతీయ గ్రామీణ ఉపాధి హామి పథకం ఫీల్డ్ అసిస్టెంట్‌తో మాట్లాడగా ఊరిలో 650 జాబ్ కార్డ్స్ ఉన్నాయన్నారు. వీటిలో 400 జాబ్ కార్డ్స్‌కు చెందిన వారు పనికల్పించినపుడల్లా క్రమం తప్పకుండా వస్తున్నట్లు చెప్పారు. ఇటీవల ప్రతి 20 మందిని కలిసి ఒక గ్రూప్‌గా చేశారు. వాటిని శ్రమశక్తి సంఘాలు అంటున్నారు. గ్రామంలో ఈ పథకం 2005లో మొదలయినపుడు 15 కుటుంబాలవారు పాల్గొనగా 2006–2008 మధ్య 60 కుటుంబాలదాకా

100 రోజుల పనిలో పాల్గొన్నాయి. 2009లో రు.16 లక్షలు విలువచేసే పనులు, 2010లో రు. 28 లక్షలు విలువచేసే పనులు జరిగినట్లు ఫీల్డ్ అసిస్టెంట్ చెప్పారు. 2010 లో పొలాలకు చెరువు మట్టి ఎకరానికి 20 ట్రాక్టర్‌లోడ్‌ల చొప్పున పోశారు. ఉపాధిహామీ పనిలో ఎండకాలం చేసే పనికి 30 శాతం అదనంగా ఆదాయం వస్తుందని ఫీల్డ్ అసిస్టెంట్ చెప్పారు. ఊరిలో ఇటీవల మూడు కొత్త బావులు తవ్వారని చెప్పారు. ఉపాధిహామీ పని కింద ఎనిమిది గజాల లోతు వరకు తవ్వడానికి అనుమతి ఉందని చెప్పారు. 8 మీటర్ల వ్యాసంతో ఈ బావులు తవ్వుతారన్నారు. ఉపాధిహామీ పని కింద చెరువు పూడికతీత పనులు చేస్తున్నట్లు చెప్పారు. ఈ పనికి రెడ్డి, కోమటి, బాపన కులాలకు చెందిన వాళ్లు రావడంలేదన్నారు. రకరకాల అవసరాల రీత్యా జాబ్ కార్డులు రెడ్డి కులస్తులు కూడా తీసుకున్నారని చెప్పారు. ఫీల్డ్ అసిస్టెంట్‌కు మొదటి మూడేండ్లు నెలకు రు. 1200 చొప్పున తరువాత రు. 2200 చొప్పున మే 2011 నుంచి రు. 3600 చొప్పున జీతం ఇస్తున్నట్లు చెప్పారు.

**కల్లు, మద్యం :** ఊరిలో గౌడ (2). తెనుగు(1), పద్మశాలి(2), కురుమ(1), కులస్తులకు చెందిన బెల్ట్ షాపులు ఆరు ఉన్నాయి. ఒక్కొక్క బెల్ట్ షాపులో రోజుకు 10 నుంచి 12 వేల రూపాయల వరకు బీరు, బ్రాండీల అమ్మకాలు జరుగుతాయని చెప్పారు. పండగలప్పుడూ, పెళ్లిళ్లప్పుడూ, చావులప్పుడూ రోజుకు ఒక లక్ష రూపాయల వరకు బీరు, బ్రాండీలు అమ్ముడుపోతాయని చెప్పారు. ఊరిలో యువత, మహిళలు కూడా మద్యం తాగుతున్నారని చెప్పారు. ఊరిలో గుడుంబా, కల్లు అమ్మకాలు కూడా జరుగుతాయని చెప్పారు. గౌడ కులస్తుల కుటుంబాలు 70 వరకు ఉన్నాయని చెప్పారు. గౌండ్ల చీరికలు 60 ఉన్నాయి. ఒక్కొక్క చీరికకు 5 తాటి చెట్లు వస్తున్నాయి. 40 కుటుంబాల వారు ఇప్పుడు చెట్లు ఎక్కడంలేదు.

**శ్రమ సంబంధాలు :** ఊరిలో అత్యధిక జనాభా ప్రధానంగా వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నారు. 30 ఏళ్ల క్రితం 50 నుండి 100 ఎకరాలకు పైగా భూమి కలిగిన భూస్వాములుండేవారు. ఇప్పుడు భూస్వాములు లేరు. మారిన పరిస్థితులు, వచ్చిన కొత్త అవకాశాలు, కుటుంబాల సంఖ్య పెరగడం వంటి కారణాలు భూమి పరిమాణంలో మార్పులకు కొంత కారణంగా చెప్పవచ్చు. ఇప్పుడు మారిన భూ సంబంధాల్లో భూస్వాముల నుంచి భూమిని మధ్య తరగతి రైతులు ఎక్కువ భాగం, చాలా తక్కువ స్థాయిలో పేద రైతులకు, భూమి లేనివారికి బదిలీ అయింది. ఇదే కాలంలో కరువు పరిస్థితులు తోడవడంతో, వ్యవసాయంలో యాంత్రీకరణ పెరగడంతో వ్యవసాయంలో రైతు కూలీల శ్రమకు అవకాశాలు తగ్గాయి. ఊరిలో పనులు సరిగా లేక చుట్టు పక్కల గ్రామాలకు కూలికి పోతున్నారు. వలసలు పెరిగాయి. ప్రత్యామ్నాయ ఉపాధి వెతుకులాట పెరిగింది. ఒకప్పుడు అరవై ఎనిమిది మంది పాలేర్లు/జీతగాళ్లు ఈ గ్రామంలో ఉండేవారు. ఇప్పుడు 25 మంది ఉన్నారు. ఒక్కొక్క పాలేరుకు సంవత్సరానికి పది వేల నుంచి ఇరవై ఐదు వేల రూపాయల వరకు జీతం ఇస్తున్నట్లు తెలుస్తోంది. ఎవరూ జీతగాళ్లుగా పనిచేయడానికి సిద్ధంగా లేరని, ముందుకు రావడం లేదని అన్నారు. మొత్తంగా వ్యవసాయం మీద పనిదినాల సంఖ్య తగ్గిపోయింది.

పెళ్లిళ్లకూ, చావులకూ, పండగలకూ తప్ప ఇంట్లో కుండల వాడకం లేదు. ఆ కొద్ది అవసరాలకు పక్కనున్న రత్నగిరి నుంచి తెచ్చుకుంటున్నారు. పద్మశాలీల పరిస్థితి చాలా దుర్భరంగా ఉంది. మగ్గాలపై బతికే అవకాశం లేక మగ్గాలు అటకెక్కాయి. ఉపాధి కోసం భీవాండి, సూరత్ వెళ్లి తిరిగి వచ్చారు. ఇప్పుడు కొద్ది మంది సిరిసిల్లలో హ్యాండ్లూమ్స్‌పై పనిచేస్తున్నారు.

కులం అనేది ఆచార వ్యవహారాల్లోనూ, కట్టుబాట్లలోనూ, పెళ్లిళ్ల లోనూ, కుల పంచాయతీల్లోనూ, చనిపోయినపుడు అంత్య క్రియల్లోనూ ఎక్కువగా ఉంది. ఉత్పత్తిలో కులం పాత్ర తగ్గిపోవడం కనిపిస్తోంది. కేవలం కుల వృత్తి మీద ఆధారపడి బతికే పరిస్థితి లేదు. అన్ని కులాల వాళ్లు దాదాపు అంతో ఇంతో భూమి కొని వ్యవసాయంపైననే ఆధారపడుతున్నారు. పాత తరం వారు అంటరానితనం పాటిస్తున్నారని, ఇప్పటి తరంలో అంటు ముట్టులు గతంతో పోలిస్తే కొంత వరకు తగ్గిపోయాయని దళితులు పేర్కొన్నారు.

*ప్రశ్నించే చైతన్యం విప్లవోద్యమం వల్లే పెరిగింది. వాళ్లు లేకపోతే పెత్తందార్ల ఆధిపత్యం కింద నలిగిపోతాము. వాళ్లే సామాన్యులను ముందుకు నడిపారు. ఇప్పటికీ అంతటా భూస్వాముల, పెత్తందారుల ఆధిపత్యమే కొనసాగుతోంది. అవినీతి పెరిగిపోయింది. ముల్కనూరు బ్యాంకులో అప్పు కావాలంటే పెత్తందారుల సిఫారసు లేకుండా పనులు జరుగడంలేదు. ఇప్పటికీ వందల ఎకరాల భూమిపై అదుపు కలిగిన భూస్వాములున్నారు. బస్వాపూర్‌లో ముగ్గురు బ్రాహ్మణ దొరలకు ఒక్కొక్కరికి 500 ఎకరాలపైనా భూమి ఉంది. మెదక్ జిల్లా బద్దిపడగలో రెడ్డికులానికి చెందిన నలుగురు అన్నదమ్ములకు ఒక్కొక్కరికి 200 ఎకరాల చొప్పున భూమి ఉంది. కోహెడలో ఒక రెడ్డి కులస్తునికి 200 ఎకరాలకు పైగా భూమి ఉంది. వంగరలో నలుగురు బ్రాహ్మణ దొరలకు 200 ఎకరాల చొప్పున భూమి ఉంది. అక్కన్నపేటలో వెలమ దొరకు 100 ఎకరాల భూమి ఉంది. గట్ల నర్సింగాపూర్‌లో ముగ్గురు వెలుమ దొరలకు మనిషికి 500 ఎకరాల చొప్పున భూమి ఉంది. తాటికాయలలో రెడ్డి కులానికి చెందిన నలుగురికి 500 ఎకరాల చొప్పున భూమి ఉంది. వారి భూమిని తెనుగోళ్లు, లంబాడీలు కౌలుకు సాగుచేస్తున్నారు. వారు విదేశాల్లో ఉంటున్నారు. విప్లవోద్యమం వల్లే ఈ గ్రామంలో ప్రజల చైతన్యం పెరిగింది. కరువు పరిస్థితుల్లో కూడా బతికే తెలివి పెంచుకున్నారు. ఏడు ఎనిమిది సంవత్సరాల కరువులో కూడా పోరాడి నిలుచున్నారు.*

***– ఒక దళిత రైతు***

**మార్పులు :** ముప్పై ఏళ్ల కిందటికి ఇప్పటికి పోల్చి చూస్తే సామాన్యుల నుంచి పై స్థాయి వరకు చాలా కొత్త ఖర్చులు వచ్చిచేరాయి. రాబడితో సంబంధం లేకుండా ఖర్చు మాత్రం పెరుగుతూ పోతోంది. ఆరోగ్యం, విద్య, పండుగలు, జాతర్లు, పుట్టుక, పెళ్లిళ్లు, చావులు, అలవాట్లు అన్నిటా ఖర్చు బాగా పెరిగింది. గతంలో అన్నీ గ్రామంలోనే దొరికేవనీ రెండు మూడు వస్తువులనే బయట కొనుక్కునేవారమనీ, ఇప్పుడు తాగే నీటి నుంచి అన్నీ బయటే కొనుక్కోవాల్సిన పరిస్థితి ఉందని చెప్పారు. సెల్‌ఫోన్‌ల పైనా ఖర్చు చాలా ఎక్కువగా ఉంది. వస్తు సంస్కృతి గ్రామానికీ వ్యాపించింది. మరో వైపు ఉత్పత్తి ఖర్చులు పెరిగి వ్యవసాయం భారంగా మారిపోతోంది. కల్లు తాగడం తగ్గి బీరు, బ్రాందీలు, గుడుంబా తాగడం పెరిగింది. దీంతో ఆరోగ్యం దెబ్బతినడమే కాకుండా, సంపాదించిన కొద్ది మొత్తం మార్కెట్‌కు తరలిపోతోంది. కుటుంబాలు అప్పులపాలై, ఉత్పాదక శక్తి క్షీణిస్తోంది. ఊరిలో ప్రజల ఆరోగ్యస్థితి దుర్భరంగా ఉంది. వైద్యం చేయించుకోలేక ఇండ్లలోనే ఉండి అవస్తపడుతున్న మహిళలు, వృద్ధులు చాలా మంది కనబడ్డారు.

ముప్పై ఏళ్ల కిందటికి ఇప్పటికి వచ్చిన మార్పులను స్థూలంగా ఇలా చెప్పుకోవచ్చు–రైతు కూలీల సంఖ్య పెరిగింది. పాలేర్లు/జీతగాళ్ల సంఖ్య తగ్గింది. మధ్యతరగతి రైతులు పెరిగారు. భూస్వాములు తగ్గారు. కలిగి ఉన్న భూమిలో అంతరాల స్థాయి తగ్గింది. ఎడ్లు, పశువులు తగ్గాయి. బర్రెల సంఖ్య పెరిగింది. కొయ్య నాగలి వాడకం తక్కువ స్థాయిలో ఉంది. మోట వాడడంలేదు. వ్యవసాయంలో ట్రాక్టర్, అధునాతన పరికరాల వినియోగం పెరిగింది. విత్తనాలకు మార్కెట్‌పై ఆధారపడడం పెరిగింది. చేతివృత్తులు క్షీణించాయి. అప్పులు విపరీతంగా పెరిగాయి. బ్యాంకు రుణాలు పెరిగాయి. స్వయం సహాయక బృందాలూ, మైక్రో ఫైనాన్స్ అప్పులూ ఇటీవల వచ్చాయి. వడ్డీ వ్యాపారులు తగ్గారు. పాల ఉత్పత్తి పెరిగింది. ఉద్యోగాలపై ఆధార పడేవారి సంఖ్య పెరిగింది. గతంతో పోల్చినపుడు వైద్య సదుపాయాలు కాస్త పెరిగాయి. చదువుకుంటున్న వారు పెరిగారు. భూస్వామ్య ఆచార వ్యవహారాల పట్టు కొంత తగ్గింది. అంటరానితనం కొంత వరకు తగ్గింది.

– ఈ ఊరిలో వ్యవసాయం పట్ల ఉన్న ఆసక్తికి, బతుకుదెరువుకు వ్యవసాయాన్నే ప్రధానంగా చూస్తున్న వైనానికి నిదర్శనంగా పక్క ఊర్లలో భూములు కొనుక్కోవడంలో కనబడుతుంది. అంతేకాకుండా ఊరిలోని పంచరాయి, కంచె, పోరంబోకులను సాగులోకి తేవడంలో కనబడుతుంది. వ్యవసాయాన్ని ఇబ్బడి ముబ్బడి ఖర్చుతో కూడిన వ్యవహారంగా మార్చిన రీతి గత రెండు దశాబ్దాల్లో ఉన్నా, వ్యవసాయాన్నే తమ జీవన భూమికగా కొనసాగిస్తున్న స్థితే ఉంది.

వ్యవసాయంపైనా, పాల అమ్మకాలపైనా, పశువుల బ్యారంపైనా, ఉపాధిహామి పనులపైనా, బీడీలు తయారు చేయడంపైనా, నిర్మాణ, రవాణ రంగాలలో పనులపైనా ఇతర రకరకాల మార్గాల ద్వారా వచ్చిన ఆదాయాలను ప్రధానంగా పిల్లల చదువులకు, అనారోగ్యాలకు, ఇళ్ల నిర్మాణాలకు వినియోగిస్తున్నారు. ఇవే కాక పుట్టుక, పెళ్లి, చావు, మత విశ్వాసాలు, ఇతర ఆచార సాంప్రదాయాలకు డబ్బును విపరీతంగా ఖర్చుచేస్తున్నారు. అన్నిటిని మించి తాగుడుకు ఈ గ్రామంలో సంవత్సరానికి దాదాపు మూడు కోట్ల రూపాయలదాకా ఖర్చు చేస్తున్నారు. ఊరు మొత్తం మీద రకరకాలుగా చేసిన అప్పు మూడు కోట్లకు పైగా ఉంది.

ముప్పై ఏళ్ల క్రితానికి ఇప్పటికి పోల్చి చూస్తే ఇప్పుడు టి.విలు, స్కూటర్లు, మోటర్ సైకిళ్లు, సెల్ ఫోన్‌లు, అవసరాలుగా మారిపోయాయి. మోటారు సైకిళ్లకు పెట్రోలు కొనుగోలుకు, సెల్ ఫోన్‌లకు రీచార్జ్ కూపన్‌ల కొనుగోలుకు ఖర్చు విపరీతంగా పెరిగిపోయింది. డబ్బు తరలిపోయే కొత్త వసతులుగా ఇవి వచ్చి చేరాయి. కడుపులోకి గ్లాసెడు పాలు, రోజుకు ఒక గుడ్డు వెళ్లేది లేదు గానీ సెల్ ఫోన్‌లు పెట్రోలు పైనా ఖర్చు లెక్కకు దొరకదు.

ముప్పై ఏళ్లకి ఇప్పటికి పోల్చి చూస్తే పర్యావరణం చాలా దెబ్బతింది. ఎరువులు, పురుగు మందుల వాడకం అశాస్త్రీయంగా పెరిగి పోయింది. అనారోగ్య సమస్యలు ఎక్కువయ్యాయి. విపరీతమైన పురుగుమందుల వాడకం వలన వచ్చిన, వస్తున్న అనారోగ్యాలను లోతుగా అధ్యయనం చేయాలి.

అప్పుడు గ్రామ విశ్లేషణ భూమి ఎవరికి ఎంత ఉంది అనేది ప్రధానంగా దృష్టిలో పెట్టుకుని సాగింది. అయితే ఇప్పుడు శ్రమ ఏయే రంగంలో ఎంత మేరకు వెచ్చిస్తున్నారనే దానిని సూక్ష్మంగా పరిశీలించాల్సిన అవసరం ఉంది. ఈ ఊరిలో వ్యవసాయం, ఉపాధి హామి పనులు కలుపుకొని 150 నుంచి 180 రోజుల పని దొరుకుతుంది. వ్యవసాయం, ఉపాధి హామి, నిర్మాణ సేవా రంగాల్లో పనులు అన్నీ కలుపుకున్నా దాదాపు సగం రోజులు పనిలేకుండా ఉండే స్థితి ఉంది. రేషన్ బియ్యం, రకరకాల పింఛన్‌లు, వివిధ మార్గాలలో వస్తున్న అప్పు సౌకర్యం తాత్కాలికంగా ఊపిరిని నిలిపి ఉంచుతున్నాయి. పొదుపు సంఘాల మహిళ ఒకరు–'ఇప్పుడు మా పరిస్థితి రంగుల రాట్నం ఎక్కిన తీరుగా ఉన్నది. ఇది ఎప్పుడు ఆగిపోయేది, ఎప్పుడు భూమ్మీద పడేది తెలుత్తలేదు' అని వాపోయింది.

ఈ గ్రామంలో గతంతో పోలిస్తే బాగా భూములున్న భూస్వాములు తగ్గారు కాని భూస్వామ్య, పెత్తందారీ విధానాలు కొనసాగుతున్నాయి. ఒక రకంగా ఆర్. ఎస్. రావు అన్నట్టుగా భూస్వామి లేని భూస్వామ్యం, పెట్టుబడిదారీ విధానం లేని పెట్టుబడి రాజ్యమేలుతున్నాయి.

ముప్పై ఏళ్ల క్రితం విప్లవోద్యమ ప్రభావంతో చైతన్యవంతమై ఉవ్వెత్తున్న ఎగిసిన మాణిక్యాపూర్ ఇప్పుడు రకరకాల ప్రభావాల మధ్య దిశా నిర్దేశం చేసుకోవడానికి యాతన పడుతోంది. నూతన ప్రజాస్వామిక విప్లవ ఎజెండాను గానం చేసి, చుట్టుపక్కల అనేక గ్రామాలకు ప్రేరణగా నిలిచిన మాణిక్యాపూర్ గ్రామం రకరకాల ఆటుపోట్లకు గురైన స్థితి కనబడుతుంది. తెలంగాణ ఉద్యమంలో తన సృజనాత్మకతతో, తనదైన రీతిలో కదం తొక్కుతోంది.

ఇప్పటి సంక్లిష్ట, సామాజిక సందర్భంలో గ్రామాలను లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది. ఒక పక్కన సమాచార హక్కు చట్టాలు ఉన్నాయంటూ ప్రభుత్వం ఊదరగొడుతున్నా ఏ చిన్న సమాచారం తెలుసుకోవడమైనా కష్టంగానే ఉంది. ఇటు ప్రభుత్వ విభాగాలైనా, ప్రజా ప్రతినిధులైనా, గ్రామ వి.ఆర్.ఒ. అయినా వాస్తవాలు చెప్పడానికి సిద్ధంగా లేరు. ఏ సమాచారం చెపితే ఏ ప్రమాదం ముంచు కొస్తుందోననే భయం వారిలో కనబడింది. ఒక పక్కన శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందినా, వేరే గ్రహాలపై పరిశోధనలు జరుగుతున్నా మన దేశంలో భూమి కొలతలే ఇంతవరకు సరిగా రికార్డుకాలేదు. బ్రిటిష్‌కాలంలో రూపొందించిన కైఫియత్తులే తప్ప, 'స్వాతంత్ర్యం' వచ్చిన ఇన్నేళ్లలో మన ప్రభుత్వాలు అటువంటి పరిశోధనకు పూనుకోలేదు. ఏదీ లెక్కకు ఒదగకుండా ఉంచడం, దేని లెక్కలూ తేల్చక పోవడంలో పాలకుల ప్రయోజనాలు, పాలనా సౌలభ్యం ఇమిడి ఉన్నాయి. ఏ లెక్కా తేల్చకుండా ఉండడం సామాజిక వెనుకబాటుకు దానికదే ఒక చిహ్నం. ఈ లెక్కలు తేల్చాల్సిన, సరిచేయాల్సిన బాధ్యత సమాజ మార్పును కోరుకునే, శ్రామికుల విముక్తిని, నిజమైన అభివృద్ధిని ఆకాంక్షించే ప్రతి ఒక్కరిపైనా ఉంది.

(ఈ గ్రామ అధ్యయనంలో మా ఈ ప్రయత్నంలో సహాయపడిన వారందరికీ కృతజ్ఞతలు తెలియజేయడం మా బాధ్యత. మొదటగా, మాణిక్యాపూర్ గ్రామంలో మేము వచ్చిన ఉద్దేశం తెలిపి సహాయం కోరగానే మాకు సహకరించిన గ్రామ ప్రజలందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలుపుతున్నాం. మమ్ములను గ్రామాలకు తీసుకువెళ్లి, గ్రామస్తులను పరిచయం చేసిన డిటిఎఫ్ రాష్ట్ర నాయకులు కవ్వా లక్ష్మారెడ్డిగారికి మా కృతజ్ఞతలు. హుస్నాబాద్ నుంచి మాణిక్యాపూర్ వెళ్లి రావడానికి ఎప్పుడంటే అప్పుడు తన బండి ఇచ్చి సహకరించిన కొహెడ కొమురయ్య, అమరావతి దంపతులకు కృతజ్ఞతలు. పరిశోధనా క్రమంలో అన్నం, వసతి ఏర్పాటుచేసి, మాకు కావాల్సిన సమాచారాన్ని సేకరించడంలో సహకరించిన ఉగ్గే శేఖర్, దేవక్క దంపతులకు ప్రత్యేక కృతజ్ఞతలు. పెట్టెం రాంనారాయణ (ఎంపిటిసి) కూ, తాళ్లపల్లి రాజయ్యకూ, తాళ్లపల్లి సత్యవులుకూ, గజవెల్లి మురళికి, సర్పంచ్ గొల్లూరి ప్రవీణ్‌కుమార్‌కూ, చిదిరాల కుమార స్వామి (ఎన్ఆర్ఇజి ఫీల్డ్ అసిస్టెంట్) కి, ఉప్పల రాంమోహన్ (ఆదర్శ రైతు) కూ, చిదిరాల రాజు (డీలర్) కూ, బి. రాజు (వెటర్నరీ అసిస్టెంట్) కూ, జడ్.పి.ఎచ్.ఎస్. హెడ్‌మాస్టర్ డి. వెంకట జవహర్‌కూ, ఎదులాపురం కళావతి (మహిళా గ్రూపుల కార్యకర్త) కీ, తాళ్లపల్లి రాజేశ్వరీ (మహిళా గ్రూపుల కార్యకర్త) కీ, అచ్చ వసంత (మహిళా గ్రూపుల కార్యకర్త) కూ, మద్ది రాజన్న (విజయ డైరీ) కూ మా కృతజ్ఞతలు

ఈ పరిశోధన చేయడానికీ, పరిశోధనా పత్రం రాయడానికీ కారకులు, గ్రామ అధ్యయనం చేసే క్రమంలో ఉమ్మడిగా ఆలోచనలు పంచి ఇచ్చిన ఆర్.ఎస్ రావు, డా. ముదునూరి భారతిలకు కృతజ్ఞతలు చెప్పడం చాలా తక్కువే. మా పరిశోధన పూర్తిచేసి, మా పత్రాన్ని ఆయనతో పంచుకోకముందే అకాలంగా ఆర్.ఎస్. రావు గారు 17జూన్, 2011న చనిపోవడం మాకు తీరనిలోటు.

ఈ గ్రామాల అధ్యయనం చేసే క్రమంలో వీక్షణం కార్యలయంలో జరిపిన చర్చా గోష్టికి వచ్చి, తమ అమూల్యమైన ఆలోచనలు పంచి ఇచ్చిన వీక్షణం మిత్రులందరికీ మా కృతజ్ఞతలు.

పలుమార్లు గ్రామ అధ్యయనం కోసం మేము వెళ్లే క్రమంలో సహకరించిన కుటుంబ సభ్యులకు మా కృతజ్ఞతలు.

ఈ పరిశోధనకు పునాదిగా ఉపయోగపడిన విప్లవోద్యమ కృషికి, ఆ కృషి చేసిన విప్లవోద్యమ జ్ఞాత, అజ్ఞాత పరిశోధకులందరికీ వినమ్రంగా మా కృతజ్ఞతలు.

ఈ పత్రాన్ని 11 నవంబర్ 2012న హైదరాబాద్‌లోని సెంటర్ ఫర్ సోషల్ అండ్ ఎకనమిక్ స్టడీస్ (సెస్)లో జరిగిన ఆర్.ఎస్. రావు తొలి స్మారక సదస్సులో సమర్పించాం. – రచయితలు)

*(రచయితలు సహాయ సంపాదకులు,*
*కరస్పాండెంట్/సర్క్యులేషన్ మేనేజర్)*

వీ

# కాంగ్రెస్ మూటా ముల్లే సర్దుకోవాలి

***తీవ్ర అవినీతిలో కూరుకుపోయిన యుపిఎ ప్రభుత్వం, మౌనమే అంగీకారంగా కొనసాగుతున్న ప్రధాని, అదుపు తప్పిన ధరలు వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్ ఓటమిని ముందే సూచిస్తున్నాయని అంటున్నారు*** **వి. హనుమంతరావు**

దేశంలో స్కాముల పర్వం అసాంతంగా కొనసాగుతూనే ఉంది. ఈ స్కాముల వలలో పెద్ద చేపే వచ్చి పడింది. ఆ చేపను పట్టింది ఎవరో కాదు, స్వయానా ప్రధాని మన్మోహన్ సింగ్ మంత్రి మండలి మాజీ కార్యదర్శి కె.ఎం. చంద్రశేఖర్. జాయింట్ పార్లమెంటరీ కమిటీ 2జీ స్కాం మీద విచారణ జరుగుతున్న సందర్భంలో ఆ కమిటీ ముందు హాజరైన చంద్రశేఖర్ ప్రకారం 2జీ పథకంలో చేరడానికి చెల్లించాల్సిన మొత్తాన్ని రు. 34,000 కోట్లకు పెంచాలని తాను ప్రధానికి లేఖ రాశానని సాక్ష్యం ఇచ్చాడు. ఈ స్కాం వ్యవహారం వెలుగులోకి వచ్చినపుడు మన్మోహన్‌కు ఈ వ్యవహారం గురించి ఏమీ తెలియదని చెప్పడం జరిగింది. కాని చంద్రశేఖర్ సాక్ష్యంతో గుట్టు రట్టయింది. మన్మోహన్ వేసుకొన్న ముసుగు తొలగిపోయింది. ప్రజా కోర్టులో బోనులో నిలబడి జవాబు చెప్పుకోవాల్సిన పరిస్థితి ఏర్పడగా, నోటికి ప్లాస్టర్ అంటించేసు కొన్నారు. విశేషమేమంటే 2జీ గురించిన సమాచారం పంపించమని స్వయంగా ప్రధాని కోరితేనే ఒక నోటు పంపించానని చంద్రశేఖర్ తన వాంగ్మూలంలో పేర్కొన్నారు. ఈ స్కాం వెలుగు చూసి నాలుగున్నర సంవత్సరాలైంది. మామూలుగా ఇలాంటి పరిస్థితి ఏర్పడినపుడు కాంగ్రెస్ పార్టీ ఇదంతా వట్టి అబద్ధం, ప్రధాని మీద దుష్ప్రచారం అని ప్రధానిని కొమ్మేసుకోక పోవడం గమనార్హం. ఇంతవరకూ మన్మోహన్ సచ్ఛీలుడు, సత్యవంతుడని, స్కాంలకతీతుడని సర్టిఫికెట్ ఇస్తూ వచ్చాం. కాని ఈ రహస్యం బట్ట బయలైన తర్వాత ఈయనను ఎక్కడ నిలబెట్టాలనీ, ఆయన దోషి కాదా అనేదే ప్రజాకోర్టులో తేలాలి. అనేక దేశాల్లో ప్రధానులో, అధ్యక్షులో స్కాముల్లో ఇరుక్కోవడం, దేశం వదిలి పారిపోవడమో, ఎన్నికల్లో మట్టి కరవడమో, ప్రజాగ్రహానికి గురికావడమో పత్రికల్లో చూస్తున్నాం. మన ప్రధాని ఎలాంటి స్కాంలోనూ ఇరుక్కోక పోయి ఉండవచ్చు. కాని స్కాములు జరుగుతున్నాయని తెలిసి కూడా గప్‌చిప్‌గా ఉండిపోవడం అవినీతికి పాల్పడడమే అంటాను.

ఇలా స్కాముల దండు వచ్చి మెడలో పడుతుండగా, 2014 సాధారణ ఎన్నికలు దగ్గర పడుతూండగా, ప్రజలు ఛీ కొడుతూండగా, ఆర్థిక పరిస్థితి మరింత దిగజారిపోతూండగా, ధరలు దిగి రాకపోవడంతో జనం వీథుల్లోకి వస్తూండగా వారి దృష్టిని మరల్చడానికి రెండవ విడత సంస్కరణలను ప్రకటించి మరింత అభాసు పాలయ్యాడు. నూటికి 60-70 శాతంగా ఉన్న వ్యవసాయ రంగాన్ని ముట్టుకోలేదు. ధరలు మళ్లీ పెంచారు. చంకలో ఉన్న కార్పొరేట్ రంగం నెత్తినెక్కి కూర్చొని ప్రధానిని మరింత ఊబిలోకి తోలుతోంది. వాళ్లేమో తమ పెట్టుబడులను విదేశాల్లో పరిశ్రమలను కొనివేయడానికి లేదా ఆఫ్రికాలో వేల ఎకరాల భూములు కొనుగోలు చేయడానికి మళ్లిస్తూంటే, దేశంలో పెట్టుబడులు ఎలా పెరుగుతాయి? చిదంబరాన్ని ఆర్థిక శాఖ మంత్రిని చేస్తే ఆయన చెలరేగిపోతున్నాడు. విదేశాల నుంచి పెట్టుబడులను ఆహ్వానించడం, కార్పొరేట్ల కొమ్ము కాయడం, పన్నులు ఎగ్గొటిన వారిని వాళ్లు మింగినదంతా కక్కమని ఈ సంవత్సరం బడ్జెట్‌లో ప్రణబ్ ప్రకటిస్తే, చిదంబరం ఆ విషయంలో తొందరపడవద్దని చెప్పడం, కఠినంగా వ్యవహరించాల్సిందని మన్మోహన్ ఇచ్చిన పిలుపును అవకాశంగా తీసుకొని గ్యాస్ ధర పెంచడంతో ప్రజల పరిస్థితి పెనం మీద నుంచి పొయ్యిలో పడ్డట్లయింది. ప్రజల దృష్టిని స్కాంల నుంచి మరల్చి ప్రజల అసంతృప్తిని పక్కదారి పట్టించాలనుకొంటే కథ అడ్డం తిరిగింది.

కాంగ్రెస్ ప్రభుత్వంలో ముసలి పీనుగులనూ, పనికిరాని వాళ్లనూ పార్టీ పని పేరుతో తోలేసి యువ రక్తాన్ని ఎక్కించి, ఇక చూడండి ఏ విధంగా మంత్రి మండలిని పునర్వ్యవస్థీకరించడం ప్రధాని, సోనియా ప్రయోగించిన తాజా అస్త్రం. కాని ఆ అస్త్ర గురి తప్పింది. విమర్శల బాణాలు తగులుతున్నాయి. అంబానీ ఒత్తిడికి తలొగ్గి, జైపాల్‌రెడ్డిని పెట్రోలియం మంత్రిత్వ శాఖ నుంచి తప్పించడం, 2) ఆరోపణలనెదుర్కొంటున్న వారికి మరింత ప్రాముఖ్య స్థానాలకెక్కించడం, 3) ఇదివరకే మంత్రిత్వ శాఖ నుంచి తొలగించిన వారిని మళ్లీ అందలమెక్కించడం, 4) కులం పేరుతో కొంత మందికి పదవినివ్వడం, 5) ఆంధ్రప్రదేశ్‌కు మంత్రివర్గంలో పది స్థానాలు కల్పించడం, 6) కొత్త మంత్రుల్లో ఒక్కరు తప్ప మిగతావారంతా కాంగ్రెస్ వారే కావడం.

అమెరికా, ప్రపంచ బ్యాంక్, దేశీయ కార్పొరేట్ సంస్థలు, బహుళజాతి సంస్థలకు మన్మోహన్ సింగ్ సాష్టాంగ నమస్కారం చేయడం కొత్త విషయమేమీ కాదు. ముఖం మీద ఉమ్మేస్తే తుడిచేసుకొన్నట్లు ప్రవర్తించే వారిని ఏమనగలం? జైపాల్‌రెడ్డి సూత్రబద్ధ వైఖరి తీసుకోవడమే ఆయన చేసిన నేరం. అంబానీకి ఆంధ్రప్రదేశ్ అంటేనే గుర్రు. వై.ఎస్ ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో ఆంధ్ర తీరంలో లభించిన గ్యాస్‌ను ఆంధ్రప్రదేశ్‌కు ఇవ్వడానికి ప్రాధాన్యత ఇవ్వకుండా వేరే రాష్ట్రానికి (గుజరాత్?) సరఫరా చేయడాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. అప్పట్లో ఇళ్లకు గ్యాస్ కనెక్షన్‌లు ఇచ్చేస్తున్నారని ప్రచారం జరిగింది. అప్పుడు కూడా కేంద్రం అంబానీలకు తలవంచింది. అప్పట్లో పత్రికల్లో వచ్చిన వార్త ప్రకారం అంబానీలకు వ్యతిరేకంగా వై.ఎస్. వైఖరికి, ఆ తర్వాత విమాన ప్రమాదంలో వై.ఎస్. మరణించడానికి సంబంధం ఉందని చదివాం. ఇప్పుడు మళ్లీ జైపాల్ సూత్రబద్ధ వైఖరికి అంబానీలు ఇబ్బందుల్లో పడి, మన్మోహన్ మీద ఒత్తిడి తీసుకొని వచ్చి ఆ శాఖ నుంచి మార్పించడం జరిగిందనేది బహిరంగ రహస్యం. దేశాన్ని కాంగ్రెస్ పాలిస్తుందా, అంబానీలు పరిపాలిస్తున్నారా?

# పేదల ఆకలి తీర్చని ఆర్థికాభివృద్ధి...

***అనేక కమిటీలు ఎన్నో నివేదికలు ఇచ్చినా ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలతో పేదరికం పెరిగిపోతోందని అంటున్నారు* ఎ. నర్సింహారెడ్డి**

**కాం**గ్రెస్ పార్టీ 2009 ఎన్నికల ప్రణాళికలో ఆహార భద్రతా చట్టాన్ని చేస్తామని ప్రజలకు హామీనిచ్చింది. మూడేళ్లు గడిచిపోయినా ఆ బిల్లు పార్లమెంట్ గడప దాటలేదు. ఆనాటి హామీ మేరకు మొత్తం దేశమంతటా శాశ్వతంగా కిలో రెండు రూపాయలకు 35 కిలోలను ఇవ్వడానికి చట్టాన్ని ఆమోదింపజేయాలి. ఈలోగా మిగులు ధాన్యాలను అదే ప్రాతిపదికగా ప్రజలకు పంపిణీ చేయాలి. అయితే కోటి టన్నుల 'మిగులు' ఆహార ధాన్యాలను పిండి మిల్లులు, బిస్కెట్ తయారీదార్లకు బహిరంగ మార్కెట్లో వేలం ద్వారా అమ్మాలన్న ఇటీవలి కేంద్ర ప్రభుత్వ నిర్ణయం అత్యంత దుర్మార్గమైంది. అమానవీయమైనది. 'మురిగిపోతున్న ధాన్యాన్ని పేదలకు పంచండి' అని సర్వోన్నత న్యాయస్థానం ఏనాడో ఆదేశించినా సర్కారుకు చెవిటి వాడి ముందు శంఖం ఊదినట్టే అయింది. దేశంలోని గోదాముల్లో ఆహారధాన్యాలు పేరుకుపోయిన మాట నిజం. అయితే జనం ముప్పూటలా సుష్టుగా భోంచేసిన తర్వాత కూడా అది మిగిలి ఉందని కాదు. అవసరమైన ఆహారం సామాన్యులు కొనుక్కోలేక పస్తులుంటున్నారు. అందుకని కేంద్ర ప్రభుత్వం చెబుతున్న 'మిగులు' ఆహార ధాన్యాలు అన్న మాటే ఓ మిథ్య. అందువలన వేలం వేయాలన్న దుర్మార్గ నిర్ణయాన్ని కేంద్ర ప్రభుత్వం తక్షణం ఉపసంహరించుకోవాలి.

'ఆహారానికి అల్లాడుతున్న దేశం మనది. పట్టెడు మెతుకులకోసం అలమటిస్తున్న కోటానుకోట్లమందికి వట్టిమాటలు చెప్పడమంటే అది వారిని వెక్కిరించడమే. ఇంత అన్నం, కొంత గుడ్డ, కొంప ఏర్పరచి, ప్రజలకు చదువు సంధ్యలు చెప్పించి, మందు మాకులు ఇచ్చాక – ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చు'. స్వాతంత్ర్యానికి ముందు నెహ్రూ చెప్పిన మాటలివి. పొయ్యి వెలిగించి, ఎసరెక్కించి, వండివార్చకుండా కేవలం తియ్యటి మాటలతో ఆకలి మంటలు తీరవన్న నెహ్రూ వ్యాఖ్యలు – ఆరున్నర దశాబ్దాల స్వాతంత్ర్యం తరువాత నిజమై నిలుస్తున్నాయి. ప్రభుత్వంలో అత్యున్నత పీఠాల్లోనివారు సైతం అవకాశాల్లో అసమానతల గురించి మాట్లాడుతున్నారే తప్ప – వాటిని తగ్గించే ప్రయత్నాలు మాత్రం చేయడం లేదు. వృద్ధిరేటు విషయంలో దూసుకుపోతున్న భారత్‌లో 44 శాతం మంది పిల్లలు బరువు తక్కువగా ఉండడం దేశానికే సిగ్గుచేటని మన్మోహన్ సింగ్ ఇటీవల వ్యాఖ్యానించారు. ఎనిమిదేళ్లుగా ఈ దేశానికి ప్రధానిగా ఉంటూ, స్వయంగా జాతీయ పౌష్టికాహార మండలికి సారథ్యం వహిస్తున్న వ్యక్తి – సమస్యను పరిష్కరించకుండా కేవలం ఇలా సిగ్గుపడడానికే పరిమితం కావడం దేనికి నిదర్శనం? కాలే కడుపుతో అలమటించేవారి సంఖ్యను పెంపొందించడమే వృద్ధికి కొలమానమైతే, ఇక మన్మోహన్ పాలనకు ఎవరూ సాటి రాలేరు. దేశ జనాభాలో సుమారు 68 శాతం అంతర్జాతీయ దారిద్ర్య రేఖకు దిగువన భారంగా

పెట్రోలియం ఉత్పత్తుల విషయంలో 70 శాతం దిగుమతుల మీద ఆధారపడుతుండగా, అంబానీలు ధరలు పెంచాలనే సాకుతో ఉత్పత్తినే తగ్గించడం దేశానికి ద్రోహం చేయడమే అవుతుంది. అలా దేశానికి ద్రోహం తలపెట్టిన వారి ఒత్తిడికి తలవంచడాన్ని ఏమనాలో మీరే చెప్పండి. ఐపిఎల్ స్కాంలో చిక్కి రాజీనామా చేసిన శశిథరూర్‌ను ఏ ముఖం పెట్టుకొని తిరిగి మంత్రివర్గంలో తీసుకున్నారో ప్రధాని జవాబిస్తారు? అలాగే బొగ్గు కుంభకోణంలో ఆరోపణలనెదుర్కొంటున్న ఖుర్షీద్‌కు పదోన్నతి కలిగించడం ఎంత సబబు? రెండవ విడత సంస్కరణలు ప్రవేశపెట్టినప్పుడు పెట్రోలియం ఉత్పత్తుల ధర పెంచారు. ఇప్పుడు మంత్రివర్గ పునర్ వ్యవస్థీకృత సందర్భంలో రైల్వే ఛార్జీలు పెంచబోతున్నారు.

ఇలా ముఖ్యమైన నిర్ణయాలు తీసుకొన్నప్పుడల్లా వేడి వేడి వడ్డనలు తప్పవా? ఆంధ్రప్రదేశ్‌లో అయిదుగిరికి మంత్రివర్గంలో స్థానం కల్పించడంతో కులం దృష్టి లేదా? ఆ మధ్య ఒకసారి ప్రధాని మాట్లాడుతూ సంయుక్త మంత్రివర్గం ధర్మం అని అన్నారు. కొత్తగా తీసుకొన్న మంత్రుల్లో ఒకరు తప్ప మిగతా వారంతా కాంగ్రెస్ వారే. సంయుక్త ధర్మం ఇప్పుడు గుర్తుకు రాలేదా?

అవినీతి దుర్గంధంలో ప్రభుత్వం మునిగి తేలుతోంది. 2014 సాధారణ ఎన్నికలకు ముందే అయిదారు రాష్ట్రాల్లో ఎన్నికలు జరగ బోతున్నాయి. ఇలాంటి అవకాశాన్ని తీసుకొని, ఆ మధ్య అయిదు రాష్ట్రాల ఉప ఎన్నికల్లో ప్రజలు చెంపలు వాయించేశారన్న నేపథ్యంలో మరికొన్ని రాష్ట్రాల్లో జరుగనున్న ఉప ఎన్నికల్లో ప్రజలు పళ్లు రాలగొడతారనే జ్ఞానం లేదా? కేంద్రంలో, రాష్ట్రంలో ఉన్నతాధికారులు మంత్రులకనుకూలంగా ప్రవర్తించి, నిర్ణయాలు తీసుకొని కాళ్లు విరగ్గొట్టుకొని, ఏం చేస్తే ఏమవుతుందోనని భయపడుతూండడంతో పరిపాలనా యంత్రాంగం స్తంభించిపోయింది. ఆర్థిక సమస్యలు పరిష్కారం కావడం లేదు. ఆర్థిక సలహాదారు రంగరాజన్ మన్మోహన్ సింగ్ కన్నా రెండాకులు ఎక్కువగా చదువుకొన్నాడు కాబోలు. మరీ దూకుడుగా సలహాలిస్తున్నాడు. పేదల సమస్యలు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉన్నట్లున్నాయి. 2013 సంవత్సరం కూడా ఆశాజనకంగా లేదనే విశ్లేషణలు వెలువడుతున్నాయి. యుపిఎ ప్రభుత్వం రెండవ విడత పాలనలో ప్రజలకు ఏమీ వొరగబెట్టిందని ప్రజలు కాంగ్రెస్‌కు ఓటు వేస్తారు? కాంగ్రెస్ వాదులారా, మూటా ముల్లె సర్దుకోండి.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

బతుకులీడుస్తున్నారు. పంచవర్ష ప్రణాళికల మౌలిక లక్ష్యమే పేదరిక నిర్మూలన. పదకొండు ప్రణాళికలు పూర్తయినా, రాజ్యాంగ హక్కైన జీవించే హక్కుకు దిక్కులేని దురవస్థ తాండవిస్తోంది. ఎండుతున్న డొక్కలు, మిన్నంటుతున్న ఆకలి కేకలు వినిపిస్తున్న దౌర్భాగ్య స్థితిలో 'ఆమ్ ఆద్మీ'కి ఆహార భద్రత కల్పించేందుకు, జీవన ప్రమాణాలు పెంచేందుకు ప్రభుత్వం చేపట్టిన చర్యలు శూన్యం.

గ్రామాల్లో రోజుకు ఒక మనిషి 2,200 క్యాలరీలు, పట్టణాల్లో 2,100 క్యాలరీలు శక్తినిచ్చే ఆహారం కనీసంగా తినాలని శాస్త్రవేత్తలు నిర్ధారించారు. కానీ, ఆ ప్రమాణాల ప్రకారం ఆహారం తీసుకోలేని వారి సంఖ్య ఏటా పెరుగుతోంది. కేంద్ర ప్రభుత్వ గణాంకాల ప్రకారమే మన పట్టణ ప్రాంతాల్లో అలాంటివారు 1973లో 49.2 శాతంగా ఉన్నదల్లా 1993 నాటికి 57 శాతానికి పెరగ్గా 2003కు 73 శాతానికి చేరింది. అదే గ్రామీణ ప్రాంతాల్లో పైన పేర్కొన్న సంవత్సరాల్లో వరుసగా 56.4, 58.5, 75 శాతం ఉన్నారు. పౌష్టికాహారం తీసుకోలేని వారి సంఖ్య ఇంతలా పెరుగుతున్న దుస్థితిలో ప్రభుత్వం సామాన్యులను ఆదుకునే దిశగా ఆలోచించడం మాని సంపన్నులను చంకనెత్తుకుంటోంది. మిగులు ఆహార ధాన్యాల పేరిట వేలం వేయడం ద్వారా వాటిని బడా వ్యాపారులు, కార్పొరేట్ కంపెనీలు కారుచౌకగా కొట్టేస్తాయి. మన ఆహార సబ్సిడీలో గణనీయమైన భాగం గోదాముల నిర్వహణకే ఖర్చవుతోంది. గోదాముల్లోని మిగులు ధాన్యాలను బహిరంగ వేలం వేయడం అంటే ఆహార సబ్సిడీని కంపెనీలకు కట్టబెట్టడమే అవుతుంది. ఇప్పటికే ఆహార పదార్థాల ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. ఆహార ద్రవ్యోల్బణం రెండంకెల స్థాయికి ఎగబాకింది. తాజాగా పెంచిన డీజిల్ ధరలతో అది మరింత పెరుగుతోంది. ఈ నేపథ్యంలో ఆహార భద్రత మరింత కరువై దారిద్ర్యం జడలు విప్పి నాట్యం చేస్తుంది.

నయా ఉదారవాద ఆర్థిక విధానాలు వచ్చాక ఎపిఎల్, బిపిఎల్ అంటూ ప్రజా పంపిణీ వ్యవస్థ (పిడిఎస్)ను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నీరుగారుస్తున్నాయి. ఈ విధానాలు అమలులోకి వచ్చిన 1991లో దేశమంతటా పిడిఎస్ ద్వారా రెండు కోట్ల పది లక్షల టన్నుల ఆహార ధాన్యాలను పంపిణీ చేశారు. ఆ ఏడాది మార్కెట్లోకొచ్చిన ఆహార ధ్యాన్యాల్లో అది 45 శాతం. పదేళ్లు గడిచేసరికల్లా 2001లో పిడిఎస్ ద్వారా పంపిణీ అయిన ఆహార ధాన్యాలు దాదాపు సగానికి అంటే కోటీ ముప్పై లక్షల టన్నులకు దిగజారింది. ఈ పుష్కర కాలంలో అది మరింత క్షీణించింది. పేదరికాన్ని తగ్గించలేని కేంద్ర ప్రభుత్వం పేదల సంఖ్యను తగ్గించేలా దారిద్ర్య రేఖ నిర్వచనాన్ని కుదించేస్తోంది. దానికి రకరకాల కొలబద్దలను నిర్ణయిస్తూ గందరగోళం సృష్టిస్తోంది. రోజుకు వచ్చే ఆదాయం ప్రాతిపదికగా దారిద్ర్య రేఖకు ఎగువన, దిగువన అంటూ విడదీస్తోంది. వాస్తవానికి పేదరికాన్ని రోజుకు తీసుకునే ఆహారం ప్రాతిపదికగా నిర్ణయించడం హేతుబద్ధమవుతుంది.

ఐక్యరాజ్యసమితి ప్రపంచ ఆకలి సూచీ (జిహెచ్ఐ) ప్రకారం తీవ్ర ఆకలి సమస్యను ఎదుర్కొంటున్న ప్రపంచంలోని 80 దేశాల్లో భారత్ 67వ స్థానంలో ఉంది. ప్రపంచంలో ఆకలితో బాధపడుతున్న వారిలో 25 శాతం మంది (దీనిని అంగీకరించాల్సి రావడం సిగ్గుచేటైన విషయం) భారతీయులున్నారు. ఈ విషయంలో ఉత్తర కొరియా, అంతర్గత కలహాలతో తల్లడిల్లుతూ విడిపోయిన సూడాన్ కంటే కూడా భారత్ దిగువ ర్యాంక్‌లో ఉంది. ప్రపంచంలో పోషకాహార లోపంతో బాధపడుతున్న ఐదేళ్ల లోపు వయస్సున్న వారు మూడింట రెండు వంతుల మంది భారత్‌లో ఉన్నారు. భారతదేశంలో 44 శాతం మంది పిల్లలు నిర్ణీత ప్రమాణం కంటే తక్కువ బరువుతో ఉన్నారు. 72 శాతం మంది రక్తహీనత సమస్యను ఎదుర్కొంటున్నారు. 52 శాతం మంది గర్భిణీ స్త్రీలు రక్తహీనతతో బాధపడడం ఘోరమైన విషయం. వారు భారత భవిష్యత్ తరానికి జన్మనివ్వనున్నారు. నివారించదగ్గ వ్యాధులతో భారత దేశంలో ప్రతి రోజూ వేలాది మంది బాలలు మరణిస్తున్నారు. ఇవి బాధకరమైన, కఠోరమైన, దాచేస్తే దాగని సత్యాలు. ఈ నేపథ్యంలో రూపొందించిన, 'ఆహార భద్రతా బిల్లు – 2011' ఎందుకు కొరగాకుండా పోయింది. ఉచిత మధ్యాహ్న భోజనం, గర్భిణీలు, పాలిచ్చే తల్లులకు ఆరు మాసాల పాటు వండిన ఆహారం పెట్టడం, ఏ ఆధారం లేని వ్యక్తులు, వలస కార్మికులు, ఆకలిగొన్న వారికి కమ్యూనిటీ కిచెన్‌లు తదితర సానుకూల అంశాల నుంచి కేంద్రం తప్పుకోవాలని చూసే ప్రతిపాదనలు బిల్లులో చోటు చేసుకున్నాయి.

ఆసియా అభివృద్ధి బ్యాంకు (ఎడిబి) లెక్కలయితే ప్రభుత్వానికి మరీ ఆశాభంగం కలిగిస్తాయి. ఆసియాలో సగటు ఆదాయాన్ని పరిగణనలోకి తీసుకొని ఎడిబి రోజుకు 1.35 డాలర్లను కనీస ఆదాయంగా నిర్ణయించింది. దీని ప్రకారం 2005లో భారతదేశంలో పేదల సంఖ్య 62 నుంచి 74 కోట్ల వరకూ ఉంటుందని అంచనా. ఆసియాలో ఒక్క నేపాల్ తర్వాత పేదల శాతం అత్యధికంగా ఉన్న రెండవ దేశంగా భారత్‌ను ఎడిబి గుర్తించింది. నేపాల్‌లో పేదల శాతం 55.8 శాతం కాగా, భారత్‌లో 54.8 శాతం, బంగ్లాదేశ్‌లో 42.9 శాతం, కంబోడియాలో 36.9 శాతం, భూటాన్‌లో 31.8 శాతం, ఫిలిప్పైన్స్‌లో 29.5 శాతం, వియత్నాంలో 16 శాతం, శ్రీలంకలో 9.9 శాతం పేదలున్నట్లు ఎడిబి గుర్తించింది. ఎడిబి అంచనాల ప్రకారం భారత దేశం యుఎన్‌డిపి లక్ష్యంగా పెట్టినట్లు 2015 నాటికల్లా 1990 నాటి పేదరికంలో సగాన్ని తగ్గించాలంటే, ఏడాదికి 2 శాతం చొప్పున పేదల శాతం తగ్గాల్సి ఉంటుంది. ప్రస్తుత ధోరణి చూస్తే అలా తగ్గడం అసాధ్యమనిపిస్తుంది.

ఐక్యరాజ్యసమితి అభివృద్ధి కార్యక్రమం (యూఎన్‌డీపీ) మానవాభి వృద్ధి నివేదిక – 2011 ప్రకారం ఇండియాలో 53.7 శాతం లేదా 61.2 కోట్ల పేదలు ఉన్నారు. దాన్ని బట్టి చూస్తే ప్రపంచంలో అత్యధిక సంఖ్యలో పేదలు ఉన్న దేశం ఇండియానే. పేదల్లోనూ 28.6 శాతం కటిక దారిద్ర్యం అనుభవిస్తున్నారని ఆ నివేదిక తేల్చి చెప్పింది. 185 దేశాల మానవాభివృద్ధి సూచి 2011లో భారత్‌స్థానం 134. మానవాభివృద్ధికి సంబంధించిన మూడు మౌలిక అంశాలు (ఆరోగ్యవంతమైన సుదీర్ఘ జీవనం, మేధో వికాసం, మెరుగైన జీవనప్రమాణాలు) పరిగణనలోకి తీసుకొని రూపొందించిన సూచి ఇది. ఐక్యరాజ్యసమితి బాలల నిధి (యునిసెఫ్) ప్రకారం భారతీయుల్లో సగంమంది పోషకాహార లోపంతో బాధపడుతున్నారు. ప్రపంచంలో పోషకాహార లేమితో బాధపడుతున్న వారిలో 29 శాతం మంది ఇండియాలోనే ఉన్నారని ఆహార వ్యవసాయ సంస్థ (ఎఫ్ఎఓ) పేర్కొంది. దేశంలో ఆరు నుంచి 35 నెలల వయోవర్గంలోని పిల్లల్లో 78.9 శాతం రక్తహీనతతో బాధపడుతున్నారని, గ్రామీణ ప్రాంతాల్లో అలాంటి బాలల సంఖ్య 80.9 శాతమని జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వేలో వెల్లడైంది. 15 నుంచి 49 ఏళ్లలోపు వివాహిత మహిళల్లో 56.2 శాతం రక్తహీనతను ఎదుర్కొంటున్నారని తెలిపింది. దేశంలో పేదరికం ఎంత విస్తృతంగా ఉందో చాటి చెబుతున్న గణాంకాలివి, కాగా ప్రభుత్వ తోడ్పాటు అవసరమైన ప్రజల సంఖ్య తక్కువగా ఉందనటం ద్వారా సంక్షేమ పథకాల వ్యయాన్ని బాగా తగ్గించుకోవాలన్నది దాని వ్యూహం. ప్రజల

జీవన పరిస్థితుల్ని మెరుగుపరచడంకన్నా, ద్రవ్యలోటు తగ్గించుకోవడానికే సర్కారు ప్రాధాన్యం ఇస్తోంది.

1957 గుల్జారీ లాల్ నందా అధ్యక్షతన జరిగిన పదిహేనో కార్మిక సదస్సులో మొట్టమొదటిసారిగా దారిద్ర్యరేఖ అనే భావనను తెరపైకి తెచ్చారు. ప్రణాళిక సంఘం కార్యాచరణ బృందం 1962లో ఈ భావనను ఆమోదించింది. వ్యక్తులు ఆరోగ్యకరంగా జీవించడానికి కావలసిన కనీస ఆహారం తదితర వస్తుపదార్థాలను దారిద్ర్య అంచనాకు ప్రాతిపదికగా తీసుకున్నారు. 1960-61 నాటి ధరల ప్రకారం ఒక వ్యక్తి వినియోగ పదార్థాల కోసం నెలకు రు.20 కానీ, అంతకన్నా తక్కువకానీ వ్యయం చేస్తే - దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నట్లు గుర్తించింది. కుటుంబ వ్యయాన్ని ప్రాతిపదికగా తీసుకొని దారిద్ర్యరేఖ నిర్వచనాన్ని బట్టి పేదల సంఖ్యను నిర్ధారించారు. వై.కె. అలఘ్ కమిటీ (1977), లక్డావాలా కమిటీ (1989) దారిద్ర్యరేఖపై అధ్యయనం జరిపాయి. ఆ తర్వాత యుపిఎ ప్రభుత్వం పేదరికం ప్రమాణాల నిర్ధారణకు 2005లో ఏర్పాటు చేసిన సురేశ్ టెండూల్కర్ కమిటీ నాలుగేళ్ల తరవాత 2009లో తన నివేదిక సమర్పించింది.

ప్రాతిపదిక మారినప్పుడల్లా పేదల సంఖ్యను ఎప్పటికప్పుడు మారుస్తూ వచ్చారు. పేదరికం బాగా తగ్గిందని పాలకులు అంటున్నప్పటికీ, పేదరికాన్ని లెక్కించడానికి తీసుకొన్న ప్రాతిపదిక, విశ్వసించలేని గణాంక వివరాల కారణంగా తీవ్ర విమర్శలు ఎదురవుతున్నాయి. పేదల జీవన పరిస్థితులు ఎంత మాత్రం మెరుగుపడకపోయినప్పటికీ, ప్రభుత్వం వారి సంఖ్యను తెగ్గోసి చూపిందని ప్రజలకు అర్థమైంది. 2009-10లో దేశ జనాభాలో పేదల సంఖ్య 29.8 శాతమేనన్న తాజా అంచనా మరింతగా విమర్శల పాలైంది. కళ్లకు కనిపించే వాస్తవాలకూ, ఈ లెక్కలకూ ఏ మాత్రం పొసగడం లేదన్నది ప్రతి ఒక్కరి అభిప్రాయం. ఆ నిపుణులు మాత్రం ఏవేవో సిద్ధాంతాలను, సూత్రాలను వల్లెవేస్తూ పేదరికం తగ్గుతూ వస్తున్నదని అంటున్నారు. సంక్షేమ పథకాలను అమలు చేయడానికి ప్రభుత్వం వాటినే ప్రాతిపదికగా తీసుకుంటున్నది.

అవకాశాల నిరాకరణ జాతి పురోగతిని ఆపివేస్తుందన్నది అందరూ అంగీకరించిన వాస్తవం. ఒక వ్యక్తి తనకు అవసరమైన, ఇష్టమైన జీవన విధానాన్ని ఎంపిక చేసుకునే అవకాశం లేని పరిస్థితినే పేదరికంగా భావించాల్సి ఉంటుంది. పేదరికాన్ని తగ్గించి, దేశ ప్రజలందరికీ ఆహార భద్రతను కల్పించాల్సిన ప్రభుత్వం దానికి భిన్నంగా పేదరికపు లెక్కలను తగ్గించి చూపడానికి ప్రయత్నిస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లో 2,200, పట్టణ ప్రాంతాల్లో 2,100 కేలరీల కంటే తక్కువ పోషక విలువలున్న ఆహారం తింటున్న వారు 75 శాతం ఉన్నారని ఒక వైపు చెబుతూనే మరోవైపు డబ్బు రూపంలో ఆదాయపు పరిమితిని నిర్ధారించడం ద్వారా పేదరికం తగ్గిందని చెప్పడానికి దొంగనాటకం ఆడుతోంది. రోజుకు గ్రామాల్లో రు.22, పట్టణాల్లో రు.28 మొత్తాన్ని పేదరికానికి గీటురాయిగా ప్రభుత్వం నిర్ణయించింది. అంతకన్నా ఎక్కువ సంపాదించేవారు పేదలు కాదని ప్రణాళికా సంఘం అంటోంది. ప్రణాళికా సంఘం నిర్ధారించిన 22, 28 రూపాయలతో రోజుకు 1,800 కేలరీల పోషక విలువలున్న ఆహారాన్ని పొందడం కూడా కష్టమే! ఇక కనీస ఆహార భద్రత ఎక్కడ? పేదరికపు ప్రమాణాలను ఇలా అర్థంపర్థం లేకుండా తగ్గించి గ్రామీణ ప్రాంతాల్లో 34 శాతానికి, పట్టణ ప్రాంతాల్లో 21 శాతానికి పేదరికం తగ్గిందని సర్కారు గొప్పలు చెప్పుకుంటోంది.

సామాజిక భద్రత కల్పించడాన్ని నైతిక బాధ్యతగా గుర్తించిన దేశాలకు చెందిన ప్రజలు - విద్య ఆరోగ్యం, జీవన ప్రమాణాలపరంగా అత్యున్నత స్థాయిల్లో ఉన్నారని ప్రపంచ నివేదికలు తెలియజేస్తున్నాయి. కొద్ది నెలల క్రితం ప్రణాళికా సంఘం పేదరిక రేఖ గురించి పట్టణ ప్రాంతాల్లో రోజుకు రు.32, గ్రామీణ ప్రాంతాల్లో రు.26 తలసరి ఆదాయం మించి ఒక రూపాయి పొందినా వారు పేదల కిందకు రారని సుప్రీం కోర్టుకు సమర్పించిన అఫిడవిట్ పట్ల ప్రజల్లోనూ, నిపుణుల్లోనూ పెద్ద ఎత్తున ఆగ్రహం వ్యక్తం కావడంతో ఇప్పుడు కొత్తగా మరో కమిటీని ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ప్రధాని ఆర్థిక సలహా మండలి అధ్యక్షులు సి. రంగరాజన్ నేతృత్వంలోని ఈ కమిటీలో మరో నలుగురు సభ్యులుంటారు. ఇందిరాగాంధీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డెవలప్‌మెంట్ డైరెక్టర్ మహేంద్రదేవ్, సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీకి చెందిన కె. సుందరం, మహేష్ వ్యాస్, ప్రణాళికా సంఘం మాజీ సలహాదారు కెఎల్ దత్తా ఈ కమిటీలోని ఇతర సభ్యులు, ఇలాంటి హేమాహేమీలతో ఏర్పడిన ఈ కమిటీ తన పనిని సమర్థవంతంగా నిర్వహించి వాస్తవానికి అద్దంపడుతుందా? గతంలో పేదరిక రేఖను నిర్ణయించిన వారు కూడ ఎంతో పేరు ప్రఖ్యాతులున్నవారే. అయినా పేదరికానికి వారు రూపొందించిన కొలబద్దలు, వాటి ఆధారంగా వేసిన అంచనాలు ఏ మాత్రం విశ్వసనీయంగా లేవని రుజువయింది.

నూతన కమిటీ ఏర్పాటును ప్రకటించే సమయంలో కేంద్ర ప్రణాళికా సహాయమంత్రి అశ్వనీ కుమార్ మాటలు గమనిస్తే అలాంటి ఆశలకు తావుండదేమో అనిపిస్తుంది. పేదరికాన్ని అంచనా కట్టే పద్ధతులను మార్చుకోవాలని చెబుతూనే, అలాంటి పరిస్థితికి దారితీసిన పరిస్థితుల గురించి ఆయన చెప్పిన ధోరణి ఎగతాళి చేసేట్టుగా ఉంది తప్ప చిత్తశుద్ధి ఉన్నట్లు కనిపించదు. నేడు పేదరికం పట్ల అవగాహనలోనే పెద్ద మార్పు వచ్చింది. 'ఇరవై పైసలు పెట్టి పోస్టు కార్డు రాసే బదులు మొబైల్ ఫోన్లను వినియోగిస్తున్నారు. ప్రతి ఒక్కరూ రీబాక్ జోళ్లు ధరిస్తున్నారు. సైకిళ్లకు బదులు స్కూటర్లపై ప్రయాణిస్తున్నారు. ఇప్పుడు సమస్య రోటీ, కపడా, మకాన్ కాదు, రీబాక్‌లు, సెల్‌ఫోన్లు' అని ఆయన మాట్లాడుతున్నాడంటే ప్రభుత్వం పేదల పట్ల ఎంత చిన్నచూపుతో ఉందో అర్థం చేసుకోవచ్చు. పేదరికానికి అర్థ, తాత్పర్యాల కోసం ప్రభుత్వం సాగిస్తున్న అన్వేషణకు ఇప్పట్లో తెరపడే అవకాశం లేదని ఆయన మాటలతో మరోమారు రుజువైంది.

పేదరికం అంటే ఏమిటో దేశంలో ఎంతమంది దాంతో బాధ పడుతున్నారో ప్రభుత్వానికి ఇప్పటికీ స్పష్టంగా తెలియదు. ప్రభుత్వం ఇన్నాళ్లుగా జబ్బేమిటో తెలుసుకోకుండానే చికిత్స చేస్తోంది. దారిద్ర్యమంటే ఏమిటో, దాని తీవ్రత ఎలాంటిదో, ఈ వ్యాధికి ఎలాంటి చికిత్స చేయాలో దానికి అర్థం కావడం లేదు. అందుకే, దారిద్ర్య నిర్మూలనకు సమర్థ విధానాలు రూపొందించలేకపోతోంది. పేదరికం పై ప్రభుత్వం అధికారిక అంచనాలకు, అనేక మంది స్వతంత్ర నిపుణుల అంచనాలకు అసలు పోలికే ఉండడం లేదు. జాతీయ శాంపుల్ సర్వేలాంటి వాటి ఆధారంగా వేసే లెక్కలు సైతం పేదరికం ప్రభుత్వం అంచనాల కన్నా చాలా ఎక్కువగా ఉన్నదని చెబుతున్నాయి. తాజా జాతీయ శాంపుల్ సర్వే ప్రకారం పేద ప్రజలు మొత్తం జనాభాలో 77 శాతం ఉంటారు. దేశం మొత్తం మీద కేవలం 23.5 కోట్ల మంది మాత్రమే కనీస ఆదాయాన్ని పొందుతున్నారు. 83.5 కోట్ల మందికి ప్రభుత్వ సహాయం అవసరమవుతుంది.

ఆర్థికాభివృద్ధిపై గొప్పలు చెప్పుకుంటున్న కేంద్ర ప్రభుత్వం సామాన్యుడి ఆకలిని తీర్చడంలో ఘోరంగా విఫలమైంది. సామాన్యుడి

ఆకలి పరిస్థితి 1996లో ఏ విధంగా ఉందో ఇప్పుడు అలాగే ఉందని తాజాగా విడుదల చేసిన గ్లోబల్ హంగర్ ఇండెక్స్ (జిహెచ్ఐ) కుండ బద్దలు కొట్టింది. సామాన్యుని ఆకలి తీర్చే విషయంలో ఇథియోపియా కంటే భారత్ పరిస్థితి ఘోరంగా ఉందని తాజాగా వెలుగులోకి వచ్చింది. మన పొరుగున ఉన్న శ్రీలంక, బంగ్లాదేశ్‌ల కన్నా వెనుకబడి ఉన్నామని అంతర్జాతీయ ఆహార విధానాల పరిశోధన సంస్థ (ఐఎఫ్ఆర్ఐ) రూపొందించిన గ్లోబల్ హంగర్ ఇండెక్స్ నివేదిక వెల్లడించింది. భారత్ విశేష ఆర్థికాభివృద్ధిని సాధించినప్పటికి సామాన్యుడి ఆకలి తీర్చడంలో వెనుకబడివుండడం శోచనీయం. భారత్‌లో గత రెండు దశాబ్దాల కాలంలో తలసరి ఆదాయం రెట్టింపు అయినా హంగర్ ఇండెక్స్‌లో ఏలాంటి మార్పు చోటు చేసుకోలేదని నివేదిక తేల్చి చెప్పింది. దేశంలో మూడింట రెండొంతుల మంది ఆకలితో అలమటిస్తున్నారని నివేదిక పేర్కొంది. ఆర్థికాభివృద్ధి, ఆకలి పోరుకు మధ్య అంతరం నానాటికి విస్తరిస్తోందని ఈ నివేదిక వ్యాఖ్యానించింది.

సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాల నివేదిక 2012 తాజాగా గుండెలవిసే నిజాలు బయట పెట్టింది. 'పారిశుద్ధ్యం', ఆహార భద్రత, కాన్పు సమయంలో తల్లుల మరణాలు, స్త్రీ పురుష అసమానతలకు సంబంధించి భారత్ పరిస్థితి రోజురోజుకూ అన్యాయంగా తయారవుతోందని నివేదిక కుండబద్దలు కొట్టింది. పేదరిక నిర్మూలన దిశగా అనుసరిస్తున్న అపసవ్య పద్ధతులను మార్చుకోని పక్షంలో 2015 నాటికి నిర్దేశించుకున్న లక్ష్యాలను చేరుకోవడం అసాధ్యమని నివేదిక స్పష్టం చేసింది. ఈ నేపథ్యంలో ప్రజలందరికీ ఆహార భద్రతను సమకూర్చాలంటే ప్రభుత్వ విధానాల్లో గణనీయమైన మార్పు రావాలి. ఆహార పంటల సాగును ప్రోత్సహించాలి. రైతాంగానికి అవసరమైన సేంద్రీయ ఎరువులను, పురుగు మందులను సాధ్యమైనంత తక్కువ ధరలకు అందుబాటులో ఉంచాలి. రైతుకు గిట్టుబాటు ధర కల్పించడం కోసం మార్కెట్‌లో ప్రభుత్వం సాధ్యమైనంత ఎక్కువగా జోక్యం చేసుకోవాలి. ఎఫ్‌సిఐ వంటి ప్రభుత్వరంగ సంస్థల చేత ఆహార ధాన్యాలను సాధ్యమైనంత ఎక్కువగా కొనుగోలు చేయించాలి. లక్షిత సబ్సిడీ వ్యవస్థకు బదులుగా సార్వత్రిక ప్రజాపంపిణీ వ్యవస్థను ఆచరణలోకి తీసుకురావాలి. నగదు బదిలీ పథకాల ఆలోచనను కూడా మానుకోవాలి. గ్రామీణ ఉపాధి హామీని మరింత విస్తృతంగా అమలు చేయడంతో పాటు, పట్టణ ప్రాంతాల్లోనూ ఉపాధికి గ్యారంటీ ఇవ్వాలి.

ఏ దేశమైనా ఆహార భద్రత సాధించడమన్నది దీర్ఘకాలిక ప్రణాళికతో నిష్ఠగా నిర్వర్తించాల్సిన కర్తవ్యం. ఉత్పత్తి సేకరణ, నిల్వ, రవాణా, పంపిణీ తదితర అంశాలతో ముడిపడిన చిక్కు సమస్యలెన్నింటినో పరిష్కరిస్తేనే తప్ప సరైన పరిష్కారం దుర్లభం. ప్రతి ఒక్కరికీ ఆహారభద్రత కల్పించడం కోసం దేశంలో రెండో హరిత విప్లవానికి పాటుపడాలని ఆర్థిక సర్వే నిరుడు పిలుపిచ్చింది. ప్రస్తుతం అందుబాట్లో ఉన్న 17 కోట్ల హెక్టార్ల సాగుభూమి 10 కోట్ల హెక్టార్లకు తగ్గిపోనుంది... అందువల్ల పరిమిత వనరులతోనే రెట్టింపు ఉత్పాదకతను చేరుకోవాలని వ్యవసాయ శాస్త్రవేత్తలు దశాబ్దం క్రితమే హితవు పలికారు. రాష్ట్రాలవారీగా ఇప్పటి అవసరాలు తీర్చడంతో పాటు పెరిగే జనాభాకు దీటుగా ఇతోధిక దిగుబడుల సాధనకు విత్తనాల నాణ్యత, సమర్థ నీటి నిర్వహణ, భూసారం పెంపుదల అత్యంత కీలకం. వాటిని యుపిఏ జమానా గాలికొదిలేసింది. రసాయన ఎరువుల విచ్చలవిడి వాడకం మూలాన కోటీ 20 లక్షల హెక్టార్ల భూములు నిస్సారమైపోయాయి. భాస్వరం, నత్రజని, పోటాషియం లోపాలు, నీటిముంపు, భూక్షారంవల్ల పంటల ఉత్పాదకత దినదినం దెబ్బతినిపోతోంది.

1991 నుంచి నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల వేగం పెరిగింది. ఆహార వస్తువుల ధరలు కూడా విపరీతంగా పెరుగుతున్నందునే దేశంలోని పౌరులందరికీ ఆహార భద్రతా చర్యలను పటిష్ట పరచవలసిన అవసరమున్నది. ప్రభుత్వానికి పన్నుల రూపంలో వచ్చే ఆదాయంలో బడా సంపన్నవర్గాల వాటా రానురానూ తగ్గిపోతోంది. కానీ ప్రజలకు ఇచ్చే సబ్సిడీ ఒక్క రూపాయి పెరిగినా బోలెడంత చర్చ చేస్తారు. ప్రభుత్వ ప్రజా వ్యతిరేక చర్యలు పేదరికాన్ని మరింత పెంచడంతో పాటు అసమానతలు మరింత పెంచడానికి ఆజ్యం పోస్తున్నాయి. ఓ పక్కన కార్పొరేట్లకు లక్షల కోట్ల రూపాయలు రాయితీలు ఇస్తూ, మరోపక్కన పేదవాడికి ఇచ్చే రాయితీలు కుదిస్తున్నారు. పేదరికాన్ని తుడిచి పెడతామన్న బడాయి మాటలకే పరిమితమైంది. ఇది పాలకుల వర్గ నైజాన్ని బయట పెడుతుంది. పేదరికమన్నది మన దేశంలో ఎన్నికల ముడి సరుకుగా మారిపోయింది.

పోషకాహార లోపాలు, శిశు మరణాలు, తామరతంపరగా పుట్టుకొస్తున్న మురికివాడలు... ఇవన్నీ విస్తరిస్తున్న దారిద్ర్యానికి నిలువెత్తు నిదర్శనాలు. అసమానతలు పెరగడమే కాదు.. ప్రజల జీవన పరిస్థితులు క్షీణిస్తుండడం ఆందోళన కలిగించే విషయం. కానీ బడా కార్పొరేట్లు, పాలక రాజకీయవేత్తలు, ఉన్నత అధికార కూటమి ఈ ముగ్గురూ కలిసి లక్షల కోట్లు దేశ సంపదను కొల్లగొడుతున్నారు. లక్షల కోట్ల రూపాయల పన్నులు ఎగవేస్తూ పన్ను రాయితీలను పొందుతున్నారు. ఈ నేపథ్యంలో ప్రతి కుటుంబానికి కిలో రెండు రూపాయలు మించకుండా నెలకు 35 కిలోలు చొప్పున ఆహారధాన్యాలు పొందే సార్వత్రిక హక్కు ఉందనీ, పప్పుధాన్యాలు, వంట నూనెలు, పంచదార వంటి నిత్యావసర సరుకులు కూడా పిడిఎస్ ద్వారా సబ్సిడీ ధరలకు సరఫరా చేయాలన్న ప్రజాడిమాండ్ న్యాయ సమ్మతమైంది. అందువలన ప్రజలు ఎట్టి పరిస్థితుల్లోనూ ఆకలితో అలమటించరాదనుకుంటే ప్రజలను దారిద్ర్య రేఖకు దిగువకు నెట్టివేస్తున్న పాలకుల విధానాలకు వ్యతిరేకంగా ఆకలి, పేదరికంలేని మెరుగైన భారతదేశాన్ని నిర్మించే దిశగా సంఘటిత ప్రజా ఉద్యమాలు నిర్మించాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# బాధితులారా బహుపరాక్!

***దళిత, బహుజన నాయకత్వంలోని అవకాశవాదం పోరాటాలను బలహీనం చేస్తోందనీ, అణగారిన కులాల, జాతుల ప్రతిఘటనా చైతన్యమే వారి హక్కులను కాపాడుతుందనీ అంటున్నారు*** **కృపాకర్ మాదిగ**

శ్రీకాకుళం జిల్లా వంగర మండలం లక్ష్మింపేటలో జూన్ 12, 2012న వెనుకబగడిన కులమైన తూర్పు కాపు కులస్తుల జాతి నిర్మూలనా దాడుల్లో ఐదు మంది మాల కులస్తులు హతులయ్యారు. అనేక మంది మాలల కాళ్లు చేతులు విరిగి, నెత్తురోడి చావు నుండి తప్పించుకున్నారు. వెనుకబడిన కులాల ఆడవారు ఈ దాడులకు పాల్పడినవారిలో భాగస్తులవడం ఈ సంఘటనలో కొస మెరుపు.

మద్దువలస ప్రాజెక్టు కింద ఖాళీగా ఉన్న ప్రభుత్వ భూములను భూమిలేని మాల కులస్తులు సాగు చెయ్యడమే తూర్పుకాపుల దృష్టిలో నేరమయ్యింది. తూర్పుకాపులంటే ఎవరు? ప్రస్తుత పిసిసి అధ్యక్షుడు, రాష్ట్ర మంత్రి బొత్స సత్యనారాయణ తూర్పుకాపు, శ్రీకాకుళం పార్లమెంట్ సభ్యురాలు బొత్స ఝాన్సీ తూర్పుకాపు, సంఘటన జరిగిన వంగర మండలం ఎంపిపి బొత్స వాసుదేవనాయుడు తూర్పుకాపు. పేరుకు వెనుకబడిన కులమే అయినా, స్థానికశక్తి, ఆర్థికశక్తి, రాజకీయశక్తి, వాటితాలుకు కోరలు. ఆధిపత్య కులాల స్థాయికి తీసిపోకుండా పెంచుకున్న అహంకారి తూర్పుకాపు కులం.

బాధితులకు న్యాయం జరగాలని, దోషులకు కఠిన శిక్షలు పడాలని మానవతావాదులు, కులనిర్మూలనా వాదులు, అణగారిన కులాల ప్రజలు, సంఘాలు పెద్ద స్థాయిలో ఉద్యమించాయి. అయినప్పటికీ, లక్ష్మింపేట బాధితులకు కొద్ది మేరకు ఆర్థిక పరిహారం తప్ప, వారి ముఖ్యమైన డిమాండ్లేవి నేటి వరకూ నెరవేరనేలేదు. 1. బాధితులు దున్నుకుంటున్న ప్రభుత్వ భూములను బాధితులకే పంచాలి. 2. ఊచకోత సంఘటన జరిగిన ఊర్లోనే న్యాయ విచారణ జరగడానికి వీలుగా ఎస్.సి, ఎస్.టిలపై అత్యాచారాల నిరోధక చట్టం(1989) కల్పించిన ప్రత్యేక కోర్టును లక్ష్మింపేటలో స్థాపించాలి. 3. దాడులు పునరావృతం కాకుండా ప్రభుత్వం జాగ్రత్తలు తీసుకోవాలి. తగిన రక్షణ కల్పించాలి. ఇవీ బాధితుల ప్రధానమైన డిమాండ్లు.

లక్ష్మింపేట మాలల మానవ హక్కయిన భూమి హక్కుపై, వారి ప్రాణాలపైన జరిగిన ఈ అమానుష దాడులను సభ్య సమాజం తీవ్రంగా ఖండించింది. బాధితుల పట్ల ఎల్లెడలా సానుభూతి వ్యక్తమయ్యింది. స్వచ్ఛంద సంఘీభావం బాధితులకు అందింది. మాదిగలు, మాదిగ సంఘాలు కూడా పెద్ద ఎత్తున ఈ సంఘీభావంలో పాలు పంచుకున్నాయి. అనేక రంగాలకు చెందిన ప్రముఖులు, నాయకులు లక్ష్మింపేటకు వెళ్లి బాధితుల్ని పరామర్శించారు. ఓదార్చే ప్రయత్నం చేశారు.

ఐదు నెలలు దాటింది. అయినా బాధితులకు తగిన న్యాయం, పరిహారం అందించడంలో ప్రభుత్వం తీవ్ర వివక్ష, అలసత్వం పాటిస్తోంది. ప్రత్యేక కోర్టు ఎక్కడ స్థాపించాలన్నది ఇంకా వివాదంగానే ఉంది. కానీ మరోవైపు ప్రధాన నిందితులంతా బెయిలుపై బయటి కొచ్చేశారు. ఈ విచారకరమైన పరిణామాలు చోటు చేసుకోవడం వెనుక లక్ష్మింపేట బాధితులకు సత్వర న్యాయం దూరం కావడం వెనుక కారణాలేమిటి?

1. స్థానిక తహసీల్దారు, సర్కిల్ ఇన్‌స్పెక్టర్, డి.ఎస్.పి, ఎం.ఎల్.ఎ, మంత్రి–వీరందరూ బాధితుల సామాజిక వర్గానికే చెందినవారై ఉన్నప్పటికీ, బాధితులకు తగిన న్యాయం, రక్షణ అందకపోవడం దేనికి సూచిక? విద్య, ఉద్యోగ, సంక్షేమ, రాజకీయ రిజర్వేషన్‌లు పొందినవారు సహ బాధితుల పట్ల, సాటి కులస్తుల పట్ల నిర్వర్తించాల్సిన ప్రత్యక్ష, పరోక్ష సామాజిక బాధ్యతలను మరిచిపోయారనడానికి ఇది కొండ గుర్తు కాదా? కూడు దొరికితే కులాన్ని మర్చి పోవడం అంటే ఇదే? హవ్వ! ఇంత విభీషణమా?

2. ప్రముఖ మాల నాయకులు, మాల సంఘాలు, మాల మేధావుల మధ్య తగినంత సమన్వయం, ఐక్యత లోపించింది.

3. మాదిగ ఉద్యమం ముందుకు తెచ్చిన ఎస్.సి రిజర్వేషన్‌లలో పంపిణీ న్యాయం తాలుకు ప్రశ్నలకు జవాబుదారీ బాధ్యతల నుండి తప్పుకోవడం ద్వారా బహుజన కులాల దొంతరలోని అంతర్గత ఆధిపత్యాలను ప్రశ్నించే, ఎదుర్కొనే స్వభావం, నైతిక శక్తి, సమతా భావం మాల నాయకత్వంలో బలహీనపడింది.

4. ఆధిపత్య కులాల పార్టీలు రాజకీయ పాలేర్లుగా పని చేస్తున్న మాల నాయకుల ప్రాబల్యం పెరుగుతున్నది. ప్రగతిశీల నాయకత్వం బలహీనంగా మారింది.

5. కారెం శివాజీ మాల మహానాడు, జూపూడి ప్రభాకరరావు మాల మహానాడు, అద్దంకి దయాకర్ మాల మహానాడు తదితర తరహా, బుద్ధుడు, పూలే, అంబేద్కర్ ముసుగులో ఉన్న మాల మహా నేతల పంపిణీ న్యాయ వ్యతిరేక, సామాజిక న్యాయ వ్యతిరేక, అసాంఘిక శక్తులదే మాల కులంలో పై చేయిగా మారింది.

6. వామపక్ష పార్టీలలో, కమ్యూనిస్టు పార్టీలలో పని చేస్తున్న మాల నాయకులు వారి వారి రాజకీయ దృక్పథాలననుసరించి వారి కార్యక్రమం ప్రాధాన్యతలు వేరే ఉంటున్నాయి.

7. బాధితుల్లో, బాధితకులంలో రాజ్యాధికార స్పృహ కంటే తక్షణ న్యాయం, సహాయం పొందాలనే న్యాయబద్ధమైన సహజ కాంక్ష బలంగా ఉంటున్నది. రాయితీలు, పరిహారాలు, సంక్షేమ పథకాల పట్ల మక్కువ ఎక్కువగా ఉంటున్నది.

8. కొందరు వెనుకబడిన తరగతుల సోదరీ సోదరులు కుల హిందూ భూస్వాముల భూములను కౌలుకు తీసుకోవడంతో పాటు, వారి క్రూర పెత్తందారీ పోకడలను కూడా అలవర్చుకుంటున్నట్లు కనిపిస్తోంది. బి.సి ప్రజలు, మేధావులు ఈ అంశంపై ఆలోచించాలి. చర్చించాలి.

9. అంబేద్కర్ ఆలోచనా విధానం, కాన్షీరాం పని విధానంతో

# లక్షింపేట హత్యాకాండ

***దళితులపై నివాస ప్రాంతాలలోనూ, పనిచేసే చోటా, దేవాలయాల ప్రవేశంలో కూడా అంటరానితనం ఇంకా కొనసాగుతూనే ఉందంటున్నారు* కడియాల సుబ్బనాచారి**

**భూ**మి – కులం – వర్గం (ఆగస్ట్ సంచిక) పరస్పర సంబంధం అనే చర్చా వ్యాసాన్ని అక్టోబర్ సంచికలో ఎం. కృష్ణ ఆదిత్య రాశారు. చదివాను. వారి సద్విమర్శను రాసినందుకు ముందుగా వారికి నా కృతజ్ఞతాభివందనాలు. వారి విశ్లేషణ ప్రకారం అన్ని కులాల్లో ఉండే పేద వాళ్లతో సహా మాల, మాదిగ కులస్థుల్ని గ్రామ జీవనానికి దగ్గరగా ఉన్నారని భావించవలసి వస్తున్నది. చాకలి, మంగలి, కుమ్మరి, కంసాలి మొదలైన వారంతా గ్రామంలోనే ఏదో ఒక వీథికి పరిమితమై ఉంటారు. ఎక్కువ సంఖ్యలో ఉంటే అట్లా నివాసాలు ప్రత్యేకంగా ఉంటాయి. ఒకటి రెండిళ్లు ఉన్నప్పుడు అగ్రవర్ణాల ఇళ్ల పక్కనే నివాసాలుంటారు. మాల, మాదిగ కులస్థులు మాత్రం గ్రామానికి ఎడంగానే వారిదొక వాడగా ఉంటూ ప్రత్యేకంగా వారికొక గుడి కూడా ఉంటూ గ్రామానికి సంబంధం లేకుండా జీవిస్తున్నారు గదా! అగ్రవర్ణాల అవసరార్థం గ్రామంలోని పొలం పనులకు, రైతుల దొడ్లలో కసుపు ఊడ్చి పోతుంటారు. వారిదొక ప్రత్యేకమైన వాడగానే ఉంటున్నది గాని అగ్రవర్ణాల గ్రామానికి సంబంధం లేదు. తతిమ్మా కులాలైన చాకలి, మంగలి, కుమ్మరి ఇంకా మిగతా కులాల వారు గ్రామంలోనే అగ్రవర్ణాల ఇళ్ల సరసన్నే ఉంటున్నారు. వీరికి మాత్రం అగ్రవర్ణాల గుడికి పోవడానికి హక్కున్నది గాని మాల, మాదిగల కులస్థులకు మాత్రం లేదు గదా! అదిగాక గుడి అనేది హిందూ సంస్కృతికి గుండెకాయలాంటిది. అటువంటిది గ్రామంలోని అగ్రవర్ణాలకు, తతిమ్మా కులాలకు సంబంధించినదేగాని మాల, మాదిగ కులాలకు లేదు గదా! వీరికి వాళ్ల వాడలో ప్రత్యేకంగా గుడి ఉంటుంది. మాల, మాదిగ కులస్థుల మీద కొన్ని కఠినమైన నిబంధనలున్నాయి గాని ఇతర చాకలి, మంగలి, కుమ్మరి మొదలైన కులస్థులకున్నాయా?

దేవాలయం ముందు మండపంలో మంగలి వారు కూర్చొని వాయిద్యాలు వాయిస్తుంటారు. మాల, మాదిగలకు కూర్చునే హక్కున్నదా! అగ్రవర్ణాల ఇళ్లల్లో పనులు జెయ్యడానికి చాకలి, మంగలి, కుమ్మరి కులాలకు అంటు లేదు గదా! ఈ వ్యత్యాసాల్ని గుర్తించకుండా మాల, మాదిగ కులస్థుల్ని కూడా వీరితో సమానం జెయ్యడం సరైన విశ్లేషణ కాదని నా అభిప్రాయం. హిందూ దేశంలో కుల అణచివేత ప్రధానమైనది కాదా? గ్రామ నడివీథిలో గానీ, అగ్రవర్ణాల ఇళ్ల పక్కన గానీ హరిజనులు నివసించగలరా? వీరికి ఆ హక్కున్నదా? తతిమ్మా కులాలు పక్క పక్కనే నివసిస్తున్నారు గదా. ఈనాడు అనేక పోరాటాల ద్వారా సంపాదించుకొన్న పరిమిత సౌకర్యాలతో ఆనాటికన్న కొంచెం గౌరవంగా వారు జీవించగలుగుతున్నారు. కాని వారి హోదాను ఎక్కడ గుర్తిస్తున్నారు? అది అగ్రవర్ణాలయితే ఎంత ప్రచార ఆర్భాటాలతో ఊరేగిస్తారో తెలియదా. రిజర్వేషన్ సౌకర్యంతో కొన్ని ఉద్యోగ సదుపాయాలు కలిగి కొంచెం గౌరవంగా జీవించగలుగుతున్నారు గాని ఈ హిందూ అగ్రవర్ణాల దయతలిచి ఇచ్చింది మాత్రం కాదు అనేది నిస్సందేహం. పట్టణీకరణ మార్పులతో వారు కడుపు నిండా తింటున్నారు. ఇళ్లు కట్టుకుంటున్నారు. వంటి నిండా గుడ్డ కట్టుకొంటున్నారు. ఇది నిజమేగాని వీరికి సంఘంలో ఏమాత్రం గౌరవం, హోదా ఉందో చెప్పండి. ఆనాడు కేంద్ర మంత్రి ఆలిండియా కాంగ్రెస్ నాయకుడు అయిన బాబు జగ్జీవన్ రామ్ ఒక ప్రముఖమైన హిందూ దేవాలయంలో అడుగుపెట్టితే ఆ తరువాత దాన్ని శుద్ధి కార్యక్రమంతో అంటబాపుకొన్నారు. ఈ హిందూ బ్రాహ్మణీయ

---

రాజకీయ విముక్తి దిశగా మాల కులస్తులను సంఘటితం చేసే బలమైన మాల నాయకత్వం లోపించింది.

10. పైన పేర్కొన్న పరిమితులు, బలహీనతలు, ప్రఘాతుకత్వాలు, వ్యక్తిగత స్వార్థాలు, దళారీతత్వం, పారదర్శకత, జవాబుదారీ తనం, సాంఘిక పర్యవేక్షణ లోపించడం మొదలైన దుస్వభావాలు బాధితుల సామాజికవర్గం నాయకుల్లోనే కాకుండా కొందరు మాదిగ నాయకులు, కొన్ని మాదిగ సంఘాల్లోనూ, ఆ మాటకొస్తే అన్ని బహుజన కులాల్లోనూ ఈ రకమైన జాడ్యం పేరుకుపోయింది. ఊడలు దిగి ఉంది. ఈ కారణాల వల్లనే లక్షింపేట బాధిత మాల కులస్తులకు ఇంతవరకూ తగిన న్యాయం జరగలేదని భావించాలి.

అసెంబ్లీ, పార్లమెంటులకు ఎన్నికలు సమీపిస్తున్నాయి. దీంతో మాల కులస్తుల ఓటు బ్యాంకును సానుకూలం చేసుకునే, సుస్థిరం చేసుకునే వ్యూహంలో భాగంగా అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీ ఆలస్యంగానైనా ప్రభుత్వం చేత లక్షింపేట బాధితులకు కొంత న్యాయం చేయించడానికి పూనుకోవచ్చు. బాధితుల అభివృద్ధికి ప్రత్యేక ప్యాకేజి ప్రకటించవచ్చు. ఈ విధంగా బాధిత కులస్తుల ఓట్ల లబ్ధి పొందాలనుకునే అధికార పార్టీ వ్యూహం కాంగ్రెస్‌కి ఉండనే ఉంటుంది. ఇలా బాధితులకు న్యాయం చేసినట్లు నటించే మనువాద ప్రభుత్వానికుండే వ్యూహం కాంగ్రెస్‌కి ఉండనే ఉంటుంది. ఇలా బాధితులకు భవిష్యత్తులో జరగబోయే కొద్ది పాటి పరిహార న్యాయం, కంటితుడుపు న్యాయం మన సంఘీభావం వల్లనే, మన పోరాట పటిమ వల్లనే జరిగిందని కొందరు నాయకులు, కొన్ని సంఘాలు సంబరపడవచ్చు. ఏదేమైనా, అణగారిన కులాలు, జాతుల్లోని ప్రతిఘటనా చైతన్యమే బాధితుల ఆత్మగౌరవాన్ని, హక్కులను రక్షిస్తుంది. వారిలో దీర్ఘకాలిక ప్రతిఘటనా శక్తిని పెంచుతుంది. ఈ దిశగా అడుగులేసే, పాదయాత్రలు నిర్వహించే ప్రతి ఒక్కరికీ, ప్రతి సంఘానికి నీలి సలాంలు. జై భీమ్‌లు. లక్షింపేట హక్కుల పేట కావాలి. బహుజన రాజ్యాధికార చైతన్యానికి కోటగా మారాలి.

*(రచయిత ఎం.ఆర్.పి.ఎస్. వ్యవస్థాపక కార్యదర్శి)* వీ

సంస్కృతి ముందు ఆ నాయకుడి హోదా ఏమైంది? హిందూ బ్రాహ్మణీయ సంస్కృతి ముందు ఇటువంటి గొప్పవారి గౌరవం బూడిదలో పోసిన పన్నీరు చందమే అయింది గదా. ఏ అధికారం లేకపోయినా, ఏ హోదా లేకపోయినా అగ్రవర్ణాలు దాని తతిమ్మ కులాలు గాని అడుగు పెట్టితే శుద్ధి కార్యక్రమం జరిపి మైలబాపుకొంటున్నారా?

నైజాం వ్యతిరేక పోరాటంలో ప్రజల మీద జరిగిన దాడులకు ప్రత్యేకమైన విశ్లేషణ చెయ్యాలి. ఈనాటి లక్ష్మింపేట లాంటి ఘటనల్ని ఇంకా అంతకు ముందటి హరిజనుల మీద మూకుమ్మడి దాడులతో ముడిపెట్టరాదు. ఇది సమంజసం గాదు అని నా అభిప్రాయం. నైజాం నవాబుకు వ్యతిరేకంగా పోరాడేటపుడు ప్రధాన శత్రువు నవాబు. ఆ నవాబుకు అండగానున్న హిందూ అగ్రవర్ణ భూస్వాములైన రెడ్డి, దొర, బ్రాహ్మణులు కూడా అణిగిమణిగి ఉండేవారు. నవాబు రాచరిక అణచివేతకు వ్యతిరేకంగా వీరంతా తిరగబడ్డారు. అన్ని కులాల్లోని పేద వాళ్లతో సహా. పేదవాళ్లు, ధనిక భూస్వాములు కలిసి వచ్చిన పోరాటం. ఆనాటి నాయకత్వం అగ్రవర్ణ భూస్వాములదే. మాల, మాదిగ కులస్థులు సైన్యంలాగా వీరికి అండగా ఉండి తోడ్పడ్డారు. పోరాటంలో త్యాగాలు చేశారు. వీరికన్న ఎక్కువగానే త్యాగాలు అగ్రవర్ణ భూస్వాములు కూడా చేశారు. వీరి త్యాగాలు అనన్య సామాన్యం. అగ్రవర్ణాలదే నాయకత్వం కాబట్టి తదితర అన్ని కులాలు ఏకమై నవాబుకు వ్యతిరేకంగా తిరగబడ్డారు. అయితే మాల, మాదిగలకు సామాజిక గౌరవం దక్కిందా? కొంత భూమిని కూడా సంపాదించుకొని ఉండవచ్చు. ఎక్కువగా లాభపడింది మాత్రం అగ్రవర్ణాల రైతులు, తదితర బి.సి. కులాలు మాత్రమే. దీన్ని గమనించుకోవాల్సిందిగా కోరుతున్నాను.

ఈనాడు జరిగే మాల, మాదిగ కులస్థుల మీద దాడులు మూకుమ్మడిగా జరుగుతున్నాయి. ఆ తరువాత నక్సలైట్ల పోరాటంలో కూడా మాల, మాదిగల కులస్తులు ఇంకొంచెం బాగుపడి ఉండవచ్చు. గౌరవం, సామాజిక హోదా సంపాదించుకొని ఉండవచ్చు. ఇక్కడ కూడా నాయకత్వం అగ్రవర్ణాలదే గదా! అగ్రవర్ణాల నాయకులలో ఎంతో మంది అనన్య త్యాగాలతో భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా చివరికంటా నిలబడి ఉద్యమాన్ని ముందుకు తీసుకొని వెళ్లారు అనేది కాదనలేని సత్యం. దిగజారిపొయ్యే వాళ్లు దిగజారిపోయినప్పటికీ ఈ దిగజారడం అన్ని కులాల్లోను ఉంది. ఇది వర్గపోరాటం. ఈ పోరాటాన్ని అంతం చెయ్యకపోతే దోపిడీ వర్గాలు బతకలేవు. అందువలన వారి దోపిడీకి అడ్డు వచ్చే వారిని వారు ఎవరైనా సరే పాలకవర్గాలు నిర్దాక్షిణ్యంగా అంతమొందిస్తాయి అనేది జగద్విదితం. అయితే ఈ వర్గ పోరాటానికి మాల, మాదిగల మీద జరిగిన హత్యాకాండకు సంబంధం లేదు. ఇది కుల అణచివేతలో భాగమే. తతిమ్మా వారితో సమానంగా వీరికి భూమిని రానీయరు. ఇది కుల అణచివేతలో ఉన్న మర్మం. ప్రతి పోరాటం కూడా భూమితో ముడిపడి ఉంటుంది. దీన్ని కాదనలేం. తరతరాలుగా జరుగుతున్న పోరాటం చారెడు నేల కోసమే. ఇది వర్గ పోరాటానికి సంబంధించింది. సామాజిక గౌరవం కోసం జరిగే పోరాటానికి ప్రత్యేకత ఉన్నది. అగ్రవర్ణాలతో సమానంగా వీరు ఎదగడానికి లేదు గదా. మాల, మాదిగలు సంపాదించుకొనే దానికి ఇతర అగ్రవర్ణాలు సంపాదించుకొనే దానికి ఉండే వ్యత్యాసాన్ని హిందూ విష సంస్కృతిలో నుంచే చూడాలి.

గ్రామాలకు కొన్ని చోట్ల దగ్గరగానూ ఇంకొన్ని చోట్ల దూరంగానూ వీరి వాడలుండవచ్చు గానీ, ఈ దూరాన్ని బట్టి వారిని గ్రామంలోని వారిగా భావించితే ఎట్లా? ఈనాటి గ్రామాలు ఆనాటి కన్నా పెరిగిన క్రమంలో ఆ దూరం తగ్గి దగ్గర అవవచ్చు. అంతేగాని వారి వాడ వారిది. వీరి గ్రామం వీరిదే. గ్రామంలో పనులప్పుడు మాత్రమే ఊళ్లోకి వస్తారు. తతిమ్మ కులాలైన చాకలి, మంగలి, కుమ్మరి తదితర కులాలు వీధుల్లో నిర్భయంగా తిరుగుతారు. ఒక్కచోట నిలబడి మాట్లాడు కొంటారు. కలిసి మెలసి తిరుగుతుంటారు. సంభాషణల్లో అత్త, మామ, అన్నా అని సంబోధించుకుంటూ అనేక రకాలుగా మాట్లాడుకొంటారు. మాల, మాదిగలకు గ్రామం వీధుల్లో అందరితోబాటు తిరిగే హక్కున్నదా? వీరిని వరుసలతో పిలుస్తున్నారా? లేదు అనేది వాస్తవం. ఇది హిందూ సంస్కృతిలోనున్న కఠిన నిబంధనలేగదా? ఈ నిబంధనలు ఎక్కడ నుండి వచ్చినాయి? బ్రాహ్మణిజం భావజాలంలోనించే గదా? బ్రాహ్మణిజం అంటే ఏదో ఒక అగ్రకుల సాంప్రదాయానికి సంబంధించినదా? ఇది ఒక కులానికి సంబంధించినదా? కాదు. అయితే దాని స్వభావం ఏమిటి? అనేది ముఖ్యం. బ్రాహ్మణిజం అంటే దోపిడీవర్గ భావజాలం. ఇది అన్ని దేశాల దోపిడీ పాలకవర్గాలకు వర్తిస్తుంది. ఎక్కడ దోపిడీ ఉంటుందో అక్కడల్లా ఈ బ్రాహ్మణిజం భావజాలం పాలకవర్గ దోపిడీ గాంగ్రకు సిద్ధాంత ఆయుధంగా ఉంటుంది. అందుకే ఏ విదేశీయులు మన దేశం మీదకొచ్చి దండయాత్రలు చేసి రాజ్యాలు స్థాపించినా ఈ బ్రాహ్మణిజం భావజాలాన్నే ఆశ్రయించారు అనేది చారిత్రక సత్యం. బ్రిటిష్ వాళ్లు గానీ, వారికి ముందు మహమ్మదీయులు గానీ ఇంకా ముందుకుపోతే అన్ని విదేశీ తెగలు మన దేశం మీదకొచ్చి పడినాయి. ప్రాచీన యుగంలో కాలుబెట్టిన ఆర్యులే ఇక్కడ స్థిరపడడానికీ, ఇక్కడున్న ఆదిమ జాతుల మీద పెత్తనం చెయ్యడానికీ, వారిని లోబరచుకొని నిలదొక్కుకోవాలి గనుక ఈ దోపిడీ వర్గ భావజాలాన్ని ప్రవేశపెట్టినారనేది ఇంకొక చారిత్రక సత్యం. ఈ భావజాలం ఏదో ఒక కులానికి సంబంధించినది కాదు. దోపిడీవర్గాలు ఏవైతే ఉన్నాయో వీటన్నిటికీ ఇది సామాన్యమైన సిద్ధాంతంగా ఉన్నది. దోపిడీని నిలబెట్టి కాపాడే భావజాలం గనుకనే బ్రాహ్మణిజం జపించారు. వాళ్లు అధికారం నిలదొక్కుకొన్న తరువాత దాన్ని వదిలేశారు. అసలైన భావజాలాన్ని ఈనాడు సరళీకరణ పేరుతో సమాజాన్ని శాసిస్తున్నారు. వీరికవసరమైతే ఏ సిద్ధాంతమైనా స్వీకరిస్తారు. ఆ వేషమే వేస్తారు. వారి పని అయిన తరువాత నిర్దాక్షిణ్యంగా వదిలేస్తారు. కాని శ్రామికవర్గ సిద్ధాంతమైన మార్క్సిజం అంత సులభంగా అన్య వర్గ భావజాలాన్ని స్వీకరించదు గదా. ఇదే వారికి మనకున్న తేడా. స్వాతంత్ర్యం పూర్వంలో గాంధీ మాల, మాదిగ కులస్థుల్ని కలుపుకొని రావడంలో ప్రధానపాత్ర పోషించారు. కోట్లాదిగా ఉన్నవారిని ఎడంగా పెట్టి బ్రిటిష్ వ్యతిరేక పోరాటాన్ని సాగించలేమని గుర్తించినందువల్లనే వారిని జాతీయోద్యమం లో కలుపుకొన్నారు. వర్ణాశ్రమ ధర్మాల్ని ఆయన గుర్తించినప్పటికీ హరిజనులని నామకరణం చేసి సమాజంలో వారికొక గౌరవమైన స్థానం కల్పించారు. ఆ తదనంతర పరిణామాలు నేడు చూస్తున్నాం. అగ్రవర్ణ పాలక మేధావులు అతి తెలివైనవారే. అవసరార్థం దేనికైనా సిద్ధపడతారు. ఆకలిగొన్నవారు ఆకలి పోరాటం మాత్రమే చేస్తారు. అంటరానివాడు ఆకలి పోరాటంతోపాటు ఆత్మగౌరవ పోరాటం కూడా చేస్తాడు.

మార్క్సిజం అంతర్జాతీయ శ్రామికవర్గ సిద్ధాంతం; బ్రాహ్మణిజం అంతర్జాతీయ దోపిడీ వర్గ సిద్ధాంతం. భారతీయ రుషి స్వామి వివేకానంద 'హిందూ మతం ప్రపంచ మతం' అని చెప్పినట్టు.

*(రచయిత ఆర్.ఎం.పి. డాక్టర్)*

వీ

# జైలులో ఫోన్ సౌకర్యం అత్యవసరం!

***జైళ్లలో అనధికార సెల్‌ఫోన్ వాడకాన్ని నియంత్రించాలంటే అధికారికంగా సెల్‌ఫోన్ సౌకర్యం కల్పించి, మానవతా దృక్పథంతో ఖైదీల సమస్యలను పరిష్కరించాలంటున్నారు ఎ. కొండయ్య***

కొద్ది రోజుల కిందట 'కడప జైళ్లలో ఫోన్ లీలలు' గురించి వార్త ఓ దినపత్రికలో ప్రచురితమైంది. కడపలోనే కాదు, గతంలో అనేక జైళ్లలో అనధికారికంగా సెల్‌ఫోన్స్ వాడకం మొదలైనట్లు అడపా, దడపా; అక్కడా, ఇక్కడా వార్తలు వస్తూనే ఉన్నాయి. ఇలాంటివి పునరావృతం కాకుండా ఉండాలంటే జైళ్లలో అధికారికంగానే టెలిఫోన్ సౌకర్యం కల్పించాలని ఖైదీలు తమదైన వాదన వినిపిస్తున్నారు. నాలుగు గోడల మధ్య నిర్బంధించబడిన ఖైదీలూ వారి కుటుంబీకులతోనూ, బంధు మిత్రులతోనూ, లాయర్లతోనూ సంప్రదింపుల కోసం అధికారికంగా టెలిఫోన్ సౌకర్యం కల్పించడం న్యాయబద్ధమే కాదు, అనివార్యం, అత్యవసరం కూడా. ఇలా ఎందుకు నొక్కి చెప్పాల్సి వస్తుందో ఖైదీలు, వారి కుటుంబీకుల మధ్య సుదీర్ఘ ఎడబాటు వల్ల నెలకొంటున్న సమస్యల తీవ్రతను మానవీయ దృక్పథంతో పరిశీలిస్తే తప్ప అర్థం కాదు. ఖైదీల జీవితాల గురించిన వాస్తవాలు అనేకం ఇప్పటికీ పౌరసమాజానికి తెలియవు.

ఇటీవల జైలు వెలుపల పనిచేసేందుకోసం వెళ్లి సిబ్బంది కళ్లుగప్పి పారిపోయి తిరిగి పట్టుబడిన ఖైదీని పిలిచి 'ఎందుకలా చేశావని' సూపరింటెండెంట్ అడిగారు. 'అయ్యా నేను భార్యను చంపిన కేసులో జైలు పాలయ్యాను. దీంతో నా ముగ్గురాడబిడ్డలూ తల్లీదండ్రీ లేని అనాథల్లా బతుకుతున్నారు. వాళ్లకేమైందో ఏమోగాని సంవత్సర కాలంగా జైలు వద్దకు ఇంటర్వ్యూకు రానేలేదు. అలా కొంత కాలంగా వాళ్ల బాగోగులు తెలుసుకొనే వీలులేక చిత్రహింస అనుభవించాను. వాళ్లకు ఏమైందో ఏమోనన్న ఆందోళన నన్ను పారిపోయేలా చేసిందని' ఆ ఖైదీ సూపరింటెండెంట్‌తో మొరపెట్టుకున్నాడు. ఖైదీ మనోవేదనను ఓపిగ్గా అర్థం చేసుకొని 'ముందే నాకు ఈ విషయాన్ని చెప్పి ఉంటే, తక్షణం మనిషిని పంపి నీ పిల్లల్ని పిలిపించి మాట్లాడించే వాణ్ని గదా?' అంటూ తిట్టి, కొట్టినంత పనిచేసిన సూపరింటెండెంట్ వెంటనే ఆయన పిల్లల్ని పిలిపించి మాట్లాడించిన తర్వాతే ఆ ఖైదీ కాస్త సంతోషంగా ఉండగలుగు తున్నాడు. ఖైదీకి వారి కుటుంబీకులతో ముఖ్యంగా భార్యా పిల్లలతో సంబంధాలు తెగిపోతే ఎలాంటి అనర్థాలకు దారితీస్తుందో తెలియబరిచే ఒక చిన్న ఉదాహరణ మాత్రమే ఇది. అసలు ఖైదీలకు వారి కుటుంబీకు లతో, బంధు మిత్రులతో, లాయర్లతో సంప్రదింపులు జరపడానికి ఉన్న మార్గాలు ఏమిటి? వాటి ద్వారా ఖైదీలకు ఎంత వరకు ప్రయోజనం నెరవేరుతున్నది? అన్న విషయాల గురించి పరిశీలిస్తే ఇందుకు రెండే రెండు అధికారిక మార్గాలు ఉన్నట్లు తెలుసుకోవచ్చు. ఒకటి, ఇంటర్వ్యూలు; రెండు, ఉత్తర-ప్రత్యుత్తరాలు.

**ఇంటర్వ్యూలు :** ప్రతి కేంద్ర కారాగారంలో దాని చుట్టూ ఉన్న నాలుగు, ఐదు జిల్లాల ఖైదీలే గాక, సుదూర ప్రాంతాల నుండి వచ్చిన ఖైదీలు కూడా ఉండాల్సి వస్తున్నది. ప్రారంభంలో జైలుకు దగ్గరగా ఉన్న ప్రాంతాల కుటుంబీకులు నెలకొకసారి, దూర ప్రాంతాల వాళ్లు మూడు నెలలకోసారి ఇంటర్వ్యూలకు వచ్చి మాట్లాడి పోగలుగుతున్నారు. కుటుంబ పోషణకు ఆధారంగా ఉన్న పురుషులే అధికంగా జైలు పాలవడం వల్ల జీవనాధారం కోల్పోయిన ఆయా కుటుంబాల ఆర్థిక పరిస్థితి వేగంగా క్షీణించి పోతున్నది.

ముఖ్యంగా ఏడు సంవత్సరాల నుండి పది, పద్నాలుగు సంవత్సరాల వరకు జైళ్లోనే మగ్గిపోతున్న జీవిత ఖైదీల వారి కుటుంబీకుల పరిస్థితి మరింత దయనీయంగా మారుతున్నది. దీంతో మధ్యతరగతి కుటుంబాలు సైతం ఇంటర్వ్యూలకు రావడం క్రమంగా మందగిస్తున్నది. 'చేసేవాళ్లు లేక భూములు బీడుగా మారుతున్నాయి. పిల్లల చదువులు గాలిలో దీపంలా మారుతున్నాయి. వృద్ధులైన తల్లిదండ్రులను చూసే దిక్కులేక కాటికి కాళ్లుజాపుకొని ఆకలి అనారోగ్యాలతో నిస్సహాయంగా రోదిస్తూ ఉంటున్నారు. సుదీర్ఘ ఎడబాటు వల్ల భార్యాభర్తల మధ్య అపోహలు తలెత్తి అనవసర గొడవలు, వివాహేతర సంబంధాలు, పునర్ వివాహాలకు దారితీస్తున్నాయి. ఇంటిల్లిపాదీ కష్టపడినా పూట గడవని ఈ రోజుల్లో కేవలం తల్లుల రెక్కల కష్టం మీదనే కుటుంబ పోషణా, పిల్లల చదువులూ, అనారోగ్యాలూ నెట్టుకురావడం అసాధ్యంగా మారి, అప్పుల పాలవు తున్నారు. ఈ పరిస్థితుల్లో ఖైదీల వద్దకు ఇంటర్వ్యూలకు రావడం, వారి బాగోగులు కూడా చూడడం ఆయా కుటుంబాలకు పెనుభారంగా మారుతున్నది. ఆరు నెలలకో, సంవత్సరానికో ఓసారి ఇంటర్వ్యూకు వచ్చినా జైలు వాళ్లిచ్చే కొద్దిపాటి సమయంలో ఎన్ని విషయాలు మాట్లాడుకోగలరు? ఎన్ని సమస్యలు పరిష్కరించుకోగలరు? చాలాకాలం తర్వాత వచ్చిన పిల్లలను ఒడిలోకి తీసుకొని, ముద్దు ముచ్చట్ల అనంతరం బాగోగులు తెలుసుకోడానికే ఇచ్చినకాలం గడిచిపోతున్నది. ఎన్నో విషయాలు మాట్లాడాల్సి ఉన్నప్పటికీ సాధ్యంగాక అసంతృప్తితోనే వెనుతిరగక తప్పడం లేదు. ఇక పిల్లల్ని చూడకుండా క్షణం ఉండలేని తల్లులు జైలు పాలైతే అదెంత నరకమో అనుభవిస్తే తప్ప అర్థం కాదు. పైన చెప్పుకొన్న పరిస్థితుల వల్ల పిల్లలను చూడడం కోసం నెలలు నిరీక్షించినా సాధ్యం కావడం లేదు. కనీసం ఫోన్‌లోనైనా తమ పిల్లలను పలుకరించి, యోగక్షేమాలు తెలుసుకొనే అవకాశం ఎప్పుడు కల్పిస్తారా? అని మహిళా ఖైదీలు వేయి కళ్లతో ఎదురు చూస్తున్నారు.

**ఉత్తర - ప్రత్యుత్తరాలు :** కొన్ని సాధారణ సమయాల్లో ఈ ఉత్తర-ప్రత్యుత్తరాలు ఖైదీలకు కొంత ఉపయుక్తంగా ఉన్నప్పటికీ కొన్ని క్లిష్ట సమయాల్లో ఇవి ఎందుకూ ఉపయోగపడడం లేదు. కారణం ఇవెంత ఆలస్యంగా, అస్తవ్యస్తంగా నడుస్తున్నాయో నా స్వీయ అనుభవమే సాక్ష్యం. 'ఈనెల 14వ తేదీన కడపలో వాయిదా ఉంది. కోర్టు దగ్గరకు

రండి' అని నేను 5వ తేదీన లాయర్‌కు రాసిన ఉత్తరాన్ని జైలర్ సెన్సార్ చేసి 9వ తేదీన పోస్ట్ ఆఫీస్‌కు పంపారు. అది వాయిదా అయిపోయిన నాలుగు రోజుల తర్వాత 18వ తేదీన లాయర్‌కు అందింది. ఇలాంటి చేదు అనుభవాలతో ఉత్తరాలపై ఆసక్తి తగ్గిపోతున్నది. అంతేగాక ఖైదీలు, వారి కుటుంబీకులలో అధికంగా నిరక్షరాస్యులే ఉంటున్నారు. లెటర్స్ రాయాలన్నా, వాటిని చదివించుకోవాలన్నా ఇతరుల దగ్గరకు వెళ్లాల్సిందే. అలాగే ఖైదీలకు వచ్చే, పోయే ఉత్తరాలను జైలు అధికారులు చదివి సెన్సార్ చేయడం ఆనవాయితీ. జైలు అధికారుల పట్ల ఖైదీలకున్న అనేక భయ, సందేహాల వల్ల, తమ కుటుంబాలలోని విషయాలు ఇతరులకు తెలియడం ఇష్టంలేనందువల్ల ఈ ఉత్తర – ప్రత్యుత్తరాల పట్ల ఖైదీలు అయిష్టత వ్యక్తం చేస్తున్నారు.

ఇలా అధికారికంగా ఉన్న పైరెండు మార్గాలలో ఉన్న అనేక ఇబ్బందులు, పరిమితుల కారణంగా ఖైదీలు అనధికార మార్గాల ద్వారానైనా సమస్యలు పరిష్కరించుకోక తప్పడం లేదు. ఇందులో స్టాఫ్ ద్వారా ఫోన్లు చేయించడం కూడా ఒక చిన్న మార్గం.

ఖైదీలు తమ భార్యా పిల్లలకూ, లాయర్లకూ తక్షణం ఏదైనా విషయం తెలియజేయాలనుకుంటే విషయాన్ని ఓ చీటీపై రాసి పదో, ఇరవయ్యో స్టాఫ్ చేతిలో పెట్టాలి. వాళ్లు డ్యూటీ ముగించుకొని ఇంటికెళ్లినపుడు సంబంధిత నెంబర్‌కి ఫోన్‌చేసి విషయాలు తెలుసుకొని మరుసటి దినం తిరిగి డ్యూటీకి వచ్చినపుడు ఖైదీలకు విషయం తెలియజేస్తారు. ఇది అనధికారికం కాబట్టి అధికారుల నుండి స్టాఫ్‌కు ఎదురయ్యే సమస్యల వల్ల చాలామంది స్టాఫ్ ఇందుకు సిద్ధం కారు. ఖైదీల వద్ద డబ్బులు ఉంచుకోవడం కూడా నిషిద్ధమే కాబట్టి రహస్యంగా దాచుకొన్న కొద్దిపాటి డబ్బులతో తమ కులం వాళ్ల దగ్గరికో లేదా ప్రాంతం వాళ్ల దగ్గరికో కాళ్లరిగేలా తిరిగితే తప్ప ఇది కూడా సాధ్యం కాదు. అయినా దీన్ని ఆశ్రయించక తప్పని పరిస్థితులెలా ఉంటాయో మూడు, నాలుగు సంవత్సరాలు వెనక్కు వెళ్లి మరో ఖైదీ విషాద అనుభవాన్ని ఇప్పుడు గుర్తు చేయడం సమంజసం.

తన చిన్న కుమార్తె తీవ్ర అనారోగ్యం పాలై హాస్పిటల్‌లో చేర్చాల్సి వచ్చింది. ప్రతిరోజు పాప బాగోగులు తెలుసుకొంటే తప్ప ఆ ఖైదీకి మనశ్శాంతి ఉండేదికాదు. ఇందుకోసం ప్రతిరోజు ఎంతోమంది స్టాఫ్‌ను బతిమాలుకొంటూ కనిపించే వాడు. కొద్దిరోజులు గడిచేసరికి అది కూడా సాధ్యం కాలేదు. అలాంటి పరిస్థితుల్లో పాప ఆరోగ్యం ఎలా ఉందో, వైద్యానికి డబ్బులెలా చూస్తున్నారోనన్న ఆందోళన తీవ్రమై దుప్పటి ముసుగేసుకొని తనలో తానే ఏడ్చుకొనేవాడు. అన్నం సరిగా తినక, దిగాలు పడి పిచ్చోడిలా తిరుగుతున్న విషయం తోటి ఖైదీల ద్వారా జైలర్‌కు తెలిసింది. ఈయన కాస్త మానవతా దృక్పథం ఉన్న వ్యక్తి కావడం వల్ల ఖైదీ మనోవేదన అడిగి తెలుసుకొని, తానే ఫోన్ చేసి విషయాలు చెపుతానని హామీ ఇవ్వడంతో సమస్య కొంత పరిష్కారమైంది. నెలరోజుల తర్వాత హాస్పిటల్ నుండి కూతురు క్షేమంగా ఇంటికి చేరిందన్న వార్త ఖైదీకి చెప్పినరోజు కృతజ్ఞత నిండిన మనసుతో జైలర్ కాళ్లకు మొక్కి ఆనందంగా కన్నీరు కార్చిన సన్నివేశం నాతో సహా చూపరులందరినీ కదిలించివేసింది.

ఇలా పైన ప్రస్తావించిన పరిస్థితుల గురించి చదివిన వారందరికీ 'అయ్యో! పాపం ఖైదీలకు ఫోన్ సౌకర్యం కల్పిస్తే ఎంత బాగుండు' అని అనిపించడం సహజం. ఇలాంటి సమయాల్లో జైలు సిబ్బంది మానవీయ సహకారం అందకపోతే పరిస్థితి ఏమిటి? అన్న సందేహం కూడా కలుగక మానదు. నాకు తెలిసిన ఒకటి, రెండు సమస్యలే ఇలా ఉంటే నిత్యం ప్రతి జైల్లో ఇలాంటి వందలాది సమస్యలు ఖైదీలను వెంటాడుతూనే ఉన్నాయి. ఎంతగా మానవీయ సహకారం అందించాలని అనుకొన్నప్పటికీ జైలు సిబ్బందికీ, అధికారులకూ ఇవి తలకు మించిన భారంగా మారుతున్నాయి. ఒకవైపు సమాచార వ్యవస్థలో వచ్చిన పెనుమార్పుల వల్ల సెల్‌ఫోన్‌లు ప్రతి మారుమూల పల్లెకూ విస్తరించాయి. ఉదయం డ్యూటీ కోసం వెళ్లి సాయంత్రానికి ఇంటికి చేరే ఉద్యోగస్తుడు మధ్యలో ఒకటి రెండుసార్లు ఫోన్‌చేసి భార్యా పిల్లల యోగక్షేమాలు తెలుసుకోవడం సర్వసాధారణంగా మారింది. మార్కెట్‌లో కూరగాయలు కోసం వెళ్లిన తల్లి తిరిగి ఇంటికి చేరేలోపు పిల్లలెలా ఉన్నారో ఫోన్‌చేసి తెలుసుకోకుండా ఉండలేకపోతున్నది. అంతదాకా ఎందుకు కటకటాల్లోనే చిక్కుకొని ఉన్న రాజకీయ పెద్దమనుషులూ, గనుల మాఫియా దొంగలూ, ఉన్నతాధికార వర్గాలూ తమ అక్రమ సంపాదన గుమ్మరించి జైల్లో సెల్‌ఫోన్ సౌకర్యం సహా, సకల సౌకర్యాలు వాళ్ల పాదాక్రాంతం చేసుకొని దర్జాగా జీవిస్తున్నారు. ఇవి చాలక లాప్‌టాప్, ఇంటర్నెట్ సౌకర్యాల దిశగా పావులు కదుపుతున్నారు. కానీ సుదీర్ఘ జైలు జీవితంలో మగ్గిపోతూ ఎన్నో సంక్లిష్టమైన సమస్యల వలయంలో చిక్కుకొన్న సామాన్య ఖైదీలకు మాత్రం ఈ సాంకేతిక అభివృద్ధి అందని ఫలంగా మిగిలిపోతున్నది. చట్ట వ్యతిరేక చర్యలకు పాల్పడ్డారన్న కారణంగా ఆయా వ్యక్తులను జైల్లో బంధించడం సరే. కాని వాటితో ఎలాంటి ప్రమేయం లేని ఖైదీల భార్యాపిల్లలకూ, తల్లిదండ్రులకూ ఆ వ్యక్తిలేని లోటువల్ల తలెత్తే తీవ్ర కష్ట నష్టాల బారి నుండి రక్షించేందుకు మన పాలకులు కనీస శ్రద్ధ కూడా పెట్టడం లేదు.

ఈ పరిస్థితుల్లో ఖైదీలు మరో మార్గం లేక ఎత్తైన గోడల మధ్య ఉన్నప్పటికీ తమ దయనీయమైన పరిస్థితుల నుండి బయట పడేందుకు, కుటుంబ ఉనికిని నిలబెట్టుకొనేందుకు తాము ఏకాకులుగా మారకుండా ఉండేందుకు అనేక సర్కస్ ఫీట్లు చేయక తప్పడం లేదు. అలా తమ కుటుంబీకులతోనూ, బంధుమిత్రులతోనూ, లాయర్‌లతోనూ సంప్రదింపుల కోసం అనధికారికంగా సెల్‌ఫోన్స్‌ను కూడా ఆశ్రయిస్తున్నారు. ఇలా చేస్తే జైలు అధికారుల నుండి అనేక ఇబ్బందులు వస్తాయని తెలిసినప్పటికీ అందుకు ఖైదీలు సిద్ధపడుతున్నారు.

ఖైదీలు తమ కుటుంబీకులతోనూ, బంధుమిత్రులతోనూ, లాయర్‌లతోనూ ఇంటర్వ్యూల ద్వారా మాట్లాడుకొనేందుకు అనుమతించి నట్లుగానే అధికారిక టెలిఫోన్ సౌకర్యం కల్పించడానికి ఎలాంటి అభ్యంతరం ఉండనవసరం లేదు. ఇదే స్ఫూర్తితో కర్నాటక, కేరళ, ఒడిశా, రాజస్థాన్ తదితర రాష్ట్రాలలో అధికారిక టెలిఫోన్ సౌకర్యం కల్పించారు. కానీ జైళ్లను ఎంతో గొప్పగా తీర్చిదిద్దుతున్నామని చెప్పుకొంటున్న మన రాష్ట్ర పాలకులు ఫోన్ సౌకర్యం కల్పించడంతో సహా అనేక విషయాల్లో ఇంకా వెనుకబడే ఉన్నారని మరిన్ని వాస్తవాలు తెలుసుకొంటే తప్ప అర్థం కాదు. ఇప్పటికైనా ఖైదీలలో మానవీయతను పెంచి సత్ప్రవర్తన తీసుకురావడంలో మెరుగైన ఫలితాలు సాధించాలంటే తక్షణం జైళ్లలో టెలిఫోన్ సౌకర్యం కల్పించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. తద్వారానే అనధికార సెల్‌ఫోన్‌ల వాడకాన్ని నియంత్రించడం సాధ్యం అవుతుంది. ఖైదీల సంక్షేమం కూడా సులభతరం అవుతుంది.

*(రచయిత ఏడు సంవత్సరాలుగా రిమాండ్‌లో ఉన్న నక్సలైట్ ఖైదీ)* వీ

# నాన్ షెడ్యూల్డ్ గ్రామాల గిరిజనుల స్థితి

*నూతన గనుల విధానం వల్ల ఆదివాసులు తమ జీవనాధారమైన అటవీ భూమి నుంచి గెంటివేయ బడుతున్నారనీ, ఈ విధానాలు వారి మనుగడకే ప్రశ్నార్థకంగా మారుతున్నాయనీ అంటున్నారు* **తుంపాల శ్రీరామమూర్తి**

షెడ్యూల్డ్ ప్రాంతం అనగా గిరిజనులు నివసించే ప్రాంతం. భారత రాజ్యాంగం ఆర్టికల్ 244ను అనుసరించి ఏదైనా ఒక ప్రాంతాన్ని షెడ్యూల్డ్ ప్రాంతంగా ప్రకటించే అధికారం, సవరించే అధికారం, రద్దుచేసే అధికారం భారత రాష్ట్రపతికి ఉంటుంది. సాధారణ పాలన, న్యాయ వ్యవస్థల నుండి ఆదివాసి ప్రాంతాలను మినహాయించాలనీ, గిరిజనులు దోపిడీకి గురికాకుండా ఉండేందుకు ప్రత్యేక చట్టాలు రూపొందించాల్సిన అవసరం ఉందని బ్రిటిష్ ప్రభుత్వం గ్రహించింది. 1839లో మొట్టమొదటిసారిగా మన రాష్ట్రంలో గంజాం, వైజాగ్ పట్టణ చట్టాన్ని తీసుకొని వచ్చింది. దాని కింద ఆదివాసిలు అధికంగా నివసించే ప్రాంతాలను గుర్తించే అధికారం కలెక్టర్‌కు ఇవ్వబడింది. దీని కొనసాగింపుగానే 1879లో షెడ్యూల్డ్ డిస్ట్రిక్ట్ యాక్ట్ వచ్చింది. ఈ ప్రాంతంలో గిరిజనుల నుండి గిరిజనేతరలకు భూ బదలాయింపులను నిషేధిస్తూ 1917లో భూ అన్యాక్రాంత నిషేధ చట్టం వచ్చింది. అదే చట్ట సవరణలతో 1/59గానూ, ప్రస్తుతం 1/70గానూ నేటికి కొనసాగుతుంది. 1919 బ్రిటిష్ రాజ్యాంగ (మింటో–మార్లే) సంస్కరణల లోనూ, 1935 బ్రిటిష్ ఇండియా రాజ్యాంగంలోనూ ఈ రక్షణ చర్యలు కొనసాగాయి.

1950 భారత రాజ్యాంగం 5వ షెడ్యూల్డ్ కింద ఆదివాసి ప్రాంతాలను ప్రకటించే అధికారం భారత రాష్ట్రపతికి ఇచ్చింది. షెడ్యూల్డ్, ఏజెన్సీ ప్రాంతం అని పిలిచే ప్రాంతాలే నిజానికి రాజ్యాంగ పరిభాషలో 5వ షెడ్యూల్డ్ ప్రాంతాలుగా చెప్పబడుతుంది. ఒక గ్రామంలో ఆదివాసిలు ఉంటే సరిపోదు. ఆ గ్రామం షెడ్యూల్డ్ ఏరియా ఆర్డర్ ద్వారా నోటిఫై అయి ఉండాలి. అప్పుడు మాత్రమే ఆదివాసిలకు ఉద్దేశించిన ప్రత్యేక పాలనా ఏర్పాట్లు, వారి రక్షణ కోసం చేసిన చట్టాలు, అభివృద్ధి కోసం ఏర్పాటు చేసిన ఐటిడిఏ కార్యక్రమాలు అమల్లోకి వస్తాయి. ఏదైనా గ్రామం ఈ నోటిఫికేషన్‌లో లేకపోతే ఇవి ఏవి వర్తించవు. ఆ గ్రామంలోని ప్రజలు పేరుకు గిరిజనులు అవుతారు తప్ప, వారికి ఉద్దేశించిన రాజ్యాంగ చట్టబద్ధ రక్షణలు సౌకర్యాలు వారికి లభించవు.

1950 షెడ్యూల్డ్ ఏరియా ఆర్డర్‌లో చేర్చడానికి ఆదివాసి గ్రామాల గుర్తింపును ప్రభుత్వం పారదర్శకంగా నిర్వహించలేదు. ఆదివాసిలకు సమాచారం లేకుండా, తమ అభిప్రాయాలు చెప్పుకునే అవకాశం లేకుండా అధికారులే ఏకపక్షంగా జాబితాను రూపొందించి ఢిల్లీకి పంపారు. దీన్ని వల్ల రాష్ట్రంలో వందలాది ఆదివాసి గ్రామాలు షెడ్యూల్డ్ ఏరియాకు చెందకుండా ఉండి పోయాయి. బి.ఎన్. యుగంధర్, ఎస్.ఆర్. శంకరన్, బి.డి. శర్మ వంటి అధికారులు ఈ లోపాన్ని కొంత సమాచార వివరాలతో ప్రభుత్వం దృష్టికి తీసుకురాగా, 1962లో కేంద్ర ప్రభుత్వం దేవక్ కమిషన్ నియమించింది. కమిషన్ ఈ సమస్యను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, అటువంటి గ్రామాలను షెడ్యూల్డ్ ప్రాంతంలో కలపాలని సూచించింది. ఈ విధంగా మిగిలిపోయిన గిరిజన గ్రామాలను షెడ్యూల్డ్ ప్రాంతంలో కలపడానికి వీలుగా 1976లో రాజ్యాంగ సవరణ తీసుకువచ్చారు. షెడ్యూల్డ్ ప్రాంతంలో కలిపేందుకు అర్హత కలిగిన గ్రామాల వివరాలను పంపమని కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలను కోరింది. మన రాష్ట్ర ప్రభుత్వం శ్రీకాకుళం నుండి ఆదిలాబాద్ వరకు తొమ్మిది జిల్లాలలో సర్వే చేసి 805 ఆదివాసి గ్రామాలను గుర్తించి, షెడ్యూల్డ్ ప్రాంతంలో కలపమని కోరుతూ 1980లో కేంద్రానికి వివరాలతో లేఖ పంపింది. అదే సమయంలో మహారాష్ట్ర, రాజస్థాన్‌లు కూడా వివరాలు పంపాయి. రాజస్థాన్ ప్రతిపాదనలు జి.ఒ. 114, 12 ఫిబ్రవరి 1987న, మహారాష్ట్ర ప్రతిపాదనలు జి.ఒ. 123, 2 డిసెంబర్ 1985న షెడ్యూల్డ్ ఏరియా గుర్తింపు పొందాయి. కానీ మన రాష్ట్రం పంపిన ప్రతిపాదనలు గత 32 సంవత్సరాలుగా పరిష్కారం కాకుండా పడి ఉన్నాయి.

1967 నుండి 1970 వరకు జరిగిన శ్రీకాకుళ (నేటి విజయనగరం జిల్లాతో కలుపుకొని) జిల్లా గిరిజనుల పోరాట జిల్లాగా దేశంలోనే పేరుంది. గిరిజన రైతాంగ పోరాటంలో సుమారు 300 మంది అమరులైయారు. ఇది దేశ చరిత్రలోనే గొప్ప చారిత్రక అంశం ఈ ఉద్యమ ఫలితంగా 1/70 భూ అన్యాక్రాంత నిషేధ చట్టం వచ్చింది. ఏజెన్సీ ప్రాంతంలో గిరిజనేతరులు గిరిజనుల నుండి భూములు కొనుక్కునే హక్కు లేదు. గిరిజనుల భూమిపై ప్రభుత్వానికి కూడా హక్కు లేదు. ప్రభుత్వాన్ని కూడా గిరిజనేతరులుగా పరిగణించాలని సుప్రీం కోర్టు సమత కేసులో తెలియచేసింది. 1/70 చట్టం అమలులో ఉన్నప్పటికీ రాష్ట్ర ఏజెన్సీలో గిరిజనులకు చెందిన 18,48,209.56 హెక్టార్ల భూమిలో, 7,53,435.66 హెక్టార్ల భూమి గిరిజనేతరుల ఆధీనంలోనే ఉంది. అంటే ఏజెన్సీ ప్రాంతాలలో సుమారు 48 శాతం భూములు గిరిజనేతరులు అనుభవిస్తున్నారు. 1/70 చట్టం కింద గిరిజనేతరులపై కేసులు నమోదు అయినప్పటికీ కేసులు చెల్లవు అని 1978లోనూ, 1983లోనూ హైకోర్టు తీర్పులు రావడం వలన గిరిజనేతరులు భూమిని సాగు చేసుకుంటూనే ఉన్నారు. అటువంటి భూముల నుండి గిరిజనేతరులను తొలగించవచ్చని 1999లో హైకోర్టు తీర్పు ఇవ్వడంతో గిరిజనులకు కొంత ఊరట కలిగింది. 1/70కీ ఇతర చట్టాలు లోబడి ఉండాలని 1997లో సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. ఈ తీర్పును అనుసరించి 2002లో జి.ఒ. నెంబరు 68 జారీ చేసింది. కానీ అప్పటికీ ఎన్నో వేల ఎకరాలకు సంబంధించిన కేసులు గిరిజనేతరులకు అనుకూలంగా వచ్చాయి.

# ప్రపంచ తెలుగు మహాసభలు

*తెలుగు విద్యాబోధన చేస్తూ, ప్రభుత్వ పాలనా విధానాలు ఇంగ్లీష్‌లో అమలు చేస్తూ ప్రపంచ తెలుగు మహాసభలను జరుపుతున్న ప్రభుత్వ ద్వంద్వ విధానాలను వివరిస్తున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

డిసెంబర్ నెల 27, 28, 29 తేదీలలో నాలుగవ ప్రపంచ తెలుగు మహా సభలను తిరుపతిలో నిర్వహించబోతున్నారు. అందుకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం అన్ని ఏర్పాట్లనూ చేసింది. 'అధికార భాషా సంఘం' దానికి తోడుగా జిల్లా కలెక్టర్లకు కూడా లేఖలు రాసి మహాసభల విజయవంతం కోసం, వివిధ జిల్లాల నుంచి ప్రతినిధులను ఎక్కువ మంది హాజరయ్యే విధంగా చూడాలని ఆదేశాలను జారీ చేసింది. అయితే ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్న ఈ సామ్రాజ్యవాద విష సంస్కృతిలో తెలుగు భాషను ఏవిధంగా పరిరక్షణించుకొవాలనే ఆశయ లక్ష్యం ఈ సభలలో విస్తృతంగా చర్చించాలనే ఆశతో కొన్ని విషయాలను నేను పంచుకోదలిచాను.

వాస్తవానికి నేడు తెలుగు భాష మాతృ భాషగా ఉన్నప్పటికీనీ, ప్రస్తుత పరిస్థితులలో 'తెలుగు మాధ్యమం' మాత్రం ప్రస్తుత విద్యా వ్యవస్థలో అనేక సవాళ్లను ఎదుర్కొంటోంది. ఇందుకు కారణాలనేకం. కానీ ఆ కారణాలలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు, ప్రజల మాతృ భాషల పట్ల వ్యవహరిస్తున్న తీరు, వైఖరుల వల్ల, సామాన్య ప్రజలకు జరుగుతున్న నష్టాలను మాత్రం, మనం ఇక్కడ చర్చించుకోవలసిందే. ఎందుకనగా, దాదాపుగా 2000 సంవత్సరాల పూర్వ చరిత్ర కలిగిన తెలుగు భాష, ఈ రోజు పరభాష సామ్రాజ్యవాదానికి గురయి, ఎన్నో ఎదురు దెబ్బలు తినీ, నేడీ స్థితిలో ఉన్నది. భారత రాజ్యాంగం కూడా మాతృభాషలోనే ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత(హైస్కూల్) విద్యా బోధన జరుగాలనీ, ఆర్టికల్ 36-51 (ఆదేశిక సూత్రాలు) తెలియచేస్తున్నప్పటికీనీ, ఈ రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేస్తున్నాయి. ఒక విధంగా, వీరు రాజ్యాంగ ధిక్కరణకు పాల్పడుతున్నారు. వీరు రాజ్యాంగానికి వ్యతిరేకంగా ప్రవరిస్తున్నారు. మన మాతృ భాష అయిన తెలుగును మన రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలే నిర్లక్ష్యం చేస్తూ, గ్రామీణ ప్రాంతాలలో కూడా నేడు ఆంగ్ల మాధ్యమంలో విద్యను విస్తరించడానికి సహకరిస్తున్నాయి. గ్రామాలలోనూ, మండల కేంద్రాలలో ఉన్న మండల పరిషత్, జిల్లా పరిషత్ పాఠశాలల విద్యను కూడా బలహీనం చేస్తున్నాయి. ఈ మహాసభలలో విస్తృతంగా ఈ అంశం పైనే చర్చించాలి.

భారతీయ వాస్తవికత, గ్రామీణ వాస్తవికత అనగా 80 శాతం మంది ప్రజలు గ్రామీణ ప్రాంతాలలో, వ్యవసాయం ఆధారంగానూ, వృత్తుల ఆధారంగానూ సహజ సిద్ధమైన వనరులపై ఆధారపడి జీవిస్తున్నారు. కావున గ్రామీణ ప్రాంత ప్రజలు, తమ స్వభాషపై వివిధ మాండలికాలలో పట్టు సాధించి ఉంటారు. కావున కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజల భావ వ్యక్తీకరణకూ, ఆలోచనా విధానానికి ప్రాధాన్యత నిచ్చే అంశాలలోనే విద్యా బోధన ఉంటే అది మరింత పట్టును పెంచేదిగా ఉంటుంది. ఆ జాతి (తెలుగు) వికాసానికి కూడా దోహద పడినట్లవుతుంది.

పాలకుల పిల్లలందరూ ఆంగ్ల భాషా బోధన గావించుకుంటూ, ప్రజలను (పాలితులను) మాత్రం మాతృభాషలోనే విద్యను సముపార్జించ మనీ, మాతృభాష గొప్పదంటూ, ఆచరణలేని ఉపన్యాసాలిస్తున్నారు. ఇది ప్రజల సహనానికీ పరీక్షగా పాలకులు భావిస్తుంటారు. మాతృభాషను గౌరవించని పాలకులున్నంతకాలం ఈ దేశంలో మాతృభాషలో విద్యా బోధన బూడిదలో పోసిన పన్నీరుగానే ఉంటుంది. తెలుగు భాష మన రాష్ట్ర ప్రభుత్వ అధికార భాష అయినప్పటికీనీ, అధికార ఉత్తర్వులన్నియూ

---

నూతన మైనింగ్ పాలసీ 2011 ప్రభుత్వం తీసుకు వస్తున్నది. ఈ బిల్లు ఆమోదం అయితే 1/70 చట్టం బలహీనం అవుతుంది. ఏజెన్సీ ప్రాంతాలలో ఖనిజ వనరులను బహుళ జాతి కంపెనీలకు దారాదత్తం చేయడానికి వీలుగా ఈ బిల్లు రూపొందించారు. గిరిజన భూమిపై గిరిజనుల గ్రామ సభల అనుమతులు లేకుండా ప్రభుత్వం భూమిని స్వాధీనం చేసుకోవచ్చు. గిరిజనుల నుండి సేకరించిన భూమికి ప్రత్యామ్నాయం చూపనవసరం లేదు. ఈ బిల్లు రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్‌లో గిరిజనులకు కల్పించబడిన హక్కులను, రక్షణలను ఉల్లంఘిస్తున్నది. నూతన మైనింగ్ పాలసీకి వ్యతిరేకంగా గిరిజనులు ఉద్యమించవలసిన అవసరం ఉంది.

మన రాష్ట్రంలో శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్ ఏజెన్సీ ప్రాంతాలలో 5,970 గ్రామాలను షెడ్యూల్డ్ గ్రామాలుగా ప్రభుత్వం గుర్తించింది. ఈ షెడ్యూల్డ్ గ్రామాలలో సుమారు 50 లక్షల మంది గిరిజనులు నివసిస్తున్నారు. ఈ తొమ్మిది జిల్లాల్లో 805 నాన్ షెడ్యూల్డ్ గ్రామాలలో సుమారు రెండు లక్షల మంది గిరిజనులు ఏ విధమైన హక్కులు లేకుండా నివసిస్తున్నారు. 1985లో రాష్ట్రంలోని గిరిజన గ్రామాలన్నింటి గుర్తిస్తూ, వాటి అభివృద్ధికి ఉప ప్రణాళిక రూపొందించారు. అదీ పూర్తిగా అమలు కావడం లేదు. నాన్ షెడ్యూల్డ్ ప్రాంతంలో గిరిజనులు ఏ రకమైన హక్కులు లేకుండా జీవిస్తున్నారు. ఈ గ్రామాలను 5వ షెడ్యూల్‌లో చేర్చడం కొరకు మేధావులు, గిరిజన సంఘాలు ఉద్యమించ వలసిన ఆవశ్యకత ఉంది.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం విశాఖపట్నం జిల్లా అధ్యక్షులు)*

ఆంగ్లంలో జరుగుతుండడం ఈ ప్రభుత్వం భాషకిస్తున్న ప్రాధాన్యత, గౌరవాన్ని తెలియజేస్తున్నాయి. ప్రభుత్వంలో ఉన్న అసమర్థత, నిర్లక్ష్యం, ఉదాసీనత, గ్రామాలలో నివసించే ప్రజల పట్ల ఉన్న చిన్నచూపు వలననే నేడు గ్రామాల జీవనం అస్థవ్యస్థంగా తయారయింది. మానవ విలువలు మృగ్యమవుతున్న నేటి ప్రపంచీకరణ విష వలయంలో సగటు మనిషి జీవన స్థితిగతులు చాలా విచారకరంగా మారినవి. కావున తెలుగు భాష ప్రాచీనత, ప్రాధాన్యత, భాషా సాహిత్యాలు, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న 18 కోట్ల మంది తెలుగు భాషా ప్రియులకు మాత్రమే కాకుండా మిగతా భాషలు మాట్లాడే ప్రజలందరూ, తెలుగు భాషపట్ల మక్కువ పెంచుకొని ఆ భాషా సాహిత్యాలను అధ్యయనం చేసే విధంగా కార్యక్రమాలు రూపకల్పన జరగాలి. తెలుగు భాషా నిఘంటువులు వివిధ భాషలలోనికి తర్జుమా చేయబడాలి.

ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలల్లో తెలుగు మాధ్యమంలో విద్యనభ్యసించే వారికి ప్రత్యేక ప్రోత్సాహకాలివ్వాలి. వాస్తవానికి ఇటీవలి సర్వేలలో కూడా పదవ తరగతి పరీక్ష ఉత్తీర్ణులైన వారిలోనే అత్యధిక శాతం మంది తెలుగు మాధ్యమంలో విద్యనభ్యసించినవారేనని వారే పై తరగతులలో కూడా మంచి లక్ష్యాలు సాధించి జీవితంలో స్థిరపడుతున్నారని ప్రభుత్వ లెక్కలే తెలియచేస్తున్నాయి. మరి ప్రభుత్వం ఎందుకు ప్రభుత్వ పాఠశాలల పట్ల ఇంత నిర్లక్ష్యం చూపుతున్నదో, దానికి వారికున్న పాలక వర్గ ప్రయోజనాలే ప్రధాన కారణంగా భావించవలసి వస్తున్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం అధికార భాషా సంఘం కానీ లేదా ప్రపంచ తెలుగు సమాఖ్యగానీ, తెలుగు భాషాభిమానులుగానీ మొదట చేయవలసింది ఏమంటే నేటి పరిస్థితులలో తెలుగు భాషను ఏ విధంగా పరిరక్షించుకోవాలనే దానిపై దృష్టి పెట్టి రాష్ట్రంలోని ప్రతి బజారులోని వ్యాపారాల బోర్డులు కూడా తెలుగులోనే ఉండే విధంగా చూడాలి మొదట. ఇంజనీరింగ్, మెడిసిన్, కంప్యూటర్స్, లా (న్యాయ విద్య) లాంటి వృత్తి విద్యా కోర్సులు అభ్యసించేవారు కూడా తెలుగు భాషను ఒక ప్రత్యేక విడువతగని కోర్సుగా కూడా అభ్యసించేటట్లు చూడాలి. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి ఇంటికీ ఒక ఫలకం తెలుగు భాషను రక్షించుకుందాం లేదా తెలుగు భాషను కాపాడుకుందాం లేదా మన ఇళ్లలో తెలుగులోనే మాట్లాడుకుందాం లేదా తెలుగు భాషను గౌరవిద్దాం లేదా తెలుగు సంస్కృతి మనది, తెలుగు భాష మనది లాంటి నుడికారాలతో నినాదాలతో కొన్ని గోడ పత్రికలను అంటించే కార్యక్రమం చేపట్టాలి. ప్రతి ప్రభుత్వ కార్యాలయంలోని ప్రతి ఉద్యోగికి ఒక కరపత్రాన్ని ఈ నినాదాలతో రూపొందించి అందివ్వగలిగితే అది ఒక మేలుకొలుపు అవుతుంది.

జిల్లా కేంద్రాలలోనే కాకుండా ప్రతి మండల కేంద్రాలలో సైతం తెలుగు భాషాభిమానులతో తెలుగు పండితులతో తెలుగు భాషా అభివృద్ధి సంఘాలను ఏర్పాటు చేసి వాటన్నింటినీ గ్రంథాలయ సంస్థలతో అనుసంధానించి కుల, మత, జాతి, విభేదం లేకుండా ఏదో ఒక కార్యక్రమం తెలుగు భాషా పరిరక్షణ కోసం చేపట్టితే అది మరింత బాగుంటుంది. మొదట అధికారులలో, ప్రజా ప్రతినిధులలో మార్పు రావాలి. స్పష్టంగా, స్వచ్ఛందంగా తెలుగులో మాట్లాడాలి! రాకపోతే నేర్చుకోవాలి. అంతే కానీ మన తెలుగు భాషను మనం గౌరవించకపోతే, పర భాషా ప్రేమికులు, మన భాషను ఏ విధంగా గౌరవిస్తారు? ఉదాహరణకు కొంత నిష్ఠూరంగా మాట్లాడాలంటే మన ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డికి తెలుగు భాషనే సరిగా ఉచ్ఛరించడం రాదు. కనీసం నేర్చుకోవడానికి కూడా ప్రయత్నించడం లేదు. 24 నెలలుగా ముఖ్యమంత్రిగా ఉంటున్నప్పటికినీ తెలుగు పదాలను సరిగా ఉచ్ఛరించ లేకపోవడం విచారకరం. ఒక తెలుగు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉంటూ తెలుగును సంబోధించడమే రాకుండడం విచారకరం, బాధకరం! వీరికన్నా వేరే రాష్ట్రాలలో నివసించేవారు (మరాఠీలు, తమిళులు) తెలుగులో చాలా చక్కగా మాట్లాడుతారు. ఇలాంటి పాలకులున్న కాలంలో తెలుగు భాష ఏమి ఉద్ధరించబడుతుందో ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించే వారికే అర్థమవ్వాలి!

కేవలం ప్రాచుర్యం కోసమే కాకుండా అధికారులంతా చిత్తశుద్ధితో ఈ తెలుగు మహా సభలను నిర్వహించాలి. భావితరాల పౌరులు అనగా ఎదుగుతున్న విద్యార్థినీ, విద్యార్థులంతా తెలుగు భాష పట్ల మక్కువ పెంచుకొని వారు తెలుగు వైతాళికులుగా తీర్చిదిద్దబడాలి. మొక్కుబడి కార్యక్రమంగా మార్చకుండా, ఈ మహాసభల నుంచి ఈ ప్రజాస్వామ్య పాలకులు ఏమి నేర్చుకోవాలో తెలియచేయాలి! తెలుగు భాషా పరిరక్షణ కోసం మొదట పాలకులు తాము నిర్వహించవలసిన కర్తవ్యాలను మనం (ఈ సభలు) గుర్తు చేయగలగాలి. రాజధాని నగరం(హైదరాబాద్)లో తెలుగు కనుమరుగవుతోంది. మొదట అక్కడి నుండే మొదలవ్వాలి. అనగా సెక్రెటేరియట్, అసెంబ్లీ, హైకోర్టు అన్నీ ప్రభుత్వ కార్యాలయాల రాష్ట్ర అధికారులు ఉండే స్థలం కాబట్టి ఆ కార్యాలయాలల్లో తెలుగు భాషలో కార్యక్రమాలు మొదలవ్వాలి. తర్వాత జిల్లా కలెక్టర్ కార్యాలయాలు, మండల తహసీల్దార్ కార్యాలయాలు, విద్యా సంస్థలు.

తెలుగు భాష పట్ల అభిరుచి ఉన్న విద్యార్థినీ విద్యార్థులకు పాఠశాల కళాశాల స్థాయిలోనే వారి అభిరుచికి తగ్గట్టుగా శిక్షణ ఇప్పించి, వారిని ప్రోత్సహించి, ప్రభుత్వమే వారిని ఉచితంగా చదివించి, అభివృద్ధి పథంలో నడిపించే కార్యక్రమం తీసుకుంటే ఈ రోజు చాలా మంది విద్యార్థినీ విద్యార్థులు ముందుకు వచ్చే అవకాశం ఉంది. మొదట ప్రభుత్వానికి చిత్తశుద్ధి కావాలి. గ్రామీణ ప్రాంతాలలో నివసించే వివిధ మాండలికాలలో మాట్లాడే భాషా ప్రయోగాలను సమీకరించాలి. ఈ సభలు 'ఒక భాషా నశిస్తే ఆ జాతి నశిస్తుంది' అనే కఠోర వాస్తవాన్ని ఈ పాలకులకూ, అధికారులకూ తెలుగు భాషాభిమానులందరూ తెలియచేయాలి.

*(రచయిత న్యాయవాది,*
*ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి.*

*– సం.*

# బాల్యాన్ని చిదిమేస్తున్న పాలకులు

***పాలకుల అవినీతిమయమైన విధానాలు భావి పౌరుల జీవితాలను చిదిమేస్తున్నాయనీ, వారి భవిష్యత్తును అంధకారంలోకి నెడుతున్నాయనీ అంటున్నారు* జి. తిరుపతి రెడ్డి**

చాచా నెహ్రూ కలలు కన్న బాలల బాల్యం మసకబారుతుంది. వారి గులాబీలు వాడిపోతున్నాయి. నేటి బాలలే రేపటి పౌరులని కీర్తించే పాలకులు బాలుర సంక్షేమం పట్ల తీవ్ర నిర్లక్ష్యాన్ని చూపుతున్నారు. బాలల అభివృద్ధి, ఆరోగ్యం, విద్య, రక్షణకు సంబంధించి నిధులు కేటాయించడంతో పాటు వాటిని ఖర్చు చేయడంలో తగిన శ్రద్ధ కనబరచడం లేదు. గడచిన 8యేళ్ల కాలంలో బడ్జెట్‌లో బాలలకు కేటాయించిన నిధులు అరకొరగానే ఉన్నాయి. బాలల కొరకు 2004-05 రాష్ట్ర బడ్జెట్‌లో 13.7 శాతం నిధులు కేటాయించగా, 2008-09లో 13.1 శాతం, 2011-12లో 12.8 శాతం ఈ క్రమంగా ప్రతీ సంవత్సరం నిధులు తగ్గిస్తూ వస్తున్నారు. బడ్జెట్ కేటాయింపుల్లో ప్రతి వంద రూపాయల్లో 13.50 పైసలు మాత్రమే బాలలకు ఖర్చు చేసే అవకాశం కలుగుతుంది. బాలల రక్షణకోసం 0.15 శాతం, ఆరోగ్యానికి సగటున 0.18 శాతం మాత్రమే కేటాయింపులు జరుగుతున్నట్లు అధికారిక గణాంకాలు వెల్లడిస్తున్నాయి. నిధుల అరకొర కేటాయింపులు ఖర్చు కాకుండా మిగిలిపోవడం వంటి కారణాలతో రాష్ట్రంలో 6 నుండి 35 నెలల మధ్య వయస్సు ఉన్న బాలల్లో 79 శాతం మందికి రక్తహీనత ఉన్నట్లు వెల్లడవుతుంది. 25 శాతం మందికి పోషక విలువలు లేని, 30 శాతం మందికి తక్కువ బరువు ఉన్నట్లుగా వెల్లడైంది. అలాగే యేడాది దాటకుండానే అనేక అనారోగ్య సమస్యలతో 53 శాతం మంది బాలలు చనిపోతున్నారు. మిగిలిన వారిలో బ్రతికి బయటపడినవారు రాష్ట్రంలో ప్రాథమిక పూర్తి చేయని బాలలు 64 శాతం ఉండగా మరో 40 శాతం మంది అక్రమ రవాణకు గురవుతున్నారు. బాలల రక్షణ, ఆరోగ్య, వైద్య, విద్యారంగాల్లో నిధులు కేటాయించడంలో ప్రభుత్వం ఘోరంగా విఫలమవుతుంది. ఇప్పటికే బాలల అనారోగ్య పరిస్థితులు పౌష్టికాహార లోపంతో మరణించే పిల్లల పట్ల పాలకులు తగిన విధంగా స్పందించడం లేదని అనేక సర్వేలు చెబుతున్నాయి. అటవి గిరిజన ప్రాంతాల్లో విషజ్వరాలు, మలేరియా, ఆంత్రాక్స్, డయేరియా, డెంగ్యూ మరియు స్వయిన్‌ఫ్లూ వంటి వ్యాధులతో వందలాది మంది బాలబాలికలు మృత్యుబాధ పడుతున్నారు.

ఇక విద్యా విషయానికి వస్తే రాజ్యాంగాన్ని అపహాస్యం చేసే విధంగా పాలకుల పాలసీలు ఉంటున్నాయి. పిల్లలందరికి విద్యను ఉచిత నిర్బంధ విద్యగా అందజేయడం ప్రభుత్వ బాధ్యతగా రాజ్యాంగంలోని 47 అధికరణ చెబుతుంది. 10 యేళ్ల కాల వ్యవధిలో పిల్లలందరిని అక్షరాస్యులుగా చేయాలని గిరిగీసింది. 1960 నాటికే 10యేళ్ల గడువు పూర్తి అయ్యింది గానీ, రాజ్యాంగం అమలై 62యేళ్లు గడిచిన సంపూర్ణ అక్షరాస్యత సాధించక పోవడం పాలకుల బాధ్యత రాహిత్యం. నేటికి లక్షలాది మంది బాలబాలికలు బడిబయటే ఉన్నారు. 2010-11 విద్యాశాఖ లెక్కల ప్రకారం రాష్ట్రంలో 5 నుండి 14 సం?ల లోపు బాలబాలికలు 2కోట్ల 30 లక్షల మంది ఉన్నారు. ఇందులో 2 కోట్ల 20 లక్షల మంది బడిలో ఉండగా మిగతా 10 లక్షలు బడిబయట బాలకార్మికులుగా, అనాథలుగా బ్రతుకులీడుస్తున్నారు. బడి మానేస్తున్నవారి వివరాల్లోకి వెళితే మరింత బయానక పరిస్థితి ఏర్పడుతుంది. 5వ తరగతిలోపు 38 శాతం 7వ తరగతిలోపు 65 శాతం, 10వ తరగతిలోపు 70 శాతం డ్రాపౌట్ అవుతున్నారు. ప్రాథమిక పాఠశాలల్లో చేరిన ప్రతి 100 మంది విద్యార్థుల్లో 26 మంది మాత్రమే ఉన్నత విద్యకు చేరుకుంటున్నారు. డ్రాపౌట్ అయితున్న వారిలో పేదలు, బడుగు, బలహీన వర్గాలు, దళితులు, ఆదివాసీలు మరియు మైనార్టీలు అధికంగా ఉన్నారు. దళితుల్లో ఈ వివక్ష మరింత స్పష్టంగా కనబడుతుంది. ఈ వర్గాల్లో చేరే పిల్లల ఎన్‌రోల్‌మెంట్ రేటు సాధారణ విద్యార్థులతో పోలిస్తే చాలా తక్కువ. దళిత పిల్లల్లో ఎస్సీలు 86 శాతం, ఎస్టీలు 88 శాతం పాఠశాలల్లో పేర్లు నమోదు చేసుకుంటున్నారు. ఇందులో ఎస్సీ బాలురు 44 శాతం, ఎస్టీ 51 శాతం, ఎస్సీ బాలురు 47 శాతం, బాలికలు 54 శాతం బడిమానేస్తున్నారు. 8వ తరగతిలోపు ఎస్సీలు 61 శాతం, ఎస్టీల్లో 71 శాతం బాలబాలికలు చదువుకు స్వస్తి చెబుతున్నారు. ఈ వర్గాల పిల్లల డ్రాపౌట్‌కు కారణాలు ఏమిటి...? వారు బడిలో ప్రవేశించి పూర్తి స్థాయిలో ఎందుకు చదువలేకపోతున్నారు. డ్రాపౌట్‌కు కారణాలైన సామాజిక, ఆర్థిక సాంస్కృతిక సమస్యలపైన ఎందుకు పాలకులు నిర్లక్ష్యం వహిస్తున్నారు. మేధావుల సూచనలను బుట్టదాఖలు చేయడానికి కారణాలేమిటి...?

లక్షలాది మంది బాలబాలికలు బడికి రాకపోవడానికి ముఖ్యంగా తల్లిదండ్రులు వలస పోవడం వలన వారితోపాటే పిల్లలు వెళుతున్నారు. మరి ఆ పిల్లల భవిష్యత్తు ఏమిటి...? ఎన్ని బాల కార్మిక చట్టాలు వచ్చినా ఇంకా అనేక మంది బాలలు బాల కార్మికులుగానే బతుకీడుస్తున్నారు. మనం ప్రొద్దున లేచి చూడగానే ప్లాస్టిక్ సంచులు, బాటిళ్లు ఏరుకునే అనాథ పిల్లలు అగుపిస్తుంటారు. వీటికి తోడు బాలికల్లోనైతే కొన్ని ప్రాంతాల్లో బాల్య వివాహాల వలన బడికిదూరం అవుతున్నారు. అభివృద్ధి పథంలో పయనిస్తున్నామని చెప్పుకుంటున్నప్పటికి నేటికి చాలా గిరిజన ప్రాంతాల్లో బాలికలు తమ చిన్న వయస్సులోనే వివాహం చేసుకుంటున్నారు. ఇలాంటి పెండ్లిలను వ్యతిరేకించాల్సిన భావన వారి పసిమనస్సుకు తెలియదు. తల్లిదండ్రుల అభీష్టం మేరకు వారు వధువులుగా మారి సమిదలవుతున్నారు. పేదరికం కారణంగానే తల్లిదండ్రులు ఇలాంటి నిర్ణయాలు తీసుకుంటున్నారు. పేదరిక నిర్మూలణ చేసి బాలికలందరిని రక్షించాల్సిన బాధ్యత పాలకులపై ఉంది. బాలల ఉత్సవాలు జరుపుకుంటూనే మరోవైపు బాలల భవిష్యత్తును చిదిమేసే విధానాన్ని మానుకోవాలి. మసకబారుతున్న బాలల భవిష్యత్తుపై పాలకులు దృష్టిపెట్టాలి. కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లో అధిక శాతం నిధులు కేటాయించి పౌష్టికాహారం, వైద్యం, విద్య సమానంగా అందరికి అందేటట్లు చూడాల్సిన బాధ్యత పాలకులది.

రాజ్యాంగం సూచించిన విధంగా నిర్బంద ఉచిత విద్యను ప్రభుత్వమే పూర్తి బాధ్యతగా స్వీకరించాలి. మేధావుల సూచనలు పరిగణలోకి తీసుకొని

# కార్పొరేట్ విద్య - విద్యార్థి హక్కులు

*కార్పొరేట్ చదువు విద్యార్థులను యంత్రాలుగా మారుస్తోందనీ, ఒత్తిడికి గురిచేసి ఆత్మహత్యలకు కారణం అవుతోందనీ అంటున్నారు* **ఎన్. నారాయణరావు**

రాష్ట్రంలో కార్పొరేట్ కళాశాలల అకృత్యాలు రోజు రోజుకూ విపరీతంగా పెరిగిపోతున్నాయి. ర్యాంకుల కోసం విద్యార్థి విద్యార్థినులపై మానసిక ఒత్తిడి ఒకవైపు పెంచుతూ, కాలేజీల అనుబంధ వసతి గృహాలలో సరియైన ఆహార సదుపాయాలు కల్పించకుండా అనారోగ్యం పాలు చేస్తున్నారు. ఆందోళనకు దిగిన విద్యార్థులపైకి పోలీసులను పంపి లాఠీచార్జీ చేపిస్తున్నారు. విద్య ప్రైవేటీకరణ అవడంతోనే విద్యార్థులు చదువును 'కొనుక్కునే పరిస్థితి' వచ్చింది. ఆహారం కోసం డబ్బులు ఇచ్చి పోలీసులతో కొట్టించుకునే పరిస్థితిని ప్రైవేట్ కళాశాలల మేనేజ్‌మెంట్ అనుసరిస్తున్న విధానం. ఇటువంటి విద్యావిధానం సరియైందికాదు. విద్యారంగ మేధావులు ప్రభుత్వానికి తెలియజేసినప్పటికి వినిపించుకునే పరిస్థితిలో ప్రభుత్వం లేదు. కార్పొరేట్ కాలేజీ అయిన హయత్‌నగర్ నారాయణ కాలేజీ హాస్టల్లో జరిగిన సంఘటన పూర్తి వివరాల్లోకి వెళితే సమస్య ఎంత జటిలంగా ఉందో ప్రజలకూ, విద్యార్థుల తల్లిదండ్రులకూ అర్థమవుతుంది.

హైదరాబాద్ నగర శివారుల్లో ఉన్న హయత్‌నగర్‌కు 'కోహెడ' రోడ్డులో చాలాలోపలికి, అంటే అక్కడ ఎటువంటి వీధి దీపాలు లేని దగ్గర నాలుగు బిల్డింగులలో నారాయణ కాలేజీ నడుస్తోంది. దీనికి ముందుగా హయత్‌నగర్ దగ్గరలోనే పనామాగోడౌన్స్, భాగ్యలతలల్లో కూడా నారాయణ కాలేజీ బ్రాంచీలు ఉన్నాయి. సుమారు మూడు కాలేజీలల్లో విద్యార్థులపై మేనేజ్‌మెంట్ ఒక ప్రైవేట్ గూండా సంస్థలాగా వ్యవహరిస్తున్నది. భాగ్యలతలో ఒక విద్యార్థిని రూమ్‌లోపెట్టి మేనేజ్‌మెంట్ వ్యక్తులు దాడిచేసి తీవ్రంగా భయపెట్టారు. దీని తర్వాత సంఘటన అక్టోబర్ 10న హయత్‌నగర్ బ్రాంచీలో జరిగింది.

ఆ రోజు ఉదయం టిఫిన్ తినే సమయంలో సాంబారులో బొద్దింక రావడంతో విద్యార్థులు ఆందోళనకు దిగారు. దీన్ని అదుపులో తేవడానికి ప్రిన్సిపాల్ వినయ్, వైస్ ప్రిన్సిపాల్ రాంబ్రహ్మచారి హయత్‌నగర్ పోలీసులను పిలిపించారు. పోలీసుల సమక్షంలో సాయంత్రం 4.30 వరకు విద్యార్థులను బెదిరించడం, కౌన్సిలింగ్ పేరుతో హెచ్చరికలు చేయడం, చివరికి ఇంకొకసారి మీ ఆహారంలో ఎటువంటి ఇబ్బంది ఉండదు అని చెప్పి వెళ్లారు. అదే రోజు రాత్రి జూనియర్ ఇంటర్ విద్యార్థులు భోజనాలు అయిన తర్వాత, సీనియర్ ఇంటర్ విద్యార్థులు భోజనాలు చేస్తున్నప్పుడు సాంబారులో 'బల్లి' వచ్చింది. దాన్ని చూసిన వైస్ ప్రినిపాల్ 'రబ్బర్ బల్లి' అని హేళనగా మాట్లాడుతూనే, 'మీరు ఇంటిదగ్గర ఇంతకన్నా మంచి భోజనం చేస్తారా? అసలు మీరు తిండికోసం వస్తున్నారా? చదువుకోవడానికి వస్తున్నారా?' అంటూ ఇష్టమొచ్చినట్లు బూతులు తిట్టడం ప్రారంభించాడు. పరిస్థితిని తట్టుకోలేని విద్యార్థులు వివిధ రూపాల్లో తమ నిరసనలు తెలిపారు. అప్పుడు సమయం రాత్రి 8.30. ఆ సమయంలో 50, 60 మంది పోలీసులు వైస్ ప్రిన్సిపాల్ వెతికి వెతికి విద్యార్థులను చూపెడుతూ, వారిని పోలీసులతో కొట్టించారు. ఈ క్రమం రాత్రి 10.30 వరకు కొనసాగింది. లాఠీచార్జీకి భయపడి సుమారు పదిహేను మంది విద్యార్థులు పారిపోయారు. కాలేజ్ మేనేజ్‌మెంట్ విద్యార్థులను సముదాయించ కుండా, పోలీసులను పిలిపించి లాఠీచార్జీ చేయించారు. ఎన్నో లక్షలు కట్టి విద్యార్థులను చేర్పించిన తల్లిదండ్రులు ఎంతటి ఆందోళన గురవుతారనే కనీస విషయాన్ని పట్టించుకోకపోతే, అక్కడ విద్యార్థుల భవిష్యత్‌కు భద్రత ఎక్కడిది? ఇక్కడ ఇంకొక ముఖ్య విషయం. అంతకుముందే జూనియర్ ఇంటర్ విద్యార్థులు భోజనం చేసారు కాబట్టి,

---

కేంద్ర బడ్జెట్‌లో 10 శాతం, రాష్ట్ర బడ్జెట్‌లో 30 శాతం నిధులు కేటాయించి అందరికి విద్య, సమాన విద్య, ఉమ్మడి పాఠశాల వ్యవస్థను ఏర్పాటు చేయాలి.

మధ్యాహ్న భోజన పథకానికి అధిక శాతం నిధులు కేటాయించి పౌష్టికాహారం అందించాలి. ఒకవైపు టై, బెల్టు, షూతో చక్కని డ్రెస్‌తో ముస్తాబై, ఏసీ కారులో కూర్చొని కార్పొరేట్ స్కూళ్లో చదివే బాలలు ఉంటే మరొకవైపు నేలపై కూర్చొని దిక్కులు చూసే పిల్లలు బాల కార్మికులుగా బ్రతుకులీడుస్తున్న పిల్లలు బడి మోహం చూడకుండానే బజారువెంట బతుకీడుస్తున్నవారు కొందరైతే, అబుజ్‌మడ్ లాంటి ఆదివాసి ప్రాంతాల్లో వారి పిల్లల పాఠశాలలు పోలీస్ క్యాంపులుగా మారిపోతుంటే పలక బలపం పట్టాల్సిన పిల్లల చేతుల్లో ఎకె47 తుపాకులు ఉంటే ఈ పరిస్థితులకు కారకులెవరు...? లోపం ఎక్కడుంది. ఈ దేశంలో పుట్టిన ప్రతి బిడ్డ ఎందుకు పాఠశాల ముఖం చూడలేక పోతున్నారు. రాజ్యాంగం అమలై 60 సంవత్సరాలు గడిచిన ఇంకెన్నాళ్లకు బాలలందరికి నిర్భంద ఉచిత, వైద్యం అందగలుగుతుంది. బాలల ఉత్సవాల సందర్భముగా జవాబు చెప్పాల్సిన బాధ్యత మనల్ని ఏలే పాలకులది.

మనిషి బ్రతకడానికి ఒక వ్యక్తికి నెలకు 11 కిలోల తిండి గింజలు అవసరమైతే కుటుంబం మొత్తానికి 10 కిలోల రేషన్ బియ్యం ఇచ్చి, ఏ మేరకు పేద ప్రజల్ని ఆదుకోగలరు...! పేద వర్గాల ప్రజలకు ఉపాధి, వ్యవసాయ రంగాల్లో అవకాశాలు కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వాలది. పిల్లల సంక్షేమమే రాజ్య సంక్షేమంగా భావించే పాలకులు ఉన్నప్పుడే అందరికి సరైన ఆహారం, విద్య, వైద్యం అందగలదు. దోపిడి వ్యవస్థ పోనంతకాలం మనిషి స్వార్థం నశించనంత కాలం, అసమానతలు రూపుమాపనంతకాలం ఈ వ్యవస్థ ఇంకా ఇలాగే కొనసాగుతుంది.

నిరుపేద బాలలు మనుగడ సాధించాలంటే సమానత్వం రావాలంటే ప్రజాస్వామిక, ప్రజాతంత్ర ఉద్యమాలు నిర్వహించాల్సిన బాధ్యత బుద్ధిజీవులపై ఉంది.

*(రచయిత అధ్యక్షులు, ఎ.పి.టి.ఎఫ్., మెదక్ జిల్లా)*

వారందరిని ముందుగా ట్రీట్‌మెంట్ కోసం హాస్పిటల్ పంపించే ప్రయత్నం చెయ్యాలి. కాని అటువంటి ప్రయత్నం ఏమి చేయకుండా, అప్పటికప్పుడు రెండు రోజుల సెలవులు ప్రకటించేసి రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో విద్యార్థులందరిని హాస్టల్ నుండి వెళ్లగొట్టారు. దెబ్బలు తిన్న విద్యార్థులు కూడా 'తమ పేరు బయటపెట్టొద్దు' అని అంటున్నారంటే పరిస్థితి ఎంత దుర్భరంగా ఉందో అర్థమవుతుంది. ఒకవైపు తల్లితండ్రుల కష్టం, మరోవైపు మేనేజ్‌మెంట్ దాష్టీకం, ఎవరికీ పరిస్థితిని అర్థం చేయించలేక విద్యార్థులు అనుభవిస్తున్న వేదన మానసికంగా భయపడుతున్న పరిస్థితి. పేరు చెబితే మేనేజ్‌మెంట్ ఏం చేస్తుందోననే భయం. ఇప్పటికీ తల్లిదండ్రులు ఎంతో కష్టంగా కట్టిన ఫీజులు, మళ్లీ మళ్లీ కట్టి చదివించలేని ఆర్థిక అసహాయ స్థితి. ఇదే క్రమం గర్ల్స్ హాస్టల్‌ల్లో కూడా కొనసాగుతోంది. హాస్టళ్లలో విద్యార్థులు జైలు ఖైదీలుగా కాలం గడుపుతున్నారు. హాస్టల్ సిబ్బంది మొత్తం విద్యార్థులందరిపై జులుం చేసే అధికారం ఉన్నట్టే బెదిరిస్తూ మాట్లాడుతారు. ఒక రాజకీయ నాయకుల పిల్లలపై తప్ప.

ఇక ఊళ్ల నుండి వచ్చిన విద్యార్థుల పరిస్థితి చాలా భయంకరంగా ఉంటుంది. వీళ్లు కొద్దిగా తక్కువ చదివే వాళ్లు అయితే వారిని చాలా హేళనగా మాట్లాడుతారు. ప్రతిక్షణం కర్ఫ్యూ వాతావరణంలో విద్యార్థుల జీవితం కొనసాగుతుంది. గట్టిగా మాట్లాడకూడదు, నవ్వకూడదు, భోజనం అయిన వెంటనే రూమ్‌కెళ్లాలి. ఎక్కడ కూడా మాట్లాడుతూ నిలబడొద్దు. ఎన్ని నిబంధనలంటే తాను ఒక మనిషిననే విషయాన్ని మరిచిపోయేవిధంగా నిబంధనలు కొనసాగుతాయి.

ఇంకా హాస్టల్స్‌లో వేడినీళ్లు ఒక పెద్ద సమస్య. పొద్దున్నే క్లాసు ఉంటుంది. అందరూ ఒకేసారి లేస్తే బాత్‌రూం సమస్య. దానికి 3 గంటలకే లేవడం, వేడినీళ్లు పట్టుకోవడం, స్నానాలు చేయడం, మళ్లీ 5 గంటలకు పడుకోవడం. ఏ ఒక్క క్యాంపస్‌లో కూడా విదార్థులు ఒక గంట ముందు నిద్రలేస్తే అందరికీ బాత్‌రూంలు సరిపోని పరిస్థితి. విద్యార్థుల ప్రకారం వారికి సంబంధించిన మౌలిక సదుపాయాలపట్ల మేనేజ్‌మెంట్ దృష్టిపెట్టడం లేదు.

ఇక ఫోన్ సౌకర్యం విషయానికి వస్తే, తల్లిదండ్రులతో, స్నేహితులతో మాట్లాడుకునే అవకాశం ఉండదు. మొత్తం హాస్టల్‌కి నాలుగు, ఐదు ఫోన్‌లు పెడతారు. పక్కపక్కనే, అందరికీ ఒకటే టైమ్. ఎవరేం మాట్లాడతారో అర్థం చేసుకోలేని పరిస్థితి. ఇది జైళ్లలో ఖైదీల జాలీ ములాఖాత్‌లను తలపిస్తుంది. తొందరగా పెట్టెయ్యమని వెనుక విద్యార్థి జాలిచూపులు. కనీసం తల్లిదండ్రులతో మనస్ఫూర్తిగా మాట్లాడుకోలేని పరిస్థితి. మేనేజ్‌మెంట్ నిబంధనలతో చదువు ఒత్తిడితోనే విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ ఆత్మహత్యలకు కూడా కార్పొరేట్ కాలేజీల మేనేజ్‌మెంట్‌లే కారణం. ఈ ఆత్మహత్యలు నిజానికి మేనేజ్‌మెంట్ హత్యలే.

హయత్‌నగర్ క్యాంపస్‌లో 800 విద్యార్థులు ఉంటే తప్పకుండా 24 గంటల డాక్టర్ పర్యవేక్షణ ఉండాలి. సిక్ రూమ్ ఉంటుంది, కాని డాక్టర్ రూమ్ ఉండదు. ప్రభుత్వం నిర్వహించే జవహర్ నవోదయ స్కూళ్లల్లో ఫుడ్ అండ్ హోటల్ మేనేజ్‌మెంట్ చదివిన వారి క్యాటరింగ్ అసిస్టెంట్‌గా ఉంటారు. అది 300 నుండి 400 మంది విద్యార్థులకే. 800 మంది విద్యార్థులకి ఒక్క మంచి డాక్టర్ ఉండదు. మంచి కేర్‌టేకర్ ఉండదు. ఇక్కడ విద్యార్థులు విద్యార్థులుగా జీవించడం లేదు. కార్పొరేట్ విద్యా సంస్థలపై ప్రభుత్వ ఆజమాయిషీ లేకపోతే ఇటువంటి సమస్యలే తలెత్తుతాయి. కాబట్టి విద్యా ప్రముఖులతో ఒక కమిటీని నియమించి, విద్యార్థులకు కనీస హక్కులు అందుతున్నాయో లేదో సమీక్షించి, అలా అందించని కార్పొరేట్ విద్యా సంస్థలను రద్దుచెయ్యాలి.

సంఘటన జరిగిన మూడు రోజులకు ప్రిన్సిపల్ వినయ్‌తో పౌరహక్కుల సంఘం సభ్యులు మాట్లాడడం జరిగింది. దీనికి అతను 'విద్యార్థులే కావాలని చేస్తున్నారు' అని ఫోన్‌లో సమాధానం చెప్పాడు. ప్రత్యక్షంగా మాట్లాడుదామని కాలేజ్ క్యాంపస్‌కి వెళ్లితే ప్రిన్సిపాల్ వినయ్ కాలేజీలోనే ఉండి కూడా లేడని చెప్పించిన పరిస్థితి. దీన్ని హక్కుల సంఘాల కార్యకర్తలం ఏవిధంగా అర్థంచేసుకోవాలి. విద్యార్థులను అనునయించాల్సిన, సంయమనంగా ఉండాల్సిన సెక్యూరిటీ సిబ్బందికి బదులు, దాడి చేయడానికి సిద్ధంగా ఉన్న గూండాలు ఉన్నారు. అక్కడ ఒక కాలేజ్ క్యాంపస్ వాతావరణం మాకే కన్పించలేదు అంటే, అక్కడే ఉండే విద్యార్థుల పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించాల్సి ఉంటుంది.

సంఘటన జరిగిన వెంటనే రెండు రోజులకు 11, 12 తేదీలలో సెలవులు ప్రకటించడం వెనుక, ఈ విషయం ఇతర క్యాంపస్‌లకు తెలవద్దనే ఉద్దేశంతో జంటనగరాలు, పరిసర ప్రాంతాలలోని అన్ని నారాయణ కాలేజీల్లో సెలవులు ప్రకటించారు. ప్రభుత్వం సెలవులను ప్రకటించినా కాలేజీ నడిపించే వాళ్లు, విద్యార్థుల సమస్యలపై బంద్ చేపడితే విద్యార్థుల చదువు గురించి మాట్లాడే కార్పొరేట్ విద్యాసంస్థలు రెండు రోజుల సెలవు ఎందుకు ప్రకటించినట్టు? ఈ విషయమంతా ప్రజల్లోకి రాకుండా ఉండడం కోసం తీవ్రంగా ప్రయత్నం చేసింది. ఎంత ప్రయత్నమంటే ఏ పత్రికల్లో కూడా విషయం వచ్చినా కాలేజీ పేరు రాకుండా లాబియింగ్ చేయగలిగింది.

విద్యార్థుల తల్లిదండ్రులకు విన్నవించేదేమంటే, చదువు అవసరమే కాని, విద్యార్థులకు మంచి జీవితం, సామాజిక బాధ్యత, భవిష్యత్ పట్ల నమ్మకం కలిగిన విద్యనందించాలి. అమానవీయంగా విదార్థులను హింసించే పద్ధతిని వ్యతిరేకించాలి.

కార్పొరేట్ కాలేజీల్లో జరిగిన ఆత్మహత్యలకు కారణం వారిపై పెరుగుతున్న మానసిక ఒత్తిడే. ప్రతివారం టెస్ట్ పెట్టి, మార్కులు నేరుగా తల్లిదండ్రులకే మెసేజ్ చేస్తారు. దానివల్ల మార్కులు తక్కువ వచ్చినందుకు తాము బాధపడాలా? తల్లిదండ్రులు తిడతారని బాధపడాలా? ఇలా నెలకొక్కసారి తల్లిదండ్రులకు మెసేజ్ చేస్తే విద్యార్థి స్థాయిని తల్లిదండ్రులు అర్థం చేసుకుంటారు. విద్యార్థులను భయపెట్టి చదివించాలనుకుంటే, జరగబోయేవి దారుణాలే తప్ప, సరియైన విద్య నేర్పే విధానం కాదు.

అయితే విద్యార్థులందరూ గుర్తించుకోవాల్సింది కాలేజీ మేనేజ్‌మెంటే అంతిమం కాదు. తల్లిదండ్రులు ఉన్నారు, ప్రభుత్వం ఉంది. బయట మీకు మంచిమిత్రులు ఉన్నారు. చదవండి కాని భవిష్యత్తును చూసి భయపడకండి. కార్పొరేట్ కాలేజీలంతా దుర్మార్గం బయట సమాజంలో ఉండదు. జీవితాలు మీవి, వాటిని మీరు జీవించడం ద్వారానే రేపటి మీ భవిష్యత్తును ఉజ్వలంగా మార్చుకోగలుగుతారు. విద్యను అభ్యసించుదాం. సరియైన విద్యావిధానం కోసం పోరాడుదాం. ఐక్యంగా ఉద్యమిద్దాం. ఇక్కడికే జీవితం అంతం కాదు. భవిష్యత్ మీదే. కార్పొరేట్ కాలేజీల్లో విద్యార్థులపై జరుగుతున్న అన్నిరకాల దాడులను ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ఖండిస్తున్నది, ప్రశ్నిస్తున్నది.

- విద్యార్థులకు కావల్సిన మౌలిక వసతులను అందచేయాల్సిందిగా డిమాండ్ చేస్తున్నది.
- విద్యార్థులు ఆత్మహత్యలకు సిద్ధపడితే దానికి మేనేజ్‌మెంట్ బాధ్యత వహించాల్సిందిగా డిమాండ్ చేస్తున్నాం.
- విద్యార్థులపై దాడులు చేస్తున్న, చేసిన నారాయణ జూనియర్ కాలేజీ హయత్‌నగర్ మేనేజ్‌మెంట్‌ను చట్టపరంగా శిక్షించాలి.
- హయత్‌నగర్ కాలేజీలో విద్యార్థులపై లాఠీచార్జీచేసిన పోలీసులపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలి.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, జంటనగరాల కార్యదర్శి)* వీ

# పసిపిల్లల ప్రాణాలకు విలువ లేదా?

***ప్రభుత్వ ఆసుపత్రులను నిర్లక్ష్యం చేస్తూ, వాటికి సరైన సదుపాయాలు కల్పించకుండా పసి పిల్లల మరణాలకు కారణమవుతున్న ప్రభుత్వ విధానాలను వివరిస్తున్నారు డా. తల్ల సాంబలక్ష్మి***

కడుపులో నవమాసాలు మోసిన అమ్మ పొత్తిళ్లైనా ఆప్యాయంగా తాకకముందే, ఎన్నో కలలతో ఎదురుచూస్తున్న అమ్మ ముద్దూ మురిపం తీరకముందే కన్నబిడ్డ కళ్లముందే శాశ్వతంగా దూరమవుతున్నారనే నిజాన్ని జీర్ణించుకోలేక ఎందరో తల్లుల హృదయాలు తల్లడిల్లుతున్నాయి. ప్రభుత్వ ఆస్పత్రుల్లో పసికందులు పిట్టల్లా రాలిపోతున్నా పాలకులు చేష్టలుడిగి చూస్తున్నారు. నవమాసాలు మోసి కన్న తల్లులకు కడుపుకోత మిగులుస్తున్నారు.

శిశుమరణాలు మానవ వనరుల విధ్వంసానికి ప్రతీక. మనిషి మనుగడకు, సమాజ ఉత్పత్తికి ప్రధానం పుట్టుకే. అలాంటి పుట్టుక నేడు పుట్టెడు కష్టాల్లో ఉంది. పౌష్టికాహార లోపం, రక్త బలహీనత, తక్కువ బరువుతో పుట్టడం, వివిధ రకాల అనారోగ్య సమస్యలే ప్రధాన కారణాలుగా కనిపిస్తున్నాయి. గర్భిణీలకు పౌష్టికాహారం అందించలేని ప్రభుత్వ నిర్లక్ష్యమే ఈ శిశు మరణాలకు కారణం. పుట్టీపుట్టగానే శిశువులు మృత్యు ఒడిలోకి వెళ్తున్నారు. దీనికి పేదరికం వల్ల గర్భిణీలకు పౌష్టికాహారం అందకపోవడం ఓ కారణమైతే సరైన సమయంలో వైద్యం అందకపోవడం మరో కారణం. పేదరికం, అనారోగ్యం నాణానికి బొమ్మాబొరుసు లాంటివి. ఈ శిశుమరణాలను నిశితంగా పరిశీలిస్తే పేద కుటుంబాలకు చెందిన వారే ఎక్కువగా ఉండడం గమనించవచ్చు.

వరంగల్ జిల్లా మాతా శిశు మరణాల రేటులో రాష్ట్రంలో రెండో స్థానంలో ఉండడం విచారకరం. జిల్లాలోని మహాత్మాగాంధీ మెమోరియల్ (ఎంజిఎం) ఆసుపత్రి ఉత్తర తెలంగాణ జిల్లాలకు పెద్దదిక్కు. కొద్ది నెలలుగా ఆసుపత్రి ఆవరణలో ఎటుచూసినా తల్లుల రోదనలే. అమ్మల ఆర్తనాదాలే వినిపిస్తున్నాయి. వైద్య పరికరాల కొరత, పసికందుల ప్రాణాల్ని బలిగొంటున్నవి. కన్న తల్లులకు కడుపుకోతను మిగులుస్తున్నాయి. ఈ విషయమై రాష్ట్రవ్యాప్తంగా పెద్ద దుమారం రేగింది. అప్పుడుగాని రాష్ట్ర ప్రభుత్వానికి సమస్య చెవికెక్కలేదు. ఈ క్రమంలోనే ఆగస్టు నెల 26న జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి రాంరెడ్డి వెంకట్‌రెడ్డి, వైద్య విద్యాశాఖ మంత్రి కొండ్రు మురళి, జిల్లా మంత్రి బస్వరాజు సారయ్య ఎంజిఎం ఆసుపత్రిని సందర్శించారు. పరిస్థితిని సమీక్షించారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డికి నివేదిక కూడా సమర్పించారు. ఈ సందర్భంలోనే మంత్రి కొండ్రు మురళి పదిరోజుల్లో సమస్యల్ని పరిష్కరిస్తామని హామీ ఇచ్చారు. తక్షణం అవసరమైన 10 వెంటిలేటర్లు, 15 సిఫాన్లు, 20 వార్మర్లు, 20 ఇంక్యుబేటర్లు, 6 డిపి బేటర్లు, 20 మల్టీఛానల్ మానిటర్లు, 4 ఎన్.బి.పిలు అందిస్తామని ప్రకటించారు. రెండు నెలలు దాటినా ఇందులో ఒక్క సమస్యా నెరవేరలేదు. ఇవి ఒక వరంగల్‌లోని ఎంజిఎం ఆసుపత్రికే పరిమితమైన సమస్యలు కావు. రాష్ట్రంలో ఉన్న ప్రభుత్వ ఆసుపత్రులన్నింటి పరిస్థితి ఇదే...!

**రెట్టింపైన మరణాలు..**

ఎంజిఎం ఆస్పత్రిలో 2012 జనవరి నుంచి సెప్టెంబర్ వరకు సుమారు 385 మంది పసికందులు ప్రాణాలు కోల్పోయారు. వైద్యం కోసం వచ్చిన ప్రతి వందమంది శిశువుల్లో 14 మంది శిశువులు పూర్తిగా కళ్లు తెరవకుండానే కన్నుమూశారు. 2011లో పిల్లల విభాగంలో వివిధ కారణాలతో చేరిన 7743 మంది పిల్లల్లో 493 మంది పిల్లలు మరణించారు. ఈ ఏడాది 2012 సెప్టెంబర్ వరకు ఆసుపత్రిలో చేరిన 2683 మంది పిల్లల్లో సుమారు 385 మంది శిశువులు మృతిచెందారు. జనవరిలో 53 మంది, ఫిబ్రవరిలో 39 మంది, మార్చిలో 43 మంది, ఏప్రిల్‌లో 44 మంది, మేలో 59 మంది, జూన్‌లో 62 మంది, జులైలో 58 మంది, ఆగస్టులో 13 మంది, సెప్టెంబర్‌లో 20 మంది శిశువులు మరణించినట్లు ఆసుపత్రి రికార్డులే వెల్లడిస్తున్నాయి. గత ఏడాదికంటే ఈ ఏడాది మరణాల సంఖ్య రెట్టింపయింది.

ఈ శిశువుల మరణఘోషకు ప్రభుత్వ నిర్లక్ష్య విధానాలే కారణం. శిశు మరణాలు ముమ్మాటికి సర్కారు హత్యలే. ఎందుకంటే ప్రభుత్వ ఆసుపత్రులపట్ల పాలకుల నిర్లక్ష్యం, నిరాదరణ, మౌలిక వసతులు, వైద్య సిబ్బంది కొరత, నిధుల లేమిలతో ప్రభుత్వ ఆసుపత్రులు సమస్యలతో కునారిల్లుతున్నాయి. అలాగే గ్రామీణ ప్రాంతాల్లో ఆరోగ్యం పట్ల తగినంత చైతన్యాన్ని, అవగాహనను ప్రజలకు కలిగించే ప్రణాళికాబద్ధమైన కృషి జరగడం లేదు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సమగ్ర అభివృద్ధిపై ప్రభుత్వం దృష్టిపెట్టడం లేదు. శిశుమరణాలకు వైద్యులే కారణమనే అపవాదును ప్రచారం చేస్తూ ప్రభుత్వం తన బాధ్యత నుంచి తప్పుకుంటోంది. కొంతమంది వైద్యులు తమ వృత్తి నిబద్ధతలో లోపాలు, అంకితభావం, సేవాదృక్పథం కనపరచడంలో నిర్లక్ష్యం లేకపోలేదు. వైద్యాన్ని ఖరీదైన సేవగా మార్చి డబ్బులు లాగుతున్న వైద్యులు కొందరు ఉన్నా పేదలకు సేవ చేయాలనే ఆలోచనతో ప్రభుత్వ ఆసుపత్రుల్లో పనిచేసే వైద్యులు కూడా ఉన్నారు. ప్రభుత్వ ఆసుపత్రుల్లో కనీస వసతులు సమకూర్చడంలో నిర్లక్ష్యంగా వ్యవహరించడంతో అలాంటి వైద్యులు కూడా ఏమి చేయలేని పరిస్థితి నెలకొంది.

**కారణాలు :**

- పేదరికం, దారిద్ర్యం అనుభవించే సామాన్య మహిళలకు పౌష్టికాహార లోపం వలన రక్తహీనతతో తక్కువ బరువుతో పిల్లలు పుడుతున్నారు.
- ప్రభుత్వ ఆసుపత్రులు ఆధునికీకరణకు నోచుకోకపోవటం, మౌలిక సదుపాయాల్ని సమకూర్చి వాటిని పటిష్టపర్చకపోవడం.
- వివిధ విభాగాల్లో అవసరాలకు అనుగుణంగా నిపుణులైన, అనుభవం గల సీనియర్ వైద్యులు, పారామెడికల్ సిబ్బంది, ఇతర సిబ్బంది కొరత.

# మాఫియా హస్తాల్లో ఆలయ కొండలు

***ప్రజల సంస్కృతికీ, సంప్రదాయాలకూ, ప్రకృతి వైవిధ్యానికీ ఆలవాలమైన చిత్తూరు జిల్లాలోని కొండలు మైనింగ్ మాఫియాల చేతిలో విధ్వంసానికి గురికానున్నాయంటున్నారు ఎం.కె. కుమార్***

పచ్చని ప్రకృతి, తరాల సంస్కృతి, సంప్రదాయాలకు ఆవాసాలుగా ఉన్న మహోన్నతమైన కొండలు, వాటిపై కొలువు తీరిన గ్రామ దేవతలు, చారిత్రక క్రమంలో ఆర్య దేవుళ్లుగా ప్రసిద్ధికెక్కాయి. ఆలయాలను వేలాది మంది భక్తులు సందర్శిస్తున్నా, ఆ కొండలు మైనింగ్ మాఫియా కబంధ హస్తాల్లో కరిగిపోనున్నాయి. ఈ మాఫియాకు వ్యతిరేకంగా స్థానిక ప్రజలు స్వచ్ఛందంగా, స్వతంత్రంగా పోరాడుతున్నారు. ఈ ఉద్యమానికి రాజకీయ రంగు పులిమి గందరగోళాన్ని ప్రజల్లో కలిగించి, సమస్యను తేలిక చేసి, తమ పబ్బం గడుపుకునే కార్యక్రమం మొదలైంది.

చిత్తూరు జిల్లా, తంబళ్లపల్లి మండలం పెద్దమండ్యం మండలాల్లో ఈ కొండలు విస్తరించి ఉన్నాయి. వాటిల్లో మల్లయ్య కొండ, సాధు కొండ, ఇనుము కొండలకు మైనింగ్ మాఫియా ముప్పు ఏర్పడింది. కొండల్లో ఉన్న ఇనుము, బంగారం ఖనిజాల వెలికితీతకు ప్రైవేట్ కార్పొరేట్ సంస్థలు పోటీ పడుతున్నాయి. కేంద్ర ప్రభుత్వంలోని ఓ ప్రముఖ రాజకీయవేత్తకు 'క్విడ్‌ప్రోకో' పద్ధతిలో మేలు చేసే విధంగా ఒక ప్రైవేట్ సంస్థకు అక్కడ మైనింగ్ లీజు కట్టబెట్టాలనుకుంటున్నారు. దీంతో పెద్ద ఎత్తున కదిలిన ప్రజలు మల్లయ్య కొండల్లో మైనింగ్ అనుమతులివ్వరాదనీ, తమ జీవనోపాధిని ధ్వంసం చేయవద్దనీ, ఈ కొండలను మైనింగ్ రహిత ప్రాంతాలుగా ప్రకటించాలనీ ఉద్యమాలు చేస్తున్నారు. ముఖ్యమంత్రిది స్థానిక జిల్లాకావడంవల్ల అటవీ, దేవాదాయ, గనులశాఖ సంయుక్త ఆధ్వర్యం లో పర్యవేక్షణ జరిపి నివేదిక సమర్పించాలని ముఖ్యమంత్రి ఆదేశించారు.

చోళరాజుల కాలం నుంచి మల్లయ్య, సాధు కొండలు ప్రసిద్ధికెక్కాయి. సముద్ర మట్టం నుండి 3,749 అడుగుల ఎత్తు ఉన్న అక్కడి వాతావరణం రమణీయంగా ఉంటుంది. కొండలపై జారే జలపాతాల వల్ల పుష్కలమైన నీరు లభిస్తుంది. అందువల్ల ఆ కొండలు అనేక రకాల ఉపాధిని స్థానిక ప్రజలకు అందిస్తున్నాయి. తాత ముత్తాల కాలం నుండి ఆ కొండలనే నమ్ముకున్న రెండు మండలాలలోని వేలాది ప్రజల ఉపాధిని రాబందుల రెక్కల చప్పుడు మింగేయబోతోంది.

ఆ కొండలనే దేవతా ప్రతిరూపాలుగా పూజిస్తూ, అక్కడ ఆలయాలు నిర్మించుకుని, జాతర్లు జరుపుకుంటున్న ప్రజలు ఇప్పుడు ఆందోళనలో ఉన్నారు. ఈ కొండల్లో 33 శాతం బలమైన అయస్కాంత ఇనుము ఉందని పరీక్షల్లో వెల్లడైంది. 2004 నుండి అనేక ప్రైవేట్ సంస్థలు ఈ కొండల్లోని పలు ప్రదేశాల్లో మట్టిని, రాళ్లను తవ్వి తీసుకుని పరీక్షలకు పంపి ఒక నిర్ధారణకు వచ్చాయి. అనుమతి లేకున్నా, కొన్ని చోట్ల పేల్లుళ్లు జరిపి లైనింగ్ పరిశీలించి, మార్కింగ్ చేశారు.

---

- అవసరాలకు తగినన్ని నిధులను కేటాయించకపోవడం.
- క్షేత్రస్థాయి నుంచి శిశు మరణాల నివారణకు ప్రభుత్వం వద్ద నిర్మాణాత్మకమైన కార్యాచరణ పథకం, ప్రణాళికాబద్ధమైన కేంద్రీకరణ లేకపోవడం.
- ప్రజారోగ్యానికి పునాదిగా ఉన్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు సమగ్ర అభివృద్ధిపట్ల ప్రభుత్వం శ్రద్ధ వహించకపోవడం, ఈ ఆరోగ్య కేంద్రాల నిర్వహణకు, అవసరాలకు అనుగుణంగా వైద్యులను, ఇతర సిబ్బందిని నిధులను సమకూర్చడంలో జరుగుతున్న వైఫల్యం.
- ప్రభుత్వ ఆసుపత్రుల పట్ల ప్రజల్లో ఉన్న తప్పుడు భావనల వలన రోగులను సకాలంలో ఆసుపత్రికి తీసుకురాకపోవడం.
- కొంత మంది వైద్యులలో వృత్తి నిబద్ధత, అంకితభావం, ప్రజారోగ్య సేవ కొరవడడం.
- ఆక్సిజన్ సరఫరాలో పైప్‌లైన్ల లీకేజీ, సిలిండర్ల కొరత
- గ్రామీణ ప్రాంతాల్లో పారిశుధ్య లోపం.

పోషకాహార లోపం ఉన్న తల్లులకు బరువు తక్కువ పిల్లలు పుడుతున్నారు. ఫలితంగా వీరికి వచ్చే పచ్చకామెర్లు, విరేచనాలు, రక్తహీనతతో చనిపోతున్నారు. ప్రతి వెయ్యి మంది పసిపిల్లలకు 60 మంది మరణిస్తున్నారు. 75 మంది రక్తహీనతతో బాధపడుతున్నారు. ఈ రకంగా ఏడాదికి దేశంలో 24 లక్షల మంది పదేళ్లలోపు పిల్లలు చనిపోతున్నారని కొన్ని నివేదికలు వెల్లడిస్తున్నాయి. ఈ మాయదారి రోగాలకు, అకాల మరణాలకు కొద్దిమంది క్రింది స్థాయి అధికారులను గ్రామ సర్పంచ్‌లను నిందిస్తున్నారు. మన దేశంలో, రాష్ట్రంలో పేదరికం, దారిద్ర్యానికి అంటురోగాలకు మధ్య అవినాభావ సంబంధం ఉంది. పోషకాహార లోపం వల్ల వచ్చే అంటురోగాలే అధికమని అనేక సర్వేలు స్పష్టం చేశాయి. కమిషన్లు నివేదికలు నిర్ధారించాయి కూడా. ఇలాంటి పరిస్థితులకు వరంగల్ జిల్లా వాసుల పరిస్థితి అతీతం కాదు.

పేదరికం వలన నామమాత్రపు ఆదాయం సామాన్య, పేద, మధ్యతరగతి వర్గాల జీవన్మరణ సమస్యగా మారింది. నిరంతరం కరువు కాటకాలు, పాలకుల విధానాల వల్ల ఉపాధి అవకాశాలు లేక, ఉద్యోగ అవకాశాలు క్షీణించి ప్రజల కొనుగోలు శక్తి పడిపోతున్నది. జీవన ప్రమాణాలు దిగజారుతున్నవి. ఫలితంగా కనీస స్థాయిలోనైనా సంపూర్ణ ఆహారాన్ని పొందలేక పోతున్నారు. మరో వైపు రక్షిత మంచినీటి లేమి, కాలుష్య రహితమైన గాలి, వెలుతురు కలిగిన మంచి గృహవసతి, పట్టణాల్లో, నగరాల్లో అండర్ గ్రౌండ్ డ్రైనేజీ వ్యవస్థ వల్ల మురికివాడల్లోని ప్రజలను రోగాలు ముసురుకుంటున్నాయి. ప్రధానంగా అతిసార, మలేరియా, మెదడువాపు, టైఫాయిడ్, డెంగ్యూ జ్వరం, బోదకాలు వంటి జబ్బులు పసిపిల్లలను బలిగొంటున్నాయి. వీటన్నింటిని ప్రభుత్వం దృష్టిలో ఉంచుకుని వాటి నివారణకు చర్యలు తీసుకోవాల్సి ఉంది.

*(రచయిత రాజనీతిశాస్త్ర అధ్యాపకురాలు, ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్)* వీ

క్రీ.శ. 1000–1200 మధ్య కాలంలో ఈ ప్రాంతాన్ని చోళరాజులు పాలించారు. ఈ కొండలపై ఇనుముతోనే వారు ఆయుధాలు తయారు చేసుకున్నారు. ఇప్పటికీ పెద్ద మండ్యం పరిసర ప్రాంత గ్రామాలలో మనకు ఇనుప ముద్దలు కనిపిస్తాయి. ఆ కాలంలోనే వారు ఎత్తైన మల్లయ్య కొండలపై ఆలయాలు నిర్మించి మెట్ల మార్గాన్ని ఏర్పరిచారు. ఆ మెట్లదారిలో సుమారు రెండు కిలోమీటర్లు కొండపైకి రాతి మెట్లు ఏర్పాటు చేశారు. అనాదిగా ఆనవాయితీగా మూలమూర్తులకు ఉత్సవాలు స్థానికులు నిర్వహిస్తున్నారు. దేవదాయ శాఖవారు తదనంతర కాలంలో కొండపై ఆలయం దగ్గర విద్యుత్తు, నీటి సరఫరా ఏర్పాటు చేశారు. ప్రతి శివరాత్రి, కార్తీక మాసాలలో భక్తులు లక్షలాదిగా తరలి వస్తారు. కొండ చుట్టూ ఉన్న వందల గ్రామాలలోని భూగర్భ జలాల పెంపుకు ప్రధాన కారణం ఈ కొండలే.

15 సెప్టెంబర్ 2012న మల్లయ్య, సాధు కొండల్లో పర్యటించిన ప్రభుత్వ అధికారిక కమిటీ తన నివేదికను ప్రభుత్వానికి ఇటీవలే సమర్పించింది. వారి నివేదిక ప్రకారమే, ఈ కొండలు రిజర్వ్ ఫారెస్ట్ పరిధిలోకి వస్తాయనీ, ఈ కొండల్లోని అడవుల్లో నేలమల్లేశ్వర స్వామి గుడి, గౌరమ్మ గుడి, మల్లయ్య గుడి, వెలుగు మల్లమ్మ గుడి, పొలిమేరమ్మ గుడి ఉన్నట్లు నిర్ధారించారు. అలాగే ఈ కొండల్లో ఎలకతీర్థం, భగీరథ తీర్థం, నిచ్చెన గుండం, వీరన్న గుహ, అంతరంగ గుహ, ఆది మానవుడి గుహలు ఉన్నాయని, వేల సంవత్సరాల నాటి ఆది మానవుల ఆవాస యోగ్యమైన గుహలు, వారి ఆనవాళ్లు ఇక్కడ ఉన్నట్లు కనబడుతుందని, దీనిపై పెద్ద స్థాయిలో పరిశోధనలు జరపాలని పేర్కొన్నారు. అటవీ శాఖ, వన సంరక్షణ సమితి పేరుతో అటవీ అభివృద్ధి, సంరక్షణ చేస్తుందని చెపుతూ, కొండల మీదే అనాదిగా నివసిస్తున్న గిరిజనుల ఉత్పత్తులను అటవీ శాఖ కొనుగోలు చేస్తూ వారికి జీవన భృతిని కల్పిస్తుందని తెలిపారు.

తిరుపతి నుండి నాలుగు కిలోమీటర్ల దూరంలో పేరూరు కొండ ఉంది. ఇది ఇప్పుడు పేరూరు బండగా మారింది. 250 ఎకరాల విస్తీర్ణం గల ఈ కొండపై మైనింగ్ జరపడం వల్ల అది ఇప్పుడు బండగా మారిపోయింది. ఈ బండపై ఉన్న ఆలయం ఒంటి స్తంభం మేడలా అయిపోయింది. క్వారీయింగ్‌లో చిక్కిపోయిన కొండపై, రాష్ట్ర వ్యాప్త ఉద్యమంలో భాగంగా క్వారీయింగ్ నిలిపి వేశారు. ఈ కొండపై ఉన్న ఆలయాన్ని, వెంకటేశ్వర స్వామి తల్లి వకుళాదేవి ఆలయంగా పేర్కొంటూ పరిపూర్ణానంద స్వామి, తదితర హిందూ మతసంస్థలు ఉద్యమాలు చేస్తున్నాయి.

గత పది సంవత్సరాలుగా తీవ్ర వివాదాలు, గందరగోళాలు నడుస్తున్న క్రమంలో, మిగిలిన ఐదు ఆకారాలున్న ఈ కొండను ప్రభుత్వం 2009లో తితిదేకి అప్పగించింది. అయితే ఆలయ భూముల్లో అక్రమ క్వారీని అడ్డుకోవడంలో తితిదే విఫలమైంది. దీంతో కొండ మొత్తం తొలిచి వేయబడి, ఆలయం ఉన్న కొద్ది ప్రాంతాన్ని వదిలేశారు. దీనిపై స్థానిక ప్రాంత వ్యక్తి హైకోర్టులో పిటిషన్ వేయగా, హైకోర్టు అక్రమ క్వారీయింగ్ నిలిపివేస్తూ, రక్షణ కంచ నిర్మించాలని జిల్లా అధికారులకు, తితిదేకు ఆదేశించింది. పరిసర ప్రాంతాల్లో కూడా పేలుళ్లను నియంత్రించాలని తీర్పు చెప్పింది. లీజుకిచ్చిన క్వారీలను వెంటనే రద్దు చేయాలని చెప్పింది. ఈ పేలుళ్లకు సమీప గ్రామాలలోని ప్రజల ఇండ్లు బీటలు వారాయి. రాత్రుళ్లు నిద్రలేక తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు. ఈ క్వారీయింగ్‌కు వ్యతిరేకంగా ఎన్ని పోరాటాలు చేసినా కరగని ప్రభుత్వం దేవుని పేరుతో తాత్కాలిక ఉపశమాన్ని కలిగించింది.

నిజానికి కుళమాలు ఆలయంగా పేర్కొంటూ వస్తున్న పేరూరు బండ మీద ఆలయం గ్రామ దేవతది. దీనికి రంగు పులిమి హిందూ మత సంస్థలు కొన్ని దేశవ్యాప్త ఉద్యమంగా మలిచి, బిజెపికి స్థానికంగా రాజకీయ ప్రయోజనాలను కలిగించాలని ప్రయత్నించాయి.

పేరూరు అనే ఊరి పేరే క్రీ.శ. 13-8-1546 నాటి శాసనంలో కనిపిస్తుంది. శ్రీపతి ఓబలేశ్వరుడు అనే అడవీటి రాజు 300 వరహాల సాలుసరి ఆదాయం వచ్చే పేరూరు గ్రామాన్ని శ్రీవారి ఆలయానికి దానం చేశాడు. ఇందులో పేరూరు కొండలపైన ఆలయ ప్రస్థావనే లేదు. అంటే అక్కడ ప్రాముఖ్యత లేని గ్రామ దేవత ఆలయం ఉండి ఉండాలి.

క్రీ.శ. 1803లో ఉత్తర ఆర్కాట్ జిల్లా (చిత్తూరు జిల్లా అందులోనిది) కలెక్టరు స్ట్రాటన్ తయారు చేసిన సవాలే – జవాబే పట్టికలో వకుళమాత ఆలయం పేరు లేదు. క్రీ.శ. 1843లో ఆంగ్లేయులు తితిదేని మహంతులకు అప్పగించారు. అప్పటి ఆలయ జాబితాలోనూ లేదు. ఆలయానికి వంటశాల ముందున్న విగ్రహాన్ని వకుళమాత విగ్రహంగా చెప్పారు. కాని అది లక్ష్మీదేవి విగ్రహం. దీన్ని పోటు లక్ష్మి అంటారని శాసనాల్లో ఉంది. తితిదే శాసనాల్లో 'పెరియపరి' (పెద్ద చెరువు అని అర్థం) ఉంది. క్రీ.శ. 1321–1337 కాలం నాటి తిరువేంకటనాథ యాదవరాజు తిరుపతి పట్టణం (అప్పట్లో గోవిందరాజు పట్టణం) తిరుమల ఆలయానికి దానం చేశాడు. దాంట్లో పేరూరు చెరువుంది కాని, ఆలయ ప్రస్తావన లేదు. తిరుపతి గోవిందరాజు స్వామి ఆలయంలోని శాసనాలు నెం. 103, 176, 224 శాసనాల్లో వకుళమాత ఆలయ ప్రస్తావన లేదు కాని పేరూరు ప్రస్తావన ఉంది. పాతువ నరసింహరాయల గురువు కందాడై రామానుజయ్యంగార్ పేరిట ఉన్న రెండు శాసనాలు 24 (9-1-1467) శాసనం నెం. 44 (7-6-1470)లలో పేరూరు భూములను ఉచిత భోజనశాలకు ఇచ్చినట్లు ఉంది. కాని ఆలయ ప్రస్తావన లేదు.

వకుళమాత ఆలయ ప్రస్తావన, తితిదే శాసనాలలోను, పురాణ, ఇతిహాసాలలోను ఆధారాలు లేవు. జానపద పాటల్లో 'పేరూరమ్మ కొడుకులంటా.. వాళ్లేదు మందీ'. వెంకటేశ్వరుడు పేరూరమ్మ ఏడవ కొడుకని ఉంది. అంటే అనాది నుండి అనేక గ్రామ దేవతలు, గంగమ్మ, అంకాళమ్మ, పోలేరమ్మ మాదిరే పేరూరమ్మ ఆ కొండలపై పూజలందు కున్నట్లు తెలుస్తోంది. ఈమెను వకుళమ్మని చేశారు. తిరుచానూరులోని అంకాళమ్మను వెంకటేశ్వరుని భార్య పద్మావతిని చేసినట్టు కథ నడిపించారు.

శ్రీ వెంకటాచలం మహత్యంలో వకుళమాత ప్రస్తాన వస్తుంది కాని ఆమె ఎక్కడ వెలిసినట్టు, లేదా పేరూరును సందర్శించినట్టు కనపడదు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడి తల్లియైన యశోదదేవి, కలియుగంలో నరహస్వామి వంటామెగా శ్రీనివాసుని కలుసుకున్నట్టు కథ ఉంటుంది. పద్మావతితో పరిణయం అనంతరం వకుళమాత ప్రస్తావన అసలు కనిపించదు. ఈ విషయాలన్ని గోపికృష్ణ అనే చరిత్రకారుడు తన రచనల్లో పేర్కొన్నాడు.

ఏది ఏమైనప్పటికీ గ్రామ దేవతల నివాసాలుగా ఉన్న మల్లయ్య, పేరూరు కొండలు ప్రకృతి, అనేక జీవరాశుల వైవిధ్యంతో విలసిల్లు తున్నాయి. వీటిపై అనాదిగా వేలాదిమంది ప్రజలు తమ జీవనాన్ని కొనసాగిస్తూ, వీటినే నమ్ముకొని కాపాడుకుంటున్నారు. సామ్రాజ్య వాదులు యుద్ధాలను దండకారణ్యాలలోని ఆదివాసులు, గిరిజనుల మీదే కాదు, మైదాన ప్రాంతాలలోని ప్రజలపై కూడా చేస్తారు. దీనికి దళారీ రాజ్యం ఇతోధికంగా తన సహాయ సహకారాలను అందిస్తుందని ఈ సంఘటనలు చెప్తున్నాయి. అందుకే ప్రజలు, ఏ ప్రదేశంలోని ప్రజల సమస్యలపైనైనా సహజాతంగా స్పందించకపోతే అదే సమస్య రేపు మనదవుతుంది. అప్పటికి స్పందించడానికి ఆ ప్రజలుండకపోవచ్చు.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

# అటవీ రాష్ట్రం - ఆటవిక రాజ్యం

***కార్పొరేట్ కంపెనీల లాభాల కోసం రూపొందిన విధానాలతో జార్ఖండ్ ఆదివాసులు అనుభవిస్తున్న అమానుష, దారుణ నిర్బంధాన్ని వివరిస్తున్న* కోఆర్డినేషన్ ఆఫ్ డెమొక్రటిక్ రైట్స్ ఆర్గనైజేషన్ *నివేదిక***

దేశంలో జార్ఖండ్ అత్యంత వెనుకబడిన రాష్ట్రం అయ్యిండవచ్చు. ఎక్కువ శాతం ప్రజలకు అడవే నివాసం. అడవే జీవనాధారం. వ్యవసాయం (పోడు) అక్కడే. అడవే ఆదాయ వనరు. బీడీల ఆకులు, కొన్ని రకాల పండ్లు, దుంపలు, ఇప్ప పువ్వు ప్రజల జీవనాధారం. భయంకరంగా తాండవమాడే అనారోగ్యం, మలేరియా, విషజ్వరాలు, భీతిగొలిపే పేదరికం. ఏదో ఒక పూట తిండి, ముతక బియ్యం అన్నం, నీళ్లలో కారం, కాస్తంత ఉప్పు, అక్కడక్కడ కొన్ని దుంపముక్కలు. పాలు, పెరుగు, మజ్జిగ కానని జీవితాలు. ఇదీ అడవుల్లో ఆదివాసుల బతుకు.

విద్య ఒక మిథ్య. పిల్లలు హాజరుకాని బడులు, ఉపాధ్యాయులు బడులకు వెళ్లలేని దారులు, రవాణా సౌకర్యం మృగ్యం. అసలు అవి బడులు కావు, బందెల దొడ్లు. సగం నిర్మించి వదిలినవి. శిథిలావస్థలో ఉన్నవి. దోమల కొట్లు. కంపుకొట్టే జైలు గదులు. ఉపాధ్యాయులకు బల్లలుండవు. కుర్చీలుండవు. శుభ్రం చేసే వారుండరు. జవహర్‌లాల్ నెహ్రూ, బాబూ రాజేంద్రప్రసాద్, మహాత్మా గాంధీ, నేతాజీ, అంబేద్కర్‌ల చిత్రపటాలు చిరిగిపోయి ఉంటాయి. ఫర్లాంగు దూరానికి కూడా ముక్కు పుటాలను తాకే మల, మూత్రశాలల కంపు.

ఆరోగ్య కేంద్రాలు గుర్తింపుకే. అది ఆసుపత్రి అని ఆదివాసిలు చెప్తేనే మనం చూస్తాం. ఆరోగ్య కార్యకర్తలుండరు. మలేరియా – విష జ్వరాలకిచ్చే ప్రాథమిక మందులు ఉండవు. జ్వరం వస్తే పది నుంచి ఇరవై కిలోమీటర్ల దూరం గల గ్రామలకూ, పట్టణాలకూ కాలినడకన పోవాలి.

ప్రభుత్వ పథకాలైన చౌక ధర దుకాణాలుండవు. బియ్యం – గోధుమలు ఇచ్చే వారుండరు. ప్రతి ఇంట్లో రేషన్ కార్డులుంటాయి. సాగు చేసుకొనే భూమికి పత్రాలుండవు. పత్రాలున్న భూమి కొందరికి తెలియదు. అధికారులు చూపరు. ఆశ్చర్యంగా పన్ను కట్టిన రశీదులుంటాయి. ఇది ఆదివాసుల అంతులేని అగాథ గాథ.

– కో ఆర్డినేషన్ ఆఫ్ డెమొక్రటిక్ ఆర్గనైజేషన్స్ (సిడిఆర్ఒ) ఆధ్వర్యాన 'జార్ఖండ్ నిజ నిర్ధారణ కమిటీ' పదిహేడుగురు సభ్యుల బృందం (పౌర, ప్రజాస్వామిక హక్కుల మేధావులు) మార్చ్ 25 నుంచి 29 వరకూ రాష్ట్రంలో పర్యటించింది. లతేహార్, ఘర్వా, పలామూ జిల్లాలు.

ప్రధానంగా నీటికోసం, అటవీ హక్కుల కోసం, భూమి కోసం, మెరుగైన బతుకు కోసం, ఖనిజ సంపదను కాపాడుకొనేందుకు అక్కడి ప్రజలు, ఆదివాసులు చేస్తున్న పోరాటాలు, దేశ ప్రజలకూ, మేధావులకూ, ప్రజాతంత్రవాదులందరికీ తెలిసిన విషయమే. అక్కడ (రాష్ట్రంలో) పోలీసు పహారాలు, పోలీసు పికెట్లు, సిఆర్‌పిఎఫ్ క్యాంపులు (కాలేజీలు, హాస్టళ్లలో కూడా) కనిపిస్తాయి. రోడ్డు వెంట ప్రతి పది నిమిషాల ప్రయాణంలో ఒక క్యాంపు. మోటార్ బైకులపై తుపాకులతో సిఆర్‌పిఎఫ్ జవాన్లు కనిపిస్తారు.

సిడిఆర్ఒ కమిటీ మచ్చుకు తొమ్మిది ఘటనలు పరిశీలించింది. ప్రయాణానికి సిద్ధమవుతుండగా మార్చ్ 26 ఉదయమే తండ్రీ – కొడుకూ ఆగని రోదనతో వచ్చారు. సంజయ్‌కుమార్ అన్న ప్రసాద్‌ను మార్చ్ 21న పోలీసులు 'పరిశోధన' పేరుతో పిలిచారు. అతనిని 'మావోయిస్ట్' అని, మందాల్, చేమూ సన్యా గ్రామాల మధ్యన బాంబు పెట్టినట్టు ఆరోపణ చేసి పోలీసులు అరెస్టు చేసినట్లు చెప్పారు. మార్చ్ 26న పత్రికలు రాస్తే తప్ప, విషయం తెలియదు. ఆశ్చర్యం ఏమంటే అక్కడ బాంబులేమీ లేవు. పేలలేదు. అది లతేహార్ జిల్లా బర్వాడి మార్కెట్.

2010 ఏప్రిల్ 27న మావోయిస్ట్‌లకూ, సిఆర్‌పిఎఫ్ జవాన్‌లకూ మధ్య ఎదురు కాల్పులు జరిగాయి. ఆ గ్రామంలో జసింతాదేవి ఇంటిని రాత్రి సిఆర్‌పిఎఫ్ జవాన్లు చుట్టుముట్టారు. బయటకు రమ్మని పిలిచారు. పిల్లలను తీసుకొని వస్తుండగానే కాల్పులు జరిపారు. ఆమె వెంటనే చనిపోయింది. ఇల్లంతా తూటాల గుర్తులే.

నవర్‌నాగో గ్రామానికి చెందిన మూగ, చెవుడు ఉన్న యువకుడు లూకస్‌మింజ్ పశువులు మేపుకుంటున్నాడు. సిఆర్‌పిఎఫ్ జవాన్‌ల ప్రశ్నలకు జవాబులు చెప్పలేదని కాల్చిచంపారు. 2012 ఫిబ్రవరి 1న ఈ సంఘటన జరిగింది.

బలిగార్, హోమియా గ్రామాలు భూస్వాముల ఆధిపత్య సహకారంతో దాదాపు 463 ఎకరాల భూమిని (సుమారు పదివేల మంది జనాభాకు చెందిన భూమిని) కార్పొరేట్ కంపనీలయిన ఎస్ఆర్, జిందాల్‌లు ఆక్రమించాయి. పారా మిలిటరీ సహకారంతో కాపాడు కుంటున్నాయి.

గర్వా జిల్లాలో జనవరి 21న బర్గాడ్ గ్రామం ఆదివాసి నాయకుడు రాందాస్ మింజ్‌ని, ఫిదా హుసేన్ (ఫకీర్)ను సిఆర్‌పిఎఫ్ జవాన్‌లు బంధించారు. మావోయిస్ట్‌లకు ఆహారం పెట్టారని అభియోగం మోపారు. చిత్రహింసలు పెట్టి జైలులో నిర్బంధించారు.

జార్ఖండ్ వీరులు, చారిత్రక నాయకులు 'నిలాంబర్, పితాంబర్'ల గ్రామం 'సన్యా'. దీంతోపాటు ముప్పై రెండు గ్రామాల భూమి 'కత్కూ' మండల్ డ్యాంలో మునిగిపోయింది. దశాబ్దాల క్రితం సర్వే రిపోర్ట్ ప్రకారం ఇప్పుడీ భూమిని అనుభవిస్తున్నవారు ఎవరూ నష్ట పరిహారానికి లబ్ధిదారులు కాలేకపోయారు. ప్రజలంతా అసంతృప్తితో, సిఆర్‌పిఎఫ్, స్టేట్ పోలీసు క్యాంపులలో భయంతో బతుకులీడుస్తున్నారు. నీలాంబర్ వారసుడు వృద్ధుడు. వంటిపై బట్టల్లేవు. ఆహారం లేదు. ఫొటో

# ఆదివాసి మహిళల పోరాటాలు-రాజ్యహింస

*బ్రిటిష్ కాలం నుండి నేటి దండకారణ్య పోరాటాల దాకా ఆదివాసుల పోరాటాలనూ, అందులో మహిళల వీరోచిత పాత్రనూ వివరిస్తున్నారు* **డా. నళిని**

*(..గత సంచిక తరువాయి)*

**పా**లు ఇస్తున్న పాడి పశువును కబేలాకు అమ్మేసినట్టు, మన వనరులను అవసరాలకు మించి వెలికితీసి, అంతర్జాతీయ విపణిలో అధిక ధరలకు అమ్ముకుంటున్నారు. కోట్లలో ఉన్న లాభాలకు ప్రభుత్వ రాయల్టీ అతి స్వల్పం. ఉదాహరణకి అతి విలువైన ఇనుప ఖనిజానికి ప్రభుత్వ పరిహారం టన్నుకి 50 రూపాయలు. బయట మార్కెట్లో దాని విలువ టన్నుకి 5,800 రూపాయలు.

ఒక పక్క నిల్వలను దోచేసి, ప్రకృతిని, జీవన విధానాన్ని శాశ్వతంగా నాశనం చేసి, అతి తక్కువ పరిహారంతో కార్పొరేట్లు పండుగ చేసుకుంటుంటే, మన ప్రభుత్వం దానికి తందాన పాడుతోంది. మన ప్రభుత్వ వైఖరికి 'హవర్డ్ జిన్' మాటలు చక్కగా సరిపోతాయి.

'మన పాలనా యంత్రాంగం ధనం, అధికారాల అసమాన పంపిణీని రూపుమాపదు-పైగా అధికారం పేరుతో ఆ అసమానతలను మరింతగా పెంపొందింపచేస్తుంది. సంపదని, పేదరికాన్ని అది సంక్లిష్టం చేసి, డొంక దారుల్లో సంపదని పెంచి, పేదరికాన్ని ఎలా తీవ్రతరం చేస్తుందంటే, బాధితులు అప్రతిభులైపోతారు'.

గతంలో ఇలాంటి కుట్రలను కనిపెట్టి ప్రతిఘటించిన వారిని రూపుమాపే ప్రయత్నాలు ఎన్నో జరిగాయి. లక్షలాది గని కార్మికుల కోసం, కాంట్రాక్టు పనివారి కోసం పాటుపడిన శంకర్ గుహ నియోగిని 1991 సెప్టెంబర్‌లో హత్య చేశారు. మన దేశం బహుళ జాతి సంస్థలకు ఆలవాలం అవుతోందని ఆయన ఆనాడే చాటి చెప్పారు.

**చత్తీస్‌గడ్‌లో :** ఒక్కొక్క ప్రాంతంలో జరుగుతున్న విధ్వంసాన్ని చూస్తే, అక్కడి ప్రజల ప్రతిఘటనలు మనకి అర్థమవుతాయి.

ఒక్క చత్తీస్‌గడ్‌లోనే దేశంలోని 6 శాతం సిమెంట్ ఉత్పత్తి, 7 శాతం బాక్సైట్ నిల్వలు, 16 శాతం బొగ్గు నిల్వలు, 5వ వంతు ఇనుప ఖనిజం ఉన్నాయి. దంతెవాడ, కన్వార్, రాజనందగాంవ్, బస్తర్, దుర్గ్ వంటి చోట్ల ఎన్నో వనరులున్నాయి. అందుకే దీన్ని 'పేద ప్రజల సంపన్న భూములు' అంటారు.

ఈ ప్రాంతంలో చట్టబద్ధమైన గనులు, చట్టబద్ధం కానివీ కూడా ఉన్నాయి. మన దేశంలో మొత్తం 8,700 చట్టబద్ధమైన గనులు ఉంటే, 15,000 కి పైగా చట్టబద్ధం కానివే. 1.64 లక్షల హెక్టార్ల అటవీ భూముల్ని గనుల కోసం వాడుతున్నారు. అలా ఆంధ్రప్రదేశ్‌లో 14.2 శాతం, చత్తీస్‌గడ్‌లో 15.2 శాతం, గుజరాత్‌లో 10.2 శాతం, జార్ఖండ్‌లో 9.5 శాతం, మధ్యప్రదేశ్‌లో 10.6 శాతం, ఒడిశాలో 16.2 శాతం అటవీ భూముల్లో గనులు తవ్వుతున్నారు. ఇనుప ఖనిజం తవ్వకం కోసం ఒక సంవత్సరంలో (2005-06) 77 మిలియన్ టన్నుల నీరు వాడారు. అది దాదాపు మూడు మిలియన్ ప్రజల నీటి అవసరాలను తీర్చి ఉండేది. అదే సంవత్సరం గనుల వల్ల 1.84 బిలియన్ టన్నుల వ్యర్థం తయారయింది. ఒక టన్ను బొగ్గు తవ్వి తియ్యాలంటే 3-4 టన్నుల వ్యర్థం తయారవుతుంది.

చత్తీస్‌గడ్‌లో దాదాపు 28 రకాల విలువైన వనరులున్నాయి. అక్కడ హోల్సిమ్, లఫార్గ్ వంటి సిమెంటు కంపెనీలు చిన్న కంపెనీలను మింగేస్తున్నాయి. ఉక్కు పరిశ్రమలో కూడా టాటా, ఎస్సార్, మిట్టల్, జిందాల్ వంటి కంపెనీలు అతి తక్కువ పరిహారంతో ఇనుప ఖనిజాన్ని దోచుకుంటున్నాయి. ఈ కంపెనీల కార్యకలాపాల వల్ల ప్రజలు నిర్వాసితులవుతున్నారు.

దంతెవాడ, బిజాపూర్ జిల్లాల్లో మొత్తం 1200 గ్రామాలు ఉంటే, అక్కడ 7.19 లక్షల జనాభాలో 78.5 శాతం ఆదివాసులే. ఇందులో 50 శాతం గ్రామాలు అంటే దాదాపు 650 గ్రామాలకు చెందిన 3.5 లక్షల ప్రజలు నిర్వాసితులయ్యారు. వారిలో 47,000 మంది

---

తీయాలన్నా మనసొప్పలేదు. అక్కడ ప్రత్యేక సంఘటన.

ఛత్రపూర్ పోలీసుస్టేషన్ పరిధి పలాము గ్రామానికి చెందిన రాజేంద్ర ప్రసాద్‌ను ఇంటి నుంచి తీసికెళ్లి సిఆర్‌పిఎఫ్ జవాన్‌లు చంపేశారు. (30 డిసెంబర్, 2009) కారణాలు నేటికీ తెలుపలేదు. పోలీసులపై చర్యా లేదు. భార్యా, చిన్న వయసు కూతురు, కొడుకులది దీనపరిస్థితి.

మావోయిస్టులకు ఆహారం పెట్టారనే అభియోగంతోనే లతేహార్ జిల్లాలోని బెహరాతాండ గ్రామానికి చెందిన తొమ్మిది మందిని (గ్రామ ప్రధాన్‌తో కలిపి) సిఆర్‌పిఎఫ్ బంధించి, చిత్రహింసలకు గురిచేసి వదిలారు.

లతేహార్ జిల్లాలోని ముర్గిడ్ గ్రామానికి చెందిన బిర్జుబరాన్ అనే యువకుడిని చత్వాకరామ్ దగ్గర సిఆర్‌పిఎఫ్ వారు తీసుకెళ్లారు. బంధువుల కుటుంబ శుభకార్యానికి వెళ్లి వస్తున్నారు. కేవలం అనుమానంతో ఆ యువకుడి చేతివేళ్లను వైర్ కట్టర్‌తో కత్తిరించారు. విషయం మీడియాకు తెలిసి రాశారు. వెంటనే బలవంతంగా మీడియా ముందు 'తాను తాగిన మత్తులో ఉండడం వలన ఎవరు కత్తిరించారో గుర్తు పట్టలేన'ని చెప్పించారు.

వెలుగుచూడని వందల, వేల సంఘటనలు, న్యాయం పొందలేని ప్రజలు. రాత్రింబవళ్లు భయంతో జీవించే పేద, ఆదివాసుల జీవితాల కథలెన్నో.

*(తెలుగు సేత : జనవాది, ప్రజాస్వామ్యవాది)* వీ

సల్వాజుడుం ఏర్పాటు చేసిన 23 బలవంతపు క్యాంపుల్లో మగ్గుతుంటే, 40,000 మంది ఆంధ్రప్రదేశ్ అడవుల్లోకి పారిపోయారు. మిగిలిన 2,63,000 మంది జాడ తెలియడం లేదు.

దక్షిణ బస్తర్‌లో కూడా 3,00,000 మంది ప్రజలను సల్వాజుడుం వెళ్లగొట్టింది. ఈ మూడు జిల్లాల్లో ఇప్పటికి 538 హత్యలు, 99 మాన భంగాలు జరిగాయి. 2005లో ప్రభుత్వ ప్రోత్సాహంతో నెలకొల్పిన సల్వాజుడుం పేట్రేగిపోతోంది. 19 బెటాలియన్‌ల సి.ఆర్.పి.ఎఫ్, రెండు నాగా – మిజో ఐ.ఆర్.బి. బెటాలియన్‌లు అక్కడ స్వైరవిహారం చేస్తున్నాయి. రాయగడ్ బొగ్గు, ప్రేమ్‌నగర్ విద్యుత్ ప్లాంటు, టిల్డా సిమెంట్ ప్లాంటు, రాజనందగాంవ్ పారిశ్రామిక ప్రాంతం, సర్గుజ జష్‌పూర్ల బాక్సైట్, రాయ్‌పూర్ స్పాంజ్ ఐరన్ ప్లాంట్, దేవ్‌భోగ్ వజ్రాల గనులు, బిలాస్‌పూర్ సైనిక క్యాంపు, రాజనందగాంవ్ వాయు దళాల క్యాంపు, పులులు ఏనుగుల రిజర్వులు–ఇలా ఎన్నో ఎన్నెన్నో పేర్లతో ఆదివాసులను వారి భూముల నుంచి, గ్రామాల నుంచి తరిమేస్తున్నారు.

లాభాల వేటలో బహుళజాతి సంస్థల కార్పొరేట్లు, వారి సాయుధ బలగాలు, ప్రభుత్వం, సైన్యం ఒక వైపు; తమ ఉనికిని కోల్పోతున్న అమాయకపు ఆదివాసులు, వారి జీవనం, పర్యావరణం మరోవైపు. అక్కడ ఇప్పుడు గ్రామాలు లేవు. అన్నీ క్యాంపులే. వైద్య సదుపాయాలు, రేషన్ షాపులు, స్థానిక మార్కెట్లు రద్దయిపోయాయి. మానభంగాలు, నక్సలైట్ పేరుతో అరెస్టులు, హత్యలు మితిమీరి పోతున్నాయి. ప్రజాస్వామ్యం కుదించుకుపోయి నిర్బంధం రాజ్యమేలుతోంది.

**జార్ఖండ్‌లో –** ఎన్.టి.పి.సి. పెద్ద పెద్ద బొగ్గు గనులు తవ్వడంతో 186 గ్రామాల ప్రజలు అంటే దాదాపు 2,50,000 మంది నిర్వాసితులవుతారు. మిట్టల్ స్టీల్ ప్లాంటు వల్ల 40 గ్రామాలకు చెందిన 70,000 మంది నిర్వాసితులవుతారు. ఇంకా జిందాల్, భూషన్, ఎస్సార్ స్టీలు ప్లాంట్లు కూడా ఈ చట్రాన్ని బిగిస్తున్నాయి.

**పశ్చిమ బెంగాల్లో ;** సెజ్‌ల పేరుతో 2,00,000 ఎకరాల భూమిని మింగేసి, 2.5 మిలియన్ ప్రజలను వెళ్ల గొట్టాలని చూసిన ప్రభుత్వానికి బుద్ధి చెప్తూ ఇప్పటికీ ప్రజలు పోరాడుతున్నారు. సింగూరులో 997 ఎకరాలు టాటా కార్ల కోసం కేటాయించి 50,000 మందిని వెళ్లగొట్టాలని చూస్తే ప్రజలు తిరగబడ్డారు. టాటా తోకముడిచి గుజరాత్‌కి పారిపోయినా లీజు కాలం పూర్తి కాలేదంటూ ప్రజల భూమిపై కబ్జాని మాత్రం సడలించలేదు. అక్కడ భూసారం తరిగిపోయింది. అలానే, నందిగ్రామ్‌లో పెద్ద కెమికల్ ఫ్యాక్టరీ 95,000 మందిని నిర్వాసితుల్ని చేస్తుంటే, రెండు పెద్ద ప్రతిఘటనల ద్వారా ప్రజలు తమ ఆకాంక్షలను తెలుపుతూనే ఉన్నారు. జిందాల్‌కి వ్యతిరేకంగా సాల్‌బొని ఆదివాసులు పిడికిలి బిగిస్తూనే ఉన్నారు. మేదినీపూర్ జిల్లా లాల్‌గడ్‌లో జిందాల్ ఉక్కు కర్మాగారానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు.

**ఒడిశాలో –** ఇక్కడ బాక్సైట్ చత్తీస్‌గడ్ కంటే శ్రేష్టమయిందని ప్రతీతి. 50–60 దశకంలో ఇండాల్ అల్యూమినియం ఫ్యాక్టరీ, దానికి నీరిచ్చే హిరాకుడ్ డ్యాముల వల్ల 1,60,000 ప్రజలు (అందులో 50 శాతం ఆదివాసిలు) నిర్వాసితులయ్యారు. వారికి ఇప్పటికీ పునరావాసం కుదరలేదు. 1998లో నాల్కో, తర్వాత బాల్కో, 93లో ఉత్కళ్, 2000లో హిండాల్కో – ఇలా ఒకటి తర్వాత ఒకటి ప్రజలను పోటు పొడుస్తూనే ఉన్నాయి. ఇప్పుడు జగత్ సింగ్‌పూర్‌లో పోస్కో స్టీలు ప్లాంటు నెలకొల్పాలంటే దానికి ఒక పోర్టు కావాలి. వందలాది కిలోమీటర్ల దూరం నించి తెచ్చే ఇనుప ఖనిజం కావాలి. ఈ క్రమంలో 7 గ్రామాల నుంచి 22,000 మంది నిర్వాసితులవుతారు. 4,000 ఎకరాల భూమిని కోల్పోతారు. ఒడరేవు ప్రాంతంలో జాలర్లు, ఇతర గ్రామస్తులు తమ జీవనోపాధిని కోల్పోతారు. కళింగనగర్‌లో 12 మంది ఆదివాసులు పోలీసు తూటాలకి బలైన తీవ్ర ప్రతిఘటన తర్వాత అక్కడ టాటా స్టీల్ ప్లాంట్ ప్రతిపాదన రద్దయింది. ఇప్పుడు మళ్లీ నియంగిరి కొండల్లో వేదాంత కంపెనీ గనుల పేరుతో డొంగారియా గోండు గిరిజనుల జీవితాలతో ఆడుకుంటోంది.

మన దేశంలో దాదాపు 8.4 కోట్ల మంది ఆదివాసులున్నారు. స్వాతంత్ర్యానంతరం అభివృద్ధి పేరుతో ఇప్పటికీ 3 కోట్ల మంది నిర్వాసితులయ్యారు. నిర్వాసితులు కావడం అంటే కేవలం ఒక చోట నుంచి మరొక చోటకి తరలించడం కాదు. ఈ క్రమంలో వారు తమ జీవనాన్ని, వనరుల్ని, సంస్కృతిని, చివరికి తరతరాలుగా ఏర్పరుచుకున్న తమ ఉనికినే కోల్పోతారు. పైగా, తమ చుట్టుపక్కల భూమి, గాలి, నీరు కలుషితమైపోయి జీవనం దుర్భరమైపోతుంది. రైతులు కూలీలవుతున్నారు. ఆదాయం సగానికి తగ్గిపోతోంది. నేరాలు, వ్యభిచారం పెరుగుతున్నాయి. ఊపిరితిత్తుల వ్యాధులు, ఆహారలేమి వల్ల వచ్చే వ్యాధులు ప్రబలుతున్నాయి. మొత్తంగా – పేదరికం ద్విగుణీకృతమవుతోంది.

**ఆదివాసి మహిళల ప్రతిఘటన**

ఈ క్రమం అంతా కలిసి స్త్రీల జీవితంపై తీవ్ర ప్రభావాన్ని కలిగిస్తోంది. సాధారణంగా ఆదివాసి స్త్రీలు పురుగు పుట్రలకు భయపడకుండా అడవంతా తిరిగి జిగురు, దుంపలు, ఇతర అటవీ ఉత్పత్తులు సేకరిస్తారు. ఫారెస్టు డిపార్టుమెంటులో, రోడ్ల పనిలో, తునికాకు వగైర పనుల్లో రోజు కూలీ చేస్తారు. అదికాక ఇంటిపని, వంటపని, పిల్లల పోషణ తప్పనిసరి. పశుపోషణా తప్పదు. తమ ఉత్పత్తులను అమ్ముకు రావడానికి సంతలకు వెళ్లేది వాళ్లే. రోజుకి 16 గంటలు పని చేసినా వారి పని తీరదు. అలా కుటుంబ భారాన్ని రెండు చేతులా మోసే స్త్రీల చదువు మాత్రం అంతంత మాత్రమే. మన దేశంలో స్త్రీల అక్షరాస్యత 39.2 శాతం ఉంటే, ఆదివాసి స్త్రీల అక్షరాస్యత 18.2 శాతం మాత్రమే. మన రాష్ట్రంలో 50 శాతం కంటే ఎక్కువ మంది ఆదివాసులకు సరైన మంచినీటి సదుపాయం లేదు. 70 శాతానికి కరెంటు లేదు. 75 శాతానికి రోడ్డు రవాణా సౌకర్యం లేదు. గర్భిణీ స్త్రీల మరణాల సంఖ్య అక్కడ 25 శాతం. శిశు మరణాల సంఖ్య వెయ్యికి 165 (మన రాష్ట్రంలో వెయ్యికి 95 మంది). 80 శాతం పిల్లల్లో రక్తహీనత కనిపిస్తుంది. 55 శాతం పిల్లలు వయసుకు తగ్గ బరువులేక బలహీనంగా ఉంటారు. ఇవి కాక బాల్యవివాహాలు, 18 ఏళ్లకి ముందే తల్లులు కావడం, మలేరియా మహమ్మారి వల్ల తరతరాలుగా రక్తంలో వచ్చిన మార్పు వల్ల కలిగే 'సికిల్ సెల్ ఎనీమియా' అనే రక్తహీనత.

అలా, మలేరియాతో, కటిక దారిద్ర్యంతో అలమటిస్తున్న ఆదివాసుల వెతలు తీర్చకపోగా, ప్రభుత్వం వారిని మరిన్ని అగచాట్లకు గురి చేసి, వారి జీవన విధానాన్నే ధ్వంసం చేస్తుంటే, వారు తిరగబడడం సహజం. పెద్ద ఎత్తున సాగుతున్న తరిమివేతను ఆదివాసులు అతి ధైర్యంగా ప్రతిఘటిస్తున్నారు. అలా కాకపోతే వారికి మనుగడే లేదు.

స్త్రీల ప్రతిఘటన ఈనాటిది కాదు. 1967లో కిసాన్ సభ పేరుతో

ఉత్తర బెంగాల్లో భూములను ఆక్రమిస్తుంటే మహిళలు పిడికిలి బిగించారు. అప్పుడు ఏడుగురు మహిళలు, ఇద్దరు పిల్లలు ప్రాణాలు అర్పించారు. 1967 లో చెలరేగిన శ్రీకాకుళ పోరాటంలో 13 మంది ఆదివాసి మహిళలతో సహ 17 మంది మహిళలు ప్రాణత్యాగం చేశారు. 1970 వ దశకంలో ఆదిలాబాద్, ఖమ్మం జిల్లాల్లో రైతు కూలీ సంఘాల్లో ఆదివాసి మహిళలు నడుము బిగించారు. తుడుం మోగించారు. 80, 90వ దశకాల్లో ఆంధ్ర, జార్ఖండ్, చత్తీస్‌గడ్, మధ్యప్రదేశ్‌లలో ఉవ్వెత్తున లేచారు. ఆదివాసి ముక్తి సంఘటన వంటి సంఘాల్లో పాలు పంచుకున్నారు. 2002లో కేరళ వయ్‌నాడ్ జిల్లాల్లో ప్రతిఘటించారు. 1989లో, 2000లో ఆంధ్రప్రదేశ్‌లో 1/70 యాక్టుకి వ్యతిరేకంగా పోరు సలిపారు. (ఈ చట్టం భూస్వాముల భూములను పరిరక్షిస్తుంది. సహజ వనరులను బహుళజాతి సంస్థలకు అమ్మడాన్ని చట్టబద్ధం చేస్తుంది.) 1996 – 2004 ల మధ్య దుబాయి కంపెనీ చేపట్టిన బాక్సైట్ గని తవ్వకాలకు వ్యతిరేకంగా చింతపల్లిలో అగ్గి రాజుకుంది. రాంచీలో కోయిల్‌కరో డ్యాముకి వ్యతిరేకంగా 1983 లో ముండా ఆదివాసి మహిళలు కదిలారు. 2001 లో త్రిప్‌కరా పోలీసు కాల్పులకి ఎదురొడ్డి నిలిచారు. రైఫిల్ దెబ్బలను, ఈడ్చివేతలను, మానభంగాలను లెక్క చేయకుండా, 'నర్మదా బచావ్' ఆందోళనలో 'కోయీ నహీ హటేగా బాంద్ నహీ బనేగా' అంటూ నినదించారు. రాయగఢ్ కాశీపూర్ తాలూకాలో, కళింగనగర్‌లో బాక్సైట్ గనులను వ్యతిరేకించారు.

ఇవికాక, తునీకాకు పోరాటాల్లో, వెదురు కోసుకునే హక్కు కోసం జరిగిన పోరాటాల్లో మహిళలు ముందు నిలిచారు. 2002లో కేరళలో పాల్ఘట్‌లో కోకాకోలా కంపెనీ రోజుకి 1.5 మిలియన్ లీటర్ల నీటి కోసం 6 బోరు బావులు వాడుకుంటే, భూగర్భ జలాలు దిగజారిపోయి విషపూరితమైపోయి, సుదూర ప్రాంతాల నుంచి నీరు తేవలసిన పరిస్థితి ఏర్పడితే, మహిళలు ప్రతిఘటించారు.

గడ్చిరోలి జిల్లాలో సిరొంచ, అహిరి ప్రాంతాల్లో 1984 నాటికి 50 వేల ఎకరాల అటవీ భూములు కొత్తగా సాగులోకి వచ్చాయి. ప్రజలు ఫారెస్టు శాఖతో జీవన్మరణ పోరాటాలు చేసి దీన్ని సాధించారు. చల్‌వాడ్‌లో తొర్రెం బుచ్చక్క, రడం పెల్లిలో ఆత్రంబాయి, మరిపెల్లిలో రత్నక్క, బంగారంపేటలో రాజక్క – అలా ప్రతి ఊళ్లో మహిళలు భూపోరాటాలు చేశారు. ఫారెస్టు అధికారులు వీరి పంట భూములను ఏనుగులతో తొక్కిస్తే సమైక్యంగా పోరాడారు. దాని ఫలితంగా ఈనాడు ప్రతి ఆదివాసి భూమిని కలిగి ఉన్నాడనడంలో అతిశయోక్తి లేదు.

నాటు కూలీ రేట్ల పెంపుదల కోసం, కరువు వ్యతిరేకంగా పోరాటాలు, కరువుదాడులు, చందాల సేకరణ, వెదురు, ఇప్పపూవు రేట్ల పెంపు కోసం పోరాటం, చీపురు రేట్ల పెంపు డిమాండ్, సంతలను తెరవాలనే డిమాండ్‌లతో పోరాటం, సమాన పనికి సమాన వేతనం కోసం, తదితర ఎన్నో అంశాలపై స్త్రీలు పోరాడుతూనే ఉన్నారు.

అంతేకాక, పురుషస్వామ్య వ్యవస్థలో స్త్రీలుగా పడుతున్న అగచాట్లకు వ్యతిరేకంగా, సామాజిక దురాచారాలకు వ్యతిరేకంగా కూడా వారు పోరాడుతున్నారు. పెళ్లయిన స్త్రీలు జాకెట్లు వేసుకోకూడదనే నిబంధనను వ్యతిరేకించారు. ఊరి బయట గుడిసెలో నెలవారీ నిర్బంధాన్ని వ్యతిరేకించారు. గుడిసెల్లోకి వచ్చే బలవంతపు పెళ్లిళ్లను వ్యతిరేకించారు. రాజకీయ పోరాటాల్లో పురుషులతో సమానంగా ముందుకు నడిచారు. సాంప్రదాయ ఆయుధాలనే కాక తుపాకులను కూడా ఉపయోగించి తమను తాము రక్షించుకోవడం నేర్చుకుంటున్నారు.

బూటకపు ఆర్థిక సంస్కరణల పేరుతో దండుగలు వసూలు చేయడాన్ని వారు ప్రతిఘటిస్తున్నారు. జాతి విముక్తి పోరాటాలకు మద్దతు పలికారు. నిర్వాసిత సమస్యపై పోరాడుతూనే ఉన్నారు. గనుల తవ్వకాలు, నేషనల్ పార్కులు, ప్రాజెక్టుల వల్ల జీవన విధానాన్ని కోల్పోవడాన్ని వారు నిరసిస్తున్నారు.

క్రాంతికారీ ఆదివాసి మహిళా సంఘం (కె.ఏ.ఎం.ఎస్) మహారాష్ట్ర, చత్తీస్‌గడ్‌లలోని 7 జిల్లాల్లో, 40 లక్షల జనాభా కలిగిన దండకారణ్యంలో పనిచేస్తోంది. ఈ ప్రాంతంలో 19 లక్షల 88 వేల మంది మహిళలున్నారు. మాడియా, మురియా, దొర్ల, రాజగోండు, హల్బ, బతర తెగల పలు జాతులున్నాయి.

వీరంతా 1991 నుంచి చేస్తున్న పోరాటాల్లో టాడా చట్టాన్ని, పోటా చట్టాన్ని, సంఘటిత నేరాల నిరోధక చట్టాన్ని (మకొక), చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టాన్ని (యు.ఎ.పి.ఎ) చవిచూస్తూనే ఉన్నారు. ఎన్నో నిర్బంధాలను ఎదుర్కొంటున్నారు. చట్టాలతో జైలు శిక్షలు కాక, చట్టవ్యతిరేకంగా మహిళలను మాయం చేయడం కూడా జరుగుతోంది. 1990, 97లలో 'జన జాగరణ్' పేరుతో, 2005 నుంచి 'సల్వాజుడుం' పేరుతో భూస్వామ్య ప్రతినిధులు, పోలీసులు కలిసి చేస్తున్న ఆకృత్యాలతో దంతెవాడ, బస్తర్, బీజాపూర్ తదితర చోట్ల ఇల్లు, పొలం, గుడిసె, కాలిబాట, ఇప్పచెట్లు, ఈతచెట్లు సైతం మహిళలకు రక్షణ నివ్వలేకపోతున్నాయి. జుడుం మూకలు, నాగా, మిజో, సి.ఆర్.పి.ఎఫ్ బలగాలు వారిని నెత్తురోడే మాంసపు ముద్దలను చేస్తున్నాయి. అందుకే అక్కడ మహిళలు ప్రతిఘటిస్తున్నారు. ఒంటరిగా మూకుమ్మడిగా, నిరాయుధులై సాయుధులై, ఇంటా బయటా యుద్ధం చేస్తున్నారు.

## 'గ్రీన్‌హంట్' పేరుతో అంతర్యుద్ధం

ఆదివాసుల ప్రతిఘటనను పోలీసుల తుపాకులు చల్లబరచలేక పోవడంతో, ఆదివాసుల్లోనే మరొక వర్గాన్ని తయారు చేసి, వారి కళ్లను వారి వేళ్లతోనే పొడిపించే సాధనం 'పవిత్రీకరణ వేట' లేదా 'సల్వా జుడుం'. 2005 నుంచి నేటి వరకు ఈ పేరుతో జరిగిన హత్యలకు, మానభంగాలకు, నిర్బంధాలకు, ఆకృత్యాలకు అంతే లేదు.'వనరుల శాపం' గా సాగుతున్న ఈ అంతర్యుద్ధంలో ఆదివాసుల సహజ వనరులు వారి సామాజిక నియమాలను రూపుమాపుతున్నాయి. పేదరికాన్ని పెంచి, అంతర్యుద్ధం వైపు వాళ్లని నెడుతున్నాయి.

విదేశీ సామ్రాజ్యవాదులు, దేశీయ కార్పొరేట్లతో కలసి పోలీసులు, సి.ఆర్.పి.ఎఫ్, సల్వాజుడుం తదితర సాయుధ బలగాలతో చేపిస్తున్న దురాగతాలు చాలదన్నట్టు కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు 'గ్రీన్‌హంట్' పేరుతో రంగంలోకి దిగింది. వర్గ సమాజంలో ప్రతి ఒక్కరూ ఏదో ఒక వర్గానికి చెంది ఉంటారు. ప్రతి ఆలోచనా విధానమూ తప్పకుండా ఏదో ఒక వర్గ ప్రభావానికి గురై ఉంటుంది అనే మహాశయుల మాటలు గుర్తు చేసుకుంటే, ఈ 'గ్రీన్‌హంట్' ని పాలకులు ఎందుకు అంత పట్టుదలగా కొనసాగిస్తున్నారో అర్థమవుతుంది. దాన్ని ప్రజలు, ప్రజాస్వామిక వాదులు ఎందుకు తీవ్రంగా ఖండిస్తున్నారో కూడా అర్థమవుతుంది.

ఈ గ్రీన్‌హంట్ వ్యతిరేక ప్రజాపోరాటం ఆదివాసి హక్కుల పరిరక్షణ పోరాటంగా అంతిమంగా వర్గపోరాటంగా రూపుదిద్దుకుంటోంది. క్రూర మృగాల నుంచి రక్షణ కోసం సాంప్రదాయ ఆయుధాలు కలిగి ఉన్న

ఆదివాసులు, ఏ నియమ నియంత్రణలు లేని మానవ మృగాలపై ఆధునిక ఆయుధాలు ఎక్కుపెట్టక తప్పని పరిస్థితికి నెట్టబడుతున్నారు. తీవ్రవాద ఏరివేత ముసుగులో అటవీ భూముల దురాక్రమణ, ప్రతిఘటించిన వారిపై నిర్బంధాలు, మానభంగాలు, కాల్చివేతలు – ఇప్పుడు దండకారణ్యం యుద్ధభూమిగా మారుతోంది.

స్త్రీలపై అత్యాచారాలు రాజ్యహింసలో భాగంగా జరుగుతున్నాయి. ప్రతి శిబిరంలో పదుల సంఖ్యలో మహిళలు అవాంఛిత గర్భాలు మోస్తూ కనిపిస్తారంటే ఆ హింస తీవ్రత అర్థమవుతుంది. బాలింతలపై, గర్భిణీ స్త్రీలపై, బాలికలపై, కనపడిన ప్రతి స్త్రీపై సాముహిక అత్యాచారాలు జరుగుతున్నాయి. నిన్న వాకపల్లి, నేడు బల్లుగూడ దీనికి తాజా ఉదాహరణలు. బల్లుగూడ బాధితులు ముగ్గురిని కలిసి మేము వారి మాటల్లోనే వారి బాధను అర్థం చేసుకున్నాం. నేరస్తులను శిక్షించాలనే వారి డిమాండుని బయట ప్రపంచానికి వినిపించాం.

ఇటీవల ఆదివాసి తిరుగుబాటును అణచడానికి అమెరికా సాంకేతిక సహాయాన్ని అందిస్తోంది. అయినా గాని అక్కడ ప్రజా సమీకరణ పెద్ద ఎత్తున సాగుతోంది. ప్రజా సంఘాలు. గ్రామ కమిటీలు ఏర్పడుతున్నాయి. వాటిలో మహిళలకు తగిన ప్రాతినిధ్యం ఉంటోంది. దాని వల్ల సారా వ్యతిరేక పోరాటాలు, గృహ హింస వ్యతిరేక పోరాటాలు కూడా జరుగుతున్నాయి. స్వయంశక్తి నమూనాపై, స్వచ్ఛంద శ్రమ, విరాళాల ద్వారా రోడ్ల నిర్మాణం, గొట్టపు బావులు, నీళ్ల ట్యాంకుల ఏర్పాటు జరుగుతోంది. విద్యార్థులు, మానవహక్కుల సంఘాలు, తదితరులు వీరికి మద్దతునిస్తున్నారు.

అరుంధతీరాయ్ వంటి మేధావులు ప్రభుత్వాన్ని కొన్ని ప్రశ్నలు అడుగుతున్నారు. కొండల నుంచి బాక్సైట్‌ని బయటకు తీయడానికి, అడవుల గర్భంలోంచి ఇనుప ఖనిజాన్ని తరలించుకు పోవడానికి, జనం దగ్గర నుంచి 85 శాతం భూమిని స్వాధీనం చేసుకుని వాళ్లని తరిమికొట్ట డానికి ఇండియా తప్పని సరిగా పోలీసు రాజ్యంగా మారవలసిందే. ఇరుకైన కాశ్మీరు లోయని అదుపు చేయడానికి ఆరుల లక్షల మంది సైనికులు అవసరం అయితే, దేశవ్యాప్తంగా కోట్లాది ప్రజలను అదుపు చేయడానికి ఎంతమంది సైనికులు కావాలి? అలానే, 2010 చివరలో కోపెన్ హెగెన్‌లో జరిగే 'క్లయిమేట్ ఛేంజ్' కాన్ఫరెన్స్‌కి వెళ్లే వారెవరైనా అక్కడ ఒక ప్రశ్న అడిగితే బాగుంటుంది–'మనం బాక్సైట్‌ని ఆ కొండల్లోనే ఉండ నివ్వగలమా?' అని..

**అంతిమంగా**

తమకంటూ ఒక దేశం లేకుండా ఎక్కడో తలదాచుకుంటున్న పాలస్తీనా ప్రజలు ఒక వైపు, తమ దేశంలోనే ఏ హక్కులూ లేకుండా తీవ్రవాదుల ముద్రతో బతుకుతున్న శ్రీలంక తమిళులు ఒక వైపు, రాజకీయ కల్లోలాల వల్ల పారిపోయి ఎక్కడెక్కడో తలదాచుకుంటున్న కాశ్మీరు ప్రజలు, ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ తదితర ఎన్నో ప్రాంతాల ప్రజలు మరోవైపు – వీరంతా తమ ఉనికిని కోల్పోయే స్థితికి వచ్చారు.

ఇప్పుడు గనుల పేరుతో జరుగుతున్న జీవన, పర్యావరణ విధ్వంసంలో కొట్టుకుపోతున్న ఆదివాసిలు తమ ప్రాంతాలకు దూరంగా మనుగడ సాగించవలసి వస్తోంది. విధ్వంసం, నిర్వాసితం అనేవి ఒకే నాణేనికి రెండు ముఖాలు.

మానవహక్కుల పరిరక్షణ కోసం పాటు పడే వాళ్లందరూ ఈ చర్యల్ని ఖండించాలి. ఈ దౌర్జన్యాన్ని ప్రతిఘటిస్తూ పోరాడుతున్న ప్రజల్ని సమర్థించాలి. 'సర్వయివల్' అనే అంతర్జాతీయ మానవ హక్కుల ప్రచార సంస్థ కార్యకర్తలు ఇటీవల లండన్‌లో 'వేదాంత' సంస్థ వాటాదారుల వార్షిక సమావేశం వద్ద నిరసన ప్రదర్శన జరిపారు. 'అవతార్' సినిమాలో పండోర గ్రహాన్ని ధ్వంసం చేసినట్టు, 'వేదాంత' అనే బహుళజాతి సంస్థ గనుల పేరుతో ఒడిశాలోని డొంగారియా గోండు గిరిజనుల జీవితాలతో ఆడుకుంటోందంటూ వారు 'పండోర' గ్రహ ప్రజల వేషధారణతో ప్లేకార్డు లతో నిరసన తెలియజేశారు – ఒడిశా 'అవతార్' ను రక్షించమంటూ.

'మా భూమి, మా గనులు, మా సంపద, మా అడవులు మేము వదలం. మా ప్రాణాలు పోయినా మా ప్రకృతి సంపదలను రక్షించు కుంటాం. మా సంపదలపై సంపూర్ణ హక్కులతో మా భవిష్యత్ తరాలను ఫలింపజేస్తాం' – అనేది నేటి ప్రజల నినాదం.

అందుకే వారు సింగూరు నుంచి టాటాని తరిమికొట్టారు. నందిగ్రామ్ లో కెమికల్ ఫ్యాక్టరీని ఆపారు. కళింగనగర్‌లో టాటా స్టీల్ ప్లాంట్‌ని అడ్డుకున్నారు. సోంపేటలో నాగార్జున థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుని తరిమికొట్టారు. నియంగిరి కొండల నుంచి వేదాంత కంపెనీని వెళ్లగొడుతున్నారు.

'అభివృద్ధి ఎవరి కోసం? పాలకుల కోసమా, ప్రజల కోసమా? అంటూ జల్ జంగల్ జమీన్‌ల మీద తమ హక్కుల కోసం పోరాడుతున్న ఆదివాసిలకు జేజేలు పలుకుదాం. త్యాగాలకు వెనుకాడకుండా, ధైర్యంగా నిలబడుతున్న ఈ ఆదివాసి వీరులకు సంఘీభావాన్ని తెలుపుదాం. మట్టిలోంచి పుట్టిన ఈ మాణిక్యాలను పరిరక్షించుకుందాం.అభివృద్ధి పేరుతో వారికి జరుగుతున్న అన్యాయాన్ని అరికడదాం. తీవ్రవాదులుగా చిత్రించి వారి జీవన ప్రమాణాలను కాలరాచి వేయడాన్ని ఖండిద్దాం.

ఆదివాసి పోరాటాలు వర్ధిల్లాలి!

విధ్వంసానికి, నిర్వాసితానికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలు వర్ధిల్లాలి!

పోరాడుతున్న ప్రజావీరులు వర్ధిల్లాలి!

(సంధ్య కోరిక మేరకు అంతర్జాతీయ మహిళా దినోత్సవ శతవార్షిక సమావేశంలో 2010 సెప్టెంబర్ 9వ తేదీన చదివిన ప్రసంగ పాఠం)

*(అయిపోయింది)*

*(రచయిత పిల్లల వైద్య నిపుణులు)* వీ

**గమనిక :** పాఠకుల వీక్షణం శీర్షికకు, వ్యాసాలపై చర్చకు పాఠకుల నుంచి ఇతోధికమైన స్పందనను ఆశిస్తున్నాం. కాని, ఎక్కువ మంది పాఠకుల స్పందనకు అవకాశం కల్పించేలా, స్థలాన్ని దృష్టిలో ఉంచుకొని తమ స్పందనలను వీలైనంత క్లుప్తంగా రాయాలని కోరుతున్నాం. చర్చ ఏ వ్యాసంపై జరుగుతుందో దానికే పరిమితమయి ఉండడం, చద్దికన్న ఊరగాయ ఘనం కాకుండా ఉండడం అవసరం. స్థలాభావం దృష్ట్యా ఉత్తరాలు, చర్చ ఎడిట్ చేసి ప్రచురించే అధికారం సంపాదకవర్గానికి ఉంది. ఇప్పటివరకూ వాడని ఈ అధికారాన్ని ఇకముందు కూడా వాడే అవసరం రాకుండా జాగ్రత్తపడాలని కోరుతున్నాం. – సం.

# ఆర్.ఎస్. రావు స్ఫూర్తిని ఇనుమడించిన సదస్సు

**2011** జూన్ 17న మరణించిన రాజకీయార్థిక శాస్త్రవేత్త, అరుదైన మార్క్సిస్టు ఆలోచనాపరుడు, భారత విప్లవ, ప్రజా ఉద్యమాల మిత్రుడు ఆర్.ఎస్. రావు స్మృతిలో ప్రతి సంవత్సరం స్మారక ఉపన్యాసాన్ని, సదస్సును నిర్వహించాలనే ప్రయత్నంలో భాగంగా బి1 కలెక్టివ్, వీక్షణం సంయుక్త నిర్వహణలో ఆర్.ఎస్. రావు స్మారక ఉపన్యాసం, సదస్సు కార్యక్రమాలు నవంబర్ 10–11 తేదీల్లో హైదరాబాదులో విజయవంతంగా జరిగాయి.

ఆర్.ఎస్. రావు ప్రథమ స్మారక ఉపన్యాసంగా 'కూడలిలో ఉన్నత విద్య – ప్రత్యామ్నాయాల అన్వేషణ' అనే అంశంపై నవంబర్ 10 సాయంకాలం హైదరాబాద్‌లోని ప్రెస్‌క్లబ్‌లో ప్రొ. వి.ఎస్. ప్రసాద్ ప్రసంగించారు. ఆర్.ఎస్. రావు పనిచేసిన, ఆసక్తి చూపిన అనేక ప్రజానుకూల అంశాల చర్చను, విశ్లేషణను కొనసాగించి సంపద్వంతం చేసే కృషిలో భాగంగా ఈ స్మారక ఉపన్యాసం, సదస్సు నిర్వహిస్తున్నామని ఈ కార్యక్రమాన్ని, ఉద్దేశ్యాలను అధ్యక్షత వహించిన ఎన్ వేణుగోపాల్ వివరించారు. స్మారక ఉపన్యాసం కన్న ముందు 'ఆర్.ఎస్. రావు స్మృతిలో...' పుస్తకాన్ని ఆర్.ఎస్. రావు చిరకాల శిష్యుడు, మిత్రుడు పంకజ్ దత్ ఆవిష్కరించారు. నాలుగు దశాబ్దాలకు పైగా ఆర్.ఎస్.రావు మొక్కవోని దీక్షతో ప్రజా ఉద్యమాలను, విప్లవోద్యమాన్ని సమర్థించారని ఆయన అన్నారు. అర్ధభూస్వామ్య, అర్ధవలస సూత్రీకరణకు సైద్ధాంతిక సమర్థన ఇచ్చేందుకు, ప్రజాఉద్యమాలు ఎదుర్కొంటున్న అనేక సమస్యలను మార్క్సిస్టు తాత్విక దృక్పథం నుంచి విశ్లేషించేందుకు ఆర్.ఎస్. రావు కృషి చేశారని, ఆ కృషిని ముందుకు తీసుకుపోవడమే ఇవాళ్టి కర్తవ్యమని పంకజ్ దత్ అన్నారు.

ఉన్నత విద్యారంగ స్థితి గురించి ప్రతి ఒక్కరూ విమర్శనాత్మకంగానే ఉన్నారని, కాని ఆ చర్చను శూన్యంలో కొనసాగించలేమని, తప్పనిసరిగా ఆ విమర్శ ఒక విశ్లేషణాత్మక చట్రం పునాదిగానే సాగాలని అంటూ ప్రొ. వి.ఎస్. ప్రసాద్ తన ప్రసంగాన్ని ప్రారంభించారు. భారత దేశం ఒక ప్రజాస్వామిక రాజ్యాంగ నిర్దేశకత్వంలో నడుస్తానని చెప్పుకున్న రాజ్యం కాబట్టి, ఉన్నత విద్యారంగాన్ని పరిశీలించడానికి భారత రాజ్యాంగ ఆదర్శాలనే విశ్లేషణా చట్రంగా గ్రహించాలని ఆయన అన్నారు. రాజ్యాంగ ప్రవేశిక, ప్రాథమిక హక్కులు, వేరు వేరు సందర్భాలలో రాజ్యాంగాన్ని వ్యాఖ్యానిస్తూ ఉన్నత న్యాయస్థానాలు ఇచ్చిన తీర్పులు ఈ చట్రంగా పనికి వస్తాయని ఆయన అన్నారు.

ఈ విశ్లేషణా చట్రంలో ఆరు అంశాలు ప్రధానమైనవని ఆయన పేర్కొన్నారు: 1. విద్యాసంస్థల ఏర్పాటుకు లాభాపేక్ష కారణం కాగూడదు. 2. విద్యను ప్రాథమిక హక్కుగా, జీవించే హక్కులో (అధికరణం 21) భాగంగా గుర్తించాలి. 3. షెడ్యూల్డ్ కులాలు, తెగలు వంటి సామాజిక, ఆర్థిక వెనుకబాటుతనంలో ఉన్న వారి ప్రగతి కోసం ప్రభుత్వం ప్రత్యేక విద్యావకాశాలు కల్పించాలి. 4. భాషాపరమైన, మతపరమైన మైనారిటీలకు తమ విద్యాభివృద్ధికోసం ప్రత్యేక సంస్థలు ఏర్పాటు చేసుకునే, నిర్వహించుకునే అవకాశం ఉండాలి. 5. విద్యారంగ ప్రమాణాలను, నైపుణ్యాన్ని పెంచడం ప్రభుత్వ బాధ్యతగా ఉండాలి. 6. ఉమ్మడి జాబితాలోని అంశంగా విద్యారంగం రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు రెండిటి పర్యవేక్షణలో ఉండాలి.

ఈ ఆరు అంశాల పునాదిపై విశ్లేషణ సాగించబోయే ముందు ఉన్నత విద్యారంగ స్థితి గురించి గణాంకాలు, వివరాలు ఇస్తూ, దేశంలో ఉన్నత విద్యారంగం విస్తృతంగా, అపరిమిత పరిమాణంతో ఉన్నదని, అనేక రకాల గందరగోళపు వ్యవస్థలు ఏర్పడి ఉన్నాయని, కళాశాలలను అనుబంధం చేసుకోవడం అనే పద్ధతి అసమానంగా ఉన్నదని, ప్రైవేట్ రంగ చొరబాటు నానాటికీ పెరిగిపోతున్నదని, ప్రభుత్వ నిధుల కేటాయింపు అస్తవ్యస్తంగా ఉన్నదని ఆయన చూపారు. సాధించవలసిన ఆదర్శాలను, కొనసాగుతున్న స్థితిని పోల్చి చూపుతూ ఆయన ఇవాళ భారత ఉన్నత విద్యారంగం ముందు ఉన్న సమస్యలలో ప్రధానమైన ఆరు సమస్యలను చర్చించారు.

పరిమిత, అసమాన అవకాశాలు, అంటే, దేశ ప్రజలందరికీ, ఉన్నత విద్యా వయసులో ఉన్నవారందరికీ అవకాశాలు ఇవ్వగలిగిన స్థితిలో ఉన్నత విద్యారంగం లేకపోవడం మొదటి ప్రధాన సమస్య అని ఆయన వివరించారు. దేశానికి అవసరమైన విద్యావిధానమే ఉందా అనే ప్రశ్న వేసుకుని, ఇవాళ ఉన్నత విద్యారంగం ఎదుర్కొంటున్న మరొక ప్రధాన సమస్య వాస్తవ జీవితంతో సంబంధంలేని అసంబద్ధమైన విద్యను అందించడమే అని ఆయన అన్నారు. ఉన్నత విద్యాసంస్థలలో నాణ్యతా ప్రమాణాలు, నైపుణ్యత ఘోరమైన స్థితిలో ఉన్నాయని, అది మరొక ప్రధాన సమస్య అని ఆయన అన్నారు.

ఉన్నత విద్యారంగంలోకి విపరీతంగా ప్రైవేట్ పెట్టుబడి రావడం, అది కూడ గతంలో లాగ దాతృత్వ సంస్థలో, విద్యాదృక్పథం గల సంస్థలో కాక, లాభార్జనా దృష్టితో మాత్రమే రావడం మరొక ప్రధాన సమస్య అని ఆయన అన్నారు. ఎక్కువమందికి ఉన్నత విద్యావకాశాలు ఇచ్చే లక్ష్యంతో ప్రారంభమైన దూర, అనియత విద్యా కార్యక్రమాలు కూడ వ్యాపారీకరణ చెందడం మరొక ప్రధాన సమస్య అని ఆయన అన్నారు. ఈ సమస్యలను పరిష్కరించే బాధ్యత తీసుకోవలసిన, ఉన్నత విద్యారంగాన్ని నిర్దేశించవలసిన ప్రభుత్వం అసమర్థంగా, అక్రమంగా వ్యవహరించడం, కేవలం డబ్బు మూటకట్టుకునే వ్యవస్థగా పని చేయడం మరొక సమస్య అని ఆయన అన్నారు.

ఈ సమస్యలన్నీ మన విద్యారంగపు అనారోగ్యానికి రోగ లక్షణాలు మాత్రమేనని, ఈ అనారోగ్యాన్ని వదిలించగల ప్రత్యామ్నాయాల గురించి ఇప్పటికిప్పుడు చెప్పగల పరిస్థితి లేదని అంటూ, మొత్తంగానే ఒక సమానత్వ విద్యా నమూనా రూపొందించడం అవసరమని ఆయన సూచించారు. ఈ కొత్త నమూనాలో ప్రభుత్వానికీ, ఉపాధ్యాయులకూ, విద్యార్థులకూ మరింత ఎక్కువ క్రియాశీల పాత్ర ఉండాలని ఆయన అన్నారు. ప్రభుత్వం విద్యారంగానికి ఎక్కువ నిధులు ఇవ్వాలని, సమానత్వ సాధనకూ, ఉన్నత ప్రమాణాల సాధనకూ అధిక ప్రాధాన్యం ఇవ్వాలని ఆయన సూచించారు. ఉపాధ్యాయులు మరింత నిబద్ధతతో, ఇతోధికమైన నైపుణ్యాలు అలవరచుకుని పనిచేయాలని, విద్యార్థులు గత ఉద్యమాలలో లాగ చదువును, పోరాటాన్ని సమ్మిళితం చేయాలని ఆయన అన్నారు. విద్యార్థులు జ్ఞాన సృజనలోనూ, ఆ జ్ఞానాన్ని జీవితాన్ని మార్చే సాధనంగా ఉపయోగించడంలోనూ ఇతోధిక పాత్ర వహించాలని ఆయన సూచించారు.

మర్నాడు నవంబర్ 11 ఉదయం సెంటర్ ఫర్ సోషల్ అండ్ ఎకనమిక్ స్టడీస్ (సెస్) సెమినార్ హాల్‌లో ఆర్.ఎస్. రావు స్మారక సదస్సు ప్రారంభమయింది. ప్రొ. డి నరసింహారెడ్డి అధ్యక్షతన జరిగిన మొదటి సెషన్‌లో మొదట ఆర్.ఎస్.రావు వ్యక్తిత్వం గురించి ఆయనతో పాటు కలిసి పనిచేసిన గణితశాస్త్ర అధ్యాపకులు ప్రొ. స్వాధీన్ పట్టనాయక్ మాట్లాడారు.

'ఆర్థిక వ్యవస్థ – రాజ్యం – మిగులు మనుషులు: పరస్పర ప్రభావాలు' అనే అంశం మీద డా. ముదునూరి భారతి ప్రసంగించారు. అభివృద్ధి అంటే మనిషి అస్తిత్వ స్థలంలో సంపూర్ణమైన మార్పు రావడం అని నిర్వచిస్తూ పాత వ్యవస్థ నుంచి నిర్వాసితులను చేసి, కొత్త వ్యవస్థలో సమ్మిళితం చేసుకోకపోతే అది అభివృద్ధి కాదని అన్నారు. అభివృద్ధిని సమగ్రంగా కాక అభివృద్ధి పథకాలుగా మాత్రమే చూసే దృక్పథం వల్ల, నిర్వాసితులను పునస్సమిళితం చేయకపోవడం వల్ల ఆ మిగులు మనుషుల సమస్య ఇవాళ దేశంలో అతి పెద్ద సమస్యగా మారిందన్నారు. ఈ సమస్యకు ఒక పరిష్కారంగా నష్టపరిహారం, పునరావాసం చూపెడుతున్నప్పటికీ ఉపయుక్తమైన, న్యాయమైన, ఆమోదయోగ్యమైన పునరావాసం ఏమిటని తేల్చలేమని అన్నారు. ఈ మిగులు మనుషులు వారి ఆర్థిక అస్తిత్వాన్ని బట్టి కొందరు అభివృద్ధి పథకాలను పూర్తిగా వ్యతిరేకించడం, కొందరు ఎక్కువ నష్టపరిహారాన్ని కోరడం, కొందరు పూర్తిగా ప్రభుత్వం ఇచ్చే తాయిలాలకు ఎదురుచూడడం, కొందరు అసాంఘిక

శక్తులుగా మారడం జరుగుతున్నదని అన్నారు. మొత్తం మీద ప్రభుత్వం ఈ మిగులు మనుషులు తమ మానవ లక్షణాలను కోల్పోయి, ప్రభుత్వ సహాయం కోసం ఎదురుచూస్తూ ఉండే నిర్లిప్తజీవులుగా ఉండాలని అనుకుంటున్నదని అన్నారు. అభివృద్ధిని సామాజిక పరివర్తన ప్రాతిపదికగా సాగించాలని, అభివృద్ధి వేరు, నిర్వాసితత్వం వేరు అని విడదీయడం కాకుండా రెంటినీ ఒకే పరిణామంలో భాగాలుగా చూడాలని, నిర్వాసితులను పునస్సమిళితం చేయడానికి, నిర్వాసితుల దృక్పథాన్ని ప్రధానం చేయడానికి ప్రయత్నించాలని ఆమె అన్నారు.

'భారీ పథకాలకూ ప్రజా నిరసనలకూ మధ్య ఘర్షణ: ఒరిస్సా ఉదాహరణ' అనే పత్రంలో సుందర్ ఘర్ జిల్లాలో నిర్మాణమవుతున్న భారీ విద్యుదుత్పత్తి కేంద్రానికి వ్యతిరేకంగా నిర్వాసితులు జరిపిన ఆందోళన గురించి సుజిత్ కుమార్ మిశ్రా వివరించారు. జిల్లాలో జరిగిన మూడు గ్రామ సభల నేపథ్యంలో ఈ ప్రజాందోళన ఎలా మొదలై, ఎలా విస్తరించిందో ఆయన వివరించారు. ప్రణాళికాకర్తలకూ, బాధిత ప్రజలకూ మధ్య సామరస్యపూర్వకంగా చర్చ జరిగి చర్యలు నిర్ణయం కావడమే ఆందోళనలు తలెత్తకుండా చూడగలిగిన ఏకైక పరిష్కారమని ఆయన అన్నారు.

'రాష్ట్రాల మధ్య తేడాలు: వివిధ రంగాల మధ్య అంతస్సంబంధాలు' అంశంపై డా.సునీల్ ఆశ్రా తన పత్రాన్ని సమర్పించారు. స్థూల రాష్ట్ర ఉత్పత్తి గణాంకాల ఆధారంగా ఆర్థిక వ్యవస్థలో వస్తున్న మార్పులను, ఆ మార్పుల సరళిలో వివిధ రాష్ట్రాల మధ్య, విభిన్న రంగాల మధ్య అంతస్సంబంధాలను వివరించడానికి ఆయన ప్రయత్నించారు. వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగం అనే మూడు రంగాల సాంప్రదాయిక విభజన స్థానంలో ఆయన నాలుగో రంగంగా ప్రభుత్వాన్ని కూడ చేర్చి ఈ విశ్లేషణ సాగించారు. కొన్ని రాష్ట్రాలలో ఈ నాలుగు రంగాలూ పరస్పర ప్రభావాలతో ముందుకు సాగుతున్నాయని, కాని కొన్ని రాష్ట్రాలలో ఏదో ఒక రంగమో, లేదా రెండు రంగాలో ఇతర రంగాలను ముందుకు తోస్తూ ఉన్నాయని ఆయన చూపారు.

చివరిగా 'సంస్కృతి – ఆర్.ఎస్. రావు సంవిధానం' అంశం మీద పాణి తన పత్రం సమర్పించారు. సాంప్రదాయిక అవగాహనకు, విశ్లేషణకు భిన్నంగా ఆర్.ఎస్.రావు సంస్కృతికి అధిక ప్రాధాన్యం ఇవ్వడం గుర్తించదగిన, ఆహ్వానించదగిన అంశం అంటూ, ఈ భిన్న దృక్పథం మూడు స్థాయిలలో ఎలా పనిచేసిందో వివరించారు. అర్ధభూస్వామ్య, అర్ధవలస సూత్రీకరణ, ఉత్పత్తి శక్తులు – ఉత్పత్తి సంబంధాల చట్రం, పునాది – ఉపరితలం చట్రం ఈ మూడు స్థాయిలలోను సంస్కృతి వైపు నుంచి ఆర్.ఎస్. రావు సూత్రీకరణలను, అవగాహనలను వివరిస్తూ, ఆ అవగాహనలతో తనకు ఎక్కడెక్కడ భిన్నాభిప్రాయం ఉన్నదో కూడ చెప్పారు.

భోజనానంతర సెషన్‌కు తొలుత డా. కవితా రావు అధ్యక్షత వహించారు. 'చారిత్రక భౌతికవాద దృక్పథంలో సుందర్‌ఘర్ జిల్లా – పునరాలోచన' అనే అంశం పై ప్రొ. గోలక్ బిహారీ నాథ్ తన పత్రాన్ని సమర్పించారు. 1981లో రౌర్కెలాలో జరిగిన ఒక సదస్సులో ఆర్.ఎస్. రావు, తాను కలిసి 'చారిత్రక భౌతికవాద దృక్పథంలో సుందర్ ఘర్ జిల్లా' అనే పత్రాన్ని సమర్పించామని, ఇప్పుడు మళ్లీ ఆ జిల్లాను పునఃపరిశీలించి అదే పత్రాన్ని పునర్వీక్షిస్తున్నానని ఆయన అన్నారు. సంపన్నమైన సహజ వనరులు ఉన్న సుందర్ ఘర్ జిల్లాపై అంతర్జాతీయ పెట్టుబడి కన్ను పడిందని, అందువల్లనే 1970ల నుంచి కూడ అక్కడికి బహుళ జాతి సంస్థలు వస్తున్నాయని, కాని ఈ పెట్టుబడి ప్రవేశం వల్ల ఆ జిల్లా వెనుకబాటు తనం తొలగిపోలేదని ఆయన అన్నారు. 'ఈ నేపథ్యంలో ఒక ప్రాంతపు వెనుకబాటుతనం పెట్టుబడిదారీ విధానం కింద అసమాన అభివృద్ధి ఫలితం కాదు, పెట్టుబడిదారీ విధానం అసమానంగా అభివృద్ధి చెందిన, లేదా పెట్టుబడి అసమానంగా ప్రవేశించిన ఫలితం. తన ప్రయోజనాలు నెరవేరేచోట్లకే పెట్టుబడిదారీ విధానం ప్రవేశిస్తుంది గాని ఏదో దాతృత్వ ప్రాపంచిక దృక్పథంతో కాదు. ఆ ప్రయోజనాలను స్థూలంగా మార్కెట్, ముడిసరుకులు, రాజ్యాధికారాన్ని బలోపేతం చేసుకోవడం అని మూడు రకాలుగా చూడవచ్చు' అని ఆర్.ఎస్. రావు రాసిన మాట ఇక్కడ గుర్తు చేసుకోవాలని ఆయన అన్నారు. వలసపాలన కాలంలోనైనా, 1947 నుంచి గతంలో పరిశీలించిన 1981 వరకైనా, ఆ తర్వాత గడిచిన ముప్పై ఏళ్లలోనైనా సుందర్ ఘర్‌లో చాల పెట్టుబడి ప్రవేశించింది గాని స్థానిక అర్ధభూస్వామ్య సంబంధాలు ఏమీ మారలేదని, పేదరికం తగ్గలేదని ఆయన అన్నారు. సామ్రాజ్యవాద దశలో భూస్వామ్య, పెట్టుబడిదారీ–పూర్వ సంబంధాలను తొలగించకుండానే పెట్టుబడి ఎంత పెద్దఎత్తున ప్రవేశిస్తుందో చూపడానికి సుందర్ ఘర్ ఉదాహరణ అని ఆయన అన్నారు.

ఆ తర్వాత 'గ్రామీణ అధ్యయనం – ముప్పై ఏళ్లకు ముందూ తర్వాతా' అనే అంశంపై వై రామచంద్రం, డి వి రామకృష్ణారావు తమ పత్రాన్ని సమర్పించారు. వ్యవసాయ విప్లవం ప్రేరణతో 1970ల చివర కరీంనగర్ జిల్లాలో నాలుగు గ్రామాల అధ్యయనం జరిగి, 1982లో క్రాంతి ప్రచురణలుగా 'దున్నేవానికే భూమి దక్కేవరకూ రైతాంగానికి విముక్తి లేదు' అనే పుస్తకం వెలువడింది. ఆ నాలుగు గ్రామాలలో రెండు గ్రామాలు తీసుకుని ముప్పై ఏళ్ల తర్వాత ఏమి కొనసాగుతున్నాయో, ఏమి మారాయో చూడడానికి తాము ప్రయత్నించామని చెపుతూ, అందులో భాగంగా మాణిక్యాపూర్ గ్రామ అధ్యయన ఫలితాలను రామచంద్రం వివరించారు. పెద్ద భూకమతాలు తగ్గిపోయినట్టు కనబడుతున్నదని, కాని భూస్వామ్య భావజాలం రూపు మార్చుకుని కొనసాగుతున్నదని రామకృష్ణారావు అన్నారు,

ఆ తర్వాత ప్రొ. జి. హరగోపాల్ అధ్యక్షత వహించిన సెషన్‌లో. 'సాగుచేయని రైతు కుటుంబాల పుట్టుక, స్వభావాలు – తొమ్మిది గ్రామాల అధ్యయనం' అనే అంశం పై డా. ఆర్ విజయ్ తన పత్రం సమర్పించారు. జాతీయ నమూనా సర్వే గణాంకాలను చూసినప్పుడు ఒకవైపు సాగుచేయని రైతు కుటుంబాల నిష్పత్తి పెరిగిపోతూ ఉండడం, అదే సమయంలో వ్యవసాయ కూలీల నిష్పత్తిలో ఏ మార్పూ లేకపోవడం కనబడి, ఈ అంశాన్ని సూక్ష్మ, గ్రామ స్థాయిలో పరిశీలించడానికి చేసిన ప్రయత్నమే ఈ పత్రం అని ఆయన అన్నారు. శ్రీకాకుళం, పశ్చిమ గోదావరి, కరీంనగర్, మహబూబ్ నగర్ జిల్లాలలోని తొమ్మిది గ్రామాలలో పరిశీలన జరిపామని, అక్కడ సాగుచేయని రైతు కుటుంబాలు ఎలా పుట్టుకు వస్తున్నాయో, వాటి స్వభావం ఏమిటో విశ్లేషించామని ఆయన చెప్పారు. పెద్ద భూస్వాములు లేకుండానే భూస్వామ్యం కొనసాగుతున్నదని, ఈ సాగుచేయని రైతు కుటుంబాలు భూమిని వదలకుండా, దాని మీద భూస్వామ్య కౌలు వసూలు చేసుకుంటున్నారని ఆయన చెప్పారు.

చివరిగా 'ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా: విప్లవోద్యమ ప్రయోగాల చరిత్ర' అనే అంశంపై ఎన్ వేణుగోపాల్ తన పత్రం సమర్పించారు. విప్లవోద్యమం గురించి సాగుతున్న చర్చలో హింసాహింసలు, నిర్బంధం, ప్రతిఘటన, దాడులు, ప్రతి దాడులు వంటి అంశాలే వస్తున్నాయని, కాని అంతకన్న ముఖ్యంగా ప్రజా ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా గురించి చర్చ జరగాలని ఆర్.ఎస్. రావు కోరుకున్నారని అంటూ, భారత విప్లవోద్యమంలో ఈ అభివృద్ధి నమూనా ఆలోచనలు, ఆచరణ చరిత్రను, ముఖ్యమైన మైలురాళ్లను ఆయన వివరించారు.

ఆర్.ఎస్. రావు ఆలోచించిన అంశాలపైలోతయిన చర్చలు జరగవలసిన అవసరం ఉందని, ఆ దిశలో ఈ సదస్సు మంచి ప్రయత్నమని సెషన్ కు అధ్యక్షత వహించిన ప్రొ. హరగోపాల్ అన్నారు. మొత్తంగా ఈ స్మారక ఉపన్యాసాల, సదస్సుల ఉద్దేశాలను వివరించి, వచ్చే సంవత్సరం ఈ స్మారక ఉపన్యాసం, సదస్సులకు ఇతివృత్తంగా సంస్కృతి, సాహిత్యాల పట్ల మార్క్సిస్టు దృక్పథం, ఆచరణ ఉంటుందని ఎన్ వేణుగోపాల్ సూచించడంతో సదస్సు ముగిసింది.

స్మారక ఉపన్యాస కార్యక్రమంలోను, సదస్సు కార్యక్రమంలోను దాదాపు వంద మంది పాల్గొన్నారు. కొన్ని అంశాల మీద లోతయిన చర్చ జరిగింది. చర్చలో అధ్యక్షులు, పత్ర సమర్పకులతో పాటు ఎ. నరసింహారెడ్డి, ఎం. నరసింహారెడ్డి, రావెల అరుణ, డా. జి విజయ్, ప్రొ. కె. లక్ష్మీనారాయణ, డా. వి. శ్రీనివాస్, ఎం రాఘవాచారి, జి. ఉదయ, వరవరరావు తదితరులు పాల్గొన్నారు.

*(స్మారకోపన్యాసం, సదస్సు పత్రాలు వీక్షణంలో వరుసగా వెలువడుతాయి.)*

వీ

# తెలంగాణ - మరికొన్ని విషయాలు

'చౌరస్తాలో తెలంగాణా ఇంకెన్నాళ్లు'? అన్న వ్యాసంలో(నవంబర్, 2012 సంచిక) ఎన్.వేణుగోపాల్ అనేక ముఖ్యాంశాలను లేవనెత్తారు. ఉద్యమ క్రమంలో తలెత్తే కొన్ని అపసవ్య ధోరణులను నిర్మొహమాటంగా ఎత్తి చూపారు. 'లేదురా ఇటువంటి భూదేవి ఎందు' అన్న కవి రాయప్రోలు ప్రసిద్ధ చరణాల్లోని దురభిమానం, దురహంకారాలను గుర్తుచేసి, ఇదొక 'ప్రధానమైన తప్పుడు ధోరణి'గా ఇక్కడ తలెత్తిందని సరిగా విశ్లేషించారు. కాళోజీ ఉటంచించిన 'పిల్ల ముద్దు అయితే పియ్యి ముద్దు కాదు' అన్న సామెతను (ఇది ఆంధ్ర ప్రాంతంలో కూడా వాడుకలో ఉందని గమనించాలి) చాలా సందర్భోచితంగా ఉపయోగించారు. మూఢాచారాలు ఎలా వ్యాప్తి చేయబడుతున్నాయో ఉదహరించారు. ఈ సందర్భంగా మరికొన్ని విషయాలను గమనించాల్సి ఉంది.

ప్రాంతీయ అస్తిత్వం పేరిట చరిత్ర, సంస్కృతి, వారసత్వం 'సంపూర్ణంగా సమర్థించదగినవి కాదు' అనడం సరైనదే. కానీ రెండో సగం గురించి ఆలోచించి నప్పుడు అలా బేషరతుగా చెప్పలేం. 'ప్రస్తుత ఉద్యమంలో మరొక ప్రధానమైన తప్పుడు ధోరణి గతాన్ని బేషరతుగా కీర్తించే ధోరణి' ఉన్నందున ఈ రెండో సగం గురించి ఇలా నొక్కి చెప్పాల్సి వస్తోంది. నైజాం ఆధ్వర్యంలో సాగిన నిరంకుశ, ఫ్యూడల్ దోపిడీ, పాలన, నిర్బంధం, భాషా సాంస్కృతిక అణచివేత సంపూర్ణంగా తిరస్కరించ వలసినవే. ఈ పాలనను కేవలం ముస్లిం ప్రభువులు సాగించలేదు. ఇక్కడి తెలంగాణా హిందూ దొరలూ విశాల ప్రాంతంలో సాగించారు. అంతేకాదు వారి వారసులు చాలా మంది నేడు నాయకులుగా చెలామణీ అవుతూ, ఈ ఉద్యమంలో నాయకత్వ స్థానాల్లో ఉంటూ పెత్తనం, మార్గనిర్దేశనం చేయగలుగు తున్నారు. ఇక్కడి విప్లవ ప్రజా ఉద్యమాల ఫలితంగా గతంలో గ్రామాలు విడిచి, బతుకుజీవుడా అని పలాయనం చిత్తగించినవారు సైతం వీరిలో భాగంగా ఉన్నారు. అందుకే ఈ విషయాలను గొంతెత్తి చేర్చాల్సిన, చెప్పాల్సిన అవసరం ఉన్నది.

బతుకమ్మ పాటలలోని పితృస్వామిక, కుల, తదితర భావజాలాన్ని విస్మరించి, మూఢాచారాన్ని వ్యాప్తి చేస్తున్న వైనాన్ని సరిగ్గా ఎత్తి చూపారు. బతుకమ్మ పండుగ తెలంగాణా సాంస్కృతిక జీవనంలో భాగం. అయితే, అనేక సంప్రదాయిక, సాంస్కృతిక అంశాల్లో అప్రజాస్వామిక గతకాలపు ముద్రలుండడం సహజమే. అలాగే బతుకమ్మ పండుగ కులవివక్షతో సాగుతూ వచ్చింది. దళిత మహిళల్ని దూరంగా ఉంచి ఆడడమే ప్రధాన ధోరణి – అనేక చోట్ల ఇప్పటికీ ఉంది. ఇతరులు కూడా – ఆయా కులాల శ్రేణులు వేర్వేరుగా – ఎవరివాడల్లో వారు ఆడడమూ ఒక చేదు వాస్తవం. గతంలో కొన్ని చోట్ల దొరలు ఒక శిక్షగా పీడితులను బట్టలూడదీసి బతుకమ్మలాడించారు. అలా వర్ణ, వర్గమయంగా సాగిన పండుగను గద్దర్, గోరటి వెంకన్న వంటివారు విమర్శనా రహితంగా కీర్తించడమేకాక, అందరి పండుగగా సాగినట్లు చెపుతున్నారు. సంధ్యలూ, విమలలూ దొరల తెలంగాణ సాంస్కృతిక జాగృతిలో మెలకువ, వర్గసోయి కోల్పోయి, ప్రాంతీయ దురభిమాన మత్తులో 'కలవకుంట'ల బురదల్లో కూరుకుపోయి, విప్లవ పదును కోల్పోయి ఆడడం నేటి విషాదం. దాన్నే వేణుగోపాల్ సున్నితంగా ఎత్తిచూపారు. అయితే ఆయన విస్మరించిన ఈ అంశాలూ ప్రస్తుత సందర్భంలో చెప్పుకోదగినవే. గుర్తు చేసుకోవలసినవే.

ప్రజావ్యతిరేకులు ఎక్కడైనా ప్రజావ్యతిరేకులే.. అని వివరిస్తూ, 'తెలంగాణ ఉద్యమం విస్తరిస్తున్న కొద్దీ దానిలో ప్రజా సౌభ్రాతృత్వ దృష్టి తగ్గిపోతూ వస్తున్నది' అని, ప్రబల ధోరణిని, చేదు నిజాన్ని రచయిత ముందుకు తెచ్చారు. 'ఇది స్పష్టంగా పాలక వర్గ దృక్పథం' అని, దానితో 'ప్రజలను చీల్చి, పరస్పర ద్వేషం పెంచి పాలిస్తారు' అని సరిగ్గా ఎత్తి చూపారు. ఈ కుట్ర అక్కడితో ఆగదు. తెలంగాణాలోని వర్గపోరాట ధోరణిని మొద్దుబార్చి, విప్లవోద్యమ శక్తులను సైతం దొరల తెలంగాణకు వైతాళికులుగా మార్చి, రేపటి భౌగోళిక తెలంగాణను హిరణ్యాక్షుడివలె చాపలా చుట్టి తెలంగాణలోని పాత, కొత్త దొరలు తమ చంకన పెట్టుకోవాలని అనుకుంటున్నారు. 20–30 ఏళ్ల క్రితం కూడా గ్రామాలు విడిచి పారిపోయిన దొరలు జన నాయకులుగా ఫోజులు పెడుతున్నారు. జనం తలలో నాలుకలైనవాళ్లు కనపడకుండా, లేదా అణగిమణగి ఉంటున్నారు. రచయిత తను ప్రారంభించిన విమర్శను దాని తార్కిక ముగింపుదాకా తీసుకువెళ్లలేదు. దొరల తెలంగాణ విషయంలో ఎంతో అవసరమయిన ఈ హెచ్చరిక చేయకుండా ఆగిపోయారు.

ఇతర ప్రాంతాల పీడిత ప్రజలతో ఐక్యత అవసరం అన్న విషయాన్ని వివరిస్తూ, ఇది 'ఆంధ్రప్రదేశ్ పాలక విధానాలకూ, తెలంగాణ ప్రజలకూ మధ్య వైరుధ్య చిహ్నమే'నని రాశారు. వాస్తవం ఏమిటి? ప్రపంచ బ్యాంకు, అమెరికా వంటి పాశ్చాత్య పెట్టుబడి ప్రాబల్యంతో పాలకులు ఈ సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ (ఎల్‌పిజి) విధానాలను దేశ వ్యాప్తంగా అనుసరిస్తూ వస్తున్నారు. ఈ విధానాల్లో మరికొన్ని రాష్ట్రాల తర్వాత అయినా, ఆంధ్రప్రదేశ్ అగ్ర శ్రేణిలో ఉంది. పి.వి. నరసింహారావు ప్రధానిగా దేశ వ్యాప్తంగా మలుపు తిప్పిన విధానాలివి. ఆయన ఎంపిక చేసిన మన్మోహన్, చిదంబరం వంటివారే నేడు కీలక బాధ్యతలలో ఉన్నారు. ఆయన ఇతోధికంగా కృషిచేసి, దాదాపు పార్లమెంటరీ పార్టీలన్నీ అవే విధానాలను అనుసరించేలా దేశ వ్యాప్త సర్వ సమ్మతిని సాధించారు. తెలుగుదేశం వంటి ప్రాంతీయ పార్టీలతో పాటు, బి.జె.పి, ఎన్.డి.ఎ, తదితర శక్తులన్నీ ఆయా రాష్ట్రాల్లో, కేంద్రంలో అధికారంలో ఉండి, ఆ సంస్కరణలను మరింతగా కొనసాగించాయి. చంద్రబాబు, ఆయన పార్టీలోనే ఆనాడున్న కె.సి.ఆర్. అవే విధానాలను జోరుగా అమలు చేశారు. ఆనాడు కొన్ని తప్పులు జరిగాయని ఆపద మొక్కులుగా ఇవాళ చంద్రబాబు లెంపలు వేసుకుంటున్నారు. కె.సి.ఆర్.కి ఇలాంటి విధానాల చర్చలేవీ పట్టవు. నేడు తెలంగాణను బలపరుస్తున్న మరో పార్టీ అయిన బి.జె.పి. కేంద్రంలో, రాష్ట్రాల్లో అవే సంస్కరణలను మరింత వేగంగా అమలు చేశామని గర్వంగా చెప్పుకుంటుంది. నిజానికి అంతార్జాతీయ నేపథ్యంగల విధానాలివి. కొద్ది సంవత్సరాల ముందు వేణుగోపాల్‌గారే వీటిని వివరించారు. 20 ఏళ్ల క్రితం తెలంగాణకు చెందిన ప్రారంభించిన విధానాల దృష్ట్యా తీవ్రమైన ఈ వైరుధ్యాన్ని నేడు 'ఆంధ్రప్రదేశ్ పాలకులతో' వైరుధ్యంగా కుదించి చెప్పడం తప్పవుతుంది. ప్రత్యేకవాదం ఆవహించి, వాస్తవాలను విస్మరించి హ్రస్వదృష్టితో వ్యవహరించడం అవుతుంది. ఇది అవాస్తవికమైన అశాస్త్రీయ ప్రతిపాదన. రేపు తెలంగాణ ఏర్పడినా కొనసాగే మౌలిక వైరుధ్యం ఇది. పాలకవర్గాల్లోని వారి సంగతేమో గానీ, కనీసం వేణుగోపాల్ వంటి విశ్లేషకులు చేయకూడని తప్పు ఇది.

'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు సర్వరోగనివారిణి అన్నట్లుగా జరుగుతున్న ప్రచారం' రచయిత చెప్పినట్టు 'మరొక అతిశయోక్తి' మాత్రమేకాదు. అది పాలకవర్గాల కుట్ర. అన్ని రాష్ట్రాల్లో సాగుతున్న పాలనే ఇక్కడా సాగుతుందని వారన్నది నిజం. దేశవ్యాప్తంగా ఉన్న పోలీసు–మిలటరీ రాజ్యమే భారత రాజ్యాంగం నీడన ఇక్కడా సాగుతుంది. ఒకవేళ ఏదైనా రాష్ట్రం కాస్త వెనుకాడితే రాష్ట్రపతి పాలన ఉండనే ఉంది. 'ప్రజాస్వామిక తెలంగాణ' నేతిబీరకాయే. ఈ ముఖ్యాంశాన్ని కూడా రచయిత విస్మరించారు.

అక్కడితో ఆగలేదు. 'కాకపోతే తెలంగాణ ప్రజలకు చెందవలసిన నీరు, నిధులు, నియామకాలు తెలంగాణ ప్రజలకే చెందుతాయి' అని రచయిత చాలా మందిలాగే రాశారు. ఇది నిజమా? దేశ వ్యాప్తంగా 85 శాతం నిధులు ప్రజలకు చేరడంలేదని పాలక వర్గాలే అంగీకరించాయి. నేడిది ఇంకా పెరిగింది. నేటి వ్యవస్థలో తెలంగాణ భిన్నంగా ఎలా ఉంటుంది? దేశమంతటా, తెలంగాణలోనూ నీళ్లు ప్రధానంగా భూస్వాములకూ, ధనిక రైతులకే దక్కుతున్నాయి. రైతాంగంలో కొందరికి కొంతమేరకు దక్కుతున్నా, వ్యవసాయ సంక్షోభంలో భాగంగా, అలాంటి మాగాణులను అమ్ముకు పోవాల్సిన దుస్థితి నానాటికీ పెరుగుతున్నది. తమ చెల్కల్లో చిన్న బావి తవ్వుకుని, పారించుకున్న పేద, మధ్యతరగతి రైతులకు కూడా దొరల భారీ బోర్ల పుణ్యమా అని (వారికి ఉచిత విద్యుత్ కూడా తోడైంది) నీళ్లు అడుగంటి దక్కకుండా పోయాయి. బోర్లు వేయడానికి చేసిన అప్పుల్లో–నీళ్లలో కాదు– వారు పీకల్లోతు మునిగిపోతున్నారు. కొందరు ఆ అప్పుల వలన ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. తెలంగాణ ఆ విషాదానికి పెట్టింది పేరు. సెంటు భూమిలేని పేదలకు నీళ్ల ప్రసక్తే ఉండదు. ఇక నియామకాలు.. ప్రభుత్వ ఉద్యోగాలు దేశ వ్యాప్తంగా తగ్గిపోతున్నాయి. ప్రైవేటీకరించ బడుతున్నాయి. కేంద్ర, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, ఐటి వంటి రంగాల్లో ప్రాంతీయ రక్షణ ప్రశ్నార్థకమే. ఇతర ప్రాంతాలనుంచీ, ఇతర రాష్ట్రాల నుంచీ వచ్చి, దశాబ్దాలుగా ఇక్కడే ఉండి, ఇక్కడే చదువుకొన్నవారి పోటీ ఎలాగూ ఉంటుంది. ముల్కీ రూల్స్‌ని మళ్లీ తెచ్చినా వారిలో అత్యధికులు అర్హులైన స్థానికులే అవుతారు. పైగా చదువు'కొనే'వారు లక్షల్లో .. ఉద్యోగాలు కొందామన్నా చాలా పరిమితంగా.. ఈ విధంగా నియామకాల్లో ఒరిగేదీ తక్కువే. కాబట్టి నీరు, నిధులు, నియామకాలు ఇక్కడివారికి– అందునా ప్రజలకు చెందుతాయన్నది అర్ధ సత్యం, ఒక రకం భ్రమ మాత్రమే. ఉద్యమంలోని కొన్ని అపసవ్య ధోరణులను ఎత్తిచూపిన రచయితను అభినందిస్తూనే, పైన పేర్కొన్న కొన్ని ముఖ్యమైన విషయాలను ఆత్మవిమర్శనా దృష్టితో విశ్లేషించుకోవాలని, వివేచనా దృష్టి గల పాఠకులు వీటిని గమనించాలని మనవి.

**ఎస్. కృష్ణమూర్తి, రాజమండ్రి**

వీ

*(వీక్షణం నవంబర్ సంచిక చూడగానే 'చౌరస్తాలో తెలంగాణ ఇంకెన్నాళ్లు' వ్యాసంలోని కొన్ని వాక్యాలపై తీవ్ర అభ్యంతరం తెలుపుతూ సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ నాయకులు ఫోన్ చేశారు. వారి విమర్శ రాసి పంపితే ప్రచురిస్తామని అన్నాం. కాని వారి విమర్శ వీక్షణంకు పంపలేదు. 'ప్రజాపంథా' 15–11–2012 సంచిక పే.2లో ఆ విమర్శ అచ్చుయింది. – సం.)*

*(... 4వ పేజీ తరువాయి)*

**అ**సోంలో ఏం జరుగుతోంది? పై నా వ్యాఖ్యను పాఠకుల వీక్షణంలో ప్రచురించారు. సంతోషం. అందులో రెండు ముఖ్యమైన అచ్చు తప్పులున్నాయి. అర్థం మారిపోతుంది కాబట్టి సవరణ వేయగలరు. 1) 65వ పేజీలో 7వ లైన్‌లో 'బిజెపితో' బదులు 'బోడోలతో' అని, 9వ లైన్‌లో 'బోడోలతో' బదులు 'బిజెపితో' అని రావాలి. 2) 65వ పేజీ రెండవ కాలమ్‌లో 10వ లైన్‌లో 'సిపిఎంకి కూడా వ్యతిరేకంగా మొదలైనది కాదు' అన్న వాక్యంలో 'కాదు'ని తొలగించాలి. ఈ రెండూ ఒరిజినల్లో లేని తప్పులు. 3) వ్యాఖ్య మొదట్లో 5వ లైన్‌లో '1947 తర్వాత' అని ఒరిజినల్లో ఉన్నదాన్ని గమనించగలరు.

**– డా. ఎం. బాపూజీ**
సిఎస్ఐఆర్ రిటైర్డ్ సైంటిస్ట్, హైదరాబాద్

'**అ**సోంలో ఏం జరుగుతోంది?' వ్యాసం (అక్టోబర్ 2012)లో లోపాలున్నాయంటూ నిర్ధారించి వేసిన బాపూజీ గారి లేఖ (నవంబర్ 2012)పై స్పందన.

1) నా వ్యాసంలో 1971 ఇండో–పాక్ యుద్ధం సమయంలో భారీగా ముస్లింలు అసోంకు వలసవచ్చారని రాశాను. కానీ దాన్ని అంగీకరించకుండా బాపూజీ గారూ 'బంగ్లాదేశ్ నుంచి ముస్లిం అక్రమ చొరబాట్లు భారీగా కొనసాగుతున్నాయన్నది తప్పుడు ప్రచారం' అని, కట్టుకథ అని చెప్తూనే మరోచోట మళ్లీ '1971లో భారీ సంఖ్యలో ముస్లింలు తరలివచ్చారు' అని రాశారు. ఈ రెండూ పరస్పర విరుద్ధ వ్యాఖ్యలు. 1971లో ముస్లింల వలస నిజమే.

2) ఈశాన్య భారతదేశంలోని గిరిజనులను 'అమాయక గిరిజన ఆదివాసిలు' అని పేర్కొనడాన్ని బాపూజీ గారు పడికట్టు భాష అంటున్నారు. వాళ్లు అమాయకులు కాదని చెప్పడానికి అక్షరాస్యత గణాంకాలు చూపించారు. ఒక ప్రజా సమూహాన్ని అమాయకులుగా గుర్తించడానికి అక్షరాస్యత మాత్రమే కొలబద్దగా గ్రహించడం సరికాదు. అది కూడా భారత ప్రభుత్వం జరిపే సవాలక్ష తప్పుల తడక, అశాస్త్రీయ పద్ధతుల జనాభా లెక్కలపై ఆధారపడి ఎంతమాత్రమూ గ్రహించలేం. అక్కడి గిరిజనులు తరతరాలుగా బ్రిటిష్ ప్రభుత్వంతో, భారత ప్రభుత్వంతో మోసగించబడుతున్న వారు కనుక వారిని అమాయకులని సంబోధించాను. లేఖకుడి కోణంలోనే చూసినా అంత గొప్పగా అక్షరాస్యత ఉన్నా కూడా ఆ గిరిజనులు ప్రభుత్వాలచే మోసగింపబడుతున్నారంటే వారిని అమాయకులనే కదా అనాలి! రాజకీయ చైతన్యం ఉండి, సుదీర్ఘ పోరాటాలు నిర్వహిస్తున్నా రాజకీయ పార్టీలు సులభంగా వారిని మోసం చేస్తున్న చరిత్ర కళ్లముందే ఉన్నప్పుడు అలాంటి వారిని అమాయకులనే కదా అనాలి!

3) అస్సామీలపై దాడులు నిత్యకృత్యమైనాయని నేను భావించడాన్ని లేఖకుడు అతిశయోక్తిగా భావించారు. అదంతా మీడియా కుట్ర అని తేల్చేశారు. జూలై నుంచి సెప్టెంబర్ దాకా జరిగిన అల్లర్లను నిజానికి మీడియా చాలా తక్కువచేసి చూపిందని, అలాగే పాలకులు కూడా ఎక్కువ సంఖ్యలో ప్రజలకు నష్టం కలిగితే, ఆ సంఖ్యను తక్కువ చేస్తున్నారని, అందుకు గాను మీడియాకు, పాలకులకు స్వీయ ప్రయోజనాల స్వార్థం ఉన్నదని అసోం ప్రజలు, వారి కష్టాలకు బాధపడుతున్న వారు ఆరోపిస్తుంటే బాపూజీ మాత్రం దాన్ని ఒప్పుకోవడం లేదు.

4) 1970ల నుంచి అసోంలో చొరబాట్లు సాగుతూ వస్తున్నాయి అని నేను రాసినదాన్ని ఒప్పుకోవడం లేదంటూనే బాపూజీ ఒప్పుకున్నారు. ఆయన అసోంలో జనాభా పెరుగుదల రేటు, భారత్ పెరుగుదల రేటుతో సమానంగానే ఉంది కనుక అసోంలో వలసలు లేవని భావిస్తున్నారు గానీ 1961–71లోని 34.95 శాతం 1971–91కి 53.26గా స్వాతంత్ర్యానంతరం ఎన్నడూ లేనంతగా ఎందుకు పెరిగిందనే ప్రశ్న వేసుకుంటే ఆయన ఇచ్చిన గణాంకాలలోనే స్పష్టమైన సమాధానం దొరుకుతుంది. దేశవ్యాప్తంగా కూడా 1971–91లో జనాభా పెరుగుదల మిగతా సంవత్సరాల కంటే ఎక్కువే కావచ్చు, కానీ అసోంలో ఆ పెరుగుదలకు పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా ముస్లింల వలసలు కారణమని ఒప్పుకోవాల్సింది. అయినా సరే గణాంకాలే ప్రామాణికమని ఇంకా అనుకుంటే సాక్షాత్తు అసోం గవర్నర్ నివేదిక ప్రకారం అసోంలో, హిందూ, ముస్లిం వలస జనాభా పెరుగుదల రేట్లు ఇలా ఉన్నాయి. 1951–61 మధ్య 33.71, 38.35; 1961–71 మధ్య 37.17, 30.99; 1971–91 మధ్య 41.89, 77.42గా ఉన్నాయి. దీన్ని బట్టి వలసల పెరుగుదల ఉందో లేదో తెలుసుకోవచ్చు. కనుక గణాంకాలు ప్రామాణికం కావని గుర్తించాలి. అంతేగాక లేఖకుడు ఒకచోట 'గత ఇరవై ఏళ్లుగా అలాంటి వలసలేమీ లేవు' అంటూనే మరోచోట 'బంగ్లా ముస్లింల దశాబ్దాల వలస ప్రవాహం' అంటూ కవిత్వీకరించారు. ఇవి పరస్పర విరుద్ధ అర్థాన్నిస్తున్నాయి.

5) చివరగా ప్రభుత్వ గణాంకాలపై ఆధారపడి ఒక విషయాన్ని అర్థం చేసుకోవడం (బాపూజీ గారికైనా, ఆయన ఆధారపడ్డ వ్యాసకర్త నీలమ్‌దత్తాకైనా) సరైన ఫలితాన్ని ఇవ్వదు. తలసరి ఆదాయాలు, జిడిపిలు, అక్షరాస్యతలు వంటివన్నీ బూర్జువా గణాంకాలు, అశాస్త్రీయ గణాంక పద్ధతులే. విషయాన్ని మానవీయ కోణంలో, శాస్త్రీయ గణాంకాల అధ్యయన పద్ధతిలో అర్థం చేసుకోవడం మాత్రమే సమస్యకు అసలైన పరిష్కారాన్ని చూపుతుంది.

***– లోకే రాజ్‌పవన్***
*మంథని, కరీంనగర్*

**దే**శీయ చిల్లర వర్తక రంగంలోనూ, బీమా, పెన్షన్ రంగాలలోనూ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు సామ్రాజ్యవాదుల ప్రయోజనాల కోసమే. ఏడాదికి రెండువేల కోట్ల రూపాయల లాభాలు ఆర్జిస్తున్న విశాఖ ఉక్కు కర్మాగారంలోని పది శాతం షేర్లు అమ్మకానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఏడాదికి వంద కోట్ల రూపాయల లాభాలు తెచ్చి పెట్టిన హిందూస్తాన్ జింక్ కర్మాగారంలో 51 శాతం షేర్లు 2000 సంవత్సరంలో వేదాంత గ్రూప్ స్టెరిలైట్‌కు రు. 450 కోట్లకు అమ్మితే వారు కంపెనీలో ఉన్న జింక్ ఉత్పత్తుల నిల్వలను రు. 750 కోట్లకు అమ్ముకున్నారు. ఇప్పుడు కంపెనీ మూసివేసి 350 ఎకరాల స్థలాన్ని యంత్రాలను వేల కోట్ల రూపాయలకు అమ్ముకోవడానికి రంగం సిద్ధం చేస్తున్నారు. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు మన దేశంలో వివిధ రంగాలలో ప్రవేశిస్తే ఆర్థిక వ్యవస్థ అతలాకుతలం అవుతుంది. పెత్తనం వారిది, ప్రేక్షకులం మనం. ఎఫ్‌డిఐల గురించి రెండు వ్యాసాలలో కావలిసిన సమాచారం ఉంది. జీవన వైవిధ్యం గురించి రాసిన రెండు వ్యాసాలు సంక్షిప్తంగా అయినా సమాచారం బాగుంది.

***– తుంపాల శ్రీరామమూర్తి***
*గాజువాక, విశాఖపట్నం*

**వీ**క్షణం వ్యవస్థాపక సంపాదకులైన వి.హనుమంతరావు గారు పత్రిక ఎలా ముందుకు సాగుతూ వచ్చిందో అభిమానంతో నవంబర్ 2012 సంచికలో ఒక లేఖ రాశారు. అందులో అనుమానం లేదు. కాని అక్కడితో ఆగలేదు. సంపాదకుని మీద, రచయితల మీద విమర్శనాస్త్రాలు సంధించడం అంటే వీక్షణం పత్రిక మీదే దాడి చేయడం, 'అత్యంత గర్హనీయం' అని ఖండించారు. 'ఒక పాఠకుడి' లేఖ రచయితలను నిరుత్సాహ పరుస్తోందనీ ఆరోపించారు. పాఠకులు 'స్పందించాలని' పిలుపునిచ్చారు కూడా. కొంత ఘాటుగా రాసినా పత్రిక నాణ్యతను పెంచాలన్న ఉద్దేశంతో విమర్శించిన వారిపై ఇది తగదు. విమర్శలలో లోపాలు, అతి ఉంటే (కొంత ఉన్నాయి కూడా) దాన్ని ఎత్తిచూపవచ్చు. కానీ దాన్ని దాడి అని పేర్కొని, గర్హించడం సరికాదు. పత్రికకు మేలు చేయదు. 'ఒక పాఠకుడే' కాదు, ఇంతకుముందు ఇతరులూ నిశిత విమర్శలు చేశారు. కృష్ణ ఆదిత్య మంచి వ్యాసం రాశారు అని రాస్తూనే, సెప్టెంబర్ సంచికలో 'విశ్లేషణ, విమర్శ తక్కువగా ఉంది. చొప్పదంటు రచనల విషయంలో కొంత క్వాలిటీ కంట్రోలు అవసరం' అని ఈమధ్యే నరేంద్రమోహన్ రాశారు. అంతకుముందొకసారి ఆయనే సైద్ధాంతిక చర్చలు లేక పత్రికని కొందరు పెద్దగా చదవడంలేదని రాశారు. నవంబర్ సంచికలోనే అసోం–బోడోల సమస్యపై అక్టోబరు సంచికలోని వ్యాసంలోని కొన్ని ముఖ్యమైన లోపాలను ఎత్తిచూపుతూ, ఒక సైంటిస్టు రాసిన పెద్దలేఖనూ ప్రచురించారు. అందులో కొన్ని ముఖ్యమైన విషయాలు, వాస్తవాలు, విమర్శలు ఉన్నాయి. అలాంటివి చూసి, రచయితలు, సంపాదకులు గర్హించడం సరికాదు. విమర్శలో అతి ఉంటే ఎత్తిచూపవచ్చును. కాస్త పదునుగా ఉన్నా సద్విమర్శను మనస్ఫూర్తిగా స్వీకరించాలి. నిజానికి సంపాదకులు అలాంటి వైఖరినే అనుసరిస్తున్నారు. 'గడ్డాఫీపై సంపాదకీయం చచ్చినవాడి కళ్లు చారెడేసి అన్న చందంగా' ఉందని చేసిన విమర్శని వేశారు. లోగడ శ్రీలంక సంపాదకీయంపై సుదీర్ఘ విమర్శనూ ప్రచురించారు. గర్హించడం కాదు, ఇదే సరైన వైఖరి. మన లోపాల్ని పట్టించుకోని మిత్రుడికన్నా, లోపాలను ఎండగట్టే విమర్శకుడి వల్లే ప్రయోజనం. ఈ సందర్భంలోనే మరొక చిన్న విషయం, వీక్షణంలోని విషయాలపై స్పందనలను, చర్చలను ప్రచురిస్తున్నారు. వాటిని స్థలాభావం దృష్ట్యా ఎడిట్ చేసే అధికారం సంపాదకులకు తప్పకుండా ఉంటుంది. 'చద్దికన్నా ఊరగాయ ఘనం కాకుండా ఉండడం అవసరం' అని ఈమధ్య చాలాసార్లు ప్రకటించారు. ఉన్నమాట చెప్పాలంటే 'ఊరగాయ' రుచికోసమే చద్దిని ఇష్టపడేవాళ్లూ చాలామందే ఉంటారు. అందుకని విమర్శల్లో విషయం, వివరాలు, విశ్లేషణలను బట్టి ఇప్పటివలెనే – తగిన ప్రాముఖ్యంతో ప్రచురించండి. 'ఊరగాయ ఘనం' అయితే దాన్ని ఉత్తరాల్లోకాక, విడిగా వేరే శీర్షిక కింద ప్రచురించవచ్చు. అంతేగానీ ఆ కారణంగా తగ్గించకండి. నిజానికి గత 10–20 సంచికలు తిరిగేసి చూస్తే, చర్చ/స్పందన/ఉత్తరాల రూపంలో మీరు ప్రచురించిన అనేక రచనలు ఇతర వేదికల్లోవలె వేడినికాక వెలుగుని ప్రచురించే రీతిలోనే ఉన్నాయి. కాబట్టి ఇప్పటివలెనే కొనసాగించండి. 'ఒక పాఠకుడు' ఆయన వ్యాసాన్ని కూడా ఘాటుగా విమర్శించారని హనుమంతరావు గారు నొచ్చుకున్నారేమో! ఇటీవలి కాలంలో ఐఎస్ఎస్ఎన్ నంబరు గుర్తింపుని పొందిన వీక్షణం తన ప్రమాణాలను, నాణ్యతను పెంచుకోడానికి ఇంకా ఎంతో కృషిచేయాల్సి ఉంది. ఇప్పటివలెనే విమర్శను ఆహ్వానించండి. కాస్త నిశితంగా ఉన్నా, నిడివి ఎక్కువైనా అవి పత్రిక ప్రమాణాల పెంపుకు తోడ్పడతాయి.

**– ఎం. కృష్ణ ఆదిత్య**
హైదరాబాద్

## శిశుమరణాల్లో భారత్‌ది అగ్రస్థానం

భారత్‌లో న్యూమోనియా కారణంగా చనిపోయిన ఐదేళ్లలోపు పిల్లల సంఖ్య 2010లో 3.97 లక్షలుగా ఉందని యునిసెఫ్ తెలిపింది. ఈ విషయంలో ప్రపంచదేశాలతో పోల్చినపుడు భారత దేశం ముందుందని న్యూమోనియా వృద్ధి నివేదిక-2012 తెలిపింది. దేశంలో న్యూమోనియా కారణంగా రోజుకు 1.088 మంది పిల్లలు చనిపోతున్నారని, 2008 నుంచి 6.7 శాతం వృద్ధిరేటుతో పెరిగిందని పేర్కొంది. 2011లో సంభవించిన మొత్తం 11 లక్షల శిశు మరణాల్లో 18 శాతం న్యూమోనియా వల్లేనని యూనిసెఫ్ నవంబర్ 16న తెలిపింది.

## చిచ్చురేపిన కులాంతర వివాహం

తమిళనాడులోని ధర్మపురి జిల్లాకు చెందిన నత్తం కాలనీ వాసి రాజా(23), చెల్ల కొండయ్య ప్రాంతానికి చెందిన నాగరాజన్ కుమార్తె లత ఒకరినొకరు ఇష్టపడి పెళ్లిచేసుకున్నారు. వధువు అగ్రకులానికి చెందినది కాబట్టి ఇది నచ్చని లత తండ్రి అవమానంతో ఆత్మహత్య చేసుకున్నారు. దీంతో నాగరాజన్ వర్గీయులు సుమారు వెయ్యి మంది నాగరాజన్ మృత దేహంతో రాజా ఇంటికి చేరి అతని ఇంటితో పాటు 200 ఇండ్లకు నిప్పుపెట్టారు.

## గుజరాత్ ఎన్నికలు

గుజరాత్ తొలిదశ ఎన్నికల నోటిఫికేషన్‌ను కేంద్ర ఎన్నికల సంఘం నవంబర్ 17న విడుదల చేసింది. మొదటి దశగా ఎన్నికలను డిసెంబర్ 13న 87 స్థానాలకు ఎన్నికలు జరుగనున్నట్లు తెలిపింది. ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థులుఈ నెల 24లోగా నామినేషన్‌లను దాఖలుచేయాల్సిందిగా ఎన్నికల సంఘం వెల్లడించింది.

## ప్రజలపై ప్రభుత్వాల యుద్ధం

ఉత్తర, దక్షిణాది రాష్ట్రాల్లో ప్రజలపై ప్రభుత్వాలు చేస్తున్న హింసను జాతీయ ప్రజా ఉద్యమాల వేదిక (ఎన్ఎపిఎం) తీవ్రంగా ఖండించింది. ఎన్.ఎ.పి.ఎం తొమ్మిదవ ద్వైవార్షిక సమావేశాలు కేరళలోని త్రిచూర్‌లో నవంబర్ 17న ప్రారంభమయ్యాయి. నాలుగు రోజులు జరిగే ఈ సమావేశాలకు మేధాపాట్కర్, బినాయక్ సేన్, బి.డి. శర్మతోపాటు తదితర 800 మంది ప్రతినిదులు హాజరయ్యారు. ప్రజలపై ప్రభుత్వ ఆగడాలకు ప్రజా రాజకీయ ప్రత్యామ్నాయమే చెక్ పెడుతుందన్నారు.పల్లె పల్లెకి కార్పొరేట్ సంస్థలను రప్పించేందుకు ప్రజలపై ప్రభుత్వాలు నిరంతరం యుద్ధం చేస్తున్నాయని డా. బినాయక్ సేన్ అన్నారు. దేశ పౌరులపై జరుగుతున్న ఈ యుద్ధాన్ని నిలిపివేయాలని ఆయన డిమాండ్ చేశారు.

## కుకి రాష్ట్రం కోసం రహదారి దిగ్బంధనం

ప్రత్యేక కుకి రాష్ట్రం ఏర్పాటు చేయాలని మణిపూర్‌లోని కుకి స్టేట్ డిమాండ్ (కె.ఎస్.డి.ఎస్) కమిటీ ఆధ్వర్యంలో రహదారి దిగ్బంధనం కొనసాగుతోంది. రాష్ట్రంలోని రెండు జాతీయ రహదారులతో పాటు కుకిలు ఉండే ప్రాంతాల్లో ఈ ఆందోళన కొనసాగుతోంది. మణిపూర్ పక్క రాష్ట్రాలతో రాకపోకలు స్తంభించాయి. తమ ప్రత్యేక రాష్ట్రం ఆకాంక్ష నెరవేరే వరకు ఆందోళన చేస్తామని కె.ఎస్.డి.ఎస్ వెల్లడించింది.

## 2జి స్పెక్ట్రమ్ వేలం

టెలికామ్ కుంభకోణం కేసు విషయంలో ప్రభుత్వం అవలంబిస్తున్న తీరుపై సుప్రీం కోర్టు ఆగ్రహం వ్యక్తం చేసింది. మొత్తం స్పెక్ట్రమ్‌ను వేలం వేయకపోవడాన్ని కోర్టు తప్పుపట్టింది. నవంబర్ 12న నిర్వహించిన వేలంలో మొత్తం 2జి స్పెక్ట్రమ్‌ను ఎందుకు వేలం వేయలేదో వివరించాలంది. ఈ విషయంపై రెండు రోజుల్లోగా అఫిడవిట్ దాఖలు చేయాలని జస్టిస్ జిఎస్ సింగ్వీ, జస్టిస్ కె. ఎస్. రాధాకృష్ణన్‌తో కూడిన సుప్రీం కోర్టు ధర్మాసనం ప్రభుత్వాన్ని నవంబర్ 19న ఆదేశించింది.

## నల్లధనం పుట్ట

జెనివాలో ఉన్న బహుళజాతి బ్యాంకు (హెచ్.ఎస్.బి.సి) లో భారత కుబేరుల డిపాడిట్లు కేజ్రీవాల్ ఆరోపణల ప్రకారం (2006 నాటి ఖాతాల వివరాలు.) ముఖేశ్ అంబానీ రు. 100 కోట్లు, అనిల్ అంబానీ రు. 100 కోట్లు, రిలయన్స్ గ్రూప్‌కు చెందిన మోంటెక్ సాఫ్ట్‌వేర్ రు. 2100 కోట్లు, నరేష్ గోయల్ (జెట్ ఎయిర్‌వేస్) రు. 80 కోట్లు, బర్మన్ సోదరులు (డాబర్) రు. 25 కోట్లు, సందీప్ టాండన్ రు. 125 కోట్లు, అన్నూటాండన్ రు. 125 కోట్లు ఉన్నాయన్నారు. వీటితో పాటు 700 ఖాతాలు ఉన్నాయన్నారు. వీటిలో మొత్తం రు. 6000 కోట్ల నల్లధనం పోగుబడి ఉందని కేజ్రీవాల్ నవంబర్ 9న తెలిపారు.

## సమాచార హక్కుచట్టం కార్యకర్త హత్య

మహా ప్రచండ పత్రిక మాజీ సంపాదకులు లింగ రాజు(55) ను నవంబర్ 20న గుర్తుతెలియని వ్యక్తులు కత్తులతో దాడిచేసి చంపారు. మహా ప్రచండ వార పత్రిక మూసిన తరువాత లింగరాజు సమాచార హక్కు చట్టం కార్యకర్తగా పనిచేస్తూ కొన్నేళ్ల నుంచి బెంగుళూరు కార్పొరేషన్‌లో జరుగుతున్న అవినీతి అక్రమాలను వెలికితీసి వెలుగులోకి తెచ్చారు. వాటిని సహించలేని భూ వ్యాపారులు, రాజకీయ నాయకులు కలిసి హత్యచేసి ఉండవచ్చునని పోలీసులు అనుమానిస్తున్నారు.

## తమిళనాడులో 18 గంటల విద్యుత్ కోత

తమిళనాడులోని కొన్ని ప్రాంతాలలో 16 గంటల విద్యుత్ కోత అమలవుతోంది. కోయంబత్తూర్‌లోని దుస్తుల తయారీకి చెందిన నలభై వేల చిన్నతరహా యూనిట్లు విద్యుత్ కోత కారణంగా కోట్లాది రూపాయలు నష్టపోతున్నామనీ, కనీసం ఒక షిఫ్ట్ నడుపుకోవడానికైనా ఎనిమిది గంటలు కోతలేకుండా ఇవ్వాలని భారత పరిశ్రమల సమాఖ్య కోరుతుంది. తమిళనాడు ప్రభుత్వం విద్యుత్ కొరతను సృష్టించడంలో కుట్ర ఉందని కూడంకుళం ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్న ఎస్.పి ఉదయకుమార్ అభిప్రాయ పడ్డారు. విద్యుత్ కోతలను పెంచితే అప్పుడు ప్రజలు సహజంగానే ప్రాజెక్ట్ నిర్మాణానికి అనుకూలంగా మారతారని, ప్రభుత్వం కావాలనే కోతలను పెంచిందన్నారు.

## కసబ్‌కు ఉరిశిక్ష అమలు

నవంబర్ 26, 2008న ముంబైని ముట్టడించి 166 మందిని చంపిన వారిలో ఒకడైన అజ్మల్ కసబ్‌ను నవంబర్ 21న పూణెలోని యెరవాడ జైలులో ఉరితీశారు. ముంబై ముట్టడి కేసులో కసబ్‌కు ప్రత్యేక న్యాయస్థానం ఉరి శిక్ష విధించింది. ఆ శిక్షను ముంబై హైకోర్టు, సుప్రీం కోర్టు సమర్థించాయి. చివరికి క్షమాభిక్ష పిటిషన్‌ను రాష్ట్రపతి తిప్పి పంపగా ఉరిశిక్షను అమలుచేశారు.

## బాల్‌ఠాక్రే మృతి

శివసేన అధినేత, సామ్నా పత్రిక వ్యవస్థాపకుడు బాల్ ఠాక్రే నవంబర్ 17న మరణించారు. ఆయన గత కొంతకాలంగా శ్వాసకోశ వ్యాధితో బాధపడుతున్నారు. ఐదు దశాబ్దాలుగా ముంబైలో తన ఆధిపత్యాన్ని చాటిన బాల్‌ఠాక్రే కార్టూనిస్ట్‌గా తన జీవితాన్ని సాధించారు. జూన్ 19, 1966లో 'శివసేన' పార్టీని స్థాపించారు. 1988లో మరాఠి దినపత్రిక 'సామ్నా'ను నెలకొల్పారు. నవంబర్ 18న ఆయన మహారాష్ట్ర ప్రభుత్వం అధికార లాంఛనాలతో అంత్యక్రియలు నిర్వహించింది. ❖

## శాండీ విలయం

అమెరికా తూర్పు తీరాన సముద్రంలో చెలరేగిన 'శాండీ' తుపాను విధ్వంసం సృష్టించింది. ఏడు రాష్ట్రాలలో తుపాను తీవ్రత ఎక్కువగా ఉంది. మహానగరాలైన న్యూయార్క్, న్యూజెర్సీలను ముంచెత్తింది. భారీ ఆస్తి నష్టం సంభవించింది. దాదాపు రెండు వేల కోట్ల డాలర్లకు పైగా నష్టం ఉంటుందని అంచనా వేస్తున్నారు. ఎనభై మంది మరణించారు. అనేక చోట్ల విద్యుత్ సరఫరా వ్యవస్థ దెబ్బతిని ప్రజలు అవస్థలు పడ్డారు. నలభై లక్షల కుటుంబాలు కొన్నిరోజుల పాటు చీకట్లో ఉన్నారు. నిత్యావసరాలు లభించక తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొన్నారు. రవాణా వ్యవస్థ, కమ్యూనికేషన్ వ్యవస్థ స్తంభించి పోయింది. సబ్‌వేలు కొన్ని రోజుల పాటు పూర్తిగా నీట మునిగి పోయాయి. విమానాశ్రయాల రన్‌వేలపై నీరు చేరడంతో వేల విమాన సర్వీసులను రద్దు చేశారు. శాండీ తుపాను తూర్పు క్యూబాను కూడా అతలాకుతలం చేసింది. భారీ వర్షాలు, ఈదురు గాలులతో చెట్లు విరిగిపడ్డాయి. ఇళ్ల పైకప్పులు ఎగిరిపోయాయి. కాఫీ, టొమాటో పంటలు బాగా దెబ్బతిన్నాయి.

## మయన్మార్‌లో హింస

మయన్మార్‌లో అక్టోబర్ ఆఖరి వారంలో బౌద్ధ రాఖిన్, ముస్లిం రోహింగ్యా తెగల మధ్య జరిగిన అల్లర్ల నేపథ్యంలో జరిగిన హింసాకాండలో వంద మందికి పైగా మృతి చెందారు. దాదాపు రెండు వేల ఇళ్లు ధ్వంసమయ్యాయి. మే నెలలో ముగ్గురు ముస్లిం పురుషులు బౌద్ధ మహిళలపై అత్యాచారానికి పాల్పడి హత్య చేయడంతో ఘర్షణలు తలెత్తాయి. అప్పటి నుంచి ఈ ఇరు వర్గాల మధ్య ఘర్షణలు చోటు చేసుకుంటూనే ఉన్నాయి.

## బెర్లుస్కోనికి జైలు శిక్ష

ఇటలీ మాజీ ప్రధాని సిల్వియో బెర్లుస్కోనీకి నాలుగేళ్ల జైలు శిక్ష పడింది. ప్రభుత్వానికి పన్నులు ఎగవేశారనే అభియోగంపై ఆయనకు ఇక్కడి న్యాయస్థానం తీర్పు చెప్పింది. బెర్లుస్కోనీ తన ఆధ్వర్యంలోని మీడియాసెట్ టెలివిజన్ కంపెనీకి ప్రసార హక్కుల కొనుగోలు విషయంలో పన్ను ఎగవేతకు పాల్పడినట్లు ఆరోపణలు వచ్చాయి.

## సంస్కరణలపై ప్రజాగ్రహం

యూరోప్ దేశాలలో ఆర్థిక సంస్కరణలపై ప్రజలు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. ఆర్థిక వ్యవస్థను గాడిన పెట్టే పేరుతో ప్రజలపై పన్నుల భారాలు, ఉద్యోగులకు, కార్మికులకు వేతనాల కోతలు, రాయితీలలో కోతలతో ఆయా దేశాల ప్రభుత్వాలు అమలు చేస్తున్న పొదుపు చర్యలపై తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేస్తున్నారు. స్పెయిన్ రాజధాని మాడ్రిడ్‌లో అక్టోబర్ 27న జరిగిన నిరసన ప్రదర్శనలో ప్రజలు భారీ సంఖ్యలో పాల్గొన్నారు. 'అప్పుల బడ్జెట్ మాకొద్దు' అంటూ పార్లమెంట్ భవనాన్ని చుట్టుముట్టారు. తమ హక్కులు కాపాడుకోవడానికీ, కోతలకు వ్యతిరేకంగానూ ఉద్యమాన్ని కొనసాగిస్తామని ఆందోళనకారులు తెలిపారు. ఇటలీలో కూడా భారీ ప్రదర్శన జరిగింది. ప్రధాని మరియో మోంటీ ప్రభుత్వం చేపడుతున్న పొదుపు చర్యల వల్ల వేతనాలు, పెన్షన్‌లు తగ్గిపోవడమే గాక పన్నుల భారాన్ని బాగా పెరిగిపోయాయి.

## సిఐఎ డైరెక్టర్ రాజీనామా

సెంట్రల్ ఇంటిలిజెన్స్ ఏజెన్సీ (సిఐఎ) డైరెక్టర్ డేవిడ్ పేట్రియాస్ రాజీనామా చేశారు. వివాహేతర సంబంధం ఉందని ఆయన ఒప్పుకుంటూ ఆయన ఈ నిర్ణయం తీసుకున్నారు. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా ఆయన రాజీనామాను నవంబర్ 9న ఆమోదించారు. 37 ఏళ్లపాటు అమెరికా సైన్యంలో పనిచేసి, రిటైరైన తర్వాత గతేడాది సెప్టెంబర్‌లో సిఐఎ డైరెక్టర్‌గా పదవీ బాధ్యతలు చేపట్టారు.

## బిబిసి చీఫ్ రాజీనామా

బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ (బిబిసి) డైరెక్టర్ జనరల్ జార్జి ఎంట్విస్టిలీ రాజీనామా చేశారు. బాలల వేధింపులకు పాల్పడుతున్నారంటూ మాజీ కన్జర్వేటివ్ రాజకీయ నాయకుడిని బిబిసి ముఖ్య కార్యక్రమంలో విమర్శించారు. ఈ సమాచారం తప్పని తెలియగానే తన పదవికి రాజీనామా చేస్తున్నట్లు ప్రకటించారు. ఆయన రాజీనామాను ఆమోదించినట్లు బిబిసి ట్రస్ట్ చైర్మన్ లార్డ్ పటేన్ తెలిపారు. టిమ్ డేవీని తాత్కాలికంగా డైరెక్టర్ జనరల్‌గా నియమిస్తున్నట్లు ప్రకటించారు.

## చైనా నూతన పాలకవర్గం

చైనా కమ్యూనిస్టు పార్టీ (సిపిసి) అధ్యక్ష పదవి నుంచి హు జింటావో, ప్రధాని వెన్ జియబావోలు తమ పదవుల నుంచి వైదొలిగారు. పదేళ్లుగా కొనసాగుతున్న వీరు నవంబర్ 14న సిపిసి అగ్రనాయకత్వం నుంచి దిగిపోయారు. బీజింగ్‌లోని 'గ్రేట్ హాల్ ఆఫ్ ద పీపుల్'లో నవంబర్ 8 నుంచి వారం రోజుల పాటు సాగిన సిపిసి 18వ మహాసభలు సాగాయి. మహాసభల ముగింపుకు ముందు సిపిసి 371 నూతన కార్యవర్గ సభ్యులను ఎన్నుకుంది. చైనా భావి అధినేతగా జీ జిన్‌పింగ్ ఎన్నికయ్యారు. సిపిసి ప్రధాన కార్యదర్శిగా నవంబర్ 15న ఆయన బాధ్యతలు చేపట్టారు. జింటావో తర్వాత జిన్‌పింగ్ వచ్చే మార్చి నెలలో దైశాధ్యక్షుడిగా కూడా బాధ్యతలు స్వీకరించనున్నారు.

## గాజాపై ఇజ్రాయిల్ దాడి

పాలస్తీనాలోని గాజా ప్రాంతంపై ఇజ్రాయిల్ దాడికి దిగింది. గాజా పట్టణంపై బాంబు దాడులతో విరుచుకుపడింది. నవంబర్ 14న ఇజ్రాయిల్ క్షిపణి దాడిలో హమాస్ మిలిటరీ చీఫ్ అహ్మద్ అల్ జాబరీ మరణించాడు. ఆయన ప్రయాణిస్తున్న కారుపై ఇజ్రాయిల్ వైమానిక దళాలు దాడి చేశాయి. మరోపక్క ఇజ్రాయిల్ చేస్తున్న దాడుల వల్ల గాజాలో 138 మంది మరణించారు. పాఠశాలలపై, ఆట స్థలాలపై, ఆస్పత్రులపై బాంబు దాడులు జరిగాయి. ఈ దాడిలో ఎంతో మంది పిల్లలు ప్రాణాలు కోల్పోయారు. వందలాది మంది గాయపడి ఆస్పత్రుల్లో చికిత్స పొందుతున్నారు.

## ఒబామాకే మళ్లీ అధ్యక్ష పదవి

అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో అధ్యక్షుడు బరాక్ ఒబామా మరోసారి విజయం సాధించారు. నవంబర్ 6న జరిగిన ఎన్నికల్లో తన ప్రత్యర్థి రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి మిట్ రోమ్నీపై గెలుపొందారు. మొత్తం 538 ఓట్లు ఉండగా, ఒబామాకు 303 వచ్చాయి. మిట్ రోమ్నీకి 206 వచ్చాయి.

## హాన్ సుయిన్ మృతి

చైనా ప్రముఖ రచయిత్రి, వైద్యురాలు హాన్ సుయిన్ (95) నవంబర్ 2న మృతి చెందారు. తన నవలల ద్వారా, జీవిత చరిత్రల ద్వారా ఆమె చైనా విముక్తి పోరాటాన్ని ప్రపంచం దృష్టికి తీసుకువచ్చారు. ఆమె అసలు పేరు ఎలిజబెత్ కువాంఘు చౌ. హాన్ సుయిన్ అనే కలం పేరుతో 1942లో ఆమె రాసిన 'డెస్టినేషన్ చుంగ్‌కింగ్' ద్వారానే తనకు చైనా గురించి ఎక్కువ తెలిసిందని బెర్ట్రాండ్ రసెల్ అన్నాడు. ఆమె రాసిన 'మావో జీవిత చరిత్ర', 1970లలో భవిష్యత్తు చైనా గురించి రాసిన 'చైనా ఇన్ 2001' తెలుగులోకి అనువాదం అయ్యాయి. వీ

# వీక్షణం 2012 సూచిక

## జనవరి 2012 సంచిక : 126

**ఫోకస్ : ప్రజా ఉద్యమాలు – పాలకుల స్పందన**

పాఠకుల వీక్షణం
చిల్లర వర్తకానికి మాత్రమే కాదు, దేశానికే గొడ్డలిపెట్టు (సంపాదకీయం)
ప్రజల పాలన కాదనే రుజువులు అనేకం; ఇది విప్లవాల కాలమేనా? (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
ఈ నేల
❖ ప్రజా ఉద్యమాలు – పాలకుల స్పందన – ఎడ్ల పోచయ్య
❖ రైతు ఆత్మహత్యలు – ప్రభుత్వ నిర్లక్ష్య ధోరణి – కిసాన్ స్వరాజ్ యాత్ర పత్రం
విప్లవ విస్తృతి చిహ్నం – కిషన్‌జీ – ఎన్. వేణుగోపాల్
ఫ్యూడల్ దోపిడీ, అణచివేత రూపాలు
పెద్దదవుతున్న మీ జేబు చిల్లు! – వి. హనుమంతరావు
సకల జనుల సమ్మె రూపసారాలు – వరవరరావు
సకల జనుల సమ్మెలో సింగరేణి – పిట్టల రవీందర్
సకల జనుల సమ్మెలో ఉపాధ్యాయుల పాత్ర – కె. వేణుగోపాల్
జీవించే హక్కును హరిస్తున్న కూడంకుళం – పి.వి. రమణ
చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడులు – కె.వి.కూర్మనాథ్
ప్రజల మెడపై వేలాడుతున్న కత్తి ఎఫ్.డి.ఐ. – చిక్కుడు ప్రభాకర్
కళింగాంధ్ర ఎదుట పెనుసవాళ్లు – దుప్పల రవికుమార్
బాక్సైట్ – ఆదివాసుల హక్కుల ఉల్లంఘన – ఎం. నాగమణి
అఫ్ఘనిస్తాన్‌లో అమెరికాకు సవాళ్లు – ఎ. నర్సింహారెడ్డి
మానవ హక్కుల చట్టం ఏం సాధించింది? – చిమ్మె జాన్ బర్నబాస్
సత్యమంగళం నుండి వాకపల్లి వరకు – తుంపాల శ్రీరామమూర్తి
తిలా పాపం – తలా పిడికెడు – విద్యాభూషణ్
చిన్న రాష్ట్రాలకు అంబేద్కర్ అనుకూలమే! – లోకే రాజ్‌పవన్
భూసంస్కరణ విధానాలు – ఒక సమీక్ష–2 – ఎం. కోదండరాం, కె. సీతారామారావు
భారతదేశంలో భూస్వామ్య విధానం ఉందా? – 4 – రమేష్ పట్నాయక్
మల్కన్‌గిరిలో ఏం జరుగుతోంది? – 3 – శ్రీరాముల శ్రీనివాస్
అణు రియాక్టర్ల ఉపయోగం – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
ఇరుగు పొరుగు
భూగోళం
వీక్షణం అభిమానులకు విజ్ఞప్తి
వీక్షణం 2011 వార్షిక నివేదిక
వీక్షణం రచయితల సమావేశం – 6

## ఫిబ్రవరి 2012 సంచిక : 127

పాఠకుల వీక్షణం
సిబిఐ దాడుల్లో వెలికివస్తున్న నిజాలు (సంపాదకీయం)
'సర్వరోగ నివారిణి' లోక్‌పాల్‌కు సర్వత్రా వంచన; ఉపఖండంలో సైనిక శక్తుల ఆధిక్యత (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
ఈ నేల
కత్తిరింపులు
గ్రామాల అధ్యయనం ఎందుకు? – ఎన్. వేణుగోపాల్
కవ్వాల్ అభయారణ్యం ఎవరి కోసం? – ఆనంద్
కొవ్వాడ అణు విద్యుత్ కేంద్రం – నడుస్తున్న చరిత్ర – పి. కృష్ణారావు
కల్తీ సారా మరణాలకు బాధ్యులెవరు? – చిమ్మె జాన్ బర్నబాస్
మాంద్యం వైపు యూరప్ యూరప్ ఆర్థిక వ్యవస్థ – ఎ. నర్సింహారెడ్డి
ప్రజల ఆరోగ్యాన్ని బలిగొంటున్న పోర్టు కాలుష్యం – పి.వి. రమణ
విద్యుచ్ఛక్తి – వెలుతురు నుంచి చీకట్లోకి – వి. హనుమంతరావు
బాధితులపైనే నింద మోపుతున్న డి.జి.పి. – వర్ష గండికోట
పని, విద్యా ప్రణాళిక పత్రం లోపభూయిష్టం – కె. లక్ష్మినారాయణ
ఖనిజ తవ్వకాలపై మర్లబడిన మర్లపాడు – చిట్టిపాటి వెంకటేశ్వర్లు
ఆరు సూత్రాల ప్రణాళికను పాతి పెట్టాలి – కొండపల్లి సీతారామయ్య
ఎవరికీ పట్టని మన్యం దైన్యం – ఎం. నాగమణి
స్వయం ప్రతిపత్తి మండలి – ఆదివాసుల అభివృద్ధి – మైపతి అరుణ్‌కుమార్
ఈ వినాశన అభివృద్ధి ఎవరి కోసం? – మాడావి భాస్కర్ రావు
ఆదివాసీ మహిళల సాధికారత – గుగులోతు జాంబు, సాదు రాజేష్
తెలంగాణ – ఓ మరణక్షేత్రం! – జి. లచ్చయ్య
భాషా రాష్ట్రాలపై అంబేద్కర్ – ఎం. కృష్ణ ఆదిత్య
ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన – 11 – ఎస్. సరళా వందనం
అణు విద్యుత్తు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
ఆలోచనల గూటికి పుల్లా పుడకా
ఇరుగు పొరుగు
అసహజ మరణాలు – వై. రామచంద్రం, రాంకి

## మార్చ్ 2012 సంచిక : 128

పాఠకుల వీక్షణం
మౌలిక లక్ష్యాలు వదిలి అంకెల గారడీ (సంపాదకీయం)
పోలీసు మంత్రి కత్తికి రెండంచులు అవినీతి, హింస;
సామ్రాజ్యవాద అహంకారానికి ఇరాన్ సవాల్ (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
ఈ నేల – డి.వి. రామకృష్ణారావు
కత్తిరింపులు
మానవ రహిత విమానాల కథ – ఎడ్ల పోచయ్య
బడ్జెట్ గలగల, సంక్షేమం విలవిల – వి. హనుమంతరావు
2012–13 రాష్ట్ర బడ్జెట్ – ప్రాధాన్యతా రంగాలు – చీకోటి శ్రీనివాస్, నేదునూరి కనకయ్య
అభివృద్ధి మార్గం మధ్యాంధ్ర ప్రదేశేనా? – డా. శ్రీధర్ కుమార్ లోధ్
2జి కుంభకోణం – మీడియా ద్రోహం – కె.వి. కూర్మనాథ్
యానాం ఘటనల పూర్వాపరాలు – వి. చిట్టిబాబు
అవినీతి ఐఎఎస్‌లదా? మంత్రులదా? – పి.వి. రమణ
అంబేద్కర్ కేవలం విగ్రహం మాత్రమే కాదు – కె. సత్యనారాయణ
అంబేద్కర్ విగ్రహాల ధ్వంసం – క్షీరాభిషేకాలు – చిమ్మె జాన్ బర్నబాస్
ఇరాన్‌పై యుద్ధ మేఘాలు – ఎ. నర్సింహారెడ్డి
భారత్‌పై అరుణతార – యాన్ మిర్డాల్
గ్రామాల అధ్యయనాల చరిత్ర – 1 – ఎన్. వేణుగోపాల్
బకాయిల బాధలింకెంత కాలం? – సిలువేరు హరినాథ్
వ్యవసాయం రుణభారం – సాయం దూరం – ముద్దసాని శ్రీకాంత్ రెడ్డి
దండకారణ్యంలో విరబూస్తున్న విలువలు – శెట్టి రాజపాపయ్య
భాషా రాష్ట్రాలపై అంబేద్కర్ – లోకే రాజ్‌పవన్
ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన – 12 – ఎస్. సరళా వందనం
రియాక్టర్లలో రకాలు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
ఇరుగు పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – సి. రాజశేఖర్
అసహజ మరణాలు – వై. రామచంద్రం, రాంకి

## ఏప్రిల్ 2012 సంచిక : 129

పాఠకుల వీక్షణం
బడ్జెట్లు, ఎన్నికల మాయాజాలం ఇంకెంతకాలం? (సంపాదకీయం)
దళారీ పాలకులకు కూడంకుళం సవాల్; శ్రీలంక ప్రభుత్వ హత్యాకాండపై ఐరాస తీర్మానం (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
ఈ నేల – డి.వి. రామకృష్ణారావు
కత్తిరింపులు
ప్రజాభిప్రాయాన్ని పాలకులు గౌరవిస్తారా? – డి.వి. రామకృష్ణారావు
ప్రత్యామ్నాయ వేటలో సామాన్యుడు – విద్యాభూషణ్
సోనీ సోడిపై రాజ్యం కత్తి గట్టిందెందుకు? – అమన్
ఆదివాసులను నిర్వాసితులను చేస్తున్న ప్రభుత్వం – షంషేర్
కూడంకుళం ఎవరి కుట్ర? – పి.వి. రమణ
విధ్వంసకర పోలవరం అప్రజాస్వామికం – కూనూరు శివకుమార్
అభివృద్ధి పేరిట వంచన – ఎ. నర్సింహారెడ్డి
విద్యారంగానికి బడ్జెట్ సరిపోతుందా? – సిలువేరు హరినాథ్
యాన్ మిర్డాల్‌తో ఇష్టాగోష్ఠి
గ్రామాల అధ్యయనాల చరిత్ర – 2 – ఎన్. వేణుగోపాల్
రాజకీయ వేదికలు కానున్న సర్కార్ బళ్లు – ఎ. పున్నయ్య
రష్యాలో అక్టోబర్ విప్లవం – ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు
వికలాంగులకు ప్రభుత్వ భరోసా ఏది? – బిల్లా మహేందర్
అవినీతి భారతం – సాదు రాజేష్, సిరిసనగండ్ల సాహితి
రైతు వ్యవసాయంపై పెట్టుబడి దాడి – నరేంద్రమోహన్

**సెప్టెంబర్ 2012** — **సంచిక : 134**

*పాఠకుల వీక్షణం*
*మళ్లీ మళ్లీ రుజువవుతున్న పాలకుల సాధికారత లేమి (సంపాదకీయం)*
*బొగ్గు బుక్కి, అబద్ధాలు కక్కి, నెత్తురుటేర్లు పారించి...;*
*అస్సాంజ్‌కు రక్షణలో ఈక్వడార్ సాహసం (సంపాదకీయ వ్యాఖ్యలు)*
కొత్త పుస్తకాలు / సి.డి.లు
*ఈ నేల* – డి.వి. రామకృష్ణారావు
కత్తిరింపులు
ఫీజుల అనిశ్చితి స్వయంకృతం – ఎ. నర్సింహారెడ్డి
బోధన రుసుముపై మల్లగుల్లాలు – సిలువేరు హరినాథ్
*అంగారక గ్రహంపై జీవం ఉందా?* – డా. జి. రామదేవుడు
*బ్యాంకుల మొండి బాకీలు లక్ష కోట్లు!* – వి. హనుమంతరావు
హంతకులకు శౌర్యపతకాలా? – వరవరరావు
పేదరికం – పోషకాహారలేమి – డా. నళిని
ఆహార (అ)భద్రతా బిల్లు – జి. సూరి
ఆర్‌టిసి సమస్యలకు కారకులెవరు? – ఎం.ఎస్. సాయి
సిరియా పరిణామాలు – లోకసంచారి
గ్రామ అధ్యయనం – ఇవాళ్టి కర్తవ్యాలు – ఎన్. వేణుగోపాల్
వాకపల్లి ఘటనకు ఐదు సంవత్సరాలు – డా. జి. లచ్చయ్య
మత మార్పిడులు – ఒక దృక్కోణం – అరుణ్
రెండు నాల్కల రాజ్యం – ఎం. అప్పలాచారి
ముంబై భవన నిర్మాణ కార్మికుల స్థితిగతులు – రమేశ్ గోండ్యాల, దుర్గేశ్ అక్కనపల్లి
ఇదేనా ఆదివాసుల ప్రగతి? – ఎం. నాగమణి
ఎందుకీ మోడల్ స్కూళ్లు? – కె. ప్రభాకర్
ఎం.జె. – జీవితమంతా పోరాటమే – పి. వరలక్ష్మి
ఐక్య పోరాటాల్ని రగిలించడమే నేటి లక్ష్యం – ఎస్. కృష్ణమూర్తి
అణు రియాక్టర్ల గురించిన సందేహాలు – డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్
*ఇరుగు పొరుగు* – వై. రామచంద్రం
*భూగోళం* – సి. రాజశేఖర్
*అసహజ మరణాలు* – వై. రామచంద్రం, రాంకి

**అక్టోబర్ 2012** — **సంచిక : 135**

*పాఠకుల వీక్షణం*
*డీజిల్ ధర, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి... (సంపాదకీయం)*
*తెలంగాణ – హింసాహింసలు కాదు, న్యాయాన్యాయాలు;*
*బహుళజాతి ఔషధ సంస్థ దుర్మార్గం (సంపాదకీయ వ్యాఖ్యలు)*
కొత్త పుస్తకాలు / సి.డి.లు
*ఈ నేల* – డి.వి. రామకృష్ణారావు
కత్తిరింపులు
జీవ వైవిధ్య సదస్సు ఎవరికోసం? – ఆశాలత
ఇండియాను అమ్మేసిన మన్మోహన్ సింగ్ – వి. హనుమంతరావు
వాల్‌మార్ట్ – చిరు వ్యాపారస్తుల ఉనికికే ప్రమాదం – డా. శ్రీనివాసరావు చొప్పర
ఎఫ్‌డిఐ ఎవరికి లాభదాయకం? – చిమ్మెె జాన్ బర్నబాస్
అంతిమ యుద్ధానికి సిద్ధమైన తెలంగాణ – శ్రీధర్ దేశ్‌పాండే
ఇనుము కార్ఖానా మృత్యు కుహరం – ఎం.డి. ఇక్బాల్ పాషా
'కోల్‌గేట్' కుంభకోణంలో అందరూ దొంగలే – పి.వి. రమణ
దోపిడీకి గొడుగు పడుతున్న ప్రధాని – ఎ. నర్సింహారెడ్డి
మోడీ నరసంహారం – నరోడా పాటియా తీర్పు – వరవరరావు
యాభై ఏళ్ల కనుమరుగై దొరికిన మావో రచన – ఎన్. వేణుగోపాల్
కసబ్.. మా దేశభక్తి ముందు నీవెంత? – పాణి
అసోంలో ఏం జరుగుతోంది? – లోకే రాజ్‌పవన్
విశాఖ మన్యం ఆదివాసులపై హింస – సిందేరి జాంబ్రి
వికలాంగులకు గౌరవం అందని ద్రాక్షేనా! – డా. పెదమళ్ళ శ్రీనివాస రావు
దోపిడీకి గురవుతున్న ఆదివాసుల సంస్కృతి – పూకే రామకృష్ణ
కనుమరుగవుతున్న ప్రభుత్వ పాఠశాలలు – ఎల్. ఆర్. అనిత
ప్రాపంచిక దృక్పథాన్నిచ్చే 'బౌద్ధ దర్శనం' – బి.వి.ఎన్. స్వామి
'దళితులు, ఆదివాసులకు అసలు న్యాయం అందుతోందా?' – లోకసంచారి
సంస్మరణ : కొడవటిగంటి రోహిణీప్రసాద్
భారత్ – పాకిస్తాన్ వాణిజ్యం – రాజకీయాలు – ఎస్. కృష్ణమూర్తి
లక్షింపేట – భూమి, కులం, వర్గం – పరస్పర సంబంధం – ఎం. కృష్ణ ఆదిత్య
*ఇరుగు పొరుగు* – వై. రామచంద్రం
*భూగోళం* – సి. రాజశేఖర్
*అసహజ మరణాలు* – వై. రామచంద్రం, రాంకి

**నవంబర్ 2012** — **సంచిక : 136**

*పాఠకుల వీక్షణం*
*వాద్రా, గడ్కరీ... బందిపోట్లదే ఈ రాజ్యం! (సంపాదకీయం)*
*పాదయాత్రల రుతువులో వాగ్దానాల వెల్లువ; ఛావెజ్ గెలుపు ఆశాసూచికేనా? (సంపాదకీయ వ్యాఖ్యలు)*
కొత్త పుస్తకాలు / సి.డి.లు
*ఈ నేల* – డి.వి. రామకృష్ణారావు
జీవ వైవిధ్యం కాదు జీవ విధ్వంసం – కె.వి. కూర్మనాథ్
జీవ వైవిధ్యం కాపాడే ఉద్దేశాలున్నాయా? – ఎం. నాగమణి
కూడంకుళం అణు విద్యుత్ ప్రమాదాలు – ఎస్.జి. ఓమ్‌బట్కరే
ఎవరి మేలు కోసం ఈ ఎఫ్‌డిఐలు? – విద్యాభూషణ్
బీమా, పెన్షన్ రంగాల్లో ఎఫ్‌డిఐ – డా. శ్రీనివాసరావు చొప్పర
భూమి పందారం – వి. హనుమంతరావు
చౌరస్తాలో తెలంగాణ ఇంకెన్నాళ్లు? – ఎన్. వేణుగోపాల్
ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఆవశ్యకత – ఆర్.ఎస్. చౌహాన్
ముప్పై ఏళ్ల తరువాత గౌరవెల్లి – వై.రామచంద్రం, డి.వి. రామకృష్ణారావు
ఆదివాసి మహిళల పోరాటాలు–రాజ్యహింస – డా. నళిని
జాతీయ గ్రామీణ ఆరోగ్య పథకం – ఒక సమీక్ష – ముదునూరి భారతి
లక్షింపేటలు జరుగుతున్నాయి.. మరి నక్సల్బరీలో? – చిమ్మెె జాన్ బర్నబాస్
బూటకపు ప్రజాభిప్రాయ సేకరణలు – పి.వి. రమణ
ఆరోగ్యరంగంలో ఏం జరుగుతోంది? – లోకసంచారి
పులిచింతల ప్రాజెక్టు ఎవరి లాభం కోసం? – ముప్పాళ్ల భార్గవశ్రీ
తిరుమల భారతీయులదే! – ఎం.కె. కుమార్
ఎన్‌కౌంటర్లు – కొన్ని ప్రశ్నలు – ప్రహ్లాద్
సర్కారు బడుల గోడు వినేదెవరు? – సిలువేరు హరినాథ్
విద్యా వ్యవస్థలో మార్పులు – తిరుక్కోవెల పద్మావతి
*ఇరుగు పొరుగు* – వై. రామచంద్రం
*భూగోళం* – సి. రాజశేఖర్
*అసహజ మరణాలు* – వై. రామచంద్రం, రాంకి

**డిసెంబర్ 2012** — **సంచిక : 137**

*పాఠకుల వీక్షణం*
*కార్పొరేట్ల చేత, కార్పొరేట్ల కొరకు, కార్పొరేట్ల వల్ల... (సంపాదకీయం)*
*అరాచకమే రాజకీయమై చెలరేగుతున్న చోట..;*
*మరొకసారి రక్తసిక్తమైన గాజా (సంపాదకీయ వ్యాఖ్యలు)*
కొత్త పుస్తకాలు / సి.డి.లు
*ఈ నేల* –
నేరం – శిక్ష : బాల్ ఠాక్రే , అజ్మల్ కసబ్ – ఎర్ర పోచయ్య
ముగిసిన బాల్‌ఠాక్రే శకం – మచ్చ ప్రభాకర్
ఒబామా గెలుపు ఎవరికి మేలు? – రాజవరం పార్థసారథి
చిల్లర వర్తకంపై పాలకుల ప్రేమ – కె.వి. కూర్మనాథ్
నేపాల్ మావోయిస్టుల దారి ఎటు? – పార్వతి
భారత్–చైనా యుద్ధం 1962– నిజానిజాలు – మేజర్ జైపాల్ సింగ్
ప్రజాస్వామ్య సంకేతాలు: సూచీ, షర్మిల – జి. ఉదయ
మాణిక్యాపూర్ రాజకీయార్థిక స్థితి – డి.వి.రామకృష్ణారావు, వై. రామచంద్రం
కాంగ్రెస్‌వాదులారా మూటా ముల్లే సర్దుకోండి – వి. హనుమంతరావు
పేదల ఆకలి తీర్చని ఆర్థికాభివృద్ధి... – ఎ. నర్సింహారెడ్డి
బాధితులారా బహుపరాక్! – కృపాకర్ మాదిగ
లక్షింపేట హత్యాకాండ – కడియాల సుబ్బనాచారి
జైలులో ఫోన్ సౌకర్యం అత్యవసరం! – ఎ. కొండయ్య
నాన్ షెడ్యూల్డ్ గ్రామాల గ్రామాల స్థితి – తుంపాల శ్రీరామమూర్తి
ప్రపంచ తెలుగు మహాసభలు – చిమ్మెె జాన్ బర్నబాస్
బాల్యాన్ని చిదిమేస్తున్న పాలకులు – జి. తిరుపతి రెడ్డి
కార్పొరేట్ విద్య – విద్యార్థి హక్కులు – ఎన్. నారాయణరావు
పసి పిల్లల ప్రాణాలకు విలువ లేదా? – డా. తల్ల సాంబలక్ష్మి
మాఫియా హస్తాల్లో అలయ కొండలు – ఎం.కె. కుమార్
అటవీ రాష్ట్రం – ఆటవిక రాజ్యం – సిడిఆర్ఒ
ఆదివాసి మహిళల పోరాటాలు–రాజ్యహింస – డా. నళిని
ఆర్.ఎస్. రావు స్ఫూర్తిని ఇనుమడించిన సదస్సు
తెలంగాణపై – ఎస్. కృష్ణమూర్తి
*ఇరుగు పొరుగు* – వై. రామచంద్రం
*భూగోళం* – సి. రాజశేఖర్
*వీక్షణం సూచిక – 2012*
*అసహజ మరణాలు* – వై. రామచంద్రం, రాంకి

వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 అక్టోబర్ నుండి 31 అక్టోబర్ 2012 వరకు 14 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1539)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 3 | – | 17 | 18 | 9 | 7 | 4 | 1 | 2 | 1 | 1 | – | 2 | 17 | 24 | – | – | – | 1 | – |
| హైదరాబాద్ | – | – | – | 10 | 10 | – | – | – | – | 1 | 4 | 8 | 1 | 4 | 31 | 17 | – | – | – | 11 | – |
| నల్గొండ | – | 1 | 3 | 14 | 9 | 8 | 9 | 4 | 3 | 6 | 4 | – | – | 8 | 38 | 31 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 5 | – | 13 | 20 | 21 | 10 | 16 | 6 | 12 | 9 | 16 | 20 | 16 | 48 | 11 | – | – | – | – | 2 |
| మెదక్ | – | 2 | – | 1 | 7 | 3 | 6 | 9 | – | 3 | 1 | 3 | – | 4 | 33 | 21 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 1 | 11 | 2 | – | – | 4 | 1 | 4 | 3 | 5 | 5 | 13 | 18 | – | – | – | – | – |
| రంగారెడ్డి | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| వరంగల్ | 2 | 15 | 1 | 11 | 9 | 9 | 12 | 9 | 1 | 1 | – | – | 2 | 11 | 20 | 9 | – | – | – | – | 2 |
| కరీంనగర్ | – | 15 | 12 | 12 | 15 | 19 | 22 | 8 | 4 | 5 | 7 | 13 | – | 5 | 36 | 11 | – | – | – | – | – |
| ఖమ్మం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| అనంతపూర్ | – | 3 | 1 | 7 | 7 | 1 | 2 | – | – | 1 | 1 | 3 | – | – | 16 | 2 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 2 | 3 | – | – | – | – | 2 | – | 1 | – | – | 21 | 10 | – | – | – | – | – |
| కర్నూలు | – | 4 | 2 | 11 | 8 | 5 | 7 | 10 | 6 | 9 | 4 | 6 | 5 | 4 | 22 | 25 | – | – | – | – | 2 |
| చిత్తూరు | – | – | – | 5 | 6 | 18 | 14 | – | – | – | 4 | 7 | 12 | – | 34 | – | – | – | – | – | – |
| విశాఖపట్నం | 1 | – | – | 9 | 11 | 3 | 7 | – | 1 | 8 | 3 | 4 | 4 | 2 | 26 | 25 | – | – | – | 2 | – |
| విజయనగరం | – | 2 | – | 6 | 4 | 2 | 4 | 6 | 4 | 6 | 7 | 6 | – | 2 | 32 | – | – | – | – | – | 5 |
| **మొత్తం** | **3** | **50** | **19** | **119** | **138** | **100** | **100** | **66** | **30** | **57** | **49** | **71** | **49** | **63** | **387** | **213** | **–** | **–** | **–** | **14** | **11** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| మీరు-నేను-ఆర్థికం | వి. హనుమంతరావు | రు. 60 |
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | 50 |
| కుత్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| మోతె | గ్రామ అధ్యయనం | 5 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు - రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు - అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు - మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝూన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| విమర్శ - పరామర్శ | వి. హనుమంతరావు | 60 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| గుమ్మెటమోత | పాణి | 100 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| నడుస్తున్న దారి | వ్యాస సంకలనం | 50 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| ధ్వంసమైన స్వప్నం | అరుంధతీ రాయ్ | 75 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| లాంగ్‌మార్చ్ | తెలంగాణ జర్నలిస్టుల సంకలనం | 100 |
| కళ్లముందరి చరిత్ర | ఎన్. వేణుగోపాల్ | 80 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| గదిలోపలి గోడ | పలమనేరు బాలాజి | 60 |
| రుదాలి | మహాశ్వేతాదేవి | 45 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |

### సాహిత్య విమర్శ

| | | |
|---|---|---|
| నవలా సమయం | ఎన్. వేణుగోపాల్ | 50 |
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| తొలితరం తెలుగు కథా రచయితలు స్త్రీ సమస్యల చిత్రణ | డా. ఎన్. రజని | 30 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh (1956-2006)** | | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunoori Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunoori Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunoori Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunoori Bharathi | 150 |
| **On Education** | Mudunoori Bharathi, R.S. Rao | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 137 -December 2012 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/11/2012 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణంకు మీ చేయి అందించండి!
# వీక్షణం పది కాలాల పాటు నిలబడడానికి తోడ్పడండి!

2003 జనవరి 1న పక్షపత్రికగా ప్రారంభమై, 2005 జనవరి నుంచి మాసపత్రికగా మారి ఒక్క సంచిక కూడ ఆగకుండా నిరాటంకంగా, ఇప్పటికి 136 సంచికలు, ప్రతి నెలా మొదటి తేదీ నాటికి కచ్చితంగా వెలువడుతూ వచ్చిన వీక్షణం 2013 జనవరి సంచికతో పదకొండో సంవత్సరంలో ప్రవేశిస్తున్నది. తెలుగునాట ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయార్థిక, సామాజిక పత్రికల చరిత్రలో ఇది ఒక విశిష్టమైన విజయం. ఈ సందర్భంగా వీక్షణం 2013 జనవరి సంచికను ప్రత్యేక సంచికగా, కలకాలం దాచి ఉంచుకోదగిన, ఎప్పటికప్పుడు సంప్రదించదగిన విలువైన వ్యాస సంకలనంగా ఎక్కువ పేజీలతో ప్రచురిస్తున్నది. వర్తమాన తెలుగు సమాజం ముందు, భారత సమాజం ముందు ఉన్న కీలక సమస్యలపై, ప్రధాన ప్రజా ఉద్యమాలపై పేరెన్నికగన్న మేధావులతో ప్రత్యేకంగా రాయించిన వ్యాసాలతో ఈ సంచిక ఆలోచనాపరులందరికీ అనివార్యమైన కరదీపికగా ఉండబోతున్నది.

తెలుగుసీమలో అన్ని ప్రత్యామ్నాయ పత్రికల లాగనే వీక్షణం కూడ తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటూనే ఈ పది సంవత్సరాల ప్రయాణాన్ని సాగించింది. ప్రతినెలా ఆ నెలే చివరిదన్నట్టుగా ఉన్న ఆర్థిక స్థితిలో వీక్షణం బృందం పళ్ల బిగువున పట్టుదలతో ఈ కృషిని కొనసాగించింది. వీక్షణం రెండో దశాబ్ది జీవితమైనా తక్కువ కష్టభరితంగా సాగాలంటే తగినన్ని ఆర్థిక వనరులు కావాలి. అందుకు మీ నుంచి సహకారాన్ని కోరుతున్నాం.

2013 జనవరి ప్రత్యేక సంచిక సందర్భంగా పాఠకుల నుంచి, అభిమానుల నుంచి, దాతల నుంచి దశాబ్ది చందాలు, విరాళాలు, అభినందన ప్రకటనలు, వ్యాపార ప్రకటనలు సేకరించడం ద్వారా వీక్షణం పది కాలాలపాటు మనగలిగే ఆర్థిక వనరులు సమకూర్చుకోవాలని ఆశిస్తున్నాం. వీక్షణం అభిమానులు వ్యక్తిగతంగా గాని, వారి సంస్థల తరపున గాని, వారికి పరిచితులైన దాతల నుంచిగాని దశాబ్ది చందాలు, విరాళాలు, వ్యాపార ప్రకటనలు ఇచ్చి, ఇప్పించి ఈ ప్రజాపక్ష రాజకీయార్థిక సామాజిక వేదికకు మీ చేయి అందించి ఆదుకోవలసిందిగా కోరుతున్నాం.

- **మీరు అందించగలిగిన కనీస సహాయం దశాబ్ది చందా రు. 1,300.**
- **కనీస విరాళం మీ శక్తిని బట్టి మీకు తోచినంత.**
- **మీరు ఇవ్వగలిగిన, ఇప్పించగలిగిన అభినందన ప్రకటన, వ్యాపార ప్రకటన**
  **(లోపల ఫుల్ పేజీ రు. 12,000, అర పేజీ రు. 6,000, పావు పేజీ రు. 3,000)**

**తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న ఈ అత్యవసరమైన, ప్రభావశీలమైన సంభాషణకు మీ వంతు సహకారం అందించండి.**

**ఇది ప్రజల పత్రిక. ఇది మీ పత్రిక. దీన్ని పదికాలాల పాటు నిలిచేందుకు సహకరించండి.**

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao